# ఆచార్య రంగా జీవిత చరిత్ర

## కొన్ని సంఘటనలు



ప్రచురణ :

రంగాజీ శత జయంత్యుత్సవ సందర్భంగా

రచన :

దరువూరి వీరయ్య

# "మాధవుడుగా రూపుదాల్చిన మానవోత్తముడు రంగాజీ"

"కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబన్ధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్య నామయమే"

భగవద్గీతలోని ఈ శ్లోకార్థం పరిశీలన్వార్థం సమత్వబుద్ధి, వివేకము, జననమరణ విముక్తి – సాధించిన సాధకుడే మనీషి. మనీషి అనగా ప్రజ్ఞావంతుడు. ఆ ప్రజ్ఞకు బుద్ధిని జోడించాలి. అట్టి మనీషి కర్మ ఫలాపేక్షలేని వాడుగా ఉండాలి. అట్టి ప్రజ్ఞాశీలుడే కర్మయోగ రహస్యం తెలిసికోగలడు వివేకము, విజ్ఞత కారణంగానే మానవుడు విహిత కర్మలను నిష్కామంగా, అనాసక్తంగా ఆచరించ గల్గుతాడు.

ఒకనికి ప్రజ్ఞకలదో లేదో తెలిసికోవడానికి వాని పాండితీ ప్రకర్షను పరీక్షించనక్కర లేదు. ఆచరణలోని నిష్కామభావము అనాసక్తి – ఉన్నాయా, లేదా అని చూస్తే చాలు. కర్మయోగ రహస్య మెఱింగి లోకంలో అనాసక్తంగా వ్యవహరించే వాడే నిజమైన ప్రజ్ఞావంతుడు. వివరణ కంటె తార్కాణం, విషయాన్ని తేటతెల్లం చేస్తుంది. కాబట్టి మనీషి అనుపదానికి రంగాజీ లక్ష్య భూతుడు అంటే సరిపోతుంది.

పదం గచ్ఛన్త్యనామయమ్ అంటూ ఒక ఉపమానం చెప్పాడు గీతాచార్యుడు. ఈ విషయంలో అనేకమైన పెద్ద పదవులున్నాయి. రాజా, చక్రవర్తి – ఇట్లా. అవి ఎంత గొప్పవైనా సంసార చక్రాంతర్గతాలే. జననం, మరణం ఆపదలనుండి, ఆపదవులు మనిషిని మరలించలేవు. ప్రపంచంలో అన్ని పదవుల కంటె గొప్పది లేశమైనా దుఃఖం లేనిదీ, బంధరహితమైనదీ, ఒకానొక పదవి ఉంది. అది – ఆత్మసామ్రాజాధిపత్యం ! దానిని సాధించడమే ప్రతి మానవుని పరమావధి.

ఆ ఆత్మసామ్రాజ్యాధిపత్యాన్ని సాధించే మార్గమేది ! చిత్తశుద్ధితో ఫలాపేక్ష రహితంగా, విహిత కర్మల నాచరిస్తూ, తద్వారా ఆత్మజ్ఞానాన్ని పొందడమే ఆ మార్గం. ప్రజ్ఞాశీలుర లక్షణం – నిష్కామ కర్మాచరణం. అట్టి నిష్కామ కర్మాచరణ వల్ల వారు బంధవిముక్తులై నిరామయ స్థితిని పొందగలరు. ఈ పరీక్షకు నిలువ గల్గినవాడే మహామనీషిగా, రూపొందగలడు. ఈ కోవకు చెందినవాడే పూజ్య రంగాజీ.

మహామనిషి – స్థిత ప్రజ్ఞుడని కూడా గీత చెప్తూ ఉంది. ఒక్కొక్కప్పుడు సాధారణ మనిషైనా, మహామనీషైనా, స్థితప్రజ్ఞుడైనా దైవికంగా కొన్ని అప్రియమైన సంకటాలను ఎదుర్కొవలసి వస్తుంది. అనుకూల్యాల పట్ల సంతోషంగాని, అప్రియాల వల్ల విచారం గాని అతడు వ్యక్తం చేయడు. హిమగిరివలె అచంచలుడై నిర్వికారుడై నిలుస్తాడు. ఇదే స్థితప్రజ్ఞని లోని దైవాంశము. తాబేలు తన అవయవాలను డిప్పలోనికి ముడుచుకొనునట్లు, స్థితప్రజ్ఞుడు తన ఇంద్రియాలను విషయలోలత్వం నుండి మరలిస్తాడు.

**"ఉ॥ ఆపదలందు ధైర్యగుణ మంచిత సంపదలందుఁ దాల్మియున్**
**భూపసభాంత రాళమున పుష్కల వాక్చతురత్వమాజిబా**
**హావటుశక్తియున్, యశమ్మునందనురక్తియు, విద్యయందు వాం**
**ఛాపరివృద్ధియున్, ప్రకృతి సిద్ధగుణంబులు సజ్జనాళికన్".**

ఈ నేపథ్యంలో ఆలోచిస్తే రంగాజీ తొంబదైదేండ్ల జీవయాత్రకు జీవగఱ్ఱ అనదగ్గది వారి స్థితప్రజ్ఞత్వమే. తన తొంబదైదేండ్ల జీవితంలో ఎనభై ఏళ్లపాటు నిస్వార్థంగా, నిర్విరామంగా, నిరంతరంగా ప్రజాసేవలో పండిన మహామనీషి ఆచార్య రంగాజీ

ఈ లోకంలో దైవ సమానులుగా ఆరాధింపబడిన వారు కొందరున్నారు. వారిలో ప్రధమ గణ్యుడు రెండువేల ఐదువందల సంవత్సరాలకు పూర్వం మన పుణ్య భారత భూమిలో జన్మించిన బుద్ధభగవానుడు. రెండువేల సంవత్సరాల క్రితం జెరూసలేంలో ఒక వడ్రంగి ఇంట జన్మించిన జీసస్ క్రీస్తు. తనే స్వయంగా నేను దేవుని కుమారుడనే తప్ప దేవుడును కాను అన్నప్పటికి అనేకదేశాలవారు అతని దైవంగా ఆరాధిస్తూనే ఉన్నారు క్రీస్తు తర్వాత ఐదువందల సంవత్సరాలకు మహమ్మదు ప్రవక్త అల్లాగా ఆరాధింపబడసాగాడు. మరో ఐదువందల సంవత్సరాల తర్వాత శంకరాచార్యులు, ఆ తరువాత రామానుజాచార్యులు, మధ్వాచార్యులు, జన్మించి మానవులకు జ్ఞానభిక్ష పెట్టారు. ఇల్లా ఎందరో మహానుభావులు! వారందరిని దైవాంశ సంభూతులుగా భావించి పూజిస్తున్నాం. ఇహలోకపు సామాన్య మానవుల నుండే పై జెప్పబడిన మహానుభావులు, ఉద్భవించి, మనిషి, మనీషి, మహామనీషిగా పరిణమించి వన్నెకెక్కారు తప్ప, పుడుతూనే వారు మహాత్ములు కాలేదు.

ఇంత కథ ఎందుకు చెప్పవలసివచ్చిందో ఈ పాటికి గ్రహించి ఉండకపోరు ఇట్టి దైవాంశ సంభూతులకోవలో చేర్చి అశేష ప్రపంచ కర్షక జనావళి ఆరాధిస్తున్నది రంగాజీని

మానవులందరూ, మాధవులుగా పరిణితి చెందగల్గిన వారేనని భారతీయ ధర్మం ఉగ్గడిస్తున్నది. అందరి స్వభావమూ నిర్మలమైనదె, నిష్కల్మషమైనదే. ఐనా అది కొన్ని ప్రకృతి సిద్ధ దోషాల వల్ల, అరిషడ్వర్గాది మనోవికారాల వల్ల - మలినమై పోతుంది. ఈ దోషాలను మించినది అజ్ఞానదోషం. ఈ అజ్ఞానాన్ని రూపుమాపడానికి స్థిరచిత్తం కావాలి. నియమపాలన కావాలి. వానిని వశపఱచుకొన్న స్థిత ప్రజ్ఞుడు ఆచార్య రంగాజీ.

రంగాజీలో దైవాంశ, అంతర్లీనంగా నిక్షిప్తమై ఉన్నదన్న సత్యాన్ని రుజువు పఱచు కొనేందుకు ఒక మార్గమున్నది. ఈ సందర్భంలో ప్రసిద్ధ తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి గారు అన్నట్లు ఆ మార్గాన్ని అంటే చెకుముకి రాయితో ఇనుప బిళ్లను రాపిడి చేసినప్పుడు అగ్ని ప్రజ్వలిస్తుంది. అదే మాదిరి ప్రకృతిని దర్శించడంలో ప్రజ్ఞను జోడించినప్పుడు నిశ్చలతత్వం బహిర్గతమవుతుంది. ఆ మార్గంలోనే ప్రతి మానవునిలో నున్న మహత్తత్త్వాన్ని దర్శించి, తన ప్రజ్ఞతో - ప్రపంచ కర్షకావళిని ఉద్దీపింపజేసి, ఉద్ధరించిన ప్రజ్ఞా నిధి పూజ్య రంగాజీ!

ఇలా సత్యదర్శనం చేసిన రంగాజీ తన 80 ఏండ్ల ప్రజాహిత రాజకీయ జీవితంలో అణగారిన, కర్షక జనావళిలో నిక్షిప్తమై యున్న సృజనాత్మకశక్తిని, తన ప్రజ్ఞాపాటవంతో రగుల్కొల్పి చైతన్య వంతం చేశారు. ఆ జాగృతచైతన్యమే కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్య

సిద్ధాంతంగా అవతరించింది ఈ సిద్ధాంతం ఒక విప్లవజ్యోతి అది ఉత్పత్తి దారులైన కష్టజీవుల పాలిట ఆశాజ్యోతి

కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్యం – ప్రజాస్వామ్య పాలనకు ఉత్తమమార్గమన్న రంగాజీ ప్రవచనంతో – మహాత్మాగాంధీ ఏకీభవించారు గాంధీజీ ఆశీస్సులందిన ఈ కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్య సిద్ధాంతాన్ని ఏభై ఏళ్లుగా రంగాజీ ప్రపంచ వ్యాప్తంగా ప్రచారం గావించాడు. కారల్ మార్క్సు ప్రతిపాదించిన ఏక పక్ష కార్మిక నియంతృత్వ సిద్ధాంతం ప్రాతిపదికగా 1917లో వెలసిన సోవియట్ యూనియన్ నేడు కుప్పగూలి పోయింది. దానికి ఉపగ్రహాలుగా వ్యవహరించిన దేశాల్లోనూ, ఏకపక్ష కార్మిక నియంతృత్వ పాలన ఛీత్కారాలకు గురై, అదృశ్యమైపోయింది ప్రత్యామ్నాయంగా రంగాజీ ప్రవచించిన కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్య సిద్ధాంత మొక్కటే ప్రపంచ శ్రమజీవులకు శ్రీరామరక్షగా మిగిలింది.

**“ యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత**
**అభ్యుద్ధానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.”**

అంటూ శ్రీకృష్ణభగవానుడు గీతలో చెప్పినట్లు రంగాజీ సహితం వ్యవసాయ దారులకు, గ్రామీణ ప్రజలకు, హస్తకళాకారులకు, చేనేత వారికి, బుద్ధిజీవులకు, ఎప్పుడు ఎక్కడ ఏ రూపంలో ఎవరివల్ల హాని జరిగిన వారెంతవారైనా అప్పుడు అక్కడ తదుచిత రూపంలో ప్రత్యక్షమై కష్టాల కడలి నుండి వారిని దరిచేర్చి కాపాడారు. దశదిశలా స్వేచ్ఛావాయువు లెగయడానికి ప్రజాస్వామ్యం విరియడానికి కారకులయ్యారు.

**బహుముఖ ప్రజ్ఞాశాలి, ప్రజ్ఞానిధి, మనీషి, మహామనిషి, మహోన్నత వ్యక్తి, జ్ఞాన సంపన్నుడు, స్థిత ప్రజ్ఞుడు రంగాజీ.**

కారుణ్యమూర్తి, కరుణామయుడు, ఆర్తత్రాణ పరాయణుడు, మానవతావాది, సత్యవాక్ పరిపాలకుడు, న్యాయ, ధర్మనిరతుడు, ధార్మికుడు, మనీషి, మహామనీషి, శాంతమూర్తి, సౌజన్యమూర్తి, సౌశీల్యము, సౌకుమార్యం, నిర్దుష్ట ప్రవర్తన, నియమపాలన, నీతి నిజాయతీ, సేవాభావం, సేవాదృక్పథం, అణువణువునా నిండి నిబిడీకృతమైన మహామనీషి, మానవోత్తముడు, మహర్షి బ్రహ్మర్షి రంగాజీ.

సౌందర్యోపాసకుడు, కళాపోషకుడు, కళారాధకుడు, ప్రకృతి ఆరాధకుడు, ప్రకృతి ఉపాసకుడు, ప్రకృతిలోనే సర్వచరాచర జీవకోటినీ వాటి మనస్తత్వాన్ని పరిశోధించి, పరిశీలించి మానవులతో పోల్చుకుని తన్మయత్వం పొందుతూ తాదాత్మ్యం చెంది, తాను పరవశించి, ఎదుట వారిని పరవశింపచేసిన ప్రకృతి ఆరాధకుడు రంగాజీ.

కుడుముస్తే పండుగ అనే గ్రామీణ శ్రామిక జనాల నానుడికి ప్రతిరూపం. భోళా శంకరుడు, పరమ సాధు పుంగవుడు, అజాత శత్రువు పరోపకారమే పరమ ధర్మంగా, అదే జీవిత ధ్యేయంగా, జీవన విధానంగా, జీవికను సాగించిన పరోపకార జీవి రంగాజీ

సకల సుగుణాల రాశి, సకల సుగుణాల ప్రోది. ఆశ్చర్యం లేదు. అనుమానం అంతకన్నా ఉండ వలసిన అవసరం లేదు. అయినా మహామనీషి మానవోత్తముడు ఆచార్య రంగా (శ్రీ) రంగాజీ [illegible] సత్య [illegible] నిర్వచనంగా

నిరాడంబరంగా మానవసేవే మాధవ సేవగా రైతు, కూలీ, చేతివృత్తుల, బుద్ధి జీవుల మధ్య వారికి సేవలందిస్తూ వారిచే ఆరాధించబడుతూ, ప్రస్తుతించబడుతూ, ప్రేమించబడుతూ తొంభై ఐదేళ్ల సుదీర్ఘ కాలం జీవించి తొంభై ఐదవయేట 1995 జూన్ 8వ తేదీ ప్రశాంతంగా కన్నుమూసిన మహోన్నత వ్యక్తి పుణ్య పురుషుడు రంగాజీ.

ఇంతటి సుదీర్ఘ కాలం ప్రజా సేవకుడుగా, ప్రజా నాయకుడుగా అశేష ప్రజల ఆదరాభిమానాలు, గౌరవ ప్రతిష్ఠలు పొందుతూ జీవించిన మహానాయకుడు ప్రపంచంలోనే అరుదుగా ఉంటారని ఎందరో ప్రశంసలను కురిపించారు.

ఈ మన ఆరాధ్య నాయకునికి, ఇన్ని సుగుణాలు అలవడి ఉండటం ఆశ్చర్యంగానే ఉంటుంది కదూ? ఈ సుగుణాలలో ఏ ఒక్క సుగుణం ఉన్నా ప్రశంసనీయమే. ఆరాధనీయమే. మనీషిగా అట్టి వ్యక్తిని ప్రస్తుతించవచ్చు. ఈ సుగుణాలలో ఏదో ఒక సుగుణమో లేదా రెండు మూడు సుగుణములో ఏదో ఒకరిలో ఉండటం సర్వసామాన్యమైన విషయం కావచ్చు. అలా కాకుండా ఈ సుగుణములన్నీ ఒకేవ్యక్తిలో మూసపోసినట్లు ఉండటం సామాన్య జన జీవితంలో మనం చూడలేము. కాకపోతే పురాణాలలో, ఇతిహాసాలలో, ఆది వ్యాస, వాల్మీకి, కాళిదాస, భవభూతి, క్షేమేంద్రుడు మున్నగు మహర్షుల కోవకు చెందిన కారణ జన్ములూ, పరా విద్యా సంపన్నులూనైన దార్శనికులూ, పండితులూ తమ కథనాలలో వర్ణించిన దేవతామూర్తులను మాత్రమే అంతటి మహా సుగుణాల రాశులుగా ఎంచుకుంటాము. అలాంటి పుణ్యపురుషుడు, పురాణ పురుషుడు ఆచార్య రంగాజీ అనుటలో సందేహమే లేదు.

ఇచ్చట మనం పైన పేర్కొనబడిన సుగుణాల రాశులైన మహోన్నత వ్యక్తుల పరిపూర్ణత్వం ఎంత విలక్షణంగా ఉంటుందో ఒకటి రెండు ఉదాహరణలు చూద్దాం. జాజికాయ, జాపత్రి, లవంగం, యాలక్కాయ, కుంకుమపువ్వు, కస్తూరి ఇలా ఇంకెన్నో సుగంధ ద్రవ్యములున్నాయి. ఇందులో దేనికదే సుగంధభరితమే. సువాసనలు వెదజల్లుతూనే ఉంటాయి. అవునా ? అయినా పై సుగంధ ద్రవ్యములన్నీ కలిపి వాడితేనే దానికి పరిపూర్ణత్వం లభిస్తుంది కదూ ? అలానే ఇంకో ఉదాహరణ చూడండి. తమల పాకు, వక్కపలుకూ, సున్నమూ, కాసు కలగలిపి నవలందే నోరు, నాలుకా పెదవులు సింధూర వర్ణము వచ్చి మానసికోల్లాసం కలుగదు. దీనికి తోడుగా పైన పేర్కొన్న సుగంధ ద్రవ్యములు జోడించామా? చెప్పనే అక్కరలేదు. ఆ ఆనందానికి.

మరో ఉదాహరణ చూడండి లవంగం, దాల్చిన చెక్క, అల్లం, గసగసాలు, కొబ్బరి కలగలిపి మొత్తంగా వెన్నముద్దవలె నూరి ఆ ముద్ద తాలింపులో వేస్తేనే గాని ఆ కూర సుగంధం నాశికాగ్రములకు అంటదు కదా ? ఇలా చెప్పుకుంటూపోతే ఇంకెన్నైనా ఉదాహరణలు సోదాహరణంగా వివరించవచ్చు.

రంగాజీని సుగుణాల రాశిగా చెప్పుకున్నాము. ఆ సుగుణాలలో ప్రతి సుగుణం దేనికదే ఉత్తమోత్తమము అయినవే. ఇక అట్టి అనేక సుగుణాలు రాశిపోస్తే ఎలా ఉంటుందో ఊహించవచ్చు.

**రంగాజీ జన్మ నక్షత్రం :**

రంగాజీ 1900 సంవత్సరం నవంబరు 7న జన్మించాడు. అందులోనూ ఒక విశేషమున్నది! అదేమంటే ఆయన 19వ శతాబ్దాంతమున జన్మించారు కదా ? అందు వలన 19వ శతాబ్దములో ఆయన జననాన్ని ప్రస్తావించే ముందు ఇంకొక ఆసక్తికరమైన విషయం చెప్పుకోవచ్చు. వారు 1995 జూన్ 8వ తేదీ పరమ పదించారు. అందువలన 19వ శతాబ్దంలో జన్మించి 20వ శతాబ్ద అంతమున పరమపదించిన రంగాజీ రెండు శతాబ్దాల మేలు కలయికగా ఒక చరిత్ర సృష్టించిన మహానుభావుడుగా మనం చెప్పుకొని గర్వించవచ్చు.

రంగాజీ జన్మదినము యొక్క విశిష్టత ప్రాధాన్యత చారిత్రక ప్రసిద్ధిని కొనియాడుతూ ప్రశంసిస్తూ ఉండేవారు. ఎందుకనగా నవంబరు 7 రష్యాలో బోల్షివిక్ విప్లవం జయప్రదంగా ముగిసి సోషలిస్టు సమాజ ఆవిర్భావానికి నాంది పలికిన దినమది. ప్రపంచ పరివ్యాప్తంగా శ్రమజీవులకది పర్వదినం. ఆ దినం రంగాజీ జన్మదినం కావడం గర్వకారణమంటూ 20వ శతాబ్దపు రెండు మూడు దశాబ్దాలలో పలువురు పలురకాలుగా ప్రశంసిస్తూ ఉండేవారు.

**మార్క్సిజం పట్ల రంగాజీ మోజు :**

నవంబరు 7కు చారిత్రక ప్రాధాన్యమనండి మరేదైన కారణం కానివ్వండి లండనులో విద్యాభ్యాసం చేస్తున్న కాలంలోనే రాజకీయాలవైపు మొగ్గడం అందులో భాగంగా మార్క్సిజంపట్ల అభిమానం పెంచుకోవడం జరిగింది.

సమసమాజం ధ్యేయంగా మార్క్సు క్యాపిటల్ అనే పరిశోధక అర్థశాస్త్ర గ్రంథం రచన చేయడం జరిగింది. 18వ శతాబ్దపు మధ్యభాగంలో క్యాపిటల్ చదివిన విద్యార్థికు లలో అత్యధికులు కమ్యూనిష్టు సిద్ధాంతం పట్ల మోజు పెంచుకున్నారు. యూరప్ అంతటా మార్క్సిజం పట్ల అభిమానం పెంచుకున్న గిల్డ్ సోషలిష్టులతో రంగాజీ సహపాఠికావడం, రాజకీయాలలో వారితో కలిసి పనిచేయడం కారణంగా దోపిడీ వ్యవస్థకు వ్యతిరేకంగా సాగిన కమ్యూనిష్టు ఉద్యమంతో పరిచయం కలగడం జరిగింది. దాంతో కమ్యూనిష్టు సుత్తి, కొడవలి చిహ్నం గల పతాకాన్నే రంగాజీ కూడా పట్టుకు తిరిగారు. ఆ నేపథ్యంలోనే ఇండియా తిరిగివచ్చిన రంగాజీ రాజకీయ రంగాలలో ప్రవేశిస్తూనే రైతు సంఘాలను స్థాపించారు. వ్యవసాయ కూలీ సంఘాలను స్థాపించారు. చేనేత పారిశ్రామికులకు ఆర్థిక సహకారాన్ని అందించేందుకు కో-ఆపరేటివ్ సంస్థలు స్థాపించారు. గ్రామీణ శ్రామిక జనాల్లో విద్యా వ్యాప్తి కొరకై వయోజన పాఠశాలలను నడిపారు. విద్యార్థికులైన యువకులలో అభివృద్ధి దాయకమైన రాజకీయ, సాంఘిక ఆర్థిక శాస్త్రములలో అవగాహన కలిగించేందుకు రైతాంగ వయోజన రాజకీయ పాఠశాలలను నెలకొలిపారు. ఈ పైన పేర్కొన్న అన్ని సంస్థలకూ సుత్తి, కొడవలి చిహ్నం గల ఎర్ర జెండానే ప్రతిష్ఠించడం జరిగింది. అప్పట్లో – ఆ 1938 దాక.

ఈ అన్ని కారణాలతో తాను సాగించే ఉద్యమాలకు కమ్యునిష్టులనే తోడు చేసుకున్నారు. అన్నింటికంటే ముఖ్యంగా రైతు సంఘస్థాపన జమీందారీ, జగీర్దారీ, ఈనాందారీ వ్యవస్థలను రద్దుచేసి భూములపై రైతులకు పట్టాలిప్పించే మహోద్యమాలలోనూ కమ్యూనిష్టులను వెంట బెట్టుకొనే కలసి పనిచేశారు. అయితే ఇంత జరుగుతున్నా కమ్యూనిష్టు పార్టీలో కార్డు

హోల్డరుగాగానీ, కమ్యూనిష్టు పార్టీ ఉద్యమాలలో పాల్గొనడం గానీ జరుగలేదు. కమ్యూనిష్టులతో కలసి పనిచేయడానికి ఆయనకెందుకో మనస్కరించలేదు. కమ్యూనిజంలో ఏదో లోపం ఉందని భావించారాయన.

ఇప్పుడు మనం ఆంగ్లకాలమానం ప్రకారం చరిత్ర ప్రాధాన్యం సంతరించుకున్న నవంబరు 7 ప్రాధాన్యత గూర్చి చర్చించుకుంటున్నాము. రాజకీయాలలో ప్రవేశించిన ప్రాథమిక దశలో ఆయన కమ్యూనిజం పట్ల అభిమానాన్ని పెంచుకుని వారి సహచర్యంతో ప్రజా ఉద్యమాలను నడుపుతూ ఉన్న ఆనాటి పరిణామాలకు అనుగుణంగా నవంబరు 7 అనగానే బోల్షివిక్ విప్లవ విజయకేతనంగా ఆ తేదీ సంతోషం గానే ఉండేది, అభిమానంగానే ఉండేది. అది ఒక గర్వకారణంగానే సహచరులూ భావించారు. అనుచరులూ మెచ్చుకున్నారు. ప్రజలూ భళాభళి అన్నారు. తాను గర్వంగా ఎంచుకున్నారు.

**చాంద్రమాన, మార్గశిర శుద్ధ పౌర్ణమి ప్రాశస్త్యం :**

రంగాజీ ఆంగ్లకాలమానం ప్రకారం 1900 సంవత్సరం నవంబరు 7వ తేదిన జన్మించారనీ, దానికొక చారిత్రక ప్రాధాన్యం ప్రపంచంలోనే కలదని కూడా చెప్పుకున్నాం. దానిని కాదనలేదు ఆయన. ఆ రీత్యా కూడా అది తనకు గర్వకారణమే నంటారు. అయితే అంతకంటే విశిష్టమూ, పవిత్రమూ, పరిశుద్ధమూ పరమ పావనమూ అయిన ఒక నక్షత్రంలో జన్మించానంటారు. అదే .. చాంద్రమాన సంప్రదాయం ప్రకారం మార్గశిర శుద్ధ పౌర్ణమి శుభదినమది. ఆ పవిత్ర ఘడియలలోనే జన్మించానని ఆయనకు ఒక గొప్ప తృప్తి, సంతోషము, ఆనందము.

**ముప్పయ్యేళ్ళకు పూర్వం ఒకనాడు ఢిల్లీ విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు ఆంగ్ల, ఆంధ్ర, సంస్కృత భాషలలో మహాపండితుడు శ్రీ గంటి జోగి సోమయాజులు గారు రంగాజీని దర్శించుటకై ఢిల్లీలోని రెండవ నెంబరు విండ్సర్ ప్లేస్‌కు వచ్చారు. అది వసంత ఋతువు. వసంత ఋతువు ఈ విశ్వంలోని సర్వ చరాచర జీవకోటికి సంతోషదాయకమైన ఋతువు. ఆహ్లాదకరమైనది. ఇక మానవుల సంగతి చెప్పనవసరం లేదు.**

ఆనాటి రంగాజీ, సోమయాజులుగార్ల మధ్య జరిగిన సంభాషణ రసవత్తరంగాను, ఆసక్తిదాయకం గాను ఉన్నది. మనమూ పాలు పంచుకుందామా ? ఇరువురూ సాయం సమయాన ఆరు బయట కుర్చీలు వేసుకుని అనేక విషయాలు అందులో రాజకీయాలూ ఉన్నాయి. సాంఘీకాలు ఉన్నాయి. ఆర్థికములూ ఉన్నాయి. మధ్య మధ్య భాషా సమస్యలు. తెలుగు నుడి కారములలోని తియ్యదనము, కాళిదాసు కవిత్వంలోని మాధుర్యం, వాల్మీకి మహర్షి తన రామాయణ మహాకావ్యం ద్వారా కుటుంబంలోని తల్లి, తండ్రి, అక్కా చెల్లెళ్లు, అన్నదమ్ములు వారి మధ్య ఉండవలసిన ప్రేమ వాత్సల్యాలు, అభిమానం, సౌజన్యం చర్చించుకునివావివరసలు ఎలా ప్రారంభమయ్యాయో సుదీర్ఘమైన చర్చలు సాగాయి. సాయం సమయమైనది. ప్రొద్దుకుంకినది. సూర్యుడు అస్తమించాడు. రంగాజీ అన్నారు. సోమయాజులుగారూ అలా కొంత తడవు నడుచుకుంటూ పోదామా ? అయినా నా మనస్సులోనూ అదే ఉంది అని బయలు దేరారు. కొత్త ఢిల్లీలోని విశాలమైన వీధులలో వీధికి ఒక రకమైనచెట్లను నాటి పెంచడం జరిగింది. నేరేడు చెట్ల వీధిగుండా బయలు దేరారు.

శివుని పూజా ద్రవ్యాలలో నేరేడు, మారేడు, గన్నేరులలో ఈ నేరేడు ప్రథమం కదా ? దాని ప్రాశస్త్యం ఏమిటి ? అని అడిగారు. సోమయాజులుగారు నేరేడు ప్రాశస్త్యం గురించి ఇలా చెప్పారు. పరమ శివుడు శ్రామిక జనాలకు అధిదేవత. ఆయన సాహచర్యమంతా అటవికులతోనే. అందువలన మానవులకు అవసరమైన ఈ వృక్షాల ఆకులు, అలములు, పండ్లు ఆయనకు ప్రీతిదాయకములు. ఇందులో గృహోపయోగ కరములైన అనేక పనిముట్లకు ఈ వృక్షమే ఆధారం. ఇక నేరేడు పండా ? ఇందులో గల రోగ నిరోధక శక్తి ఊహాకందనిది. పంటకాలంలో రోజుకు ఒకటి రెండు పండ్లు తిన్నా అది రోగ నిరోధకశక్తిని పెంచుతుంది. ఇలా చెప్పుకుంటూ పోతూ ఉండగా వసంత ఋతువును రంగాజీ వర్ణిస్తూ పులకించిపోతున్నారు. పరవశించిపోతున్నారు వసంత ఋతువును వర్ణించిన విధం గమనించిన సోమయాజులుగారు రంగాజీని ప్రశంసిస్తూ రంగాజీ వసంత ఋతువును కాళిదాసు, భవభూతులు కూడా ఇంత శక్తివంతంగా వర్ణించలేదాయ్యా! అని మెచ్చుకున్నారు. అప్పుడు చెప్పారు రంగాజీ. నేను మార్గశిర శుద్ధ పౌర్ణమి పవిత్ర దినాన జన్మించాను. ఆ దినం పవిత్రమైనదని, పుణ్యప్రదమైనదని చెప్పారు మా పెద్దలు. అటు తరువాత నా అభిమాన గురువు శ్రీ జంపని ఆంజనేయులుగారు ఒక రోజు నన్ను చేరబిలిచి ఒరేయ్ రంగనాయకులూ ఈ ముహుర్తాన జన్మించినవారు – సౌందర్యో పాసకులు, సౌందర్య ఆరాధకులు, కళాపోషకులు, కళారాధకులు అవుతారురా అబ్బాయి అని అంటుండేవారు. అప్పుడు దానిని నేను అంతగా పట్టించుకోలేదు. ఎందు కంటారా ? సరిగ్గా ఆ ముహుర్తాన ఈ విశ్వంలో వేలమంది పుడతారు. వారంతా ఇంతటి గొప్ప సౌందర్యోపాసకులు, సౌందర్యారాధకులు అవుతారా ? అనుకుంటూ దానిని అంతగా పట్టించుకునే వాడిని కాను. ఒక రోజు ఆయనే చెప్పారు అందరూ అలా అవుతారని కాదు. ఆ ముహుర్తాన పుట్టినవారికి ఆ అంశ ఉంటుంది. దానిని పొందే అనుభవం, అనుభూతి అలవరచుకోవాలని.

ఇక సోమయాజులుగారు ప్రారంభించారు. మార్గశిరశుద్ధ పౌర్ణమి పవిత్రత, విశిష్టత లపై వేదాలు, పురాణాలు ఇతిహాసాలు, ఖగోళ శాస్త్రం మున్నగు విషయాలను త్రవ్వి పోశారు. హిందువుల పవిత్ర గ్రంథం భగవద్గీతకు రూప కల్పన జరిగింది ఈ ముహుర్తం లోనే. వైదికులు (హిందువుల) ఆరాధించి, పూజించి, అర్చించే శ్రీరామచంద్రుడు కూడా ఈ నక్షత్రంనందే జన్మించారు.

భగవద్గీత విభూతియోగంలో మార్గశిర మాసంను వర్ణించిన విధం ఆయన కంఠస్థంగా ఇలా చెప్పారు.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ చంద్ర సామహమ్ మాసాం మార్గశీర్షోహం రుతునాం కుసుమాకరం.

దీని తాత్పర్యం వల్లె వేస్తుంటే హృదయం పల్లవిస్తుందంటాగాయన.

తా ॥ సామవేద గానములలో బృహత్సామమునూ్నా చందస్సులలో గాయత్రియూ, మాసములలో మార్గశిరమూ ఋతువులలో వసంత ఋతువునూ నేనై యున్నాను అంటారు శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో.

రంగాజీ ప్రశ్న ? అయ్యా! సోమయాజులుగారూ శ్రీరామచంద్రుని జననం చైత్రశుద్ధ నవమి అంటారే. మరి మార్గశిరపౌర్ణమి ఎలా అయింది ? నాకు అంతా తికమకగా ఉంది వివరించండి.

సోమయాజులు సమాధానం వినండి. పూర్వము మహాభారత రచనకు ముందు అంటే (5,6 వేల సంవత్సరాలకు ముందు)

నూతన సంవత్సరం మార్గశిరంతోనే ప్రారంభమయ్యేది (మహాభారతం అను –106 నుండి 109 వరకు గల అధ్యాయాలో చూడండి) ఇప్పుడు తెలిసిందా నూతన సంవత్సరం నేటివలె చైత్రమాసంలో కాక చాంద్రమానం ప్రకారం మార్గశిరమే నూతన సంవత్సరానికి మొదటి మాసంగా ఉండేదని చరిత్ర పారం.

మార్గశిరమాస ప్రాముఖ్యత, విశిష్టత, పవిత్రతల గురించిన కథలు, గాథలు తామర తంపరగా వైదిక సారసత్వం నిండా ఉన్నాయి.

అందు ప్రథమమూ, ప్రధానమూ, పవిత్రమూ అయిన భగవద్గీత నుండి చూడండి.

ధనుర్మాసం అగు ఆ సమయం మహా పవిత్రమైనది. వ్రతోపాసనకు మంచి తరుణం. అది మంచి ఫలితముల నిస్తుంది. ఆ కాలములోనే పంటలు పండి ఇండ్లకు చేరి ప్రజలు సుఖసంతోషాలతో ఉంటారు. చెట్లు చిగురిస్తాయి. ఫలముల నందిస్తాయి.

వాల్మీకి రామాయణం నందు వాల్మీకి మహర్షి మార్గశిర మాసం సంవత్సరం మొత్తానికి భూషణమన దగినదని వర్ణించారు. భగవద్గీత ఈ మార్గశిర మాసమునందే శుద్ధ ఏకాదశినాడు ఆవిర్భవించింది.

అవతారపురుషుడు దత్తాత్రేయులు ఈ మాసంనందే జన్మించిరి. (మార్గశిర శుద్ధ పౌర్ణమి) రంగాజీ జన్మించిన ముహూర్తం అదే కదా ? వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది.

ఋతునాం కుసుమాకరం అన్నారు. కదా గీతాకారుడు

ఇచ్చట గమనించదగిన ప్రధానమైన విషయమేమనగా ఇంతకు ముందే మనం చెప్పుకున్నట్లు శ్రీరామచంద్రుని జననం చైత్రశుద్ధ నవమిగా వాడుకలో ఉన్నది కదా? మహాభారత రచనా కాలానికి ముందు సంవత్సరాది మార్గశిర మాసంతో మొదలయ్యేది.

సమకాలీన సమాజమునందు మార్గశిర పుష్యమాసములు హేమంత ఋతువుగా ఉన్నది. మహాభారత కాలమున అది వసంత ఋతువై ఉండవచ్చును. మార్గశిర శుద్ధ పౌర్ణమి తన జననం కావడం రంగాజీకి ఆనందదాయకం, సంతోషదాయకం. అప్పుడప్పుడు తన జన్మదినోత్సవానికి ముందు మనస్సులో మహా పండితుడు జోగి సోమయాజులుగారు ఆనాడు మార్గశిర ప్రాశస్త్యాన్ని గురించి చెప్పిన విషయాలను మననం చేసుకొని ఆహ్లాదముతో ఉప్పొంగిపోతూ ఉంటారు. మహాభారతం, భగవద్గీతల నుండి మార్గశిరమాస ప్రాశస్త్యాన్ని వర్ణిస్తూ సోమయాజులుగారు తనకు పంపిన శ్లోకాలను వల్లెవేస్తూ ఉంటారు.

**పెంచిన తల్లి నేర్పిన ప్రకృతి పాఠాలు :**

తన చిన్ననాట ప్రాథమిక విద్యాభ్యాసపు రోజులలో ఏ కొద్దిపాటి సమయం లభించినా తన పెంపుడు తల్లి, నా ప్రథమ గురువు అని చెప్పుకొనే మంగమ్మ తన వెంట పొలాలకు

తీసుకొని వెళ్ళి పంటలు, పైరులు, పశువులు, పక్షులను చూపిస్తూ వాటి ఆకృతులను వర్ణిస్తూ వాటి జీవిత విధానం, ప్రవత్తుల గురించి పారాల్లు చెబుతూ ఉండేది. ఈ సంభాషణ అంతా ప్రశ్నలు సమాధానాల రూపంలోనే ఉండేదట. మాగాణులలో పాములు తిరుగుతూ ఉండేవి. వాటిని చూచి భయ విహ్వలుడై పరిగెత్తుకొనివచ్చి తల్లి ఒడిలో దూరేవాడట. ఆమె పకపకానవ్వి అవి నిన్ను ఏమి చేయవయ్యా ? వాటి జోలికి పోవద్దు. తెలిసిగానీ, తెలియకగానీ నీవు వాటికి బాధ కలిగించే పనిచేస్తే అవి నిన్ను భయపెట్టడానికి బుసకొడతాయి. అంతకంటే విశేషమేమిటో తెలుసా! అవి మనకు ఆప్తమిత్రులు. మనకు సహాయకారులు. న్యాయానికి మనం వాటిని పోషించాలి. కానీ అవి మన సహాయాన్ని ఆర్థించకుండా మన వలన ఎలాంటి ఉపకారాన్ని ఆశించకుండా మనకెంతో మేలు చేస్తాయి. పాములు మనకు మేలుచేయటమేమిటమ్మా! అని రంగా ప్రశ్న.

మన పంట పొలాలను ధ్వంసం చేసి విచ్చలవిడిగా పైరులు నాశనం చేసే ఎలుకలను పట్టుకొని తింటాయి. అవి చేసే మేలుకు వెలకట్టడం సాధ్యంకాదు.

అలానే మరోమారు వందల కొలది పక్షులు పంట పొలాలపై వాలి పంటను తింటూ నష్టం కలిగిస్తూ ఉంటుంటే రంగాజీ తల్లిని ప్రశ్నించాడు. పాములు ఎలుకలను తిని మనకు మేలు చేస్తాయని అన్నావు. రకరకాలైన ఈ పక్షులు మన పంటపొలాలను నాశనం చేస్తున్నాయి కదా ? ఇవీ మనకేమయినా మేలు చేస్తున్నాయా అని అడిగారు రంగాజీ. అవును మనకు మేలేచేస్తున్నాయి రంగడూ! ఎలాగో చెప్తా. మన పైర్లను, పంటలను సర్వనాశనం చేసే వందలకు వందల రకాలైన కీటకాలను పట్టి తినేస్తాయి. అది ఎంత లాభమో తెలుసా నీకు ? ఒక్కొక్క పురుగును పట్టి మనం చంపగలమా ? పుట్టలు పెట్టిన చెదలును చూపిస్తూ ఒరేయ్ ! రంగడూ ఇటురారా ఇటు చూడు. ఇవి వందలు వేలే కాదు లక్షలలోనే ఉన్నాయి. చిన్నచిన్న బుల్లిబుల్లి అందమైన చెదలు. ఇవి ఒక రకంగా మనకి నష్టం చేస్తాయి. కొన్ని పంటను చెదలుపట్టి నాశనం చేస్తాయి. కానీ మేలు ఎలా చేస్తాయో తెలుసా ? మన పొలాల్లో చెత్తా చెదారాన్ని గుల్ల చేస్తాయి. భూమిని కూడా పాటు చేస్తాయి. ఒక రోజున వర్షం పడుతూంది. చెట్టు క్రిందకు పరిగెత్తారు. అక్కడ చిన్న చిన్న పాముల వలె వందలు వందలు జట్లు జట్లుగా లుకలుకలాడుతున్నాయి. అమ్మో! పాములు అని కేకవేసి వాటిని చెప్పులతో కొట్టి చంపుతున్నాడు. అయ్యో అయ్యో అవి మన అప్త బంధువులు. అవి మనకెంతో మేలు చేస్తాయి. మానవ శ్రమతో చేయలేని సహాయం అవి చేస్తాయి. ఈ బండబారిన భూమిని గుల్లచేస్తాయి. ఇలా ప్రకృతి పాఠాలను ఆ తల్లి చెంగుపట్టుకుని వెంట తిరుగాడుతూ ప్రశ్నలు, సమాధానాల రూపంలో తెలుసుకున్నానంటాడు రంగాజీ. అందుకే నా ప్రథమ గురువు మా అమ్మ మంగమ్మ అని ఆసక్తికరంగా ఒక వ్యాసమే వ్రాశారు. అయన.

**సౌందర్యోపాసకుడు, సౌందర్యారాధకుడు, కళోపాసకుడు, కళారాధకుడు, ప్రేమస్వరూపుడు, కరుణామయుడు, కారుణ్యమూర్తి, అర్తత్రాణ పరాయణుడు, ధర్మనిరతుడు, సర్వజ్ఞుడు, స్థితప్రజ్ఞుడు అంటూ అశేష ప్రజలు ఆరాధించే, ప్రస్తుతించే ఆచార్య రంగాజీ మానవులలో మాధవుడు.**

ఆయనలోని సౌందర్యోపాసన, సౌందర్యారాధన, ప్రకృతి ఆరాధన, కళాపోషణల గురించిన యదార్థగాథలను కొంతగాకపోతే కొంతయినా ఇచట మీముందుంచే ప్రయత్నం చేస్తా.

రంగాజీ సౌందర్యానికి, కళలకు, సాహిత్యానికి అత్యధిక ప్రాధాన్యత ఇస్తారు. రాజకీయాలను ప్రవృత్తిగానే తీసుకుంటారు. దానినే వృత్తిగా స్వీకరించరు అన్నింటి కంటె మొదటి ప్రాధాన్యత ప్రకృతి ఆరాధనకే ఇస్తారు. వృక్షాలను శాస్త్రజ్ఞులు కొన్ని కుటుంబాలుగా విభజిస్తారు. వేల కొలదిగా ఉన్న ఈ వృక్షాలను గుర్తు పట్టాలంటే ఈ వృక్ష విభజన ద్వారానే సులభమవుతుంది. ఆయనలోని ఈ ప్రకృతి ఆరాధనా ప్రవృత్తి తనకు సంబంధించిన ప్రక్రియ కాకపోయినా బోటనీని ఢిల్లీలోని వ్యవసాయ పరిశోధనా సంస్థల నుండి బోటనీ సబ్జెక్టుపై అనేక గ్రంథాలు తెప్పించుకొని చదివారు. సాధారణంగా పుష్పాలనగానే ప్రజానీకంలో మల్లె, మందార, చామంతి, బంతి, గులాబి, సంపెంగ, జాజి, విరజాజి మున్నగు పరిమళ భరితములైన ఈ పుష్పాలనే ప్రశంశిస్తూ ఉంటారు. కొనియాడుతూ ఉంటారు. భక్తులైతే భగవంతునికి పూజాద్రవ్యంగా అర్పిస్తారు. తమ భార్యా బిడ్డలకు తలలో తురుముతారు వివాహాది శుభసమయాలలో గృహాలంకరణకు వినియోగిస్తారు. ఇవన్నీ రంగాజీకి కూడా అభిలషణీయములే, అనుకరణీయములే, అనుసరణీయములే. ఈ పరిమళాలు వెదజల్లే పుష్పాలన్నా ఆయనకు కూడా ఎనలేని ప్రీతి పాత్రములే. కానీ ఆయనలో పై పుష్పాలకంటే పంట పొలాలలో, బీడు భూములలో, చెఱువులలో దొఱువులలో పుష్పించే వందలాది పుష్పాలను గురించి కథలు, గాథలుగా చెబుతూ హర్షాతిరేకముతో ఉప్పొంగిపోతుంటారు

ఉదాహరణకు గ్రామాలలోని చెఱువులలో, దొఱువులలో కలువ, తామర, మెట్ట తామర, తంగేడు, ఉమ్మెత్త, జిల్లేడు, ఈ తరహా పుష్పాలను కూడా చూసి ఆనందించి కవిత్వ ధోరణిలో వేదాంతాన్ని గుప్పించి అనేక ఉదాహరణలతో ప్రశంసిస్తుంటారు. వరికోత అనంతరం పంటపొలాల్లో జనుము, కంది, నూవు విరగపూసి ముదిపసుపు పచ్చగా జనుము లేత పసుపు రంగులో మొగ్గలుగా ఉన్న కందిపూత కనుచూపుమేరలో ఉన్న పొలాలకు సాయం సమయాల్లో షికారు చేయడం ఆయనకెంతో తృప్తి. ఆ సీజనులో నిడుబ్రోలు వచ్చాడా ? ఎవరు అందుబాటులో ఉంటే వారిని తోడు చేసుకొని ఆ పొలాల మధ్య తిరుగుతూ ఆహా, ఒహో అని ప్రతిస్పందిస్తూ ఎదుటివారిని ఆనందింప చేస్తారు.

పుష్పం అనేది కేవలం సుగంధ భరితమే కాదు, సువాసనలకే కాదు, అలంకరణలకే కాదు. ఒక్కమాటలో చెప్పాలంటే వాటి ఉపయోగం సర్వకాలీనం. సార్వజనీనం. కానీ ఈ అన్నింటికంటె ఒక గొప్ప శక్తి దానిలో నుండి ఉద్భవిస్తుంది. కాయ, కసరు, ఫలం, భూమాత నుండి ఉత్పత్తి అయ్యే ఏ వస్తువైనా దాని ఫలితం పుష్పంతోనే ప్రారంభమవు తుంది. అందుకనే స్త్రీల ఋతుక్రమాన్ని రజస్వల అని, పుష్పవతి అనే నానుడి వచ్చింది. ఇలా ప్రకృతి రహస్యాలు పాఠాలుగా చెప్పితాను ఆనందించి ఎదుటివారిని ఆనందింపచేస్తుంటారు.

ఆయనకు కొబ్బరికాయ కంటబడిందా ! అందరిలాగే పీచుతీసి కొబ్బరి కాయ ఉపయోగించుకోవడం కాదు. దాని జన్మవృత్తాంతాన్ని లాగుతుంటారు. చూడండి కొబ్బరికి

రక్షణగా టెంక, దాని రక్షణకు పీచు, లోన ఉన్న కొబ్బరికి ఆక్సిజన్ అందించే మూడుకళ్ళు. కొబ్బరికి ఆహారంగా నీరు ఎవరందించారు ? ఈ సృష్టి రహస్యం ఎంత విశేషమైంది ? భగవంతుడు వేరే ఎక్కడ ఉన్నాడు ఏ మతం దీనికి ఆధార భూతం? అలానే ఒక వస్తువును ఇంపితంగా భోజనం చేయాలంటే దాని షడ్రుచులు కావాలి. అవి ఉప్పు, కారం, పులుపు, తీపి, చేదు, వగరు ఈ వస్తువులను సృష్టించినది ఎవరు? ఏ మతం ? ఇదంతా ప్రకృతి సృష్టి ఇలా ప్రతి వస్తువుని గురించి ఏది తన చేతిలో ఉన్నా దానికి ఒక వివరణ దాని సృష్టి రహస్యం ఒక పారంగా చెబుతూనే ఉంటారు ఆయన అర్థశాస్త్రంలో ఆచార్యుడే కాదు. ఏ విషయం ప్రస్తావనకు వచ్చినా దానికొక శాస్త్ర విజ్ఞానం అన్వయించి చెబుతూనే ఉంటారు. ఆయన వేదాలను గురించి ప్రసంగం ప్రారంభించినా, పురాణాలు, ఇతిహాసాలను గురించిన ఉపన్యాసాలు ప్రారంభించినా, బైబిల్ ఖురాన్‌లపై చర్చ ప్రారంభించినా దానిలో ప్రకృతి రహస్యాలనే వెలికితీస్తుంటారు. ఆయన బోధనల అన్నింటినీ ప్రకృతి రహస్యాలకు అనుకూలంగానే అన్వయిస్తుంటారు ఈ విశాల విశ్వమంతా సృష్టి, స్థితి, లయా ప్రధానం ప్రకృతే ఆరాధ్య దైవం. ప్రకృతే జీవరాశికంతటికీ ఆహారపానీయాలను అందిస్తుంది. అందు వలననే మన పూర్వులు పెద్దగా వేదాంతం చదువుకోకపోయినా ఈ సృష్టి, స్థితి లయలకు ప్రధాన కారణం ఈ ప్రకృతేననేది వారి ఆత్మలకు తెలుసు. అది బయటకు కనపడదు అందుకనే భగవంతుని వారు చెట్టులో, పుట్టలో, రాతిలో, రప్పలో, పశువులలో, పక్షులలో చివరకు సూక్ష్మాతి సూక్ష్మములైన కీటకాలలో కూడా ఆరాధించదగిన, పూజింపదగిన జీవినే చూస్తుంటారు. వారే ప్రకృతి ఆరాధకులు, వారు ప్రకృతినే దైవంగా ఆరాధిస్తారు.

**సౌందర్యోపాసన - సౌందర్యారాధన - కళారాధన - కళోపాసన :**

సౌందర్యోపాసన, సౌందర్యారాధన విషయాలకు వస్తే ఆయన ప్రవృత్తి అదొక విలక్షణంగా ఉంటుంది. మన ప్రాచీన ప్రబంధకవుల రచనలలోని సౌందర్యంకాదు ఆయన చూచేది. ఆయన ప్రకృతిలోని ప్రతిజీవియందు ఒక విశేషమైన సౌందర్యాన్ని గమనిస్తారు. మీకు కొన్ని ఉదాహరణలిస్తాను. సౌందర్యవతి అయిన ఒక స్త్రీ. ఆ స్త్రీని అంగాంగముల శల్యపరీక్ష చేయరాయన. ఇతురులంతా కురూపిగా చూసే మనిషిలో ఎక్కడో దాగియున్న ఒక అందాన్ని చూచి దానినే ఆ వ్యక్తికి అందమైనదిగా అభినందిస్తుంటారు. నల్లగా నేరేడు పండు వర్ణంలో ఉన్న స్త్రీనిగాని, పురుషునిగానీ చూసినప్పుడు ఆయన అది క్రిష్ణ వర్ణమయ్యా ! అంటూ అభివర్ణించుతారు. ఆ ముక్కు చూడు ఆ అమ్మకు ఎంత అందంగా ఉందో కోటేరులాగ. విద్యుత్ లీనే ఆ కళ్ళు చూడు విశాలంగా ఎంత ఆకర్షణీయంగా ఉన్నాయో, ఆనడక తీరు చూడు. ఇలా ఆ వ్యక్తి లోని ఏదో ఒక భాగాన్ని తీసుకుని ఆ అందాన్ని వర్ణిస్తారు.

రంగాజీ కనీసం వేయి మంది కలం చిత్రాలు ( జీవితం) రాసి ఉంటారు. ఒక్కమారు ఆసక్తి ఉన్నవారు ఆ కలం చిత్రాలు చదివితే ఆయనలోని సౌందర్యోపాసన, సౌందర్యారాధన అర్థమవుతుంద. రచన ప్రారంభంలోనే ఆ వ్యక్తి యొక్క, ప్రధానమైన భాగాలను తీసుకుంటారు. ఉదాహరణకు ఆ బలిష్టమైన భుజాలు, ఆ విశాలమైన వక్షస్థలం, కోటేరులాంటి ముక్కు, ఉబ్బెత్తుగా, విశాలంగా ఉండే ఆ ఫాలభాగం ఇలా ఉంటాయి ఆయన వర్ణనలు

**సాహిత్యంలోనూ, సౌందర్యారాధనే, ప్రకృతి ఆరాధనే :**

రంగాజీ నిత్య జీవితంలో ఎచ్చట ఏ కించిత్ సౌందర్య, ప్రకృతి పరిమళం తన అవగాహనకు వచ్చినా, తానున్న పరిధిలో చర్చకు వచ్చినా ఎంతగానో పరవశించి పోతారనుకున్నాం కదా ! మరెంతగా ఆనందిస్తారో చర్చించుకున్నాము. ప్రకృతి రహస్యాలను శాస్త్రీయవిజ్ఞానానికి, చారిత్రక పరిశోధనకు ఉపయుక్తంగా మలుచు కుంటారో చూశాం. ప్రసంగాలలో, రచనలలో, చర్చలలో ఆయనదదే బాణి. ఆయన సాహిత్య సేవ గురించి మహాత్ముని ఆస్థాన కవిగా ప్రసిద్ధి పొందిన తెలుగు లెంక, అభినవ తిక్కన శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు ఆయన సాహిత్య సేవను అభివర్ణిస్తూ ఈ చిన్ని ఆణిముత్యంలాంటి గీత పద్యంతో ప్రారంబిద్దాం.

> **నిను దేశభక్తునిగా మెచ్చినవారల్**
> **కలరు మహి నశేష ప్రజ నీ**
> **ఒనరించిన భాషా సేవ నెఱింగిన వార**
> **లెన్ని వందలు కలరో?**

కళా ప్రపూర్ణ, తెలుగు లెంక, అభినవ తిక్కన, మహాత్ముని ఆస్థాన కవి, గాంధేయ వాది శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారన్నట్లు రంగాజీకి రాజకీయ నాయకుడిగానే ప్రశస్తి. ప్రపంచంలో రాజకీయ నాయకుడిగానే పరిగణన. కానీ ఆయన సాహిత్య, సాంస్కృతిక, చారిత్రక ప్రక్రియలపై సాగించిన కృషి సాహిత్య కృషి పండితులైన బహు కొలది మందికి మాత్రమే తెలుసు.

రంగాజీ ఆంగ్లములో ఎన్ని గ్రంథములు రచించారో అంతకంటే హెచ్చుగానే తెలుగులో కూడా గ్రంథ రచన చేశారు (ఆంగ్లములో 45 గ్రంథాలు రచించారు) చెబితే ఆశ్చర్యంగా ఉంటుందేమో ! ఆయన రాజకీయ, అర్థశాస్త్ర, సాంఘిక, సంస్కరణ, సాహిత్య, సాంస్కృతిక, చారిత్రక రంగాలకు సంబంధించిన వేయి మందికి పైగా ప్రముఖుల జీవిత చిత్రణలను (కలం చిత్రాలు) రచించారనే విషయం నేటి తరం వారికి అంతగా తెలియకపోవచ్చు.

రంగాజీ రచనా పాటవాన్ని ఆ రచనలలోని సాహిత్యం విలువలను, అందులో ఆయన వెలువరించిన సౌందర్య పోషణ, ప్రకృతి ఆరాధనలు ప్రాశస్త్యాన్ని పలువురు ఆంధ్రకవి పండితులు, చారిత్రక పరిశోధకులు బహుముఖాలుగా కీర్తించారు. అందులో కొన్ని బహుగ్రంథకర్త, జీవిత చరిత్రల రచనలలో అగ్రగామి పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు కేవలం ఆయన సాహిత్య సేవపైనే అనేక వ్యాసాలు రచించారు. ఆయన గ్రంథాలకు ఆ ముఖాలు రచించారు. రంగాజీ సాహితీ ప్రక్రియ ప్రాశస్త్యాన్ని గురించి ఆచార్య రంగాపై కవితామంజరి అనే గ్రంథానికి శ్రీ గొర్రెపాటి వారు రచించిన ఆ ముఖాన్ని ఒకమారు చదవండి మీకే తెలుస్తుంది.

రంగాజీ రచనలలో తెలుగు, జిలుగు, వెలుగుల సౌరభాలు ఆఘ్రాణించడానికి సుబ్రగ్రాహ్యములు. ఆయన గద్య రచన పద్యం వలె చంపోబద్ధంగా ఉంటుంది. గేయం వలే లయబద్ధంగా ఉంటుంది. ఆయన రచన ప్రారంభించాలంటే ఆంగ్లములోనైనా,

తెలుగులోనైనా రాకెట్ వేగంతో పోటీపడి పరుగులు తీస్తున్నదా అన్నట్లు ఉంటుంది. ఆయన రైల్లో ప్రయాణిస్తున్నా, పార్లమెంటు చర్చల్లో పాల్గొంటున్నా, ప్రపంచ పర్యటనకు విమానంలో బయలుదేరినా ఒక చోట అనేదేమిటి ఆలోచనరావాలేగాని అచటనే ఆ నిమిషాన్నే రచనకు ఉపక్రమిస్తారు. ఆ రచన అలనాటి వీరేశలింగం గారి ధారయే. కొట్టివేతలు, తుడుపులు మచ్చుకైన ఉండవు. ఏకంగా, నేరుగా ముద్రణకు పోవలసిందే. అందుకే ప్రముఖ రచయిత ఆవుల గోపాల క్రిష్ణమూర్తి, ప్రముఖ కవి పండితుడు మరుపూరి కోదండరామిరెడ్డి, భాషా శాస్త్రవేత్త పూతలపట్టు శ్రీరాముల రెడ్డి అనేక సమీక్షా వ్యాసరచనలు చేశారు.

తెలుగు నుడికారపు సొంపు, ఇంపు పసందులలో ఆయనకు ఆయనే సాటి. పలుకు బడులలో, నుడికారములో ప్రాంతీయ పారిభాషిక పదజాలములో ఆయనదొక ప్రత్యేకమూ విశిష్టమూనైన బాణి సర్కారు. రాయలసీమ – ఉత్తరాంధ్ర– దక్షిణాంధ్ర– తెలంగాణా పలుకుబడులు, నుడికారములు, శైలి కలగాపులగంగా ఉండి పడుగు పేకల వలే సాగుతుంది ఆయన రచనేగాని, ప్రసంగమే గాని గ్రంథ రచనకు పూనుకుంటూనే ప్రచురణ కొరకు రైతు గ్రంథమాల అనే సంస్థను స్థాపించారు.

రంగాజీ సౌందర్యారాధన, సౌందర్యోపాసన కేవలం ప్రకృతి ప్రసాదించే పరిమళములను, సుగంధములను సృష్టి, స్థితి, లయ కారణమును చూచి పరవశత్వము చెందటమే కాదు ఆనందోత్సాహాలను అనుభవించడమేకాదు శృంగార రసభరితంగా కూడా ఉంటుంది. రంగాజీ సౌందర్యోపాసనలోని శృంగారము ప్రాచీన ప్రబంధకవుల పచ్చి శృంగారము కాదు. భర్తృహరి ప్రతిపాదించిన సునిశితమూ, సుజన రంజకమూ, హృదయాలను పల్లవింపచేసే శృంగారము అనునది భర్తృహరి ప్రతిపాదించిన సుభాషితములు మూడు. దానిని సుభాషిత త్రిశతి అని కూడా అందురు. ఇందు నీతికి, వైరాగ్యానికి, శృంగారము అను మూడు విధముల ధర్మములను చెప్పారు. నీతి ఎంత ధర్మ పథంలో ఉండాలో వైరాగ్యమునకూ అంతటి ధర్మపథం నిర్దేశించారు. ఈ రెండు ధర్మములకు సమానమైన ధర్మముగా శృంగారమును కూడా వర్ణించారు. శృంగారమనగానే స్త్రీ పురుషుల అంగాంగ నిర్మాణ రహస్యముల వర్ణించుటయే కాదు. శృంగారమనేది స్త్రీ పురుషుల మధ్య సృష్టి, స్థితి, లయ కారకమైనదిగా ఉండాలి. ఇదే రంగా గారి ఆశయం. ఇదే ఆయన ఆదర్శం.

రంగాజీ సౌందర్యోపాసనలో శృంగారమనేది అతి ప్రాముఖ్యమైన అంశము. ఆ శృంగారము సృజనాత్మకమైనదిగా ఉండాలి. ప్రతి మానవుని మనఃఫలకంపై ఆనందాను భూతిని, ప్రేమామృతమునూ వర్షించేదిగా ఉండాలనేది రంగాజీ ఆశయం. అందు కాయన భర్తృహరి శృంగార శతకమునే ప్రామాణికంగా ఎన్నుకున్నారు. భారతీదేవి జీవితమును సౌందర్యము, కళా వైదుష్యము, శృంగార రసభరితములూ అయిన వర్ణనలతో రచించారు రంగాజీ. ఆ గ్రంథం వందకు పైగా శీర్షికలతో రసవత్తరంగా, మనోహరంగా రచించారు. అది రైతు ఉద్యమంగానీ, రైతాంగపోరాటమేగానీ, రైతు రక్ష యాత్రలేగానీ, దైనందిన జీవిత విధానాన్నే గానీ, విహార యాత్రలే గానీ, మరేదైనా గానీ అదొక శృంగార రసభరితంగానే ఉంటుంది. శ్రీమతి భారతీదేవి హృద్ రోగముతో గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రిలో

మృత్యువుతో ఆమె సాగించిన పోరాటాన్ని రోజుకో శీర్షిక క్రింద ఆమె అనుభవించే బాధలను పాఠకుల హృదయాలను కదిలించేదిగా, కనుగొనుకుల వెంట నీరు కార్పించేదిగా సాగింది. ఆయన రచన.

ఒక రోజు భారతీదేవి ఆసుపత్రిలో మృత్యువుతో పోరాడుతూ, బాధపడుతూ అచట చేరిన బంధుగణాన్ని సహచరులను, అనుచరులను, శిష్యులను ఓదార్చడం అనునయ వాక్యాలు పలకడం చూస్తుంటే ఆశ్చర్యంగా ఉండేది. ఆ సందర్భంలోనే అచట చేరినవారికి ఒక ధర్మోపదేశం చేశారు.

జాతస్య మరణం ధృవం ఇది ప్రాచీన ఆర్యోక్తి వేదాంత సారము కూడా. జనన మొందిన ప్రతిజీవి మరణించడం అనివార్యం. ఇది సృష్టి యొక్క రహస్యం. అందుకే మన పూర్వులు మృత్యువును దైవంగా అభివర్ణించారు. పూజించారు, ఆరాధించారు, ఉపాసించారు. ఎందుకో తెలుసా ? ప్రతిజీవికి మిత్రుడు, బంధువు, పోషకుడు, రక్షకుడు మృత్యుదేవతే మృత్యువు ప్రతీక్షణం జీవిని అంటిపెట్టుకొనే ఉంటుంది. తోడునీడగానే ఉంటుంది తల్లిదండ్రులు తమ బిడ్డల పోషణలో ఎంతటి జాగరూకులై ఉంటారో మృత్యుదేవత కూడా అంతటి జాగ్రత్తగా ఉంటుంది. ఎప్పుడూ హెచ్చరిస్తుంది. ఏమని ? జాగ్రత్త అని.

దరువూరి వీరయ్య

---

## త్వరలో వస్తోంది

**రంగాజీ యూరప్ (లండన్) లో నాలుగేండ్లు విద్యాభ్యాసం**

**లండన్ పార్లమెంటులో పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపై పరిశోధన**

**యూరప్‌లో గిల్డు సోషలిస్టు పార్టీ క్రియాశీల రాజకీయాలలో ప్రత్యక్ష సంబంధాలు**

**లండన్‌లో ఆంధ్ర పత్రికకు ప్రత్యేక విలేకరిగా పర్యవేక్షకులుగా నిరంతర పరిశోధన.**

# రంగాజీ స్వీయకథ - జీవితం : అనుభవాలు

నేను గొప్ప శివాలయం కలిగిన నిడుబ్రోలు గ్రామంలో జన్మించాను. ఈ గ్రామం తమిళనాడులోని కాంచీపురం ముఖ్యపట్టణముగా రాజ్యపాలన చేసిన చోళ ప్రభువు కులోత్తుంగ చోళునిచే వెయ్యి సంవత్సరాలకు పూర్వం నిర్మించబడినది.

నిడుబ్రోలు గ్రామం అనేక పురాతన గ్రామాలకు కూడలిగా ఉన్నది. విష్ణుకుండినులచే నాలుగైదు దశాబ్దాలలో నిర్మాణంకాబడ్డ కొండముది గ్రామం ఈ గ్రామానికి రెండుమైళ్ళ దూరంలో ఉన్నది. ప్రముఖ బౌద్ధ కేంద్రమయిన చేబ్రోలు ఏడుమైళ్ళ దూరంలో ఉన్నది భట్టిప్రోలు ఏడెనిమిది మైళ్ళదూరంలో ఉన్నది. భట్టిప్రోలులో ఉన్న స్థూపం అశోకచక్రవర్తి నిర్మితం. పేరునుబట్టి మా గ్రామం చాలా. పాడపైనదిగా భావించబడుతున్నది. ఇక్కడకు ఆరుమైళ్ళ దూరంలో బౌద్ధ కేంద్రాలు ఉన్నందువలన బౌద్ధమత ప్రభావం మా గ్రామంపై కూడా ఉన్నది. అలాగే చోళ ప్రభువుల గ్రామరాజ్య సిద్ధాంత ప్రభావం కూడా ఈ గ్రామం పై ఉన్నది.

1౨౦౦ వరకు ప్రస్తుతపు గుంటూరు జిల్లా, కృష్ణాజిల్లాగా వ్యవహరింప బడుతూండేది 1౩వ శతాబ్దం వరకు ఈ ప్రాంతం కర్మ లేక కమ్మ రాష్ట్రంగా వ్యవహరించబడేది. దీనికర్థం కర్మ అనగా పని జేయటం, చేతివృత్తులవారు వివిధ కలంకారీలో భాగంగా వృత్తుల వారు కళాం క్రియవ్యవసాయదారులు నివశించే ప్రాంతమని దీనికి అర్థం.

కనుక కర్మ, కమ్మ సమానార్థకాలనవచ్చు. ఈ ప్రాంతంలో వ్యవసాయం ప్రధానవృత్తి **అట్లే చేనేత, కమ్మ**రం, కుమ్మరం, వడ్రంగం మున్నగు చేతి వృత్తులకు కేంద్రం. **అందువలన** ఎల్లరూ కర్మకారులు శ్రమజీవులు. ఈ ప్రాంతపు వ్యవసాయదారుల విషయంలో మాత్రమే కమ్మ అనే ప్రాచీన బౌద్ధనామం ఈనాటికీ మిగిలివున్నది అట్టి వ్యవసాయదారుల కుటుంబములో పుట్టుటే నా అదృష్టముగా భావిస్తున్నాను

మాలో చాలామందికి గిరిజన మూలాలు, గిరిజన సాంఘిక నిర్మాణమూ వున్నది ప్రతి తెగలోనూ కొన్ని వంశాలు వుండేవి. ఏ భాషకు ఏ భౌగోళిక ప్రాంతానికి చెందిన వంశాలయినా ఒకదానితో ఒకటి ఎటువంటి సంబంధంతో వుండేవంటే వారిలో సగంమంది అక్కచెల్లెళ్ళుగాను, అన్నదమ్ములుగాను, మరో సగం మంది ఒకరితో మరొకరు వైవాహిక సంబంధాన్ని ఏర్పరుచుకొనుటకు తగినవారుగా **భావించుకొ**నేవారు.

ఉదాహరణకు మా నాన్న వంశం గోగినేని. **మా అమ్మ**గారి వంశం **పాములపాటి.** మా నాన్నగారి వంశీకులు తొలుత కడపజిల్లాలోను ఆ తరువాత వరంగల్ జిల్లాలోను పెంపొంది వుంటారు. వారిలో కొందరు ఖమ్మం నుండి దివి సీమకు వలసవచ్చారు. అటునుండి భట్టిప్రోలు పరిసరాల్లోని నడింపల్లి-గూడవల్లి గ్రామ **ప్రాంతా**లకు విస్తరించి సుమారు ౨౫౦ సంవత్సరాల క్రితం నిడుబ్రోలు **చేరుకున్నా**రు. మా **అమ్మ**గారి వంశీకులు **పాములపాటి**వారు. కృష్ణానదికి ఉత్తర దిశనగల కృష్ణాజిల్లా పాములపాడునుండి వచ్చారు. దాదాపు అదే కాలంలో నిడుబ్రోలు వలసవచ్చారు. వ్యవసాయదారులయిన యీ రెండు వంశాలవారు మా వూరి సమాజ జీవితంలో పెద్దరికం వహిస్తూ వచ్చారు. మా గ్రామానికి కొద్దిరోజులయినా చుట్టపుచూపుగా వచ్చిచూస్తే ఎవరికైనా అట్టే తెలిసిపోతుంది వివిధ వర్గాలను సమన్వయ మార్గంలో నడిపించే అనుబంధాల అంతరార్థం

భారతదేశంలోని వివిధ మతాలవారు, అంటే హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు మా వూళ్ళోనూ వున్నారు. పద్మసాలీలు, కమ్మర్లు, కుమ్మర్లు మున్నగు వివిధ వృత్తులవారూ వున్నారు.

## జానపదా కళారూపకాలు

గ్రామీణులకు వినోద కాలక్షేపాలు సమకూర్చే తెగలు మరికొన్ని వీధి భాగవతులు, తోలుబొమ్మలాటలు, దొమ్మరాటలు- జంగం కథలు- పిచ్చిగుంట సుద్దులు- కాటిపాపలు - బైరాగులు ఎప్పడూ ఏదో ఒక సంచలనాలకు, సంరంభాలకు గ్రామాలలో కొదవలేదు ఈ సంచార జాతులను ఆయా గ్రామస్తులే ఆదరించి పోషిస్తూ వుండేవారు ఇక పండగల విషయానికొస్తే హిందువులు సంక్రాంతి, శివరాత్రి, ఉగాది, దసరా, దీపావళి ఏడాది పొడవునా ఎన్ని పండుగలో ! ఆ అన్నింటా ఉత్సవాలు, ఊరేగింపులు, దేవుని పూజలు, తిరునాళ్ళు, రథోత్సవాలు, తెప్ప ఉత్సవాలు, భజనలు, పురాణ కాలక్షేపాలు, పొంగళ్ళు, పానకాలు, వడపప్పలు, బోణాలు ఎంతసందడి, మరెంత సంతోషం చెప్పతరంగాదు.

ఇక ముస్లిములు జరుపుకొనే మొహరం, పీర్లపండుగ, ఈద్ మొదలయిన పండుగలు తక్కువేమీ కాదు. స్థానిక క్రైస్తవులు క్రిస్మస్, జనవరి పండుగల సందర్భంగా బైబిల్ పఠనం, కీర్తనలు, భక్తి ప్రవచనాలు చర్చిలో ప్రార్థనలు సాగించేవారు

మతాలు వేరయినా ఉత్సవాలు, ఊరేగింపులు వచ్చేసరికి అందరిలోనూ ఉత్సాహం పెల్లుబికేది. నూతనోత్తేజం చోటుచేసుకొనేది గ్రామీణ జన జీవన సౌందర్యం రంగుల హరివిల్లును తలపించేది. అయితే గ్రామీణ జీవితంలో అపశ్రుతులు కూడ లేకపోలేదు అంటరానితనం అక్షరాల పాటించబడేది. కులాల మధ్య హెచ్చుతగ్గులు రాజ్యంచేసేవి. అందరికన్న బ్రాహ్మణులు అగ్రభాగాన, తదుపరి వైశ్యులు, తరువాత కమ్మ, రెడ్డి, తెలగ, కాపు, యాదవ మొదలగు శూద్రులు - తుదిమెట్టులో మాల, మాదిగలు. అయితే చేతివృత్తుల వారిని అందరినీ ఆప్యాయంగా చూచిన రైతులకే చేరువగా భాయిభాయిగా మెలగేవారు, మెసలేవారు.

గ్రామీణ సమాజంలో భూవసతిగల కుటుంబాలకు ఆర్థిక స్తోమత సమకూరేది. కులంతో నిమిత్తం లేకుండా కాస్తోకూస్తో పొలం గల వారందరికీ సమాన హోదా లభించేది. కమ్మర, కుమ్మర, వడ్రంగి మొదలయిన వారు, వ్యవసాయదారులకు కాడి, మేడి, పలుగు, పార సమకూర్చి పొట్టపోసుకొనేవారు. అలాగే ఆ రోజులలో సుఖజీవనం సాగించేవారు. అన్ని

పనులకు డబ్బుకన్నా, ధాన్యమే ప్రధానంగా చలామణిలో వుండేది ఆటగాళ్ళకు, పాటగాళ్ళకు, వినోదానికి ధాన్యంతోను సత్కారం ఉప్పు, పప్పూ, కాయ, పండు, అన్ని వస్తువులూ ధాన్యంపోసి కొనేవారు బైరాగితత్వాలు, వీధిభాగవతులు, కాటికాపరులు ఇంటిముందుకొస్తే చాటతో ధాన్యం దానం చేసేవారు బిచ్చగాళ్ళొస్తే దోసెడు ధాన్యంతో తృప్తిగా వెళ్ళేవారు. ఇప్పుడా పద్ధతి మారింది రూపాయల గలగలలు, కరెన్సీనోట్ల తళతళలే.

మా అమ్మవైపువారు వ్యవసాయములో సిద్ధహస్తులు. మా రమణయ్య తాత క్షణము ఊరకుండేవారు కాదు వ్యవసాయములో ఆయనకున్న ఆసక్తికి, పడేశ్రమకు, చూపిన నేర్పుకు తీసిన లాభాలకు మా ప్రాంతాల రైతులు ఆశ్చర్యపోయే వారు, ఎంతగానో అభిమానించేవారు. ఆయనకు తన పూర్వీకుల నుండి సంక్రమించిన కమతం పెద్దదే ఇంకా దానిని ఇబ్బడి ముబ్బడిగా పెంచాడు. డబ్బు కూడబెట్టాడు. సౌభాగ్యవంతమైన కుటుంబంగా తీర్చిదిద్దాడు. వారు కాలంచేసే నాటికి నా వయస్సు ఐదు సంవత్సరాలు మా తాతగారు పుష్టిగా, ప్రసన్నంగా, ఠీవిగా ఉండేవారు ఇప్పటికీ ఆ విగ్రహం నాకు కళ్ళకు కట్టినట్లుంటుంది. ఒకసారి పొన్నూరు తిరునాళ్ళలో నన్ను తన భుజాలమీద ఎక్కించుకొని ఆ వింతలన్నీ చూపించాడు. ఆ తరువాత నా విమానయాన సందర్భాలలో భూతల సుందరతా దృశ్యాలు నా కంటపడ్డప్పుడు ఆనాటి మా తాతగారు తలంపుకు వచ్చేవారు. ఇక మా అమ్మమ్మ మట్టంగా, పల్చగా, దబ్బపండు ఛాయలో అందంగా ఆకర్షకంగా ఉండేది. ఉదారమైన స్వభావము. పనివారికి, నౌకర్లకు అడిగిన దానికన్నా మిన్నగా ప్రతిఫలం ముట్టజెప్పి సంతోషించేది. మా ఊళ్ళలో మా చుట్టుప్రక్కలలో, పనివాళ్ళలో, పేదసాదలలో, మాతాత ముత్తవ్వలకు గల మన్నన, మర్యాద అపారము.

మా నాన్నగారి పూర్వీకులు అంత సంపన్నులు కారు. మా తాతగారికి పొలంమీద కన్నా పశువుల మీద మోజు హెచ్చు. ఆయన పశుపోషణలో దిట్ట. అయినా పశువుల వ్యసనముతో నష్టపోవటం తప్పించి కాదు వారు గతించే నాటికి సగం పొలం నష్టపోయి ఏకైక పుత్రుడైన మా నాన్నగారికి అప్పులే మిగిల్చి పోయారు. మా నాయనమ్మ కష్టానికి వెనుకాడే మనిషికాదు అయినా ఆమె సహకారం మా తాతకు అక్కరకు రాలేదు. ఇక మా అమ్మ అచ్చమాంబ నాన్నగారు నాగయ్య పాత చుట్టరికము కారణంగానే వీరి పెళ్ళి కుదిరింది.

ఎవరోకాదు వీరిరువురూ మేనత్త మేనమామ బిడ్డలు దక్షిణాదిన ఒక చిత్రమయిన ఆచారమున్నది మేనమామ మేనత్తల బిడ్డల విషయములో ఇరుపక్షాలు పెళ్ళికి తప్పనిసరిగా ఒప్పదల కావలిసిందే ఒకవైపు వారికేమయినా అయిష్టమైనా ఊరిపెద్దలు ఊరుకోరు ఇరుపక్షాల మెడలు వంచి లగ్నం పెట్టిగాని వదిలేవారు కాదు ఒకరు బలిసిన భాగ్యవంతులైనా, మరొకరు చితికిన సన్నకారైనా ఈ చుట్టరికపు వరుసలో మాత్రం అడ్డు చెప్పడానికి వీలులేదు ఈ ఆచారం ఇంత బలంగా ఉండబట్టే పాములపాటి వారి ఆడపడుచు ను గోగినేని వారికివ్వక తప్పిందికాదు ప్రసిద్ధమైన ఈ రెండు కమ్మ వంశాలవారు ఒకరికొకరు ఇచ్చి పుచ్చుకొనడం మరల ౫౦ సంవత్సరాల తరువాతగాని తటస్థించింది కాదు ఈ సంప్రదాయం ఈ రోజుల్లో చెల్లుబాటు కావడం లేదు తామివ్వగలిగే వరకట్నాలకు దీటైన గొప్ప సంబంధాల కొరకే అంతా తాపత్రయం క్రమంగా బంధుప్రేమలు సన్నగిల్లుతున్నాయి. ఇంతగా నాగరికత పెరిగినా వర్ణాంతర వివాహాలు పెద్దగా జరగడం లేదు. వరకట్న దురాచారం సరేసరి పట్టపగ్గాలు లేవు

మా పూర్వీకుల నుండి మాకు సంక్రమించిన ఆస్తి చెప్పకోదగ్గది కాదు సుక్షేత్రమైన మెట్ట, మాగాణి కమతాలు, మందువాలోగిళ్ళు, పశువుల కొట్టాలు అంతకన్న మించిన వారసత్వం చెప్పలేనంత గొప్ప ప్రజాసేవానురక్తి పెద్దరికం పలుకుబడి మాకు సంక్రమించాయి మా ముత్తాత గోగినేని నాగయ్యగారు భూమి శిస్తు శాఖలో ౧౭౭౦-౧౮౦౦ మధ్యకాలంలో ఒక ముఖ్యమైన పదవి నిర్వహించారుట మా ఊరి పొలిమేరల్లో గల పొలములో నాలుగోవంతు పొలాన్ని వ్యవసాయయోగ్యం చేశారు ఒక ప్లాను ప్రకారం దాని దారిడొంకలు తీర్చిదిద్దారట. ఆలూరు, పొన్నూరు, కొండముది, గ్రామపెద్దల సహకారంతో పొన్నూరు భావనారాయణ స్వామి ఆలయములో పక్షం రోజులపాటు ఉత్సవాలను నిర్వహించి స్వామివారికి నిలువెత్తు దివ్యాశ్వ ప్రతిమను కానుకగా ఇచ్చారు ఆయన మా గ్రామములో విష్ణుకుండినులు నిర్మించిన విష్ణుమూర్తి ఆలయాన్ని పునరుద్ధరించారు ఈ ఆలయం చోళులు క్రీ శ. ౧౦౦లో నిర్మించిన శివాలయం కన్నా పురాతనమైనది. విజయదశమి పండుగనాడు పార్వేట ఉత్సవం జరిపి ముందు భాగాన మా పూర్వీకులు ఊరేగింపును నడిపేవారు ఈ నాటికి సటేటా మా కుటుంబీకులు ఆ ఉత్సవాలను నిర్వహిస్తూనే వున్నారు

# నేటి రామానీడు రైతాంగ విద్యాలయం- మా తాత రమణయ్య చలవే

ప్రజాహిత కార్యాలపట్ల ఈ మాదిరి ఆసక్తి గోగినేని వారి నుండి పాములపాటివారికి ప్రాకినట్లున్నది. తరువాత తరములో నాగయ్యగారి దౌహిత్రుడు పాముల పాటి రమణయ్యగారు మా గ్రామములో ఒక బ్రహ్మాండమైన ధర్మసత్రం నిర్మించారు. ఇది నూరేళ్ళనాటి మాట ౧౯౩౩ డిసెంబరులో ఈ భవనాలను ఇతర స్థలాలను, పాములపాటివారు భారతరైతు సంస్థకు దఖలు పరిచారు. ఇది కాలానుగుణమైన శుభపరిణామము. మా తాతగారు బీద బ్రాహ్మణుల వేడుకలకు, పెళ్ళిళ్ళకు ఉదారంగా ధర్మాలిచ్చారు వారు చేసిన ఈ ధర్మకార్యాలు అశోకచక్రవర్తి సంప్రదాయములోని సప్త సంతర్పణలను పోలివుంటాయి. ఈ ఆచారం ప్రకారం స్వయంగా సంతానాన్ని కలిగివుండడంతో పాటు బ్రాహ్మణులకు సహాయం, పేదలకు అన్నదానం, బావినో, చెరువునో, సరస్సునో, త్రవ్వించడం, చెట్లను, తోటలను పెంచడం, పశుపక్ష్యాదుల రక్షణశాలలను ప్రోత్సహించడం, గుడి నిర్మించడం, పాఠశాలనో, పఠనాలయాలనో ఏర్పరచడం, స్త్రీలను శిశువులను రక్షించడం వంటి సంఘసేవా కార్యక్రమాలనుచేయాలి ఆయన భార్య అమ్మమ్మ. అన్నదానం, అనాధ స్త్రీ, శిశు సంరక్షణ విషయాలలో పేరు పొందింది. వారి కొడుకు రామస్వామిగారు కూడా సేవా తత్పరతతో నిడుబ్రోలులో ౧౯౧౦సం..లో గ్రంథాలయాన్ని స్థాపించారు తద్వారా గ్రామీణుల ఆధునిక విద్యాభివృద్ధికి దోహదం చేశారు ఈ గ్రంథాలయాన్నే ప్రజా గ్రంధాలయాల చట్టం క్రింద ప్రభుత్వానికి స్వాధీనం చేయబడింది. ఇదే సందర్భములో నేను మరొక విషయం చెప్పడం మంచిదనిపిస్తుంది. రమణయ్యగారి తమ్ముడి కొడుకు పాములపాటి బుచ్చినాయుడుగారు నిడుబ్రోలులో ౧౯౫౧ లో ఫస్టుగ్రేడు ఇంగ్లీషు కళాశాలను స్థాపించాడు. ఆంధ్రవిశ్వవిద్యాలయానికి అనుబంధంగా ప్రారంభమైన ఈ కళాశాలకు నాయుడుగారొక్కరే ౨ లక్షల రూపాయల ఆస్థిని విరాళంగా ఇచ్చారు. ఆంధ్రదేశంలో అప్పటికి ఇంత భూరి విరాళాన్ని విద్యాలయానికి ఇవ్వడం ఇదే మొదటిసారి.

మా కుటుంబాలలో అశోకుని సప్త సంతర్పణల ప్రాశస్త్యము గురించి మాట్లాడుకోవడం నా చిన్నతనములో వింటుండేవాడిని వివిధ సంస్థలకు

మావాళ్ళు చేసిన దానధర్మాల సాంఘిక, మత, ఉత్సవాల్లో వారికున్న పెద్దరికం నా దృష్టికి వచ్చింది ఆ ముచ్చట్లు నాలోనూ, నా సోదరుల్లోను మా మహోన్నత వారసత్వం పట్ల అభిమానాన్ని రేకెత్తించినాయి. మా వారి ఆస్థులకన్న వారి సమాజ సేవానురక్తి మాకు సంక్రమించిన ఉత్తమ సంపదగా మేము ఉప్పొంగిపోతున్నాము.

మా అమ్మ అచ్చమాంబగారు ధార్మిక చింతనగల మనిషి భారతీయ నారీ ధర్మానికి ఆమె ప్రతీక అనవచ్చు చాలాకాలం ఆమెకు సంతానం కలగలేదు. అప్పడు మా తాత రమణయ్యగారు మా కుటుంబాన్నంతటినీ వెంటబెట్టుకొని దక్షిణ భారతములో గల పుణ్యక్షేత్రాలను చుట్టివచ్చారు. ఉత్తరాదికి వెళ్లలేదు. దక్షిణదేశవాసులకు ఉత్తరాది యాత్రలపట్ల ఆసక్తి ఉండేది కాదు. యాత్రకు వెళ్లిన మా తల్లిదండ్రులు తిరుపతిలో వేంకటేశ్వరస్వామిని, శ్రీరంగములో రంగనాయకస్వామిని అర్చించి అభీష్టాన్ని తెలుపుకున్నారు. వారి నోములు ఫలించి నేను జన్మించినపుడు ఆ స్వాములిరువురినీ జోడించి నామకరణ మహోత్సవమును జరిపించారు.

మా తల్లిదండ్రులు తమ ఆత్మ గౌరవాన్ని ప్రాణపదంగా కాపాడు కొనేవారు. మా నాన్నగారికి వారసత్వపుటాస్తిగా సంక్రమించిన పాత అప్పలతో బాటు, పశుపోషణ కలసిరాక మరికొన్ని అప్పలు చోటు చేసికొన్నాయి ఈ ఋణాలు తీరేవరకు పట్టుచీరలు కట్టుకోనని, బంగారు సొమ్ములు పెట్టుకోనని మా అమ్మ పంతం పట్టినది. ఉత్సవాలకు, వేడుకలకు పోరాదని నిశ్చయించు కొన్నది. ఈ మా అమ్మ సంకటస్థితిని మా మేనమామ రామస్వామి గారికి తెలిసి ఎంతగానో ఖిన్నులయ్యారు. చెల్లెలుపై అనురాగము, ఆపేక్షకు దీటుగా ఒక త్యాగానికి సమకట్టారు ఆ అప్పలన్నీ తను తీర్చగలనని ముందుకొచ్చారు అయితే మా అమ్మ పడనివ్వలేదు. పెళ్ళినాటి కట్నకానుకలు తప్పించి మధ్యలో మరెన్నడూ ఏ ఆడపడుచు పుట్టింటికి భారము కారాదని మా అమ్మ అభిప్రాయ పడినది. మా నాన్నగారిదీ అదేమాట. ఆ యిరువురు ఆరు సంవత్సరములు అహోరాత్రులు శ్రమించారు. పొలాలు దారికి తెచ్చారు. పశు సంపదను వృద్ధిచేశారు. పొదుపును కఠినముగా పాటించారు. ఎట్టకేలకు ఋణబాధ నుండి విముక్తులయ్యారు. అంతేకాదు, కొంత డబ్బు కూడబెట్టారు. మబ్బు వీడిపోయినది. మా అమ్మ మరలా పట్నం నుండి మా మామయ్య

తెచ్చిన పట్టుచీర కట్టినది. పచ్చలహారము ధరించినది నాన్నగారికది కన్నులపండుగ. అమ్మకు అవి అమృత ఘడియలు ఎనిమిదేళ్ల పసివాడిని నన్ను దగ్గరకు తీసి తలనిమిరింది. నా తమ్ములు వెంకటప్పయ్య (రసం..) లక్ష్మీనారాయణలను ముద్దు పెట్టుకుంది. అప్పటికింకా మా అమ్మకు ముప్పది రెండు ఏండ్లు నిండలేదు. వాత్సల్యాన్ని ఒలకబోసే చూపులతో విశుద్ధమైన లేనవ్వులతో, చిట్టిపొట్టి మాటలతో అమ్మ నన్ను చేరదీసి లాలించటం ఇప్పటికీ నాకు జ్ఞాపకమే. అటువంటి సౌందర్యవతి ఆ ప్రాంతములో మరొకరు లేరని చూచినవారు విస్తుపోయేవారట. మా అమ్మ పోయిన తరువాత మా నాన్నగారు జబ్బున పడ్డారు. గ్రామ వ్యవహారాలలో ఇక ఆయన పెద్దగా జోక్యం కల్పించుకొన్నది లేదు. మా అన్నదమ్ములం ముగ్గురము మేనమామ పెంపకములోకి వెళ్ళి పోయాము. లంక అంత యింటిలో ఒంటరితనమే తోడుగా వారు కాలక్షేపము చేశారు. యిబ్బందులన్నింటిని మౌనముగా సహించారు. ఒకే ఒకసారి అదీ నా ఇంగ్లాండ్ ప్రయాణ సందర్భములో పెదవి విప్పారు. "ఇపుడు నాకు సంతోషముగా ఉంది. ముగ్గురు ముద్దుల బిడ్డలను ఆ యిల్లాలు నాకు అప్పగించి వెళ్ళినది. ఈ జీవితానికి యిది చాలు అనుకొన్నాను. తిరిగి నన్ను ఒక యింటివాడిని చేయాలనుకొన్న మా బంధువుల ప్రయత్నాలను నేను సాగనివ్వలేదు. మీలో మీ అమ్మను చూచుకొంటూ మీరు ఏనాటికయినా ప్రయోజకులు కాకపోరన్న ధైర్యముతో కన్నీరు ఒత్తుకుంటూ రోజులు నెట్టుకొచ్చాను. నా ఆశలు వమ్ముకాలేదు. నా పరువు నిలబెట్టారు అంటూ బొట బొట కన్నీరు కార్చారు." నా క ళ్ళు చెమ్మగిల్లాయి. మా అమ్మదేవతా విగ్రహం మసక మసకగా కన్పించినట్లయినది. లేచి నాన్నగారిని సమీపించాను. వారు నన్ను పొదివి పట్టుకొని కళ్ళనీళ్ళు తుడుచుకొన్నారు. కొంతసేపటికి యిరువురుము స్థిమితపడ్డాము. నా లండన్ ప్రయాణము బొంబాయి మీదుగ జరగవలసి ఉన్నది. నిడుబ్రోలులో రైలెక్కాలి. రైలు వేళయినది. "నాన్నా వెళ్లొస్తాను" అనగానే దుఃఖముతో కుప్పకూలిపోయారు. నన్ను సాగనంపటానికి రైలు స్టేషన్‌కు సైతం రాలేక పోయారు.

## భూమాత పట్ల మా నాన్నప్రేమ – ఆక్రమణను ఎదిరించి నిలచారు

నేను ఇండియన్ సివిల్ సర్వీసులో చేరతానని తద్వారా రెవిన్యూ

అధికారులు, ఇరిగేషన్ అధికారులు మా రైతులమీద జరుపుతున్న దౌర్జన్యముల నుంచి వారిని రక్షిస్తానని ఆయన ఆశించారు ఆ రెండు శాఖలతోను ఆయన సాగించిన పోరాటములలో విఫలమయినారు. వాళ్ళ దౌర్జన్యముల వలన ఆయన ఎంతగానో ఇబ్బందులు పడ్డారు. రైతులందరి మాదిరే ఆయనకూడ తన పొలాలన్నిటిపైన తాను అధిపతినని తన భూమిపై ఏ శక్తికి జోక్యం కల్పించుకొనే హక్కులేదని భావించేవారు, నిర్బంధ భూసేకరణ చట్టము ఉన్నదని ఆయనకు తెలియదు. ఆయనకు ప్రత్యర్థులయిన స్థానిక రెవెన్యూ, పి డబ్ల్యు.డి అధికారులు రెచ్చగొట్టిన మీదట, కొందరు రైతులు తమ పంటకాల్వల కోసము ఆయనకెంతో ప్రియమైనదిగా భావించే పొలములో నుండి దారి ఇమ్మని అడిగినపుడు, అధికారులకు సాయంగా ప్రభుత్వము పోలీసులను పంపినపుడు వారు ఆయన పొలములో కాల్వ తవ్వడానికి స్థలము గుర్తించపోతుండగా వారి మీద తిరగ బడ్డారు. జరుగుతున్నది తనకు అన్యాయముగా భావించి, పోలీసులను, అధికారులను అక్కడనుండి తరిమివేశారు

అధికారుల విధి నిర్వహణకు ఆటంకము కలిగించాడనే నేరం మోపి కేసు పెట్టారు. అపుడు ఆయన "నా పొలములో నా అనుమతి లేకుండా ప్రవేశించి దానిని ముక్కలు చేయడానికి అధికారము ఏమిటని ప్రశ్నించాడు నేను ఎవరిని వారి యింట్లోగాని బయటగాని అవమానించలేదు. కొట్టలేదు. వాళ్ళ అస్తులను వారు అనుభవిస్తుండగా అడ్డుపడలేదు" అని జవాబు యిచ్చారు. ఆయన మాటలలో ఇమిడి ఉన్న వ్యంగాన్ని, వేదనను జిల్లా మున్సిఫ్ మేజిస్ట్రేట్ అర్థంచేసుకొని కేసు కొట్టివేశారు కాని ఆయన పొలములో ఒక అంచునుండి దారి అనుమతించమని తీర్పుయిచ్చారు సరిగ్గా ఆ పొలమే "రంగా ట్రస్టు"కు దత్తం చేయబడినదని గుర్తించడం ఆసక్తికర విషయం.

మరొక సందర్భములో కొందరు రైతులు మా భూమిలో ఆరుసెంట్లు ఆక్రమించి దానిని తమదిగా స్థానిక రెవెన్యూ అధికారులచేత రికార్డులలో నమోదు చేయించారు. ఈ దురాగతము మా నాన్నగారికి తెలిసినపుడు న్యాయస్థానములకు వెళ్ళి ఎంతో వ్యయముతో తమదే న్యాయమని ఋజువు చేసికొన్నారు.

# తన కొడుకు కలెక్టరు కావాలనే తపన ( ఐ. సి. ఎస్)

దురాక్రమణ దారులను బేదఖలుచేయించారు. ఆయన తన హక్కుగా భావించి జరిపిన పోరాటాలలో ఆయనకు నేను తోడుగా ఉన్నాను నేను నా పదిహేనవ యేట నుండి ఇరవయి ఏళ్ళ చిన్నవయసులోనే భూములను సర్వేచేయడము, ప్రామిసరీ నోట్లను వ్రాయడము, క్రయవిక్రయ పత్రాలవంటి అనేక రకాల దస్తావేజులు వ్రాయడం, న్యాయవాదుల కొరకు వకాల్తా నామాలు నింపటం, న్యాయస్థానపు సమన్లకు జవాబులు ఇవ్వడము ఇలా అనేక విషయాలలో సోదర ప్రజలకు సహాయపడుతుండేవాడిని ఉన్నత పాఠశాలలో చదువుచున్న ఆరు సంవత్సరముల కాలములోనూ ఇంటా బయటా ఎన్నో బాధ్యతలను నెరవేరుస్తూనే ౧౯౨౦లో ప్రథమశ్రేణిలో ఉన్నత పాఠశాల విద్యను ముగించటాన్నిబట్టి సహజంగానే ఇండియన్ సివిల్ సర్వీస్‌లో విజయము సాధించగలనని తాను ఎంతో కాలముగా సమకూర్చి కూడబెట్టిన ధనాన్ని నా విదేశ విద్యాభ్యాసమునకు ఖర్చుపెట్టటానికి నిర్ణయించుకొన్నారు మా నాన్నగారు

ఆగష్టు ౧౯౨౧న విదేశీయాత్రకు వెళ్ళవలసిన సమయం దగ్గరపడేసరికి నాపైగల ప్రేమాతిశయముతో నాకు వీడ్కోలు పలకటానికి స్టేషనుకు కూడ రాలేకపోయారు నేను ఇంగ్లాండ్ పోయిన తరువాత అనుకోకుండా అయిదు లేక ఆరు మాసాలలోనే ప్రధాన ఆదాయ వనరులయిన ధాన్యం ధర తగ్గిపోవడం, రూపాయి మారకపు విలువ పడిపోవడం మా నాన్నేగాక మొత్తము రైతాంగమే ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొన్నారు. ఆక్స్‌ఫర్డ్‌లో నాకు అయ్యే వ్యయం ఆయనకు మోయలేని భారమయినది. అయినా ఆక్స్‌ఫర్డ్‌లో నన్ను చదివించితీరాలనే పట్టుదల, ఎన్నికష్టాలనయినా భరించగలిగే మానసిక దృఢత్వాన్ని సంపాదించారు. ఆయన మరణించేటపుడు నా చదువులకు డబ్బు కొరత ఉన్నదని నేను ఎన్నడూ భావించకుండా చూడాలని నా సోదరులతో పదేపదే ఉద్వేగ పూరితముగా చెప్పారట. అపుడు మాత్రమే నా సోదరులకు, మా కుటుంబములోని ఇతర సభ్యులకు ఆయన నన్ను ఎంత గాఢముగా ప్రేమించేవారో అర్థమయినది. ఆయన నాపై అంత ఆప్యాయముగా, ప్రేమగా ఉన్నట్లుగా పైకి కనపడకుండా ఉండటానికి ఎంత సమ్యమనను పాటించారో తెలిసినది మా నాన్నగారి వ్యక్తిత్వము అటువంటిది.

మా నాన్న వ్యక్తిత్వాన్ని వివరించేందుకుగాను నేను నా కధను తర్వాత జరిగిన సంఘటనలలోనికి తొంగి చూడవలసి వచ్చింది. ఇప్పుడిక మళ్ళి నా చిన్ననాటి ముచ్చట్లనే వివరిస్తాను

నాకు అక్షరాభ్యాసము జరుగకముందే మా తాత రమణయ్యగారు మరణించారు రైతులు విద్యను అభ్యసించవలసిన అవసరం గురించి వారికి నచ్చజెప్పటంలో మాకు ఒక అసాధరణమైన అనుభవం ఉంది రమణయ్యగారు లెక్కలు చూచేందుకుగాను ఒక ఆచారి గుమస్తాగా పనిచేస్తుండేవారు ఆయనకు మా తాత ఋణాలు కూడ ఇచ్చారు మా తాతగారికి చదువు అంత బాగారాదు. కేవలము సంతకము మాత్రము పెట్టుచుండెడివారు ఆ అవిద్యను ఆసరాగా తీసికొని మాతాతగారి సంతకం ఫోర్జరీ చేసి ఆ ఆచారి అప్పు చెల్లవేస్తూ ఉండేవారు మాతాతగారు మరణించాక ఆయన కుమారుడు రామస్వామి కాస్త ఎక్కువగా చదవగలిగేవారు ఈ అవకతవకలను కనిపెట్టారు. ఆ గుమస్తాను పని నుండి తొలగించటమే కాక, కోర్టులో వ్యాజ్యము వేసి గెలిచారు మా నాన్నగారు కూడా మామాతా మహులయిన రమణయ్య, అంకమ్మగార్లవలనే విద్యలేనివారు. అందుకనే మా అమ్మగారు నా విద్యపట్ల చాలా శ్రద్ధవహించారు మా మేనమామగారు గ్రామములో గ్రంధాలయము నెలకొల్పి యువకులయిన విద్యార్థులకు పఠన, లేఖన అభ్యాసాలకు సాయపడ్డారు

నా విద్యాభ్యాసం ప్రారంభము బ్రహ్మాండమయిన ఏర్పాట్లతో జరిగినది ఆ ఉత్సవంలో మా అమ్మ అవధులు లేని ఆనందాన్ని అనుభవించారని నాకు ఆ తర్వాత తెలిసినది. కాని తర్వాత మూడు, నాలుగు సంవత్సరములపాటు నా విద్యాభ్యాసము అటు మా అమ్మకుగాని, ఇటు మాకుగాని ఏమాత్రము సంతోషముగా సాగలేదు తెలుగు, కన్నడ లిపులు నేర్చుకోవడం చాలా కష్టం. ఆ భాషా శబ్దాలను పలకడం, వ్రాయడం యింకా ఎంతో కష్టం చదవడం మరింత కష్టం కనుకనే పాఠశాలకి వెళ్ళడం నాకేమి ఆనందముగా ఉండేదికాదు. ఈ లిపిని, దాని గుణింతాలను కనిపెట్టినది ఎవరో తెలియదు కాని, ఆ కనిపెట్టినవారు పిల్లలకు స్నేహితులు మాత్రము అయి ఉండరు. ఈ సందర్భములో తెలుగు భాషను, దాని లిపిని గురించి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారి ఈ పద్యభాగము గమనించవచ్చు.

" తెలుగు తెలుగని ఎద్దాన దిగుటకాని,
సంస్కృతంబున కన్న కష్టంబు హెచ్చు."

ఈ మధ్యనే వినోబాభావే కూడ ఒరిస్సా భాషగురించి ఇదేమాట అన్నారు. ఆ సంక్లిష్ట లిపిని నేర్చుకోవడానికి నాకు చాలా కాలము పట్టడములో ·ర్యము ఏమిలేదు

ఈమధ్యకాలములో ఉపాధ్యాయులనుంచి, మా అమ్మగారినుంచి నేను ఎదుర్కొన్న మందలింపులు నాకు పెద్ద అవమానాలుగా తోచేవి. మన జాతి నాయకులు కనీసం లిపి విషయంలో న ునా మన చిన్నారి పిల్లల అవసరాలకు ప్రాధాన్యతనిచ్చి భారతదేశం మొత్తానిి రోమన్ లిపినిగాని, దేవనాగరి లిపిని గాని అనుసరించేలా చేస్తే ఎంత బావుంటునని అనిపిస్తుంది. అట్లా చేసినట్లయితే, మన చిన్నారి బాలలు ఇంత సంక్లిష్టమైన లిపులను నేర్చుకోవడానికి తమ మనసులను అనవసరంగా శ్రమపెట్టించి ఇబ్బంది పడవలసిన అవసరం ఉండదు కనీసం తెలుగు, కన్నడ లిపుల మధ్యనయినా ఆయా లిపులలో కొన్ని మార్పులు చేసి, దైనందిన వ్యవహారానికి అవసరమయ్యే ౪౦-౫౦ పదాలను అంగీకరించి ఐక్యతనో, పరస్పర ఆమోదాన్నో సాధించినా మంచిదే

మా పెద్దమ్మ మంగమ్మగారు బాల వితంతువు. ఉపాధ్యాయుల చేతులలో నేను అనుభవించిన బాధలను గమనించి ఆమె నన్ను సానుభూతితో తన రక్షణలోకి తీసుకుంది. ఆమె నన్ను తనతోపాటు పొలానికి వెళ్ళేందుకు, చేల మధ్య, కాలవ వెంట పచ్చిక మైదానాల్లో, బండ్ల బాటల్లో మీద తిరిగేందుకు ప్రోత్సహించింది. ాలబుగ్గల వయసులోనే పంటలను, పశువులను చూసేందుకు జీతానికి కుదిరే హరిజనులతో సహా అన్ని కులాల బాలలతో నేను స్నేహం చేసేలా ఆమె న ్ను ప్రోత్సహించింది.

ఇది నాకు ఎన్నో వి ాలు నేర్చుకోవడానికి ఉపయోగపడింది. నేను మా మేనమామగారి సి ెడ్లను తీసుకువెళ్ళి చిత్రలేఖనం చేస్తుండేవాణ్ణి. మెత్తని దుమ్ముపైన ఆటవ శిక్షణలేని చిత్రలిపిలో బొమ్మలు వేసేవాణ్ణి. పంటల గురించి పశువుల గు ంచి, రైతుల పిల్లల గురించి ఎన్నో కథల్ని నేను ోగుచేస్తుండేవాణ్ణి నేను కొన్నిటిని అల్లుతుండేవాణ్ణి. వాటన్నిటి గురించి మా అమ్మతో మాట్లాడుతుండేవాణ్ణి మధ్యాహ్నం, సాయంత్రం ఆమె విశ్రాంతి

తీసుకునేటప్పుడు ఆమె దగ్గర చేరి ఇతర రైతాంగ స్త్రీ పురుషులతో కూడ ఇవన్నీ చెపుతుండేవాణ్ణి ఈ రకంగా నాకు మా గ్రామంలో పండించే పంటలన్నింటి గురించి సన్నిహిత జ్ఞానం సంపాదించే వీలుకలిగింది. పంటలన్నిటికీ స్వంత వ్యక్తిత్వం ఉన్నట్లుగా ఇవన్నీ కథల రూపంలో ఉండేవి

వాళ్ళు భూమి కలవాళ్ళయినా, భూమి లేనివాళ్ళయినా, యజమానులైనా, కౌలుదార్లయినా, వృద్ధులయినా, యువకులయినా, పిల్లలయినా మొత్తం మీద రైతు జనావళి జీవితం గురించి, కార్యకలాపాల గురించి, మానసిక ప్రతిస్పందనల గురించి, ఉద్వేగాల గురించి నాకు వివరంగా తెలిసింది. శ్రీమతి మంగమ్మ నా అద్భుతమైన ఉపాధ్యాయురాలు. అన్ని వ్యవసాయ కార్యకలాపాల గురించి, పంటల గురించి, వేరు వేరు పంటలపై వాతావరణ ప్రభావం గురించి, వేరు వేరు ఋతువులలో వేరు వేరు పంటలు మార్చి మార్చి వేయడంలో గల మంచి చెడుల గురించి ఆమెకు చాల లోతయిన, నికరమైన జ్ఞానం ఉండేది. ఆమె శ్రమైక జీవనాన్ని ఎంతో ప్రేమించేది మొక్కలను ఆమె ఎంత జాగ్రత్తగా పెంచే దంటే వాటిని పిల్లలలాగ చూసుకునేది ఆమె పంటమొక్కలతో మాట్లాడగలిగేది. విడివిడి మొక్కలతో ఆమె తన ప్రత్యేకమైన తరహాలో ప్రశాంతంగా, అప్యాయంగా మాట్లాడుతున్నప్పుడు నేను ఆమె చెంతనే ఉండేవాణ్ణి. నేను ఆమె మేధో సంపదను, ప్రకృతిపట్ల అనురాగాన్ని అవే నా తల్లి పోసిన ఉగ్గు పాలన్నట్లు గాపుణికిపుచ్చుకున్నాను భూమి పట్ల, వ్యవసాయం పట్ల, ప్రకృతిపట్ల, పశుపక్ష్యాదుల పట్ల ఆమెకు గల ప్రేమను నేను సంకల్పపూరితంగా నాలోకి ఇముడ్చుకున్నానని చెప్పలేను ఇవన్నీ కలిసి ప్రకృతికంగా అనంతమైన సౌందర్యాన్ని సమకూరుస్తున్నాయి. ఇప్పుడు విమాన ప్రయాణ సౌకర్యం వల్ల, ప్రపంచమంతటా తిరుగుతున్నప్పుడు, ఆమెవెంట ప్రకృతిలో నిరంతరంగా ఎడతెగకుండా పొందిన అనుభవాల జ్ఞాపకాలు అపారమైన విజ్ఞాన గనిలోకి నేను మళ్ళీ మళ్ళీ ప్రవేశించకుండా ఈ శతాబ్దంలోని ఈ రెండో భాగంలో ఏ ఒక్క సంవత్సరమూ గడవదు మా రైతాంగంతో నాకు ముడిపడిన అనుబంధం అభివృద్ధి చెందడంతో అది నిజంగా ఒక యాంత్రికమైనటువంటి కాలం. నా ఉపాధ్యాయకురాలయిన మంగమ్మగారు తాను నాకు సమకూరుస్తున్న అమూల్య విద్య గురించి తెలిసినట్లు ఉండేది కాదు

(నా మొదటి గురువు అనే శీర్షిక క్రింద రంగాజీ ఒక ఉత్తేజకరమైన రచన చేశారు)

మా అమ్మగారు స్వయంగా చదువుకోలేదు గాని, నేను ఒక బ్రాహ్మణుని లాగ విద్యావంతుణ్ణి కావాలనే విషయంలో ఆమె పట్టుదలగా ఉండేది. కనుక ఆమెకు నా ప్రవర్తన పట్ల, మా పెద్దమ్మ ప్రవర్తన పట్ల చాలా అసహనం ఉండేది సాంప్రదాయ విద్యను నిర్లక్ష్యం చేస్తున్నందుకు నన్ను కోప్పడుతూ, మా పెద్దమ్మతో నిష్టురాలాడుతూ ఉండేది. మా దురదృష్టవశాత్తూ అప్పటి ఉపాధ్యాయులు విద్యార్థులలో ఏదో ఒక బోధనా పద్ధతి ద్వారా ఆసక్తి కలిగించడానికి ప్రయత్నించే బదులు, కఠినంగా శిక్షించడానికే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేవారు. విద్యార్థులతో ప్రతి విషయమూ బట్టీయం వేయించడం వంటి పాత పద్ధతి, విద్యార్థులను తమ భయానకమైన బోధన పద్ధతులకు లొంగి ఉండేలా చేయడానికి కొట్టడం, నా విషయంలో ఘోరంగా విఫలమయ్యాయి. కనుక నా పనులన్నింటివల్లా మా అమ్మగారు నిరాశపడడమూ, ఖేదానికి లోను గావడమూ జరిగింది. మరొకవైపు ఈ కాలంలోనే నా భవిష్యత్ జీవితానికి సరైన, విశాలమైన, గాఢంగా ప్రేరణాత్మకమైన పునాదులను మా పెద్దమ్మ అసంకల్పితంగా నిర్మిస్తూ వచ్చింది కేవలం మా అమ్మగారి జీవితపు చివరి సంవత్సరములో, ౧౯౧౨ లో తెలుగులో రాయగల శక్తిని చూపి నేను మా అమ్మగారిని సంతోషపెట్టగలిగాను మా నాన్నగారు, మా తాతగారు అనుభవించిన అసంపూర్ణ అక్షరజ్ఞానం సాంప్రదాయం నుంచి విజయవంతంగా బైట పడగలననే ఆశను నేను ఆమెలో కల్పించగలిగాను. అదృష్టవశాత్తూ నా సోదరుడు వెంకటప్పయ్య కూడ చదవడం, రాయడం నేర్చుకుని ఆశను స్థిరపరచ గలిగాడు కనుక, ఆమెను అకాలంగా మృత్యువు పిలుచుకుపోయినప్పుడు మా అమ్మగారు సంతృప్తితోనే కన్నుమూసింది. భార్య, దత్తసోదరి అయిన లక్ష్మీదేవిల ప్రేమమయ సంరక్షణలో నన్ను వదిలి మా అమ్మ మరణించింది

అంత ఘోరంగా ఛాందసంగా ఉండే పాఠశాలల్లో, చిన్నారి బాలలను అతి దీర్ఘకాలంపాటు చదువు, తాతల ప్రాథమిక దశలోనే ఉంచే పాఠశాలలో నా ప్రాథమిక విద్య నేర్చుకోవడాన్ని నేను ఎందువల్లనో గాని సహించలేక పోయాను. అదృష్టం కలిసివచ్చినట్లుగా, ఒక రైల్వే ఉద్యోగి, శాశ్వత గ్యాంగ్

కార్మికుల మేస్త్రీ మా గ్రామానికి వచ్చి ఎందరో బాలలకు రామాయణ, మహాభారతాల నుంచి కధలు చెప్పడం ప్రారంభించాడు నేను ఆయనకు అత్యాసక్తితో వినే శ్రోతనయ్యాను ఆయన గ్రామంలో మాకు కొందరికి చెపుతున్న కధలను నేను మళ్ళీ పొలాల్లో పశువులను, పంటలను కాపాడే బాల బాలికల లెందరినో పోగుచేసి వినిపిస్తున్నాని కొన్నివారాల్లో ఆయనకు తెలిసిపోయింది దానితో ఆయనకు మరింత శ్రద్ధ కలిగింది అటువంటి కధలు గల పుస్తకాలను పట్టుకొచ్చి, వాటిని మాచేత చదివించి, మళ్ళీ మా స్వంత మాటల్లో ఆ కధలను చెప్పించడం ప్రారంభించాడు ఈ పద్ధతి నా విషయంలో ఔషధంలాగా పనిచేసింది నేను మళ్ళీ ఇతర విద్యార్థులకు శ్రద్ధగా చెప్పే బోధకుడిని ఐపోయాను. ఆ రకంగా నేను ఏలక్ష్యం లేకుండా పొలాల్లో తిరుగుతుండే స్థాయినుంచి పంటల గురించి, పశువుల గురించి కధలు చెప్పే వాడిలా పరివర్తన చెందాను

మాతృభూమికి, ఆయా ఋతువులలో వచ్చే పురుగులు, పక్షులు, సీతాకోకచిలుకలు, పాములు, చేపలు, కప్పలు, వివిధ రకాల ఆహార ధాన్యాలు, పప్పదినుసులు, నారలు, కాయగూరలు, ఆకులు, పూలు, పచ్చదనం, గోధుమవర్ణం, శిశిరంలో ఇంద్రధనుస్సు రంగుకు తిరిగే ఆకాశం, వసంతంలో అంతటా ఉత్సాహపూరితంగా ఉండే వాతావరణం, ఎల్లవేళలా, అన్నిచోట్లా చిరునవ్వులతో, సువాసనలు వెదజల్లే వసంత కాల పరిసరాలు వంటి వాటికి గల పరస్పర సంబంధం చుట్టూ అల్లిన, విచిత్ర ప్రేమ కావ్యాలను వినిపించే వాడినయ్యాను.

మా అమ్మగారు మరణించిన తర్వాత మా పెద్దమ్మ(మంగమ్మగారు) మా అమ్మగారి స్థానాన్ని స్వీకరించారు ఆ తర్వాత నుంచి అమ్మ అనే మాటకు గల అన్ని అర్థాలలోను ఆమె మా అమ్మకన్న నాపై ఎక్కువ ప్రేమను, ఆదరాన్ని మా పట్లచూపారు. నిజంగా నేను రైల్వే ఉద్యోగి నుంచి నేర్చుకున్న కథలను నా స్వంత చిన్న పిల్లల భాషలో తిరిగిచెపుతున్నప్పుడు ఆమె మొదటి శ్రోత అయింది. నా మొదటి శ్రోతల బృందానికి ఆమె అధ్యక్షత వహించింది.

త్వరలోనే మాకు మరొక ఉపాధ్యాయుడొచ్చారు. ఆయన ఒక వృద్ధ హరిజనుడు. ఆయన పేరు నారాయణ. ఆయన కథలను అద్భుతంగా

చెప్పేవాడు. సాంప్రదాయక దైవాలపై పోరాడిన తిరుగుబాటు దేవతల కథలు ఆయన కొచ్చేవి. అంటే ఆయన శాక్తేయుడు ఈ విశ్వానికి, మనుగడకు ఆదిశక్తి ఉన్నదని ఆయన నమ్మేవాడు. మా అమ్మగారు మరణించిన తర్వాత ఒక సంవత్సరంలోనే ఈ కథకు లందరూ నాకు నేర్పగలిగినదంతా నేను నేర్చుకున్నాను. ఆ కథలను లిఖిత రూపంలో చూపేందుకు వారు సూచించిన పుస్తకాలన్నీ చదివేశాను ఇక నేను నా తదుపరి సాహసానికి సిద్ధపడుతున్నాను.

మా మేనమామ రామస్వామిగారు, ఆయన స్నేహితుడు జంపని ఆంజనేయులుగారు వీరు ఇరువురు బెంగాల్ విభజన (౧౯౦౮) ఉద్యమ కాలంలో జాతీయ ఉద్యమము వైపు ఆకర్షితులయినారు. మా పొరుగున ఉన్న అవ్వ్యతలూరులో ఆ ఊరివారు ఒక గ్రంథాలయమును స్థాపించి నడుపుతున్నారని వీరికి తెలిసింది. అప్పటివరకు బ్రాహ్మల సొత్తుగానే మిగిలి పోయిన సంస్కృత భాషను అందరూ నేర్చవచ్చునంటూ ఒక సంస్కృత కళాశాలకూడ ఆ గ్రామ ప్రజలు స్థాపించారు. అది విన్న రామస్వామి, ఆంజనేయులుగార్లు మా గ్రామములో కూడ ఒక గ్రంధాలయమునకు అంకురార్పణ చేశారు ఒకనాడు మా మేనమామకు ఏదో పుస్తకాల బంగీ పోస్టులో అందినది, అందమైన అచ్చుతో, ముచ్చటైన బొండులో తమాషా అయిన వాసనలతో ఆపుస్తకాలు చూడముచ్చటగా ఉన్నవి. మామకు చెప్పి ఒక మంచి పుస్తకము నాకు ఇప్పించమని మా పెద్దమ్మను ప్రాధేయపడ్డాను. నాకు అంతటి ఆసక్తి కలగడం చూచి ఆమె సంతోషించి అలాగేనన్నది. మామగారికి చెప్పినది. మరునాటి ఉదయమే ఆ గ్రంధాలయానికి వెళ్ళి ఆంజనేయులుగారిని కలిశాను నాకు ఏ పుస్తకము కావాలో చెప్పమన్నారు. నాకు నచ్చిన పుస్తకము ఒకటి ఎంచుకొన్నాను. ఆయన నావైపు ఆసక్తితో చూచి ఆపుస్తకము పేరు చదవమన్నారు. "రాణిసంయుక్త" అని స్పష్టంగా చదివేసరికి "బేష్" అని అన్నారు. వారం రోజులలో ఆ పుస్తకము తిరిగి ఇవ్వాలన్నారు. ఆపుస్తకము ఎప్పటికీ నాదయితే ఎంత బాగుండునోననిపించినది. అయితే వారు నాకు ఒక షరతు పెట్టారు. క్రొత్తపుస్తకము అడిగే ముందు, పాత పుస్తకములోని సారాన్ని చెప్పాలట. అందుకు సరేనని ఆ పుస్తకము చంకన పెట్టుకొని మా పెద్దమ్మవెంట పొలము వెళ్ళాను. నిలుతెత్తు పెరిగిన జొన్నచేను పట్టెలో కూర్చుండి భద్రంగా పుస్తకము తెరిచాను. తెరిచినది మొదలు దృష్టి

మరలినదిలేదు భారతీయ చక్రవర్తులలో తుదివాడు పృథ్వీరాజు వారి పట్టమహిషి "రాణిసంయుక్త" వీరి రాజ్యముపైకి దండెత్తి వచ్చినది మహమ్మద్‌గోరి ఈ గోరీకి తొత్తుగా మారి ఈ రాజ్యముపైకి వచ్చిన సాటి రాజునకు ద్రోహము తలపెట్టిన వాడు జయచంద్ర. రమ్యమైన ఆ వీరగాధ రసవత్తరంగా సాగిపోతున్నది నాకళ్ళు పరుగులు తీస్తున్నాయి పుటలు తిరిగి పోతున్నాయి చెప్పరాని ఉద్వేగానికి లోనయినాను నాకు మరిక స్పృహలేదు "రంగడూ" అన్న పెద్దమ్మ కేక విన్నపుడే ఈ లోకములోకి వచ్చిపడ్డాను ప్రొద్దువాలినది తిండితినుదువుగాని రమ్మని మంచె వద్దకు పిలిచినది. రెండు రోజులలో కథ ముగిసినది భారత భూమిని దురాక్రమించిడానికి జరిగిన ప్రయత్నాన్ని ఎదురించి పోరాడిన ఆ భీకర సంగ్రామము నాలో ఒక వీరావేశాన్ని సృష్టించినది. విద్రోహి రాజా జయచంద్రుని యెడ కోపాగ్నిని రగులుకొల్పినది. వివశుడనయినాను పుస్తకము ఒప్పగిద్దామని గ్రంధాలయమునకు వెళ్ళినపుడు ఆంజనేయులుగారు ఆ కథ చెప్పమన్నారు. గ్రుక్కత్రిప్పకోకుండా గంటకొట్టినట్లుగా కథ చెప్పేసరికి విని ఆశ్చర్య పోయినారు అపుడు అక్కడ ఉన్న వాళ్ళకు రంగా పండితుడవడం తధ్యం అంటూ ముచ్చట పడ్డాడు. ఈ పర్యాయము ఒకటికి బదులు రెండు పుస్తకాలు నాచేతికిచ్చారు ఈ పెద్దల ప్రశంసలకు లోలోన సంబరపడుతూ ఇల్లుచేరాను నా గ్రంధాలయోద్యమ ప్రవేశానికి ఇది అంకురార్పణ అనవచ్చును ఇక మద్రాసు, మచిలీపట్నంల నుండి వచ్చే విజ్ఞానచంద్రిక ఆంధ్రప్రచారిణి సభల వారి ప్రచురణలన్నీ విడవకుండా చదివాను నా అభిరుచులను చక్కదిద్ది నన్ను సక్రమ మార్గాన నడిపించటంలో ఈ గ్రంధాలకున్న పాత్ర అనన్య సామాన్యము లేత మనసులో తలయెత్తిన ఈ గ్రంధపఠనాశక్తి నేటికి విడవని వ్యసనంగా నన్ను వెన్నాడుతునే ఉన్నవి.

ఆ తదుపరి ౧౨౦౨-౧౨౧౦ సంవత్సరాలలో ఎన్ని పుస్తకాలు చదివానో లెక్కలేదు. భారత, రామాయణ కధలు ఆధునిక కవుల కృతులు, అపుడే వస్తున్న నవలలు చదివేవాడిని. ఈ రోజులలో ఆంజనేయులుగారు ఉపదేష్టగా వ్యవహరించటం నా అదృష్టముగా భావిస్తున్నాను. ఆయా పుస్తకాల ప్రాశస్త్యమును వివరించి నన్ను చదవమని ప్రోత్సహించేవారు. కొన్ని నవలలకు మహమ్మదీయ దండయాత్రలను హిందూ ప్రభువులు ఎదిరించిన తీరు కధా

వస్తువుగా ఉండేది ఇందుకు సాటిగా అపుడపుడే బ్రిటీష్ పాలనకు వ్యతిరేకముగా దేశంలో రగులుకొంటున్న విప్లవాగ్నిని ఆయన నాదృష్టికి తెచ్చేవారు మా పరిసర గ్రామాలలోని సాహెబ్‌లు ఒకపుడు భారతీయులేనని, ముస్లిం దురాక్రమణ కాలంలో మతాంతరీకరణ చెందిన దురదృష్టవంతులని చెప్పారు. ఈ హరిజనులు సైతం క్రైస్తవమతస్థులయి జాతీయ ధర్మాన్ని కాదు అనే ప్రమాదము ఉన్నదని భయపడేవారు. ఈ ఆపద తప్పించటానికే నన్ను హరిజనసేవకు అంకితం కమ్మని ప్రోత్సహించేవారు.

పొన్నూరు, మునిపల్లె, ములుకుదురు, ఆలూరు గ్రామాలకు చెందిన బ్రాహ్మణ బాలురతో సమానమైన స్థాయిని రైతుల పిల్లలు, హరిజనుల పిల్లలు సాధించలేకపోవడం నేను గుర్తించాను. (మా ప్రాంతంలో గ్రామీణ బాలికలు ఉన్నత పాఠశాలకు వెళ్ళడం అప్పటికింకా ప్రారంభంకాలేదు) ఇందుకు నేను విచారించాను వారాంతపు సెలవు దినాలలో నాదగ్గరకొచ్చి నేర్చుకునే ఆసక్తి కనబరచిన వారందరికీ ఉచితంగా ప్రత్యేకంగా చదువునేర్పడం ప్రారంభించాను. అటువంటి విద్యార్థులలో ఒకరు, తర్వాత ఒక శాఖాధిపతి స్థాయికి ఎదిగాడు రైతాంగానికి చెందిన వయోజనులకు కూడా చదవడం, రాయడం నేర్పాలని నాకు చాల కుతూహలంగా ఉండేది ఎందుకంటే మా రైతుల దురదృష్టం నిరక్షరాస్యతే. గ్రంథాలయోద్యమ నాయకులందరిలోనూ నిరక్షరాస్యతను పారద్రోలాలనే వాంఛ ప్రబలంగా ఉండేది. ఆంధ్ర గ్రంథాలయోద్యమంలో మొదటి దశాబ్దం అది. శ్రీ అయ్యంకి నడిపిన పత్రిక ప్రభావం నావంటి యువకుల మీద చాల ఎక్కువగా ఉండేది కనుక నేను మా గ్రామంలో ఒకరాత్రి పాఠశాల ప్రారంభించాను దానిలోని వయోజన విద్యార్థులలో ఒకరు ఆ తర్వాత మా గ్రామంలోని ప్రముఖ ప్రజాసేవకులయ్యారు.

శ్రీ కె. నాగేశ్వరరావు సంపాదకుడిగా ఆంధ్రపత్రిక నావంటి యువకులకు సాంఘిక కార్యకలాపాలలో మార్గదర్శకత్వం వహిస్తూండేది. పేద విద్యార్థుల విద్యాభ్యాస రుసుములు చెల్లించేందుకు వివిధ రైతాంగ కుటుంబాల యువకులు వారానికొకసారి ఇల్లిల్లు తిరిగి విరాళాలు సేకరించే పద్ధతి ఆ పత్రిక ప్రారంభించింది. మా గ్రామంలో నేను కొందరి సహ విద్యార్థుల సహకారంతో గ్రంథాలయంలో నాతోపాటు పనిచేసే యువకుల

సహకారంతో నేనీ కార్యక్రమాన్ని ప్రారంభించాను రెడ్డి కులానికి చెందిన రైతాంగం నుంచి పేద విద్యార్థులలో ఒకరయిన విద్యార్థి మా ఉన్నత పాఠశాల చదువు విజయవంతంగా పూర్తిచేయడానికి ఈ విరాళాలు ఉపయోగపడ్డాయి ఆయన ఆ తర్వాత ఎం ఎ., బి యల్ , చదివి, ఆంధ్రప్రదేశ్ ప్రముఖ సాంఘిక, రాజకీయ నాయకుడయ్యారు

కొన్ని కులాల రైతులను మా గ్రామములోని ఇతర రైతులందరు క్షత్రియ వంశానికి చెందిన వారుగా లెక్కించేవారు వారి సైనిక సాంప్రదాయంవల్ల గాని, పల్నాడు, చోళ, కాకతీయ, యాదవ, విజయనగర రాజ్యాల పాలకులలో వారికి గల చారిత్రక సంబంధంవల్లగాని ఈ గుర్తింపు ఉండేది ప్రతి ప్రధాన క్షత్రియ తెగకుగాని, కులానికిగాని ప్రత్యేకంగా ఒక నాయకుల ఉపతెగ ఉండేది. ప్రధాన తెగకు చెందిన మహాపురుషుల, సాధ్వీమణుల సాహస కృత్యాలను, వీరోచిత కార్యాలను ప్రత్యేకంగా గణనీయమైన విజయాలను కీర్తించడానికి, వాటిపై గేయాలు, పాటలు, రూపకాలు తయారుచేసి తమ వార్షిక సంచార ప్రదర్శనలో ప్రతి గ్రామంలోను వాటిని పాడడం, వివరించడం, వ్యాఖ్యానించడం వారి పనిగా ఉండేది. నాలుగు తెగలకు వాటి వాటి ప్రత్యేకమైన గాయక ఉపతెగలు ఉండేవారు. ప్రదర్శనలు గ్రామీణ యువజనులకు వినోదంగా, విజ్ఞానంగా, ఉత్తేజంగా ఉంటూ ఉండేది. వారి మాటవల్ల పాటలవల్ల నాకు ప్రత్యేక ఆసక్తి ఉండేది. నేను వాటి నుంచి మా వివిధ గ్రామీణ తెగల చరిత్రను, ఘనకార్యాలను, సాంఘిక లక్ష్యాలను గురించిన ఉపయోగకరమైన పరిజ్ఞానాన్ని పొందగలిగాను. కాని వివిధ తెగల సామాజిక ప్రాముఖ్యతను గురించిన ఉన్నత, నిమ్నస్థాయిల విభజనను నేను అంగీకరించ లేకపోయాను. మహారచయిత, ఆంధ్ర సంఘ సంస్కరణోద్యమ నేత వీరేశ లింగం గారి బోధనలవల్ల నేను ఈ వ్యర్థ విభజనలను తొలగించి నా తోటి గ్రామీణ యువజనుల సాంఘిక ఐక్యతను, సమానత్వాన్ని గుర్తించేలా చేయడంలో సహకరించాలని నిర్ణయించు కున్నాను. మేం నిర్వహించిన గ్రామీణ గ్రంథాలయాల నిర్ణీతవ్యవధి సమావేశాలలో మాపొరుగు గ్రామాలకు చెందిన అన్ని కులాల యువకులకు, సాంఘిక కార్యకర్తలకు నేను సామూహిక, సహపంక్తి భోజనాలను ఏర్పాటుచేసే వాణ్ణి! గ్రామీణ సాంఘిక శిష్టవర్గంతో సమానంగా ఉంచబడిన సాలి, వడ్రంగి, కమ్మరి తదితర కులాల

వాళ్ళు క్రమంగా కేంద్రస్థానానికి రావడం మొదలయింది తర్వాత కాలంలో నేను ఏ ప్రజాస్వామిక ఆశయంకోసం, సాంఘిక సమానత్వం కోసం పాటుబడ్డానో వాటికి బీజాలు ఇక్కడే పడ్డాయి ఒక క్షత్రియ యువకుడు, ప్రతిభావంతులయిన వారందరిలో క్షత్రియ దీక్షనే చూడగలగడం నిజంగా ప్రజాస్వామ్య ప్రయాణంలో ఒక మంచి ప్రారంభమే.

ఆరోజులలో (1912-1916) ఆంజనేయులుగారు నాయెడల చుక్కాని. వారు నాకు సంస్కృతము నాలుగు ముక్కలు నేర్పారు. తెలుగు వ్యాకరణము నిఘంటువులలో పరిచయము కల్పించారు. వీరేశలింగము పంతులుగారి సంఘ సంస్కరణ ధర్మాన్ని నాతలకి ఎక్కించారు. వివేకానందుడు వెలర్చారిన భారతీయ తాత్విక శోభను నా కళ్ళముందు నిలిపారు. ఆంగ్లేయ పాలనపై ధ్వజమెత్తిన లోకమాన్య బాల గంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్ వారి ఉద్విగ్న భరిత ఉపన్యాసాలను నాకు వినిపించారు. సాహిత్య రంగములోనే కాక రాజకీయ రంగములో కూడా ఆనాడు బెంగాలీలు మార్గదర్శకులు. ఆంజనేయులుగారు ఆప్రభావమునకు ముందుగా లోనయి నన్ను ఉత్తేజపరుప సమకట్టారు. నేను ఆరోజులలో శరీరశాస్త్రము, వృక్షశాస్త్రము చదవడంతోపాటు యూరప్, అమెరికా జపాన్ దేశాల రాజ్యాంగ చరిత్రలు తెలుగులో చదివాను

ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక చదవడం వలన నాకు కొంత రాజకీయ పరిజ్ఞానము అలవడినది అప్పటినుండే మాతృభాషలో విద్యాబోధన అన్ని శాస్త్రాలలోనూ సుసాధ్యమనే అభిప్రాయము నాలో పాతుకొన్నది స్వదేశీ భాషా ఉద్యమాలను అందుకే నేనెప్పుడూ ఆదరిస్తూ వచ్చాను. మా మేనమామ రామస్వామి గారు బాపట్లలో జరిగిన ప్రథమ ఆంధ్ర మహాసభకు నన్ను తీసికెళ్ళారు. తర్వాత కాలములో బ్రిటీష్ వైస్రాయ్ కేంద్ర కేబినెట్ సభ్యుడిగా ఎదిగిన శ్రీ బి.ఎన్ శర్మగారు ఆ సభకు అధ్యక్షులు. వారు నాకు వేలెత్తి చూపుతూ, నీకు ఇంగ్లీషు నేర్చుకోవాలని ఉందా అని అడిగారు. నేను తలూపాను. అప్పటివరకు నా చూపు అంతా ఆంజనేయులుగారి నేతృత్వములో తెలుగు భాషా పాండిత్యముపై ఉండేది. ఇక మా మేనమామ నన్ను ఇంగ్లీషు హైస్కూలులో చేర్చే విషయమ్మై నిర్ణయానికీ వచ్చారు.

చదువు సంధ్యలలో నాకున్న చొరవ చూచి ఎంతగానో సంతోషించారు మా పెద్దమ్మ "ఇంకా నాలుగేళ్ళు చెల్లెలు జీవించగలిగితే బిడ్డ తెలివితేటలు చూచి ఎంతగా ముచ్చటపడేదో చెప్పలేను రంగాను పెద్ద చదువులు చదివించాలని మా చెల్లికి ఎంత ఉబలాటమో" అంటూ మా పెద్దమ్మ దుఃఖాన్ని దిగమింగుతూ ఆ సందర్భములో నన్నూ పరామర్శించారు గతించినవారికేగాని జీవించిన వారికి చావులేదన్నట్లు వ్యవహరించటము మానవ సహజము

## ఇది భ్రమ అన్నది నిజమేకాని-

జీవన సమరములో పురోగమనముతో అనుక్షణం శ్రమించే దశకి ఈ భ్రమ నుండే జనిస్తుంది మా తల్లి దురదృష్టానికి వగచినా మా మేనమామ రామస్వామి సాధించినది ఏమిటి? నన్ను హైస్కూలులో చేర్పించక మునుపే ఆ సంవత్సరమే కన్నుమూశారు మా మేనమామ భార్య లక్ష్మీదేవి. వీలకి ఉన్న ఒక్కగానొక్క కూతురు అప్పటికే గతించినది భర్త పనుపున మా అన్నదమ్ముల ముగ్గురిని కన్నబిడ్డలవలె ప్రేమించినది తమ ఆస్తినంతా మాకే సంక్రమింప చేసినది. ఉదారంగా సంక్రమించిన ఈ ఆస్తి లేనట్లయితే నేను ఆక్స్‌ఫర్డ్ వెళ్ళ గలిగేవాడినేకాను. నా సోదరులు పట్టభద్రులు కాలేరు కూడా. తన ఆస్థినంతా మాకు సంక్రమింపజేసి మా అక్కను మాకు గార్డియనుగా నియమించాలని మా మేనమామ నిర్ణయించడం మా అదృష్టానికి కారణం. అందుకే "క్రెడో ఆఫ్ వరల్డ్ పెజెంట్రీ" అనే నా ఉద్గ్రంధాన్ని వారిరువురికి అంకితము చేయడం నాకెంతో సంతృప్తిని కలిగించింది.

మా మేనమామ అకాల మరణం వల్ల నా ఇంగ్లీషు చదువు రెండేళ్ళు వెనక బడింది. ఇంగ్లీషు చదువుల ఖర్చు తలకు మించిన భారమనీ, అప్పటికి చదివిన చదువులు మా కుటుంబ వ్యవహారములు చక్కదిద్దడానికి చాలునని మా పెద్దమ్మ మంగమ్మగారు నిర్ణయించుకొని, వ్యవసాయంలో దిగమని పురమాయించింది. వ్యవసాయాన్ని చేపట్టాలని ఆమె తలంపు. అయితే ఆంజనేయులుగారికీ నాకు మాత్రం మనసంతా ఇంగ్లీషు చదువుపైనే వుండేది అప్పటికే నేను ఆధునిక గ్రంథప్రచురణకర్తల నుండి తెప్పించుకొన్న తెలుగు గ్రంథాలు చదివివున్నాను కూడ. మంగమ్మగారు ఈ సందిగ్ధావస్థలో స్థానిక పండితులను సంప్రదించింది.

భూవసతి లేని ఏ బ్రాహ్మణులో బ్రతుకు తెరువుకై ఇంగ్లీషు నేర్చుకొంటారని మోతుబరులయిన మా వంటి వారికి ఇంగ్లీషు అక్కరలేదని సలహా ఇచ్చారు. దానితో ఆమె ఒక నిశ్చయానికి వచ్చింది. నన్నిక వ్యవసాయం పై దృష్టి కేంద్రీకరించమని చెప్పింది నేనిక చేసేదిలేక రెండేళ్ళపాటు వ్యవసాయానికి అంకితమైపోయాను ఆ సమయంలో కూడ నేను స్వంతంగా చదువుకోవడం, స్థానిక గ్రంధాలయాన్ని నడపడం, రైతాంగ యువకులను విద్యావంతులను చేయడం మాత్రం మానలేదు.

రెండేళ్ళలో అభ్యాసమైన పొలం పనులు, ఇంటిలెక్కలు, సర్వే కొలతలు నా భావి జీవితంలో ఎంతగానో అక్కరకు వచ్చాయి తర్వాతికాలంలో ఏవో ఆర్థిక ప్రణాళికలు. రాజకీయ పథకాలు చర్చకొచ్చినప్పుడల్లా ఆనాటి స్వానుభవపు గీటురాయిమీదనే వాటిని పరీక్షించే వాడిని. ఇది ఇట్లా వుండగా చదువుకు వెళ్ళితీరవలసిందేనని ఆంజనేయులుగారు పట్టుపట్టారు.

మే మిద్దరమూ మా నాన్నగారిని కలిసి మాకు అనుకూలముగా మంగమ్మగారితో మాట్లాడమని కోరాము ఆధునిక చట్టాలను గురించి పరిజ్ఞానము లేక పోవడము, వల్లనే మా నాన్నగారు ప్రభుత్వంతో ఇబ్బందులు పడ్డారని ఇంత పెద్ద ఆస్తులను నిర్వహించాలంటే కుటుంబంలో ఎవరో ఒకరు ఇంగ్లీషు చదివి ఉండాలని మా బంధువులు కొందరు ఆమెకు నచ్చజెప్పారు. ఆ తర్వాతే నేను పొన్నూరులోని ఇంగ్లీషు బడికి వెళ్ళడానికి ఆమె అయిష్టంగా అనుమతి ఇచ్చినది

1914 లో నేను ఆ పాఠశాలలో చేరాను మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమయినది ఆ సంవత్సరంలోనే.

నేను పొన్నూరు హైస్కూలులో చేరాక ఇంగ్లీషులో తప్ప మిగిలిన అన్ని సబ్జక్టులలో మంచి పరిజ్ఞానము నాకు ఉన్నదని అక్కడ ఉపాధ్యాయులు గుర్తించారు. నా తరగతిలో నేనే ప్రథమ శ్రేణికి చెందిన ఉత్తమ విద్యార్థినని అంగీకరించారు. నాకు శ్రద్ధగా బోధించటానికి నాతో ఆదరవముగా మెసలడానికి ఆ ఉపాధ్యాయులు పోటీపడ్డారు. నా 3 వ తరగతి నుండి సెల్లూరి వారైనా శ్రీ ఆర్. వెంకయ్యగారు మాకు అధ్యాపకులు. వారి మార్గదర్శకత్వం నాకు ఎంతో లాభించింది. వారు ప్రకృతి సౌందర్యారాధకులు వర్డ్స్‌వర్తు

కవితాభిమాని స్వామి రామతీర్థ అనుచరులు నా ఇతరేతర కార్యకలాపాలను వారు ప్రోత్సహించారు. మా పరిసర గ్రామాలలో గ్రంధాలయాలు నెలకొల్పడానికి ఆంజనేయులుగారితో కలిసి నేను చేస్తున్న కృషికి వారు తోడ్పడ్డారు వారి ప్రోత్సాహముతో పాఠశాల వక్తృత్వ సమితిలో ఉపన్యాసాలు ఇవ్వడం అలవాటు చేసికొన్నాను వారు వ్యాస రచన పోటీలు నిర్వహించి నాలోని రచనా శక్తిని మేలుకొల్పారు

ఆ ప్రధమ ప్రపంచపు యుద్ధ విశేషాలు మా గ్రామాలలోని విద్యావంతులను చైతన్యవంతులను చేశాయి. ప్రత్యేక భాషా రాష్ట్రాన్ని కోరుతూ ప్రారంభమయిన ఆంధ్రోద్యమము నానాటికి బలపడి జాతీయోద్యమములోని శక్తివంతమైన భాగంగా ఎదిగింది. భారతదేశానికి సంపూర్ణ స్వరాజ్యాన్ని కాంక్షించింది నా రాజకీయ చైతన్యం కూడా ఆంధ్రోద్యమ చైతన్యంతో పాటు అభివృద్ధి చెందనారంభించింది.

రాజకీయాలలో విద్యార్థులు పాల్గొనకూడదని గవర్నర్ పిన్‌ట్లెండ్ విధించిన నిషేదాజ్ఞలను ధిక్కరించాను. నెల్లూరులో 1917 లో జరిగిన ఆంధ్ర మహాసభకు హాజరయ్యాను. ఆనాడే నేను తొలుత ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ఉపన్యాసము విన్నాను. వారు గొప్ప కార్యదక్షులు దేశభక్త కవులు ఠాగూర్ శిష్యుడయిన రాయప్రోలు సుబ్బారావుగారి గీతాలను వారు గానము చేస్తుంటే ఆంధ్రులకు గల వైభవము నా కళ్ళకు కట్టినట్లయినది అప్పటికే చిలుకూరు వీరభద్రరావుగారు రచించిన ఆంధ్రుల చరిత్ర నేను చదివి ఉన్నాను. వక్తలు లోకమాన్య తిలక్ అపూర్వ త్యాగాలను ప్రశంసిస్తుండగా నాకు కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు రచించిన శివాజీ సాహసకృత్యాలు జ్ఞప్తికి వచ్చాయి. ఇంగ్లండ్ రాజ్యాంగ చరిత్ర అనే తెలుగు గ్రంథములో చదివిన "మాగ్నాకార్టా", "బిల్ ఆఫ్ రైట్సు" ఉద్యమాలు స్ఫూర్తికి వచ్చాయి. ఈ నెల్లూరు మహాసభ నాకు గొప్ప కనువిప్పు. బ్రిటీష్ ప్రభుత్వాన్ని ధిక్కరిస్తూ సాగే సాహసోపేతమైన స్వరాజ్య పోరాటములో భాగస్వామిని కావడం నాకు ఒక పునర్జన్మ ఆ మహాసభ తరువాత కొద్దికాలానికే ఐరిష్ యువతి ప్రముఖ దివ్యజ్ఞాన సామాజికురాలు డాక్టర్ అనిబిసెంట్‌గారిని బ్రిటీష్ గవర్నర్ ప్రవాసము పంపించారు. ఈ దురాగతముపట్ల తెలుగు పత్రికలు తమ నిరసనను ప్రకటించాయి ఆమె సంపాదకత్వము వహిస్తున్న

న్యూ ఇండియా దినపత్రిక సులభమైన ఇంగ్లీషుశైలిలో ఉండేది. నాకు బాగా అర్థమయ్యేది ఆ సంపాదకీయాలు మాలో ధైర్యసాహసాలని పురికొల్పేవి. భారతదేశ ప్రయోజనాలను సమర్ధించటములో ఆ పత్రిక చూపిన వైదుష్యము బ్రిటీష్ అధికారుల యెడ మాలో కొందరికి గల భ్రమలను పటాపంచలు చేశాయి.

మేము అందరము బ్రిటీష్ పాలనకు వ్యతిరేకముగా సమాయుత్తము కావడానికి అవి సాయపడ్డాయి. నా మార్గదర్శకులయిన వెంకయ్య మాష్టారుగారు, ఆంజనేయులుగారు ఈ ప్రపంచయుద్ధపు జాతీయ, అంతర్జాతీయ పరిణామాలను ఎప్పటి కప్పుడు మాకు విశదపరుస్తుండేవారు పై పెచ్చు దక్షిణాఫ్రికాలో శ్వేతజాతీయులపై విజయం సాధించి వచ్చిన మహాత్మాగాంధీ, బర్మా జెయిల్‌లో ఆరేళ్లపాటు బందీగా ఉండి విడుదలయి వచ్చిన బాలగంగాధర్ తిలక్ భారతజాతీయ లక్ష్యాలను చాటి చెప్పే శ్రీమతి అనిబిసెంట్ మమ్ములను ఎంతగానో ఆకర్షించారు. బ్రిటీష్ ప్రభుత్వం అనిబిసెంట్‌ను ప్రవాసం పంపినందుకు నిరసనగా నేను ఒక ప్రదర్శనకు నాయకత్వం వహించాను. మా ప్రాంతములో అటువంటి ప్రదర్శన జరగడము అదే ప్రథమం. దాంతో పోలీసులు వచ్చి మంగమ్మగారిని కలిసి తన సుపుత్రుడిని అదుపులో పెట్టుకొనమని ఆజ్ఞాపించి వెళ్ళారు అయినా పర ప్రభుత్వం అంటే సరిపడని మా నాన్నగారు మాత్రం నన్నుజూచి ముచ్చట పడ్డారు.

నా పదమూడవ యేట నుండి పదిహేడవ యేటి వరకు వీరేశలింగం పంతులు గారి పది సంపుటాల రచనలు పదే పదే చదివాను. వారి ఉపదేశాలను ఆచరణలో పెట్టడానికి యత్నించాను. లెక్కకు మిక్కుటమ్మైన దేవతలను కాదని ఏకేశ్వరోపాసన ఆరంభించాను. మాంసాహారము వర్జించాను బ్రాహ్మణులకుగాని, మరెవరికయినాగాని దివ్యత్వము జన్మతః ప్రాప్తించదని నమ్మి వారి ఆధిపత్యాన్ని తిరస్కరించాను. నేను వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్రలను, మరెందరో మహనీయుల జీవితగాధలను చదివి యున్నందున దినచర్య వ్రాసిపెట్టుకోవాలనే ప్రేరణ నాలో కలిగినది. ఇంతకాలానికి మరలా ఆనాటి నా డైరీని పరిశీలిస్తే ఎన్నో ఆసక్తికరమ్మైన విషయాలు బయల్పడి ఆశ్చర్యము కలిగిస్తాయి. నేను ఆపుటలలో ఏ రోజున ఏ గ్రంథాన్ని చదివినది ఏ భజన కాలక్షేపాలకు ఏ మిత్రులతో కలిసి వెళ్ళినది

వ్రాసిపెట్టు కొన్నాను ఆయా గ్రామాలలో జరిపిన సంఘ సంస్కరణ ప్రచారము, నడిపిన గ్రామీణ గ్రంధాలయోద్యమాలు, మూఢనమ్మకాలను చెండాడుతూ చేసిన ఉపన్యాసాల సారాంశము ఇప్పటికీ ఆ దినచర్య పుటలలో చూడవచ్చు. ఆంధ్ర కవులు ఆ కాలములో జరిపిన శతావధానాలు, అష్టావధానాలు ప్రజలను ఎట్లా సమ్మోహితులను చేసినది వర్ణించి భద్రపరిచాను

ఆ కాలపు నా జ్ఞాపకాలన్నిటిలో మణిపూస వంటిది ఒకటి ఉన్నది అప్పటికి ఇరవయి ఏళ్ళక్రితం మాయమైన మా బంధువు ఒకరు దక్షిణాఫ్రికాలో తిరిగి తిరిగి ఒకనాటి మధ్యాహ్నము ఊరి మధ్యన ఊడిపడ్డాడు

ఆయన ఆఫ్రికాలో గాంధీతో జరిపిన సమావేశాల గూర్చి గాంధీజీ భావాల పట్ల తనకు గల ఆసక్తిని గూర్చి వింత వింతలుగా, కథలు గాధలుగా రోజూ నాకు వివరించి చెప్పేవారు అతను అక్కడ మహాత్మునితోపాటు కారాగార క్లేశాన్ని కూడ అనుభవించిన వ్యక్తి. గాంధీజీ, కస్తూరిబాయిలు ఆఫ్రికాలో సాగిస్తున్న మహత్తర పోరాటాన్ని గూర్చి నాచే విశ్వరూప సందర్శనము చేయించాడు. ఉత్సాహం ఉరకలు పెట్టే కోడె వయసులోనే మహాత్మునికి నా మదిలో పెద్ద పీట వేశారు.

హైస్కూలులో ఇంగ్లీషు, గణితాలలో సాటి విద్యార్థులతో పోటీపడటం కష్టమయినది. ఇతర పాఠ్యాంశములలో మాత్రము నేను దిట్టనే ఈ ఇంగ్లీషు చదువులలోనికి నేను ఆలస్యంగా దిగినందువల్ల మా క్లాసులో గల నా ఈడు మించిన విద్యార్థులలో నేను ఒకడిని అయ్యాను. అప్పటికే మా ప్రాంతములో నేను సాంఘిక సంక్షేమ కార్యకర్తగా పేరుమోసి ఉన్నందున చదువులలో సైతం వెనుకబడరాదని తీర్మానించుకొన్నాను. తదనుగుణంగా ఇంగ్లీషు, గణితము నేర్పడానికి మిత్రుల సహాయము ఆర్థించాను. వారిలో ఒకరు అప్పికట్ల వాస్తవ్యులు. మరొకరు మా గ్రామస్థులే. అప్పికట్ల మిత్రుడు ఆచంట నాగయ్య నాకు బంధువు కూడ.

అతడు బాపట్ల హైస్కూల్‌లో నాకన్నాపై క్లాసు చదువుచున్నాడు. వానికి ఇంగ్లీషు గణితాలలో మంచి ప్రావీణ్యము ఉంది. నాగయ్య ఎంతో ఓపికతో రెండు సంవత్సరాలు చదువులలో నాకు సహాయపడ్డారు. మేము ఇద్దరము

ఒకేసారి 1920లో మెట్రిక్‌లేషన్ పరీక్షలో నెగ్గటం కాకతాళీయం. అయితే నాగయ్యగారిది అంత సంపన్న కుటుంబము కానందువల్ల పై చదువులకు పోలేకపోయాడు. ఈనాటికి అతడు నాకు ఆప్తమిత్రునిగా రైతు ఉద్యమ సహచరుడుగా అనుభవజ్ఞుడగు సచివునిగా సాయపడుతూనే ఉన్నాడు.

నాగయ్యలాగ నాకు చేదోడు వాదోడుగా నిలచిన వారెందరో లేరు. వారి మైత్రి చిరస్మరణీయం. రెండవ మిత్రుడు గోపాలకృష్ణయ్య. అతను బ్రాహ్మణ యువకుడు అప్పటికి ఆయన గుంటూరు కళాశాల విద్యార్థి వానికి ఇంగ్లీషు సాహిత్యమంటే తగని అభిమానము. గణితములో అందెవేసిన చేయి ఆయనే నాకు తోడ్పడనట్లయితే నేను మెట్రిక్‌లేషన్ పరీక్షలో గణితము. భౌతిక శాస్త్రాలలో తప్పి ఉండేవాడినేమో. దురదృష్టవశాత్తు అతడు తుదకు చిన్నవయసు లోనే పక్షవాతానికి గురయి ఆధ్యాపక వృత్తి నుండి అర్థంతరంగా విరమించుకోవలసి వచ్చింది. ఆయన స్నేహం, సౌహార్దం ఇప్పటికీ నాకు లభిస్తూనే ఉన్నాయి.(1959).

నా విద్యార్థి దశలో, నా సహ విద్యార్థులు కొందరు సాటివారితో స్పర్థలు, మరి కొందరు ఉపాధ్యాయుల ఆగ్రహాన్ని కొనితెచ్చుకొన్నారు. మూడవఫారమ్ తప్పిన విద్యార్థులు కొందరు బాపట్ల హైస్కూల్‌లో చేరారు తమను ప్రధమశ్రేణి విద్యార్థులుగా గుర్తించాలని తమ పంతం. అన్ని పాఠ్యాంశాములలోనూ 3 నెలలపాటు క్రమబద్ధంగా ప్రతిభను చూపినపుడే ఏ విద్యార్థి అయినా ప్రధమశ్రేణి విద్యార్థిగా చెల్లుబాటు కాగలడు ఇది మా ప్రధానోపాధ్యాయుని నిర్ణయం ఈ నిష్పాక్షిక నిబంధనలన్నింటిలో నెగ్గగలిగాను కనుక నేను మెట్రిక్‌లేషన్ వరకు ప్రథమశ్రేణి విద్యార్థిగా రాణించగలిగాను. ఒకరిద్దరు ఉపాధ్యాయులు నా సాంఘిక సేవాకార్యకలాపాల యెడ విముఖులైనవారు నా విద్యా వ్యాసంగాలలో దోషాలు ఎన్నడానికి సమకట్టారు. అదృష్టవశాత్తూ వారి దోషారోపణలు ఋజువుకు నిలచినవి కావు. వెంకయ్య మాష్టారు మా పాఠశాలను విడిచి వెళ్ళినప్పటికి మిగిలిన ఉపాధ్యాయుల నా పట్ల సాదరంగానే వ్యవహరించారు. బాలభట ఉద్యమము మన బాలురను సంఘసేవా తత్పరులుగా తీర్చిదిద్దే మహోద్యమము. 1911లో క్రొత్తగా ఉద్యమం మొదలయినపుడు మా హైస్కూలులో ఉత్సాహము వెల్లువికినది. మా పై క్లాసు విద్యార్థి ఒకరు ప్రత్యేక శిక్షణపొంది వచ్చి మాకు శిక్షణ ఇవ్వడం మొదలెట్టాడు.

నేను తొలి బృందంలోనే జయప్రదంగా శిక్షణపొంది పెక్కు పతకాలు సంపాదించాను

1920లో మా హైస్కూలు హాలులో జిల్లా సహకార సంఘ సమావేశం జరిగినది నన్ను స్వచ్ఛంద సేవకుల సంఘానికి నాయకునిగా ఎంపిక చేశారు వడ్డీ వ్యాపారులనుంచి వర్తకులనుంచి వారి అక్రమ వసూళ్ళనుంచి రైతులకు రక్షణ కల్పించేది సహకార ఉద్యమమే అన్న విశ్వాసము నాకు ఈ సమావేశము కలిగించినది. ఆరోజులలో మేము ఒక ఫుట్‌బాల్ క్లబ్‌ను స్థాపించాము ఆ ఆట నాకు ఎంతో ఇష్టమయినది ఆ జట్టు జిల్లాలో పోటీలలో కూడ పాల్గొన్నది కాని మేము అక్కడ గెలుపొందలేక పోయాము అయితే ఈ క్రీడలలో నేను తుదకంట పాల్గొనలేక పోయాను ఎందువల్లనంటే పాఠశాల ముగిసిన తరువాత నా విరామ సమయము అంతా గ్రంథాలయ సేవకు, వయోజనవిద్యకు తదితర సంఘసేవ కార్యకలాపాలకు వినియోగించవలసి వచ్చేది. నేటికి ఫుట్‌బాలు ఆటలో మా నిడుబ్రోలు జట్టుకు రాష్ట్రవ్యాప్తంగా మంచిపేరున్నది.

ఆంజనేయులుగారికి కవులంటేనూ, కవిత్వమంటేనూ ఆసక్తి ప్రముఖ కవులెందరో మా గ్రామానికి వచ్చి మా మునసబ్ శ్రీ పి వి సుబ్బయ్యగారి అనుగ్రహానికి పాత్రులయ్యేందుకు ప్రయత్నిస్తుండేవారు. నన్ను ఒక ప్రముఖ రైతు కుటుంబమునుండి పైకివస్తున్న విద్యావంతునిగా వారికి పరిచయము చేసేవారు. నేను కూడ పద్యము వ్రాయడానికి ప్రయత్నించినవాడనే అయితే అది తప్పటడుగు మాత్రమే. నేను పద్యాలను, పాటలను, నాటక ప్రదర్శనములను, వివిధ కళారూపాలను వదిలేవాడిని కాను నిజానికి ఆంధ్రులకు కవిత్వము వెన్నతో పెట్టిన విద్య. ఇప్పటికీ కవిత్వమంటే నాకు ప్రాణం లేచి వస్తుంది

ఆంజనేయులుగారు ఫ్లూట్, వయోలిన్, హార్మోనియం పలికించటంలో నేర్పరులు. వారి సహచర్యము, నాకు సంగీతము పట్ల అభిరుచిని, గాయకుల పట్ల అభిమానాన్ని కలిగించింది సంగీత కచేరీలు ఎక్కడ జరిగినను మేము ఇద్దరము వెళ్ళేవారము మేము మా గ్రామములో ఒక ఔత్సాహిక నాటక సమాజము నెలకొల్పాముకూడ. అది కొన్ని నాటకాలను ప్రదర్శించినది. దురదృష్టవశాత్తు నటులు కొన్ని దురభ్యాసాలకు లోను కావడమువల్ల ఆ

సమాజము మూలబడినది. అయినా ఆ కృషివల్ల కొన్ని సత్ఫలితాలు కలుగక పోలేదు. రైతుయువకులకు కళలపట్ల మోజు కల్గినది అట్టివారిలో ఒకరైన శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరిగారు తర్వాత కాలములో ప్రసిద్ధమైన సంగీత విధ్వాంసునిగా ఆంధ్రలో వన్నెకెక్కారు. స్వాతంత్ర్య దినోత్సవం సందర్భముగా రాష్ట్రపతిచే గౌరవ పురస్కారాన్ని పొందారు. ఇందుకు నేనూ కొంత దోహదం చేసి ఉండటం నా అదృష్టంగా భావిస్తున్నాను నాకు నటుడు కావాలనే ఆపేక్షలేనప్పటికీ ఆంజనేయులుగారు ఒక నాటకముతో నా చేత వేషం కట్టించారు. కౌరవ, పాండవ యుద్ధ నాటక ప్రదర్శనలో సంగ్రామ సరళిని తెలిపే వార్తాహరునిగా నేను నటించాను ఈ ప్రయోగము నాటకాలపట్ల నాలో ఆసక్తిని రేకెత్తించినది. మన గ్రామ సీమలలో లలితకళలు వర్థిల్లాలి అని ఇప్పటికీ నేను అభిలషిస్తూ ఉంటాను.

మదరాసు రాష్ట్ర కమ్మజన మహాసభ జరపాలని తలపెట్టారు. నన్నుకూడ వారితో సహకరించమని అన్నారు. ఆ దశాబ్దములో ఆ తరువాత కూడ వంచనకు గురయి నిద్రాణవంతముగానున్న రంగాలలో రాజకీయ చైతన్యం మోసులెత్తింది. ఆనాడు కులపరంగా సభలు జరపటం నేరంగాక ప్రగతిశీలక చర్యగానే పరిణమించినది ఆ కులాల వారిలో విద్యాగ్రంధవ్యాప్తికి దురాచార నిర్మూలనకు ఆ మహాసభలు దోహదం చేశాయి. అగ్రవర్ణాధిపత్యానికి తలొగ్గే రోజులు గతించాయని తనకూ ఒక వ్యక్తిత్వము ఉన్నదని ప్రజలు గుర్తించి, విజృంభించారు. నేను వెంకయ్య మాష్టారిని సంప్రదించగా వారూ మమ్ములను ప్రోత్సహించారు ఆ మహాసభను కమ్మజన మహాసభ అని పిలచినప్పటికి మా తాలూకాలోని బ్రాహ్మణేతరులందరూ సహకరించడం నేను ఊహించని విషయం సమైక్యంగా లేకుంటే విముక్తి లేదన్న సత్యం వారికి సహజంగానే స్ఫురించినది ఆ మహాసభలో కీర్తిశేషులు బారిష్టర్ పంగులూరు వెంకటసుబ్బారావుగారు కూడా పాల్గొన్నారు. వారు లండన్‌కు చెందిన ఒక ఇంగ్లీషు వనితను పెళ్ళాడి, అక్కడే స్థిరపడ్డారు, వారి కుమారుడే రామన్ సుబ్బారావు. బెస్టు క్రికెట్ క్రీడాకారునిగా ఇంగ్లండ్‌లో ప్రసిద్ధికెక్కారు. నాటి సభకు హాజరయిన వారిలో వి. రామకృష్ణ, కె. గోపాలకృష్ణయ్య ఉన్నారు. వెలగపూడి రామకృష్ణగారు ఎడింబరోలో ఎమ్.ఎ పట్టాపుచ్చుకొన్నారు. ఇండియన్ సివిల్ సర్వీస్ ప్రొబేషనర్‌గా ఇంగ్లండ్‌కు తిరిగి వెళ్ళారు. ఆక్సుఫర్డ్

విశ్వవిద్యాలయములో నా సంరక్షకునిగా ఉన్నది ఈ రామకృష్ణగారే ఆ మహాసభలో స్వాగత పద్యాలను కూర్చి పాడినది కర్షక కవితా కిశోరం శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు వారు తర్వాత కాలములో ఆంధ్రదేశములో సాటిలేని మేటిజాతీయ కవిగా ప్రసిద్ధిగాంచారు. అభినవ తిక్కనగా ఆస్థాన కవి బిరుదులతో సన్మానితులయ్యారు ఆ మహాసభ విజయానికి కారణం మా వంటి యువకుల జాతీయ ఆకాంక్షలకు భిన్నంగా ఏరకమైన రాజకీయ తీర్మానాలను ఆమోదించకపోవడం అస్పృశ్యతను, ఘోషాను, వరకట్నాలను ఎదిరించేందుకు, వేదాలు ఉపనిషత్తులు ఎల్లరు చదివేటందుకూ నిరక్ష రాస్యతను నిర్మూలించేందుకు వయోజన విద్యను వ్యాప్తిగావించేందుకు గ్రామీణ గ్రంథాలయాలను స్థాపించేందుకు స్త్రీలు, పురుషులు ఎల్లరూ సమాయత్తం కావాలని ఈ మహాసభ పిలుపునిచ్చింది సభా తీర్మానాలలో రైతు వర్గ దృక్పథం ప్రతిబింబించటానికి నేను ఒక కారకుడనయ్యాను ఒక వారపత్రికను ప్రచురించాలనే ప్రతిపాదనవచ్చినపుడు అది గ్రామీణ రైతు సమస్యలకు దర్పణంగా ఉండాలని నేను పట్టుపట్టాను

మహాసభ సందర్భముగా శ్రీ పి.వి. కృష్ణయ్య, నేను పెద్ద మొత్తాలలో విరాళాలు సేకరించగలిగాము మిగిలిన నిధులను ఎట్లా సద్వినియోగము చేయాలనే అంశంపై మాకు తర్జన, భర్జనలు జరిగాయి. ప్రభుత్వములో ప్రముఖస్థానాలలో ఉన్న పెక్కురు పెద్దలు ఒక తెలుగు వార పత్రికను "కమ్మ పత్రిక " అనే పేరుమీద నడపాలని మహాసభలో పాల్గొన్నవారు ఎల్లరూ రైతువర్గానికి చెందినవారేనని వారు వివిధవర్గాల నుండి వచ్చారని కులం పేరులేని "రైతు " అన్న మకుటంపై పత్రిక నడపాలని సవరణ తెచ్చాను ఒక ఉన్నత పాఠశాల విద్యార్థి నుండి ఈ సవరణ రావడము పెద్దలకు విస్మయం కలిగించినది. అయితే విరాళాల సేకరణలో సభ నిర్వహణలో నాకు గల ప్రాబల్యము వారి దృష్టికొచ్చింది. స్థానిక ప్రజలలో నాకు గల ప్రేమాదరణలు వారు గమనించారు

ఎట్టకేలకు పత్రిక పేరు "రైతు"గా నిర్ణయించి నా సూచనకు తల ఒగ్గడం బ్రిటీష్ ప్రభుత్వ అనుకూలురైన ఆ బ్రాహ్మణేతర నాయకులకు తప్పిందికాదు ఈ నిర్ణయాన్ని యువకులందరూ హర్షించారు. అప్పటికింకా నేను విద్యార్థినే అంతటి చిన్న వయసులో అంతటి విశాల దృక్పధాన్ని ప్రదర్శించడం నా

భావికాలపు జాతీయ, అంతర్జాతీయ విప్లవ పరిణామాలు ప్రఖ్యాతికి నాంది కాబోలునని ఇపుడనిపిస్తుంది. అయితే ఆ వయస్సుకే నాలో అభ్యుదయ భావాలు రూపుదిద్దుకొన్నాయి. కులవ్యవస్థకు, అస్పృశ్యతకు, బ్రాహ్మణ చాంధసానికి, చిల్లరదేవుళ్ళకు తిలోదకాలు ఇచ్చాను. నాపై వీరేశలింగం పంతులుగారి ప్రభావము వలన వితంతు వివాహము, స్త్రీవిద్య, సాంఘిక సమానత్వము మున్నగు ఉద్యమాలపట్ల నాలో ఆదరాభిమానాలు బలపడ్డాయి నాకంటే వయస్సులో రెండు మూడు దశాబ్దాలు ముందున్న ఈ ప్రభుత్వ ఉద్యోగులు సంకుచిత మనస్కులుగా ఉన్నారు లోకమాన్య తిలక్, మహాత్మా గాంధీ ఆదేశాలకు ముగ్ధుడనయి జాతీయ కాంగ్రెస్ లక్ష్యాలకు బద్ధుడనయి ముందుకు సాగుచున్న నాకు కులతత్వంతో బ్రాహ్మణ వ్యతిరేక భావనతో పనేమి ఉన్నది.

1915 లో మేము గ్రంథాలయ వార్షికోత్సవాన్ని జరుపుకొంటూ బాపట్ల నుండి కొందరు న్యాయవాదులను ఆహ్వానించాం. ఒక బహిరంగసభా వేదిక నుండి ఉపన్యసించటానికి మొట్టమొదటిగా నేను సాహసించినది అపుడే ఆ న్యాయవాదులను మాకు సందేశము వినిపించవలసినదిగా కోరాము మత తత్వాలను విడనాడాలని ఐక్యంగా కృషిచేయాలని వారు ఉద్బోధించారు అది చక్కని సలహాగా నాకు తోచినది మా గ్రామాధికారులు అప్పటివరకు మా గ్రంథాలయ కార్యకలాపాలలో భాగం పంచుకొనేవారు కారు వారిని కలసి మాకు చేదోడుగా నిలబడమని అర్థించాము. మా కరణంగారందుకు సంతోషించి సరేనన్నారు.

వారికి సంస్కృతములో ప్రవేశము ఉండుటమువల్ల వారి సలహా సహకారము అమూల్యముగా పరిణమించినది. వారు గ్రంధాలయపు ఆర్థిక స్థితిగతులను మెరుగుపరచటంలో శ్రద్ధ వహించారు. కాని ఇది మూనాళ్ళ ముచ్చటే అయినది. తదుపరి గ్రంథాలయ వార్షికోత్సవములో అపశృతులు పలికాయి మేము ఆ వార్షికోత్సవానికి కృష్ణాజిల్లాకు చెందిన కుర్ర బారిష్టర్‌ను ఆహ్వానించాము. వారే త్రిపురనేని రామస్వామి చౌదరిగారు. వారు అప్పటికి కొన్నాళ్ళ క్రితమే ఇంగ్లండ్ నుండి తిరిగి వచ్చారు. వారు మంచి కవులని అవధాన చక్రవర్తులయిన తిరుపతి వెంకట కవుల శిష్యులని విని ఉన్నాను. చౌదరిగారు వార్షిక సభలో చేసిన ప్రసంగం మమ్మల్ని ఉద్రూత లూగించింది.

వారి వైదుష్యము మమ్ముల్ని ఆశ్చర్యపరచినది స్థానిక పండితులు సభకు వచ్చిన బాపట్ల తెనాలి న్యాయవాదులు చౌదరిగారి విప్లవ భావాలపట్ల విముఖులై మా పట్ల కొంత కోపము పెంచుకొన్నారు.

చిరకాలముగా చెల్లుబాటు అవుతున్న బ్రాహ్మణాధిపత్యమును కూకటివేళ్లతో పెకిలింప సమకట్టిన చౌదరి గారిని, వారు ద్వేషించడం సహజమే కావచ్చును. త్రిపురనేనివారు ఆంధ్ర ఉద్యమమును జాతీయ ఉద్యమాలను కూడా దుయ్యబట్టుదురేమోనని భయపడ్డాను. తాము ఆ ఉద్యమాలకు అనుకూలుడునేనని చెప్పారు. దానితో నా మనస్సు కుదుటపడినది స్థానిక బ్రాహ్మణ పండితులు మాపై శత్రుభావము పూనటం వల్ల ఆంజనేయులుగారి దృష్టి అపుడే మనసులో తలెత్తిన బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమము వైపు మళ్లినది నాకు మాత్రం ఆ ఉద్యమం పట్ల మోజు కలుగలేదు సాంఘిక సమానత్వానికి అనుకూలమని కులవ్యవస్థకు వ్యతిరేకముగా కృషి చేసినవారు స్వయముగా బ్రాహ్మణుడే కదా. అందువలన బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమము సమర్ధనీయము కాదని నా తలంపు మరి సర్వవర్ణ సమానత్వాన్ని ఇంతగా వ్యతిరేకిస్తున్న బ్రాహ్మణులు రాజకీయ అధికారపు పంపిణీలో మాత్రము మనలను చిన్నచూపు చూడరా అని సందేహము. మా సందేహాలను బలపరచేందుకా అన్నట్లు కొందరు రాజకీయ ప్రబుద్ధులు విద్యార్హతలు ఉన్నవారికే ఓటింగ్ హక్కు అన్న సూత్రాన్ని ప్రవచించారు రైతులోకములో ఎందరు చదవరులున్నారు!' అత్యధిక సంఖ్యాకులకు ఓట్ల అర్హత ఉండదని కాని వారు అందరు ఎన్నికలలో సున్నలేనా? ఏమిటి వైపరీత్యము, పరిస్థితులు క్లిష్టంగా మారడం మొదలయ్యాయి.

ఈ విషయాలను కూలంకషముగా తెలిసికోవడానికి అధ్యయనము చేయడానికి మదరాసు నుండి వచ్చే "జస్టిస్" అనుదిన పత్రికను, బొంబాయి నుండి వచ్చే "రైతు" అన్న వార పత్రికను తెప్పించటం మొదలెట్టాము. ఈ రెండూ బ్రాహ్మణ వ్యతిరేక పత్రికలే. అనిబిసెంట్‌గారి "న్యూ ఇండియా" కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి "ఆంధ్రపత్రిక" అప్పటికే మాకు వస్తున్నాయి. బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమ నాయకుడు డాక్టర్ టి.యమ్. నాయర్ ముమ్మూర్తులా వీరేశలింగం పంతులుగారి వంటి సంస్కర్తయే కాని బ్రిటీష్ అనుకూలుడు కాదని నాకు ఎవరో చెప్పారు. అప్పటి నుండి "నాయర్‌గారి" వ్యాసాలను అధ్యయనం చేయడం ఆరంభించాను.

ఫ్యాక్టరీ కార్మికులను యజమానుల దోపిడి నుండి కాపాడేనిమిత్తం నాయర్ బ్రిటీష్ పెట్టుబడిదారులతో, బొంబాయి పారిశ్రామికులతో సాగించిన సాహసోపేతమైన పోరాటాలు నన్ను ఎంతగానో ఉత్సాహపరిచాయి సరిగా అపుడే సంయుక్త పార్లమెంటరీ సంఘము ముందు వాఙ్మూలము ఇవ్వడానికి ఇంగ్లండ్‌కు వెళ్ళిన "నాయర్‌గారు" అక్కడ మరణించటం మనదేశ దౌర్భాగ్యం. నాయర్‌గారి చిత్తశుద్ధి నన్ను ఎంతగానో ప్రభావితుని చేసినది నాయర్‌గారి జీవిత చరిత్రను తెలుగులో వ్రాయడానికి పూను కొన్నాను అయితే తన జీవిత చరమదశలో అవలంభించిన రాజకీయ వైఖరితో నేను ఏకీభవించలేకపోయాను ఆ సమయములోనే నాకు ఆంజనేయులుగారికి కూడ విబేధాలు పొడచూపాయి ఆంజనేయులుగారు శుద్ధ బ్రాహ్మణ వ్యతిరేకి నేను అందుకు ఒప్పకొనను మా కుర్రమునసబ్ పి.వి. కృష్ణయ్య కూడా ఆంజనేయులు పక్షమే ఆంజనేయులు గారు సంఘములో అగ్రవర్ణాధిపత్యము సాగుతూ ఉన్నంతవరకు స్వరాజ్య ప్రాప్తి జరగబోదన్నారు. బ్రాహ్మణేతరులకు ప్రత్యేకమైన రక్షణ సౌకర్యాలు కల్పించకనే స్వరాజ్యాన్ని అంగీకరించేది ఎట్లా అని అన్నారు

ఈవిషమ పరిస్థితుల్లో 1917 విజయవాడలో బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమ నాయకులు సమావేశమయ్యారు ఆ సమావేశం తిరోగమన చర్య. అది స్వరాజ్య సాధనకు హానికరం అన్న నా వాదనతో ఆంజనేయులు గారు కూడా ఏకీభవించారు మరొక దిశలో ప్రపంచ యుద్ధం భీకరంగా సాగుతుంది బ్రిటీష్ సైన్యానికి అనుకోని ఎదురు దెబ్బలు తగిలాయి. అరేబియాలో తురుష్కుల చేతిలో బ్రిటను పరాజం న్ని చవిచూచింది ఈ స్థితిలో మనదేశాన్ని మంచి చేసుకొనటం తప్పనిసరయింది. లాయిడ్ జార్జి భారత రాజ్యాంగ సంస్కరణలపైపు దృష్టి మరల్చారు. భారతీయులు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఇక ఆమోదించబోతున్నట్లే పార్లమెంటులో మాంటేగ్ మాట్లాడాడు. మన జాతీయ వర్గాలలో కొత్త ఆశలు చిగురించాయి. ఈ నేపధ్యంలో బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం తీసుకొన్న రాజకీయ వైఖరి మాకు నచ్చిందికాదు. కాంగ్రెసు జాతీయ వాంఛకు మద్ధతును ప్రకటింపదలచి ఆంధ్ర మహాసభ విజయవాడలో సమావేశమయింది. మేము విజయవాడ చేరేసరికి ఆ మహాసభను బహిష్కరింపదలచిన బ్రాహ్మణ వ్యతిరేక నాయకుల ఏర్పాటు వాదం మాకు ప్రత్యక్షమయినది. నేనూ ఆంజనేయులుగారు వారితో

చేరడానికి ఇష్టపడలేదు భారతజాతియాకాంక్షలకు బద్ధులమై వుండాలని నిర్ణయించుకొన్నాము. తర్వాత కొద్దికాలానికే త్రిపురనేనివారి అధ్యక్షతన జరిగిన జాతీయ వాదానుకూల బ్రహ్మణేతర మహాసభలో పాల్గొనడానికి మాత్రం మాకెలాంటి అభ్యంతరము లేకపోయింది

జాతీయ పరిణామాలు అన్ని సందార్భాలలోను జాతీయ ప్రయోజనాలతో ముడిపడి వుంటాయని చెప్పలేము ౧౯౧౮-౨౦లలో జరిగిన పరిణామాలు ఇందుకు తార్కాణాలు బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమ నాయకులు చేస్తున్న బెదరింపులు కాని వారు ఆశిస్తున్న రాజకీయ ప్రయోజనాలుగాని బారిష్టర్ రామస్వామి చౌదరిగారికి రుచించలేదు. వారొక సమన్వయ మార్గాన్ని అన్వేషిస్తున్నారు. ఇంతలో దురదృష్టవశాత్తు కృష్ణా, గుంటూరు మండల బ్రాహ్మణపండితులు చౌదరి గారిపై సమరభేరి మ్రోగించారు ఆయన తమ శాస్త్రోక్తమైన ఆధిపత్యానికి ఎసరు పెట్టాడనే కసితో దారుణమైన వ్యక్తిగత దూషణలతో బారిష్టరుగారి ఆలోచనలు పెడత్రోవ పట్టాయి. వున్న గందరగోళం చాలదన్నట్లు కృష్ణ, గుంటూరు మండలాలు కమ్మ, తెలగ, రెడ్డి మున్నగు రైతు కుటుంబాలలోని విద్యావంతులను స్వామి సరస్వతి ఆకర్షించాడు. యీ రైతులందరూ క్షత్రియులని, కనుక వేదాలను పంచడానికి వారికి అధికారం కలదని ప్రచారం సాగించాడు. స్త్రీలు కూడా వేదాధ్యయనానికి యోగ్యులని అస్పృశ్యతను హిందూ శాస్త్రాలు అంగీకరించవని, కాదన్నవారు తమతో, వాదనకు రావలసిందని బ్రాహ్మణ పండితులను సవాలు చేశారు ఈ సవాలుకు జనాకర్షణ శక్తి హెచ్చింది. ఉత్తర సర్కారు జిల్లాలలో ముఖ్యంగా డెల్టా ప్రాంతాల్లో సంఘర్షణాత్మక వాతావరణం అలముకొన్నది. ప్రభుత్వం కూడా ఒక చెయ్యివేసి బ్రాహ్మణ వ్యతిరేక భావనను ఎగదోసింది. అధికారులు సైతం బ్రాహ్మణ వ్యతిరేక భావనతో, యీ ఘర్షణలల్లో తల దూర్చడం ప్రారంభించారు. యీ ప్రాంతాలలోని బ్రాహ్మణేతర యువకులు జంధ్యం వేసుకోవడం, శర్మ వర్మ వంటి మాటలు తగిలించుకోవడం, మహర్షుల గోత్రాలు ఆపాదించుకోవడం సాగించారు. మేముకూడా వారిని అనుసరించాలన్న నిర్బంధాన్ని ఎదుర్కొన్నాం. అయితే బ్రాహ్మణ సమాజంలో నాకు గల విశ్వాసం నన్నావైపు మ్రొగ్గనీయలేదు. తామొక్కరమే వేదాధ్యయనానికి అర్హులమని శూద్రులకు హరిజనులకు,

స్త్రీలకు ఆ అర్హత లేదని బ్రాహ్మణ పండితులు చేసే మొండివాదను చొదలిగారికి మనస్తాపం కలిగించినది. సంఘసంస్కరణాభిలాషతో వున్న నేను, ఆంజనేయులు గారికి, రామస్వామిగారి పక్షమే అయితే శంభుకుడు తమ ఆధ్యాత్మిక ఆధిపత్యాన్ని ఉల్లంఘిస్తానని బెదిరించినందువల్లనే బ్రాహ్మణులు శ్రీరామ చంద్రుణ్ణి తప్పదారి పట్టించి శంభుకుణ్ణి చంపించారని రామస్వామిగారు అనేసరికి నేను ఆసిద్ధాంతాన్ని అంగీకరించలేకపోయాను తుదకు తాను శంభుకవధ జాగ్రత్తగా చదివిచూడమని ఆ పుస్తకాన్ని నాకిచ్చి వెళ్ళిపోయారు. నేనా పుస్తకాన్ని పదేపదే చదివాను. పరమదయాళువైన శ్రీరామచంద్రమూర్తి కూడా బ్రాహ్మణుల కుయుక్తులకు వశుడై చేయరాని దుర్మార్గం చేశాడని అంగీకరింపక తప్పిందికాదు మాపట్ల, బ్రాహ్మణేతర విద్యార్థులపట్ల, విద్యావంతులైన రైతులపట్ల, స్థానిక బ్రాహ్మణుల్లో తీవ్రమైన అసహనం నెలకొన్నది. మా పట్ల మా హైస్కూలులో నాటివరకు కనిపించిన సమరసభావం మాయమై ద్వేషాగ్ని రగుల్కొన్నది. బ్రాహ్మణేతరులలో నేను మెట్రిక్ చదువుతున్న ప్రముఖ విద్యార్థిని కనుక వారలందరి కోపోద్రిక్తులకు గురికాక తప్పలేదు. వారి ఆగ్రహావేశాలకు మంగమ్మగారు జంకింది నాకు యే హాని జరగరాదని వెయ్యిదేవుళ్ళకు మ్రొక్కింది. బ్రాహ్మణ యాచకులను భక్తితో ఆదరించింది

మరొక దిశలో బ్రాహ్మణుడే అయిన వెంకయ్య మాష్టరుగారు ఆంజనేయులు గారు మనదేశ సంప్రదాయక తాత్వికభావాలను నేను సంత రించుకోవడంలో సాయపడ్డారు. గ్రామీణుల మూఢనమ్మకాల్లో చెట్టు, పుట్టలను పూజించే ఉత్సవాలలో నేను ఆసక్తితో పాల్గొనేవాడిని. ఆ ఉత్సవాల్లో, కొలువుల్లో హరిజనులే పూజార్లుగా నిలవడం, శూద్రులందరు తరతమ భేదాలు లేకుండా ఆ జాతరలో కలసి పోవడం చూచి నేను పెక్కు విషయాలు గ్రహించాను. శాస్త్రీయ సంప్రదాయాల్లో తదుచితమైన కర్మకాండ జరిపేది. రక్తతర్పణ మొనర్చేజంతువులను, వికటాట్టహాసాలతో సాగే ఊరేగింపులను వీరేశలింగం గారు తీవ్రంగా ఖండించారు. శైవులు, వైష్ణవులు తమ తమ ఆధిపత్యాల కోసం ఒకరిపై ఒకరు కత్తులు దూస్తూ చేసే ప్రతాపాలను నేను విన్నాను. విగ్రహారాధనను, శ్రీకృష్ణ భగవానుని దూషిస్తూ క్రైస్తవ మిషనరీలు చేసిన ప్రసంగాలు సైతం విన్నాను. నిజానికి సుందరకాండ్లైన

శ్రీకృష్ణభగవానుని కీర్తిస్తూ పోతన చిందించిన కవితా మకరందాన్ని అప్పటికే రుచి మరిగాను మానవతనంతటినీ సలీనం చేసుకోవాలని, కళ్యాణ దృష్టితో సాగిన శ్రీకృష్ణుని లీలావినోదాలకు ముగ్ధుడనయ్యాను నేను భగవద్గీతను గౌరవము కొద్దీ చదివాను కాని ఆ పరమార్థము నాకు తలకెక్కింది కాదు అప్పుడు నా వయస్సు అందుకు చాలివుండకపోవచ్చు తుదకు భారతదేశపు తత్వ శాస్త్రసారాన్ని అవగాహన చేసుకోవడానికి నాకు వీరేశలింగంగారి భోధనలే శరణ్యమయ్యాయి

పడుచుమదనంలో వున్న రంగా, ఆరోజుల్లో సంక్లిష్టమైన యీ తాత్విక విషయాలతో, వివాదాలతో ఎందుకు తలమునకలు కావలసివచ్చిందని ఆశ్చర్యమూ కలగవచ్చు భారతదేశపు, ప్రత్యేకంగా ఈ శతాబ్దపు మొదటి రెండు దశాబ్దాలు, ఆమాటకొస్తే ఇవాళ్టికి కూడ ప్రత్యేకమైన లక్షణం సరిగ్గా ఇదే బిచ్చగాళ్ళు, గాయకులు, మత సన్యాసులు, సాంఘిక ఏకపాత్రాభినయం చేసేవారు, పూజారులు, సంచార భిక్షువులు, చివరికి అసంఖ్యాకమైన కవులు, రచయితలు వంటి భారతీయ గ్రామాలలో గాని, పట్టణంలో గాని కనబడే ప్రతివ్యక్తీ మత, తత్వశాస్త్ర పరిభాషలోనే ఎక్కువగా మాట్లాడతాడు, పాడతాడు, ఆలోచిస్తాడు, చర్చిస్తాడు, విమర్శిస్తాడు అమెరికాలో మతాధిపతులు తమ ప్రతీకల్నీ, ఉదాహరణల్నీ వ్యాపారం నుంచి, పరిశ్రమ నుంచి ఎంచుకోగా, భారతదేశంలో ప్రతి ఒక్కరూ మన మహాకావ్యాల నుంచి ఉదాహరణల్నీ ప్రేరణను, సమర్థనను తత్వశాస్త్రం నుంచి గ్రహిస్తారు. అందువల్ల నాకు అటువంటి పరిసరాలజ్ఞానం, నీతిబోధకతర్కం పూర్తిగా తెలిసి ఉండడంలో ఆశ్చర్యం లేదు. దేవుడు శ్రీ కృష్ణుడైనా, శ్రీరాముడైనా, శివుడైనా లేక ఎప్పటికప్పుడు పెరుగుతుండే వివిధ బృందాల మహానుభావులైనా, వారిపై భక్తిమార్గంలో రాసిన పద్యాలతో, పాటలతో నా జ్ఞాపకశక్తి దాదాపు నిండిపోయినది కనుక వీటి మధ్య సమ్మేళనం కోసం నేను ఆసక్తిగా వెతకడం సహజమైన విషయమే. నాకు ఆ సమ్మేళనం వివేకానందుని బోధనలలోను, రామతీర్థ బోధనలలోను లభించింది. వాళ్ళిద్దరూ కూడ వేదాంతసారమైన భావన చుట్టూ కమ్ముకున్న బురదను తిరస్కరించారు ఇద్దరూ అన్నిమతాలు ప్రజలను ఒకే లక్ష్యం వైపు నడిపించాలని కోరుకున్నామని, ఆ లక్ష్యం దేవుణ్ణి సాక్షాత్కరింపజేసుకోవడమే నని, దేవుడితో ఏకత్వం అనుభవించడమేనని అన్నారు. ప్రాచీన వేదాంత వేత్తల

మహత్తర తాత్విక అన్వేషణలయినటువంటి తత్వమని, త్వమేహామ్, అహాం బ్రహ్మాస్మి వంటి భావనలను ఇద్దరూ కూడ కొత్తగా వ్యాఖ్యానించారు వాటిని సాధారణ ప్రజల అవగాహనా పరిధిలోకి తీసుకువచ్చారు మతంలో జ్ఞానానికి గాని, అవకాశాలకు గాని ఎవరికీ ఆధిపత్యం లేదని, తత్వశాస్త్ర చర్చలోకూడా ఏ కులానికీ ఆధిపత్యం లేదని ఇద్దరూ తిరస్కరించారు దేవుడు ఒకడేనని, ఆ దేవుడు విశ్వవ్యాపకుడని ఆయన అత్యున్నత ప్రేమ స్వభావమని ప్రజలందరూ చైతన్యయుతంగా గుర్తించేలా చేయడంలో విఫలమైన పూజారులు, తత్వవేత్తలు పూర్తిగా అభివృద్ధి చెందని మనుషులకోసం విగ్రహారాధనను, కులతత్వాన్ని జంతుబలి ఆచారాల్ని ఏర్పరచారని ఇద్దరూ గ్రహించారు. నా చుట్టూ నెలకొని, నన్ను ఉక్కిరిబిక్కిరి చేసే వైరుధ్యపూరితమైన గందరగోళమైన సాంఘిక వాతావరణాన్ని వివరించే సరైన వివరణను చిట్ట చివరికి నేను కనుక్కొగలిగానని నేను చాల ఆనందించాను. అదృష్టవశాత్తు వివేకానందుని గ్రంథాలను వావిళ్లవారు తెలుగులో ప్రచురించారు. స్వామి రామతీర్థ ఉపన్యాస సంపుటాలు మాత్రం ఇంగ్లీషులోనే దొరికాయి. రామతీర్థ శైలిసరళంగా, ధారాళంగా సాగుతుంది వారి సందేశం తర్కబద్ధంగా ఉద్విగ్న భరితంగా ఒప్పుతుంది. వారి ఉపన్యాసాలను తెలుగులోకి అనువదించాలని ఉత్సాహించాను ఆంజనేయులుగారు నన్ను అందుకు ప్రోత్సహించారు. 1920లో 200 పుటలు తెనిగించాను అందులో కొన్ని భాగాలు తెలుగు వారపత్రిక "సమదర్శిని" లో ప్రచురితాలు మిగిలిన అధ్యాయాలు 1922 "స్వరాజ్య" లో ప్రకటితాలు నాలో రేగిన ఈ విజ్ఞాన తృష్ణ, ఆత్మ నిగ్రహానికి, నియమబద్ధ జీవనానికి కారణమై నన్ను కాపాడినది.

1919లో ఇటువంటి ఉద్విగ్న సన్నివేశమే మరొకటి నాకెదురయినది. "చరిత్రకెక్కిన మహాత్ముల" జీవితచరిత్రలతో వీరేశలింగంగారు కూర్చిన గ్రంథ మొకటి నేను చదివాను. దీనితో కాకతీయ సామ్రాజ్ఞి రాణి "రుద్రమదేవి" జీవిత చరిత్ర వ్రాయాలనే అభిలాష కలిగింది. ఆమె 35 సంవత్సరాలు రాజ్యం చేసింది అంతర్జాతీయ వాణిజ్యాన్ని అభివృద్ధి పరచింది. విదేశీయాత్రికుడు "మార్కోపోలో " ఆమె రాజ్యపాలనను గూర్చి ఎంతగానో ప్రశంసించాడు. వీరేశలింగంగారి గ్రంథంలో "విక్టోరియా మహారాణి ", " సెయింట్ జోన్ " (జోన్ ఆఫ్ ఆర్క్), "ఫ్లారెన్సు నైటింగేల్ "ల చరిత్రలు చదివాను. చిలుకూరి

వీరభద్రరావుగారి "ఆంధ్రుల చరిత్ర" ఆధారంగా చూస్తే రుద్రమదేవి మహత్తర వ్యక్తిత్వంగల వీరనారీశిరోమణి ఆమె నావలె కర్షక జాతులకు చెందిన నలుగురు రాకుమారులకు తన నలుగురు కూతుళ్ళనిచ్చి వారి నెల్లరను నేక మొనర్చిన రాజనీతిజ్ఞురాలు ఆమె బ్రిటీష్ మహారాణి ఎలిజబెత్‌నకు సరితూగు ప్రాజ్ఞురాలు ఈ ఆరాధనా భావంతో పులకితుడనై, రాణిరుద్రమ జీవిత రచనకు ఉపక్రమించాను । ౨ । ౨ తుదకు ఆ రచన ముగించి మా గ్రామస్తు పలువురచేర్చి వినిపించాను. వారి మెచ్చుకోలునకు మేరలేదు. ఆనందపార వశ్యమున తన్మయుడనైతిని "ఆంధ్రపత్రిక ","న్యూ ఇండియా", మున్నగు జాతీయ వాద పత్రికలను శ్రద్ధగా పరికిస్తూ, అంతర్జాతీయ రాజకీయ పరిణామాలను గ్రహిస్తున్నాను. వారొక ప్రక్క మహాత్మాగాంధి, తిలక్, అనీబీసెంట్ వంటి జాతీయనేతల ఉద్వేగభరిత ప్రసంగాలను గమనిస్తున్నాం, భారతీయులు బేషరతుగా సాయపడితే యుద్ధం ముగిసినంతనే బ్రిటీష్ పాలితులకు స్వరాజ్యం ప్రసాదిస్తారని నమ్మి, గాంధీ మహాత్ముడు సైనిక సమీకరణకు ఆమోదించాడు ఈ అదనులో పి వి. కృష్ణయ్య హరిజనులను సైన్యంలో చేర్చడానికి సిద్ధపడ్డాడు మేము అందుకు అభ్యంతరం చెప్పలేదు యుద్ధ సమావేశములో లార్డు హార్డింజ్‌తో "స్వరాజ్యాన్ని ఇస్తామని వాగ్దానం చేస్తేనే మీకు మా సహకారమని తిలక్ బల్లగుద్ది చెప్పినట్లు చదివి గర్వపడ్డాము. గాంధీ మహాత్ముడు తన పై చంపరాన్ మేజిస్ట్రేట్ విధించిన నిషేధాజ్ఞలను ధిక్కరించినప్పుడు మా రక్తం ఉడుకెత్తిపోయింది. అహమ్మదాబాదు మిల్లు యజమానులపై సమ్మెకు దిగిన కార్మికుల కోర్కెలనంగీకరింపజేయడానికి మహాత్ముడు నిరహారదీక్షకు దిగినప్పుడు భారత గగనతలంలో నూతన తారవెలసిందని ఉప్పొంగి పోయాము కైరావాసులను కరువు రక్కసి నుండి కాపాడడానికి గాంధీజీ చేసిన కృషి, ప్రభుత్వాన్ని ప్రతిఘటించి సాధించిన విజయం మాకు విస్మయం కలిగించాయి ఒక వేసవి సాయం సమయంలో మేమందరమూ, మా తోటలో చేరినప్పడు మా నాన్నగారు కూడ కైరా కర్షకుల పోరాట పటిమను కొనియాడారు. మహాత్ముడు రైతుల పాలిట దేవుడని శ్లాఘించాడు. నేను సైతం కష్టజీవుల ప్రయోజనాలు గాంధీ మహాత్మునిచేతిలో సురక్షితంగా మనగలవని విశ్వసించాను. రైతుల క్షేమం మనజాతీయోద్యమ విజయంతో ముడిపడి యున్నదని గుర్తించాను. శ్రీ మాంటేగ్‌నకు సమర్పించే

నిమిత్తం రూపొందించిన కాంగ్రెసు ప్రణాళికపై దేశభక్తుల సంతకాలు సేకరించవలసిందిగా గాంధీ మహాత్ముడు పిలుపునిచ్చాడు గ్రంధాల యోద్యమంలో నాతో పాటు పనిచేసి యువకులు, పెద్దలు, అందరు యీ పిలుపును పత్రికలలో చదివారు. మేమప్పటికే జాతీయోద్యమ దిశగా పయనిస్తున్నాము గనుక యీ సంతకాల సేకరణ చేపట్టాలని నిశ్చయించుకొన్నాము. ఈ ప్రచార కార్య క్రమానికి కొంతడబ్బు కావలసి వచ్చింది మానాన్నగారిని అడిగాను తన సంతకం ఆ ప్రకటన మీద మొదటిగా వుండాలని షరతు పెట్టారు అట్లాగే జరిగింది. ఇక మేము పలు గ్రామాలు పర్యటించి ఎందరినో కలసి వందలాది సంతకాలు వేలిముద్రలను సేకరించాము ఆ కాంగ్రెసు ప్రణాళికా పాఠాన్ని ఆంధ్రపత్రిక నుండి సంతరించాము. మా కృషిని గూర్చి వార్తా పత్రికలకెక్కలేదు ఆ రోజులలో పత్రికారంగం యింతగా విస్తరించలేదు. పోలీసులు మాత్రం మమ్మల్ని ఒక కంట కనిపెడుతూనే వున్నారు. అయినా ఆ వైపు నుండి అవాంఛనీయ పరిణామాలేవీ చోటు చేసుకోలేదు. ఆ విధంగా గాంధీజీ సందేశం నలుమూలలా వ్యాపించింది భారతమాత దాస్య శృంఖలాల విచ్ఛేదనానికి యువకులు అనుపమాన త్యాగాలకు సిద్ధపడ్డారు 70యేళ్ళనాటి పాత జ్ఞాపకాలు నేటికీ నా రక్తాన్ని ఉడికిస్తున్నాయి ఆనాటి మా నాన్నగారి తొలి సంతకం ఆ తదుపరి కాలంలోనే సాధించిన పోరాట విజయాలకు ఆశీర్వాద సూచకమా అనిపిస్తుంది

1910లో మా మేనమామ రామస్వామి గారు నాకై ప్యాంటు షర్టు తెచ్చి ఇంగ్లీషువారి వేషములో నాకు పరిచయము కలిగించారు. పి.వి.కృష్ణయ్యగారు జమీందారుల మాదిరి బంగారు మలాము చేసిన టోపీ పెట్టుకొనేవారు. మా మేనమామ గారు నాకు అటువంటి టోపి ఒకటి తెచ్చి ఇచ్చారు. అయితే ఆత్మాభిమానముగల మా అమ్మ ఆ టోపీని చీదరించుకొన్నది. ఈ సోమరి వేషాలు మాని మాతాత తండ్రులు కట్టును పాటించమని కేకలేసినది. తర్వాతకాలములో ఎన్నెన్నో. క్రొత్త చారలు చొక్కా గుడ్డలు కొని మా అక్క నాకై క్రొత్త ఫ్యాషన్ షర్టులు కుట్టించినది. పి.వి.సుబ్బయ్య గారింట్లో ఇంగ్లీషు పద్ధతులు అమర్చిన డ్రాయింగ్ రూము, తివాచీలు, సోఫాలు, అద్దాలు మొదలగు అలంకారములను నేను చూడకపోలేదు కాని నేను జాతీయ

ఉద్యమానికి అంకితమయినందుకు మా ఇంట్లో ఆ పటాటోపాలకు చోటు ఇవ్వలేదు నేను గాంధీ మహాత్ముని నమ్మినవాడను వెంకయ్య మాష్టారు గారి శిష్యుడను వారి వలె సాదాగా సరళంగా జీవించాలని కోరుకొన్నాను స్వదేశీ వస్తువులనే వినియోగించడం ద్వారా రాబోయే స్వదేశీ ఉద్యమానికి ముందుగానే స్వయం శిక్షుతుడనయినాను

మా నిడుబ్రోలులో పెద్ద సంఖ్యలో పద్మసాలీలు, కుమ్మరులు, కంసాలులు, వడ్రంగులు ఆయా వృత్తులలో జీవిస్తుండేవారు. మా అమ్మమ్మ రోజూ తన రాట్నంపై నియమంగా నూలు వడికేది మా అమ్మ మరణంతో ఆ రాట్నం మచ్చుకెక్కినది మేము ప్రత్తి పండించే వాళ్ళము కూడ. తాను ఒడికిన ముడినూలును మా అమ్మమ్మ నేత పనివారికిచ్చి కావలసిన చీరలను, ధోవతులను నేయించేది మూరనేతకి ఇంత అని మజూరి చెల్లించేది. చేతివృత్తులంటే నాకు చెప్పరాని ఆసక్తి. ఆ సాలీల ఇళ్ళలో పిల్లలతో పాటే భోజనం. కొన్నిసార్లు మా అమ్మ కన్నుగప్పి నేత మగ్గము గోతిలో దిగేవాడిని బడి తప్పించుకొనేటందుకు ఇదొక ఎత్తు అయినా మా అమ్మ నన్ను పట్టి శిక్షింపక వదిలేది కాదు ఆసాలెవారి సాహచర్యము అదొక విధమైన విజ్ఞానము అని ఆ తల్లికి అంతుపట్టలేదు నాకు ప్రాణప్రదులైన నేతగాండ్రలోని వాడే గోలి బసవయ్య ఇప్పటికీ నాకు యితడు మంచి మిత్రుడు అంతేగాక 1925 లోనే స్థాపించిన చేనేత కాంగ్రెసున కితడు నాయకుడు కుమ్మరులు వారి ఆము, కమ్మరులు వారి కొలిమి, కంసాలులూ వారి కుంపటి, వడ్రంగులు వారి బాడిస, మాదిగలు వారి ఆరె ఈ పనిముట్లన్నీ నాకు చిరపరచితాలే ఎవరెవరి వద్ద ఎంతకాలము గడిపానో చెప్పలేను. కాని వారు అందరూ నాకు కుమ్మరి మిత్రులే. గుట్టు చప్పడు కాకుండా వారికి వుప్పలూ, కూరగాయలు, పిండివంటలూ చేరవేస్తూండేవాడిని మా అమ్మమ్మ చూచి చూడనట్లు ఉండి సంతోషించేది. వాళ్ళంటే నాకు అంత ప్రీతి. గ్రామీణ చేతి వృత్తుల్ని పునరుజ్జీవింప చేయుడని గాంధీ మహాత్ముడు 1917 లో చాటి చెప్పినపుడు నా హృదయం పల్లవించినది. నాకు నా పట్ల నాకున్న సంఘసేవానురక్తి పట్ల విశ్వాసము బలపడినది. నేను ఇక ఆ హస్త కళాకారులను చేరి మహాత్ముని సందేశాలను వారికి వినిపించాను. స్వతంత్ర భారతములో ఉజ్జ్వల భవిష్యత్తు వారికై కాచుకొని ఉన్నదని నొక్కి చెప్పాను. ఈ అంశాలపై మహాత్ముడు చేసే ప్రసంగాలు

మంగమ్మగారికి వినిపించేవాడిని ఆమె సంతోషించేది గాంధీ మార్గము గ్రామ కళ్యాణానికి రాజమార్గమని ఆమెకు క్రమంగా అర్థమయినది. పుడమి తల్లికి ఎడంకాని బాటన నేను నడుస్తున్నందుకు ముచ్చటపడేది.

నేను ఆ విధముగా జాతీయ సమరయోధునిగా, సంఘ సంస్కర్తగా రూపొందుతూ నా సోదరులు వెంకటప్పయ్య, లక్ష్మీనారాయణ కూడా నా వలె చదువుకోవాలని జాతీయ ఉద్యమములో పాలు పంచుకోవాలని ఆశిస్తూ వారి విషయములో తగిన శ్రద్ధ వహించాను. గ్రంథాలయోద్యమములో వయోజన విద్యలో సంఘసేవలో నా తమ్ములు నాకు సహచరులుగా ఉన్నారు. వెంకటప్పయ్యను హైస్కూలులో చేర్చబోతున్నప్పుడు మంగమ్మగారు మళ్ళీ అడ్డుపడ్డారు. ఒకరైతు కుటుంబానికి ఒక ఇంగ్లీషు తెలిసిన వ్యక్తి వుంటే చాలదా అని ఆమె అన్నారు. "మనకి చాలినంత భూమి ఉంది. ప్రభుత్వ ఉద్యోగంలో చేరి మరొకరి క్రింద పనిచేయవలసిన అవసరం లేదు. తన మనుమలలో ఎవరయినా ఒకరి క్రింద ఉద్యోగులుగా మారారంటే మానాన్న రమణయ్యగారి ఆత్మ ఎంత క్షోభిస్తుందో" అంటూ ఆమె వాపోయారు. ఇంగ్లీషు నేర్చుకొన్నంత మాత్రాన మేము ఉద్యోగాలలో చేరబోమని నేను ఆమెకు నచ్చజెప్పాను ఇక లక్ష్మీనారాయణగారి వంతు వచ్చేసరికి నేనే కుటుంబ వ్యవహారాలు చక్కదిద్దుతున్నాను. గనుక ఆ యిబ్బంది కలుగలేదు. నేను పొరుగున ఉన్న వందలాది మంది బాలుర దృష్టిలో మాదిరి వీరి దృష్టిలో కూడ మంచి మార్గదర్శిని, స్నేహితుడిని వాళ్ళు ఆదర్శ విద్యార్థులుగా పైకి రావాలనే తపనతో ఎక్కువ కష్టపడేవాడినేమో కూడ నేను ప్రారంభించిన అన్ని ఉద్యమాలలో నాకు చేదోడు వాదోడుగా ఉన్నారు. అయితే ఈ విషయములో బాగా చెప్పుకో దగ్గవారు మరొక్కరు నా పెద్ద తమ్ముడు వెంకటప్పయ్య మెట్రిక్‌లేషన్‌తో తన చదువును ముగించవలసి వచ్చింది మా మేనమామ మా నాన్నగారు మరణించిన తరువాత వారి వ్యవహారాలన్నీ వెంకటప్పయ్యే చూడవలసి వచ్చింది. అయినప్పటికి అతడు వివేకానందుని గ్రంథాలను, రామతీర్థ రచనలను చదవడం మానలేదు అంతేకాదు మా గ్రామములో వివేకానందుడి విగ్రహాన్ని ప్రతిష్ఠించగలిగాడు. ఇక చిన్నతమ్ముడు లక్ష్మీనారాయణ ప్రథమ శ్రేణిలో ఎమ్. ఎ. ప్యాసయి న్యాయవాద వృత్తిని స్వీకరించాడు. అయితే నా ప్రజాసేవా కార్యక్రమాల్లో తోడ్పడటానికి లక్ష్మీనారాయణ ౧౯౩౮లో న్యాయవాద వృత్తికి తిలోదకాలు ఇచ్చాడు.

తొలుత మాధ్యమిక పాఠశాలగానున్న ఇప్పటి ఉన్నత పాఠశాల ఆదిలో పొన్నూరులో ఉండేది పొన్నూరు, వడ్డె ముక్కల గ్రామాలకు చెందిన సేవా తత్పరులు అయిన బ్రాహ్మణులు కొందరు దాని స్థాపకులు వారిలో ప్రముఖ న్యాయవాదులు భావనాచారిగారు ఈ పాఠశాల నిర్వహణా సమితికి అధ్యక్షులు శ్రీ పట్టయ్యగారు ఐదు ఎకరాల మాగాణి భూమిని పాఠశాలకు దానం చేశారు నేను మూడవ ఫారమ్‌లో ఉన్నప్పడు పాఠశాలను ఉన్నత పాఠశాలగా అభివృద్ధి చేసేందుకు అనుమతి లభించింది ఏటేటా ఒక్కొక్క పై తరగతి కలుపుతూ పాఠశాల స్థాయిని పెంచాలన్నారు అందువల్ల నేను ఒక ఫారమ్ పూర్తిచేసేసరికి నన్ను చేర్చుకోవడానికి మరొక ఫారమ్ సిద్ధంగా ఉండేది ఆ విధముగా ఆ పాఠశాల నుండి మెట్రిక్‌లేషన్ పబ్లిక్ పరీక్ష వ్రాసి ప్యాసయిన మొదటి జట్టు 5 గురు విద్యార్థులలో నేను కూడ ఒకడను ఈ సంస్థ పట్ల నాకు వల్ల మాలిన అభిమానము ఉండటానికి అదే కారణము

ఈ పాఠశాలను ఉన్నత పాఠశాలగా అభివృద్ధి చేయాలని నిర్ణయించి నపుడు నిడుబ్రోలు వాసి ఒక బక్కరైతు కొసరాజు లక్ష్మయ్యగారు భవన నిర్మాణాన్ని చేపట్టడానికి ముందుకు వచ్చారు ఈ నూతన భవనాన్ని పెనుకటి పొన్నూరులో గాక నిడుబ్రోలు హద్దులో నిర్మించారు గనుక ఆ పాఠశాలకు మా ఊరి పేరే వచ్చినది భవన నిర్మాణ వ్యయము పదివేలు అనుకొన్నది ఇరవై వేలు అయిపోయినా లక్ష్మయ్యగారు వెనుకాడక పొలమమ్మెను

ఈ లక్ష్మయ్యగారి అసమాన త్యాగానికి అబ్బురపడిన శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు తన "పటిగ పంట" కావ్యాన్ని లక్ష్మయ్యగారికి భక్తితో అంకితమిచ్చారు. ఈ కృతి భర్త తుదకు కార్మికుడిగా మారి బాడుగ బండి తోలుకొంటూ జీవితం సాగించారు అయితే తన చరమదశలో లక్ష్మయ్యకు విలువయిన వారసత్వపు ఆస్తి ఒకటి సంక్రమించినది. తృప్తిగా జీవించి పండు ముదుసలిగా జీవనం చాలించారు ఆయన నిరక్షరాస్యుడు నిరుపేద అయినా ఆ మహత్తర త్యాగము ద్వారా మా ఉన్నత పాఠశాల ఒక శాశ్వత సంస్థగా రూపొందింది 1955లో పాఠశాలకు తగినంత విశాలమయిన ఆటస్థలము సమకూర్చేందుకుగాను పట్టయ్యగారి భూమిని కలుపుకొని అందుకు బదులుగా దేవాలయపు భూమి నొక దానిని ఆ పట్టయ్యగారికి బదలాయించేందుకు ప్రభుత్వాన్ని ఒప్పించగలిగాను.

ఆంధ్రదేశములో అతి సమర్థులైన శ్రీ ప్రసాదుగారు ఆరు సంవత్సరాలు పైగా ప్రధానోపాధ్యాయుడు మా ఉన్నత పాఠశాలను పాలించి ప్రసిద్ధికి తెచ్చారు వారు నెలకొల్పిన సాంప్రదాయాలను వారి తర్వాత వచ్చిన శ్రీ టి వి సుబ్బయ్యగారు కొనసాగిస్తున్నారు శ్రీ సుబ్బయ్యగారు రైతు కుటుంబము నుండి వచ్చినవారే ఈ ఉన్నత పాఠశాలలో చదివిన విద్యార్థులెందరో ప్రొఫెసర్లుగా, కవులుగా, పాలకులుగా, రాజకీయ నాయకులుగా, బారిస్టర్‌లుగా, డాక్టర్‌లుగా ప్రసిద్ధికెక్కారు. ప్రధానోపాధ్యాయులు శ్రీ సుబ్బయ్యగారి కుమారుడే నేడు ఐ ఎ. యస్ ఆఫీసర్‌గా మంచి స్థానములో ఉన్నారు. అతడి పేరు ప్రసాద్ ఇందరు సుప్రసిద్ధులను దేశానికి అర్పించిన ఈ పాఠశాలను చూస్తే నాకు ఎంత సంతోషమో చెప్పలేను. నేను మా తమ్ముడు వెంకటప్పయ్య యుక్తవయస్కులైనామని మా నాన్నగారు పెళ్ళి సంబంధము చూడడం మొదలెట్టారు మేము డిగ్రీ చదువులు పూర్తి చేసే వరకు పెళ్ళిళ్ళ మాట తలపెట్ట వలదని మా అక్క లక్ష్మీదేవిగారన్నారు. చివరకు మా నాన్నగారు నన్ను అడిగినపుడు నేను అయిష్టంగానే అంగీకరించాను మాచవరంలోని ఒక ప్రముఖరైతు వెలగా సుబ్బయ్యగారి గారాలపట్టి భారతీదేవి నాకు అన్ని విధాలా తగిన ఇల్లాలని శ్రీ ఆంజనేయులుగారు సూచించారు తామరపూల వంటి కళ్ళని, తమలపాకుల వంటి చెక్కిళ్ళని, ముంగురు చిందియాడే మోము అని, పసిడికి సరియగు ఛాయ అని ఆంజనేయులుగారు వధువు రూపు రేఖలు వర్ణించి చెప్పారు మాతో సంబంధానికి సుబ్బయ్యగారు సంసిద్ధులుగా ఉన్నారని చెప్పారు. అసలు ఆంజనేయులుగారి అత్తగారి ఊరుకూడ మాచవరమే నన్ను పెళ్ళి పిల్లను చూచి రమ్మన్నారు నాన్నగారు మీరు ఆంజనేయులుగారు చూచి సమ్మతిస్తే చాలునని నేను అన్నాను. వెంటనే నిశ్చితార్థం జరిగింది. అంతే పెళ్ళిమాత్రం అపుడే కాదు 1934 లో నేను ఆక్స్‌ఫర్డ్ నుండి తిరిగి వచ్చిన తరువాతనే పెళ్ళి. భారతీదేవి వర్ణనలో ఆంజనేయులు గారు చెప్పినవి అతిశయోక్తులు కాదన్నది నిజమే

నిశ్చితార్థానికి, పెళ్ళికి మధ్యకాలంలో మాచవరము రైతులతో నాకు కొన్ని అనుభవాలు ఎదురయ్యాయి [illegible] ఉన్న తమ భూములకు సకాలములో నీరు అందునట్లు భూములను [illegible] చేసే విషయములో పోరాడుతున్న మాచవరం, ములుకుదురు, చింతలపూడి రైతులకు సుబ్బయ్య

గారు నాయకత్వము వహించారు నేను వారి గ్రామాలకు వెళ్ళినపుడు వారు ఒక బ్రాహ్మణ స్నేహితునిపై ఆధారపడి ఏ ఒక్క పని సరిగా చేసికోలేని దైన్యంలో ఉండటం గమనించాను ఆ బ్రాహ్మణుడయినా పి డబ్ల్యు డి వారితో సమర్థంగా వ్యవహరింప లేకపోతున్నాడు మా కాబోయే మామగారి సలహా మేరకు నేను రైతుల పక్షాన జోక్యం కలిగించుకొని కావలసిన పిటీషన్ సిద్ధం చేశాను ఇంజనీర్లను కలిసి మాట్లాడాను రైతుల కోర్కెలు నెరవేరాయి తన కాబోయే అల్లుడు కేవలము ఒక ప్రభుత్వ నౌకరిగా మాత్రమే మిగిలి పోడని సుబ్బయ్యగారికి ధైర్యం చిక్కి సంబరపడ్డారు నేను ఇండియన్ సివిల్ సర్వీస్ పరీక్షకు వెళ్ళాలనే వాంఛ మా మామగారికి రుచించలేదు ఒక రైతు ప్రభుత్వ ఉద్యోగి అయితే ప్రమాదము ఏదీలేదని నేను ఆయనికి నచ్చజెప్పబోయాను అయినా ఎందుకు బానిస కావాలి అని గద్దించారు. "కాని మీరు కలెక్టరు వద్దకు వెళ్ళినపుడు గౌరవముగా, వినయంగా ఉంటారు కదా ? అభ్యర్థనలు సమర్పిస్తారు కదా ?" అని నేను ప్రశ్నవేశాను "అది కేవలము ఆయన బాధ్యతను ఆయన నిర్వర్తించవలెనని అడగటమే" రైతులమయిన మనమే నిజమయిన యజమానులము మనము స్వతంత్రులము" అని వారు జవాబు ఇచ్చారు". "మరి బ్రిటీష్ వాళ్ళ సంగతేమిటి ? వాళ్ళు మన పాలకులు కదా?"అని ప్రశ్నించాను." ఓహో", "వాళ్ళకంటె ముందు చాల మంది వచ్చారు పోయారు. వీళ్ళు గాడ ఒకనాటికి పోకతప్పదు" అన్నారు మొక్కవోని ధైర్యముతో మా మామగారి ఆత్మస్థైర్యము నన్ను ఆశ్చర్యపరచింది.

ఇప్పటి విద్యార్థులకున్నట్లు చారిత్రక, సాంస్కృతిక ప్రాధాన్యంగల వివిధ ప్రాంతాలకు విద్యాయాత్రలు జరిపే సౌకర్యం మా రోజులలో లేదు. ।౨।౨ క్రిస్మస్ సమయములో నేను మద్రాసుకు వెళ్ళగలిగే వరకు నేను గుంటూరు, నెల్లూరు, కృష్ణా జిల్లాల సరిహద్దులు దాటలేదు

"ఆంధ్రపత్రిక " దినపత్రికగా ప్రారంభమయినప్పటికి నుండి మన సువిశాల దేశములో ఏ ప్రాంతములో ఏం జరుగుతుందో చదువుతునే ఉన్నాను. ఈ భూ భారాన్ని మోసే ఆది సర్పము "ఆదిశేషువుకు" నిలయుమయిన మోపిదేవికి నేను రెండుసార్లు వెళ్ళాను. మొదటిసారి ఏ విషయము గుర్తుంచు కోలేనంత చిన్న వయస్సు, రెండోసారి హైస్కూలులో చదువుచున్న రోజులలో నా సోదరులతో కలసి ఆ పుణ్యస్థలానికి వెళ్ళాను కృష్ణా నది శాఖలు

రెండింటిని దాటటం సరదాగా ఉంది హఠాత్తుగా సముద్రపునీరు నటలోనికి ఎగతన్నటంతో మా ఎద్దుల బళ్ళు దాదాపు కృష్ణలో మునిగినంత పనయినది భట్టిప్రోలులో పెద్ద మట్టి దిబ్బదగ్గరకి వెళ్ళినపుడు నాకు మంచి ఉత్సాహము కలిగినది. సరిగ్గా అక్కడే ఒకపుడు మహాచక్రవర్తి అశోకుడు నిర్మించిన బౌద్ధ స్తూపము ఉండేది. దివిసీమలోని గూడవల్లి, కళ్ళేపల్లి, ప్రాంతాలలో మా పూర్వీకులు జీవించిన స్థలాలను సందర్శించాను. దివిసీమ ప్రజలు పొడగరులు అక్కడ పండిన జొన్న కంకులు మూరెడుకి మించి చిత్రంగా ఉన్నాయి. మరొకసారి మా తల్లిదండ్రులు, నన్ను, వెంకటప్పయ్యను కోటప్ప కొండకు తీసికెళ్ళారు. అప్పటికి నేను చిన్నవాడ్ని. ఇరవైమైళ్ళ పాటు సాగిన ఆ ఎడ్లబండి ప్రయాణం నాకు ఎంతో ఆసక్తికరంగా సాగినది. మా అన్నదమ్ములం ఇద్దరం పోటీలు పడి కొండపైకి పరుగులు పెట్టాం. ఆ రాతి మెట్లమీద పడిపోబోతున్న మా తమ్ముడిని సమయానికి మానాన్న కాపాడాడు. గండం గడిచినందుకు మా అమ్మ సంతోషించినది. కోటప్పకొండ తిరునాళ్ళ అమావాస్య నాడు జరుగుతుంది శివుని ప్రభను చాటె వందలాది ప్రభలు పలు ప్రాంతాల నుండి వస్తాయి. ఎత్తైన ఆకాశములోకి చొచ్చుకొని పోయినట్లుగా ఆ ప్రభలు ఉంటాయి వాటిపైన శైవమత సంబంధమైన కథల బొమ్మలు అలంకరిస్తారు సంగీత వాయిద్యాలు, సన్నాయి మేళాలు, ఎద్దుల గంటలు అన్నీ కూడా దేవుడిని కీర్తిస్తూ ధ్వనించేవి నేను విశ్వవ్యాప్తంగా విమానాలలో, ఓడలలో రైళ్ళలో ఎన్నోసార్లు ప్రయాణము చేశానుగాని ఆ నాటి మా తల్లిదండ్రులతో కలసి చేసిన కోటప్ప కొండ ప్రయాణమునకు అవి సాటిరావు బహుశా అది నేను తల్లిని ఎనిమిదోయేట, తండ్రిని ఇరవయ్యో ఏట పోగొట్టుకొని వారి ఆప్యాయతకు దూరం కావడం వల్ల కలిగిన భావం కావచ్చు. మానాన్నగారితో కలిసి నేను వెళ్ళిన మరొక పట్నం గోదావరి జిల్లాలోని ఏలూరు మా పశువులకు దాణా తెలక పిండిని కొనేందుకు ఏటా ఏలూరు వెళ్ళవలసి వచ్చేది.

అక్కడ వేరు వేరు దుస్తులలో ముస్తాబయ్యే స్త్రీలు చూడముచ్చటగా ఉండేవారు. వారికి రవికెలు వేసుకొనే అలవాటు లేదు. వాళ్ళు తలమీద రెండు, మూడు నీళ్ళకుండలు నిలుపు కొని విచిత్రంగా వీధులలో నడిచే దృశ్యం ఆశ్చర్యాన్ని కలిగించినది. కాని చుట్టలు కాల్చే వారి అలవాటు మాత్రము

దుర్భరము ఈ రోజు క్కూడ ఎంతోమంది గోదావరి కళింగ ప్రాంతాలలోని స్త్రీలు ఈ అలవాటుకి బానిసలు పాశ్చాత్య స్త్రీల సిగరెట్ కాల్చే అలవాటు నాకు నచ్చదు స్త్రీలేమిటి పురుషులయినా సరే పొగ త్రాగేవారంటే నాకు మంట అసహ్యం కూడ.

ఆ రోజులలో మాకు మార్కెట్టుగా ఉన్న పట్టణం గుంటూరు అది జిల్లా కేంద్రం కూడ పెద్దవాళ్ళమయిన మా అన్నదమ్ములిద్దరిని ఏడాదికి ఒకసారి గుంటూరుకు తీసికెళుతుండేవారు వడ్లబస్తాలు ఎత్తిన బళ్ళను మేము తోలుకు పోవలసి ఉండేది మేము భోజనము చేసి ప్రొద్దుకుంకే వేళ బళ్ళుకట్టుకొని బయలుదేరి మరునాటి ప్రొద్దుపొడిచే వేళకు గుంటూరు చేరే వాళ్ళము. మరునాడు మధ్యాహ్నము పన్నెండు గంటలకు అక్కడ వేపచెట్టుకు ప్రక్కన ఉండే హోటల్‌కు తీసికెళ్ళేవారు అప్పటికి మేము మంచి ఆకలిమీద ఉండే వాళ్ళము తరువాత కమీషన్ కొట్టు దగ్గర వాళ్ళు కట్టిన లెక్కలను సరిచూచి డబ్బులు లెక్కపెట్టినాన్నకు ఇచ్చేవాళ్ళము తిరుగు ప్రయాణములో దొంగల భయము మమ్ములను వెన్నాడేది నిజంగా ఆ ప్రయాణాలు అరుదైన అనుభవాలు

1916-17లతో ఆంజనేయులుగారు వారి స్నేహితులు చేసిన అఖిల భారత యాత్రను నా మనో నేత్రముతో పూర్తిగా దర్శించే అసాధారణ అవకాశము కలిగినది. ఆయన పూరీ, కలకత్తా, బుద్ధగయ, బెనారస్, ప్రయాగ, ఢిల్లీ, కురుక్షేత్రం, హృషికేశ్, హరిద్వార్, బొంబాయి, పండరీపూర్, హైదరాబాద్ మొదలైన అనేక స్థలాలకు వెళ్ళారు తన బృందం చూచిన ప్రతి ముఖ్యమైన స్థలము గురించి వారు నాకు ఆసక్తికరమైన విషయాలను తెలుపుతూ లేఖలు రాస్తుండేవారు ఉదాహరణకు వారణాసిలో పండాలు ఎంతటి మత విరుద్ధమైన ధనాకాంక్షకు దాసులవుతారో తెలిసికొన్నాను. ఢిల్లీపేరు గొప్పే కాని ఊరు దిబ్బ అని వ్రాశారు ఢిల్లీ నగరం నిండా సమాధులే తప్ప సజీవ సంఘటనలు లేవని వ్రాశారు. పంజాబీల గురించి వారి దేహధార్ఢ్యతను గూర్చి, వారి అద్భుత సౌందర్యమును గూర్చి, వారి ఆకర్షణీయ మైన వర్చస్సు గురించి ఎంతగానో ప్రశంసించారు బొంబాయి చేరి ఆయన పార్శీల మాయాజాలానికి లోబడి పోయాడట ఈ విధంగా భారతదేశపు సమాజ స్వరూపము నా కళ్ళకు కట్టినట్లు జాబులు వ్రాశారు ఇటువంటి యాత్రా విశేషాలు పుస్తకాలుగా రాదగ్గవి. మన రైతుల కోసం కూడ మనం

ఇటువంటి యాత్రలు ఏర్పాటు చేయాలి ఈనాటి రైతులలో ఇలాంటి ఆకాంక్షకు ప్రతిస్పందనగానే నా అనుచరులు వీరాచారి, పార్లమెంటు సభ్యుడు వి.వి రమణ కిసాన్ యాత్రా స్పెషల్ రైళ్ళను నడిపి వేలాది రైతులను 1954,57,58 లలో ఉత్తర భారతయాత్ర చేయించారు. కె వి.సుబ్బయ్య ఈ యాత్రలను "భారతదేశ సందర్శనం" అన్న గ్రంథములో ప్రతిభావంతముగా చిత్రించారు. ఆ రోజులతో పోల్చి చూస్తే అది ఎంతో అభివృద్ధి. సజీవమైన భారతదేశ సమగ్ర స్వరూపాన్ని నేను అర్థం చేసికొనేందుకు తోడ్పడిన ఆంజనేయులుగారికి సర్వదా కృతజ్ఞుడను

## మహానుభావులు, ఉత్తములు పరస్పరం ఎందుకు వ్యతిరేకించు కుంటారు ?

బాలగంగాధర తిలక్ బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకముగా రాజద్రోహ నేరంపై ఆరు సంవత్సరాలు శిక్షను అనుభవించి విడుదలై వచ్చినప్పుడు మహారాష్ట్రులు వారికి లక్షరూపాయల నిధిని బహుకరించారని "లోకమాన్య" అన్న బిరుదం ప్రదానం చేసారని చదివి నేను పులకించి పోయాను "స్వరాజ్యం నా జన్మహక్కు" అని వారు చేసిన సింహగర్జన ఉన్నత పాఠశాలల్లో చదువుతున్న మాబోటి గ్రామీణ యువకులను ఉత్తేజపరచింది. మహాత్మాగాంధీకి మార్గ దర్శకుడయిన గోపాలకృష్ణ గోఖలే వంటి మహానుభావుడు లోకమాన్య తిలక్‌ను పూనాలోకి ప్రవేశించ కుండా ఎందుకు అడ్డుకున్నాడో తెలియ దు. ప్రాథమిక విద్యా వ్యాప్తి కోసం కోటి రూపాయల వార్షిక విరాళాన్ని ఏర్పాటు చేయాలని కోరుతూ గోఖలే కేంద్ర శాసన సభలో ప్రవేశపెట్టాలని చేసిన ప్రసంగం తీర్మానం, నేను నా బాల్యంలో నిర్వహించిన నిరక్షరాస్యతా [illegible]లనా ఉద్యమానికి ఎంత ప్రోద్బలాన్ని ఇచ్చిందో నేను మరవలేను. అటువంటి మహా దేశభక్తులిద్దరూ, ఒకరిపొకరు ద్వేష భావంతో ఎందుకు వ్యతిరేకించుకొన్నారో నాకు అర్థం కాదు. ఇటువంటి కార్పణ్యాలు చరిత్రకెక్కిన మహాపురుషుల జీవితాలలో కూడ అనివార్యమని నేను రాజకీయ జీవితంలోకి ప్రవేశించిన తరువాత కాని అర్థం చేసుకోలేకపోయాను. నేను ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయానికి వెళ్ళిన కొద్ది రోజులకే, మహాత్మాగాంధీ ప్రారంభించిన సహాయ నిరాకరణ ఉద్యమాన్ని అనిబిసెంట్ వ్యతిరేకించటం ప్రారంభించింది కదా! ఒకప్పుడు తాను మహాత్ముడుగా కీర్తించిన వ్య[illegible] ను దూషించడం ప్రారంభించింది. బ్రిటీష్ వారిచే ప్రస్తుతి గాంచిన మహావక్త శ్రీనివాస

శాస్త్రిగారు కూడ వివాదాలకు లోనయ్యారు నేను మాత్రము ఉద్వేగపూరితునిగా, 1920-2లో గాంధీజీకి మద్ధతు పలకడంలో ఆక్స్‌ఫర్డ్‌లోని ఇతర విద్యార్థులతో ఏకమయ్యాను

స్వామిదయానంద సరస్వతి వ్రాసిన గొప్ప గ్రంథం "సత్యార్ధప్రణాళిక" దాని తెలుగు అనువాదము 1920లో మాకు చేరింది నేను వారి బోధనలను చదివి వారిని ఎంతో అభిమానించాను అప్పటికే నేను వీరేశలింగం గారి ప్రబోధాలతో ప్రభావితమై ఉన్నాను కనుక కుల వ్యవస్థ పైన ఆయన విమర్శలను అంగీకరించగలిగాను వేదాలు కూడ దైవదత్తమైన ఇతర పవిత్రగ్రంధాల వంటివేనన్న ఆయన అభిప్రాయాన్ని మాత్రం నేను అంగీకరించలేకపోయాను

నా నమ్మకాలకూ, ఆచరణకూ మధ్య సమన్వయం లోపిస్తే నేను సంతోషంగా ఉండలేను ఇటువంటి లక్షణమే బాపూజీలో కూడ ఉండేదని తర్వాతి సంవత్సరాల్లో గుర్తించినప్పుడు నేను సంతోషించాను. నిజంగా భారతీయ ఋషులు తత్వవేత్తలు ఎల్లప్పుడూ మనోవాక్కాయ కర్మల సారూప్యతనే ప్రబోధించారు వాస్తవానికి పద్నాలుగు సంవత్సరాల చిరుతప్రాయంలో నేను ఏ విషయంలో ఏ నిర్దారణకు వచ్చానో దాన్ని ఆచరించడానికి ఉత్సాహపడ్డాను, కులవ్యవస్థకు, అస్పృశ్యతకు, వ్యతిరేకంగా వీరేశలింగం గారి వలన ఉత్తేజితుణ్ణి కాగానే, విభిన్న కులాలకు చెందిన మిత్రులతో, యువకులతో కలివిడిగా తిరగడం ప్రారంభించాను. అదే విధముగా వీరేశలింగం గారు, దయానందుడు, విగ్రహారాధన, జంతుబలులు అనాగరికమయినవని చేసిన బోధనలు నన్ను ఎంతగానో ఆకర్షించునవి. ఆ తరువాత మా గ్రామాలలో అటువంటి అనాగరిక ఆచారాలను వ్యతిరేకించ సాగాను. 1933లో రవీంద్రుని గోరా చదివినప్పుడు, 1916-20ల మధ్యకాలంలో నా వంటి గ్రామీణ యువకులు అనుభవించిన మానసిక, నైతిక సంఘర్షణలను, ఆ నవలలో రవీంద్రనాథ్ ఠాగూర్ ఎంతగా వాస్తవికంగా చిత్రించాడో నేను గుర్తించాను

## నా విద్యార్థి జీవితంలోకి అమెరికా వచ్చిన తీరు

నేను మా గ్రామీణ పాఠశాలలో ఉన్నప్పుడే గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు [illegible] సిన అబ్రహాం లింకన్ జీవిత చరిత్రను చదివే భాగ్యం కలిగింది

కాని దాన్ని మరోసారి చదివే వరకు, అంటే రాజకీయాలలో తలమునకలయ్యే వరకు దాని సారాన్ని నేను అర్థం చేసుకున్నానని చెప్పలేను. ప్లుటార్క్, బెంజిమిన్ ఫ్రాంక్లిన్‌ల జీవిత చరిత్రలు తెలుగులో చదివే అదృష్టం నాకప్పటికే కలిగింది. అమెరికన్ నీగ్రోలు తమ బానిసత్వం నుంచి లింకన్‌చే ఎలా విముక్తి చేయబడ్డారో చూసి, అస్పృశ్యత నుంచి మన పంచములను కూడ విముక్తి చేయాలని కలగన్నాను ఆ విధంగా అమెరికా సంయుక్త రాష్ట్రాలు అనే ఇంగ్లీషు భాషా ప్రజల మహత్తర దేశం మరొకటి ఉన్నదని నాకు తెలిసి వచ్చింది.

ఆ తర్వాత మొదటి ప్రపంచ యుద్ధంలో అమెరికా పాల్గొన్నది యుద్ధంలో అమెరికా తోడ్పాటును గురించి, దాని స్వేచ్ఛా ప్రియత్వాన్ని గురించి, అది జరిపిన స్వాతంత్ర సమరాన్ని గురించి ఇంగ్లండ్ వలసవాదాన్ని, సామ్రాజ్యవాదాన్ని అమెరికా ప్రజలు వ్యతిరేకించిన తీరు గురించి పత్రికల నిండా వార్తలు రావడం మొదలైంది. కొద్దిరోజులలోనే అధ్యక్షుడు ఉడ్రో విల్సన్ చేసిన ఉత్తేజకరమైన ప్రసంగాలు వచ్చాయి సమస్త జాతులకు స్వయం నిర్ణయాధికారం కావాలనీ, ఒకజాతిపై మరొక జాతి సాగించే ఆధిపత్యం చెల్లదనీ చెప్పే ఆ సందేశాలు, భారతీయ నాయకుల ప్రగాఢవాంఛలకు అద్దం పడుతున్నాయి విల్సన్ ప్రకటించిన ప్రముఖమైన పద్నాలుగు అంశాల కార్యక్రమాన్ని చూచి భారతదేశం సంతోషంతో పులకించింది మొట్టమొదటి భారతీయ చీఫ్ జస్టిస్ సర్ సుబ్రహ్మణ్య అయ్యర్ ఉడ్రో విల్సన్ తెల్పిన సదాశయాలు భారతదేశానికి కూడ వర్తించాలనీ భారతదేశం కూడ స్వయం నిర్ణయాధికారం సాధించుకునేందుకు అమెరికా [illegible]యుపడా[illegible]నీ విజ్ఞప్తి చేశారు ఈ విజ్ఞప్తి అధ్యక్షుడు విల్సన్ దృష్టికి వచ్చిరాకముందే బ్రిటీష వారు అయ్యర్ చర్యను ఖండించారు ఆయన ఎంత ఉన్నత పదవిలో ఉన్నప్పటికీ అలా విజ్ఞప్తి చేయటం సమంజసం కాదన్నారు. బ్రిటీష్ సామ్రాజ్యపు ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోరాదని అమెరికన్ అధ్యక్షుణ్ణి హెచ్చరించారు ఈ బ్రిటీష్ దోరణి పట్ల మా అందరిలో కోపావేశం చెలరేగింది. ఒక భారత ఉన్నతోద్యోగి దుర్భరమైన బ్రిటీష్ సామ్రాజ్యవాద నిరంకుశత్వానికి వ్యతిరేకంగా గళం విప్పటం ఆనాడు ఎంతటి సాహసకార్యమో !

నానాజాతి సమితిను రూపొందిస్తున్నారని. [illegible] ఒడంబడిక పత్రంపై భారతదేశం తరుపున లార్డ్ సిన్హా, బికనీర్ మహారాజులు సంతకం చేశారని

మేం విన్నాం వారివి కుంటి సంతకాలే తప్ప, వారు భారతజాతి ప్రతినిధులే కారు అప్పటికే మేం హోంరూల్ ఉద్యమంపై ఆశలు పెట్టుకొని ఉన్నాం జాతుల స్వయం నిర్ణయాధికార భావం మాలో ప్రబలంగా వ్యాపించింది

భారతీయ సైనికులు నిర్వహించిన వీరోచితపాత్రను బ్రిటీష్‌వారు విస్తృతంగా ప్రచారం చేశారు సాధారణ భారత సైనికులు అసాధారణ వీరత్వాన్ని, స్థైర్యాన్ని, సైనిక పరిజ్ఞానాన్ని ఎట్లా ప్రదర్శించారో తద్వారా గౌరవనీయమైన విక్టోరియా క్రాస్‌ను ఎలా గెలుచుకున్నారో బాగా ప్రచారం చేశారు ఈ ప్రచారంతో మన ప్రజలు సైతం వీరత్వంలో, సైనిక నాయకత్వంలో ఎవరికీ తీసిపోరనే భావమే బలపడింది మిత్రపక్షాల విజయానికి మనం చేసిన గణనీయమైన ఈ త్యాగాలకు ప్రతిఫలంగానయినా మనకు జాతీయ స్వాతంత్ర్యం రావలసివుందన్న భావం బలపడింది

## పట్టణాలకు, గ్రామాలకు మధ్య సమన్వయంలో భేదం

ఆ విధంగా నా జీవితంలోని తొలి ఇరవై సంవత్సరాలు గ్రామ సీమల్లో నెలకొన్న ప్రశాంతత, సాంఘిక సమన్వయ వాతావరణం మధ్య గడిచాయి ఇంతకాలం గడిచిన తర్వాత ఇప్పుడు వెనుకకు తిరిగి చూస్తే ముఖ్యమైన పరిణామాలు కొన్ని కనబడసాగాయి. భారతదేశానికి, పాశ్చాత్య ప్రపంచానికి మధ్య ప్రగతిలో తేడా చాల ముఖ్యమైనది శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో నూతన ధోరణులను చేపట్టటంలో అమెరికా సంగతి ఇక చెప్పనవసరంలేదు అత్యాధునిక పరిశోధనలను, యంత్ర పరికరాలను, సాంకేతిక విధానాలను అంగీకరించడంలో ఆయా దేశాల మధ్యగల శక్తియుక్తులలో కూడ ఎంతో తేడా వుంది. ఇక ఇప్పటి గ్రామీణ భారతదేశం, పట్టణ భారతదేశం కన్న అన్ని విషయాల్లోనూ ఎంతో వెనుకబడి ఉండటం కనిపిస్తూనేవుంది మా తాలూకాలోని ఈ కుగ్రామాలకు దూరంగా ఈ సముద్రపు ఆవలి తీరంలో మరొక క్రొత్త ప్రపంచం ఉన్నదనే గుర్తింపు ఆ 1910-20 మధ్యకాలంలో నాకెంతో విస్మయాన్ని సంతోషాన్ని కలిగించిందో చెప్పలేను.

తెలుగు వార్తాపత్రికలలో వ్యక్తమవుతున్న జాతీయ వాద ధోరణులతో చైతన్యవంతులయిన ఆంజనేయులుగారు, వివేకానంద, రామతీర్థ, వీరేశలింగం గారల గ్రంథాలు సమకూర్చిన వెంకయ్యగారు లేనట్లయితే

జాతీయ ఉద్యమాల గురించి, అంతర్జాతీయ సంఘటనల గురించి నాకు ఒక్కముక్కకూడ తెలిసి వుండేది కాదు. ఇక అత్యధిక సంఖ్యాకులైన రైతుల విషయానికివస్తే వారికి జాతీయ, అంతర్జాతీయ పరిణామాల పట్ల అవగాహన తక్కువ ౧౯౨౦-౧౯౩౦ సం ఉద్యమాల సందర్భంలో మాత్రమే రైతులలో జాతీయ పోరాట స్పృహ తలయెత్తింది. నేను ఇంగ్లండ్ వెళ్ళిన కొద్ది నెలలకే ౧౯౨౧ సం లో సహాయనిరాకరణ ఉద్యమం, ఇండియాలో ప్రారంభ మయినపుడు "ఒక సంవత్సరంలోగా స్వరాజ్యం" అన్న నినాదం మార్మోగినప్పుడు నేను నా నిష్క్రియాపరతకు ఆవేదన చెందాను.

నేను నిడుబ్రోలు నుంచి బొంబాయికి బయల్దేరే రోజున యూరోపియన్ దుస్తులు ధరించాననుకుంటాను చిన్నప్పుడు కొన్నిసార్లు తప్ప, అటువంటి దుస్తుల్ని నేను ఎన్నడూ ధరించలేదు గనుక అవి ధరించడం కొంచెం ఇబ్బంది గానే ఉండేది వాస్తవానికి లండన్‌కు చేరే వరకు కూడా నాకు సరిగ్గా టై కట్టుకోవడం కుదిరేది కాదు. నేను నా పెంట్రుకల్ని చాంధస బ్రాహ్మణ పండితుల మాదిరిగా వెనుకకు ముడివేసుకునే వాణ్ణి. ఓడ ఎక్కే సందర్భంలో బొంబాయిలో ఆ పెంట్రుకలు తీసివేయవలసి వచ్చింది. వేద సాంప్రదాయాను సారం నేను శాఖాహారిగానే ఉండేవాణ్ణి కనుక ఓడమీద మాంసాహారిగా మారడం నాకు కష్టమే అయింది యూరప్‌లో శాఖాహారిగా బ్రతకడం అసాధ్యమని నేను విన్నాను నిజమే ఇప్పటి పరిస్థితి కూడ అంతే!

యూరోపియన్ జీవనానికి తగినట్లు వేషభాషలు, సాంఘిక మర్యాదలు పాటించటంలో నాకు ఎన్నో యిబ్బందులు ఎదురయ్యాయి కాఫీ, టీ, కోకోలు త్రాగడం, ఫోర్కులు, కత్తులు చేతపట్టటం మర్యాదల పేరిట [illegible] పోవటం అన్నీ నాకు క్రొత్తవే! స్త్రీలను చెల్లెళ్ళుగా భావించి గౌరవించడం నాకు తెలుసుగాని, ఈ ఇంగ్లండులో వారితో పాటు ఆడటం పాడటం నాకు ఎంతో బెరుకుగా ఉండేది.

సింధియా నావిగేషన్ కంపెనీ అనే భారతీయ సంస్థకు చెందిన ఆనాటి "ఎస్ ఎస్ లాయల్టీ"లో వందమంది యూరోపియన్లతో పాటు నా అదృష్టం కొద్దీ ౩౦౦లకు పైగా భారతీయ విద్యార్థులున్నారు కనుక యూరోపియన్ల మధ్య సాంఘిక మర్యాదలలో ఎక్కడ తప్పటడుగేస్తానో అన్న భయం

లేకపోయింది మా భారతీయ విద్యార్థులందరికీ జాతీయవాద చైతన్యం ఉండడంతో యూరోపియన్ ప్రయాణికులు దురుసుగా ప్రవర్తించలేకపోయారు.

## సర్ పి. సి. రే తో కలయిక

మాతోపాటు స్టీమరులో సర్ పి సి రే కూడ ఉండడం మా అదృష్టం వారిని గురించి రసాయనశాస్త్రంలో వారి మహత్తర పరిశోధనల గురించి, బెంగాలీ విద్యార్థులకోసం వారు చేసిన శ్రమను గురించి నాకు తెలుసు 1917-8లో మద్రాసులోని గోఖలే హాల్ ప్రారంభోత్సవ సందర్భంగావారు చేసిన మహోపన్యాసాన్ని నేను చదివాను వెంకయ్యగారు కూడ వారిని గురించి, గోపాలకృష్ణ గోఖలే గారిని గురించి ఎన్నో మంచి విషయాలు చెప్పారు అట్టి మహానుభావుడి సాహచర్యంలో మొదటి తరగతి డెక్ మీద ప్రయాణం సాగించటం నాకు గర్వకారణం నేను వారి దగ్గరికి వెళ్ళి, ఇంగ్లండ్‌లో ఎక్కడ ఏ చదువు చదవడం మంచిదని సలహా అడిగాను ముందుగా సీటు రిజర్వు లేకుండా, ఏమి చదవాలో ముందుగా నిర్ణయించుకోకుండా ఇంగ్లండుకు బయలుదేరిన నన్ను చూసి వారు ఆశ్చర్యపోయారు కాని జాతీయ సమస్యల పట్ల నాలో గల చొరవచూచి వారు నన్ను అభిమానించారు రాజారామమోహనరాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, రవీంద్రనాథ్ టాగూర్, బంకించంద్ర ఛటోపాధ్యాయులగురించి వారిని ఎన్నో ప్రశ్నలు అడిగాను వారందరి జీవిత చరిత్రలను తెలుగులో నేనప్పటికే చదివి ఉన్నాను అచ్చమైన బెంగాలీ మాదిరి వారి విజ్ఞాన శాస్త్ర విజయాలను గురించి నేను మాట్లాడినప్పుడు వారు సంతోషించారు వారితో స్నేహం కలిగింది. మేము ప్రతిరోజు కలుసుకొనేవాళ్ళం డెక్ మీద నడుస్తున్నపుడు ఎన్నో సమస్యలు ప్రస్తావనకు వచ్చేవి. వారి సాంగత్యంలో నాకు ఇంటిమీద ధ్యాస మళ్ళలేదు. సుస్తీచేయలేదు వర్షాకాలపు హిందూ మహాసముద్రం మాత్రం పర్వాతాలవంటి తరంగాలతో పరవళ్ళు త్రొక్కుతూ భీతావహంగా ఉంది.

హిందూ మహాసముద్రం భయంకరమైనది అది, అంత సంక్షుభితంగా ఉంటుందని నేనెన్నడూ ఊహించలేదు నేను మద్రాసులో చూసిన బంగాళాఖాతం ఈ హిందూ మహాసముద్రం ముందర దిగదుడుపు ఎర్ర సముద్రం మాత్రం అంత భయం కలిగించలేదు ఇక మధ్యధరా సముద్రం

ఆ సెప్టెంబర్‌లో ఉన్మత పిశాచం వలె ఉన్నది. ఆ సముద్రాల మీద మూడువారాల పాటు గడిపిన తర్వాత మేము మార్సెయిల్స్ చేరాం అక్కడ నేల మీద కాలు మోపగానే నాకు ఎంతో ఊరట కలిగింది. మార్సెయిల్స్‌లోని ప్రజలు తెల్లగా, పొట్టిగా, బొద్దుగా మెరుస్తున్న కళ్ళతో ఉన్నారు ఈ నగరం పేరు మీదుగా ఉన్న ఒక ఫ్రెంచి జాతీయ గీతం నాకు గుర్తొచ్చింది. మా కందరికీ ఒక ప్రత్యేక రైలులో పడకలు సమకూర్చారు ఆరైలు చాల వేగంగా నడిచింది మరునాడు వేకువ జామునే నేను వణుకుతూ లేచాను అక్కడ అంత చలి విశాలమైన గాజు కిటికీలతో ఆకర్షకంగా ఆకు పచ్చరంగులో ఉన్న ఆ రైలు కంపార్ట్‌మెంట్‌లో నుండి ఫ్రెంచి గ్రామీణ ప్రాంతాలు, వరుసగ ఉన్న ఆ బంగళాల చిమ్నీల నుండి లేస్తున్న ధూమతరంగాలు సెలయేళ్ళు అది మనోజ్ఞమయిన దృశ్యం.

ఆ ఫ్రెంచి స్త్రీ పురుషులు ఒకరినొకరు రైల్వేప్లాటుఫారంపై ముద్దాడు కోవటం చూసి భారతీయ విద్యార్థులు విస్తుపోయారు. మనదేశంలో అటు వంటి శృంగారం పడకగదికే పరిమితమవుతుంది గాని వీధులకెక్కదు ఇంగ్లీషు ప్రయాణికులను ఈ విషయం అడిగాం "ఆ అది ఫ్రెంచి పద్ధతిలే!" అని వాళ్ళు చప్పరించారు త్వరలోనే వడివడిగా పారే రోన్, రైన్ నదులు దాటాము. వాటిని నదులని పిలుస్తారని విని ఆశ్చర్యపోయాను అవి మా గ్రామంలోని తుంగభద్ర కాలువంతే ఉన్నాయి అయినా అవి నదులట తుదకు, ఇంగ్లీషు ఛానల్ దాటి 1920 సెప్టెంబర్‌లో ఒక రాత్రి ప్రొద్దు పోయిన తర్వాత లండన్ చేరాం. గాడ్జ్‌లోని వై ఎం సి ఎకు చెందిన షేక్స్‌పియర్ హాలుకు మమ్మల్ని తీసుకు వెళ్ళారు భారతదేశంలో లాగ పరుపులపైన పడుకోవద్దని, సంచుల లాంటి దుప్పట్ల మధ్యకు దూరి నిద్రించాలనీ, లేనట్లయితే చలికి గడ్డ కట్టుకొని పోవటం తథ్యమనీ అక్కడి కార్యదర్శి మాతో మరీ, మరీ చెప్పాడు

మర్నాడు అక్కడ విశ్వవిద్యాలయంలోను సీటు సంపాదించటం అంత సులభమైన విషయం కాదని నా దగ్గర ఉన్న ఇండియన్ మెట్రిక్యులేషన్ సర్టిఫికెట్ బ్రిటీష్ విశ్వ విద్యాలయాలలో ప్రవేశానికి చాలదని నాకు తెలిసి పోయింది ఇది నాకు పెద్ద ఆశాభంగం ! ఇంతలో ఒకగు దేవుడల్లే వచ్చి ఐ.సి ఎస్ ప్రొబేషనర్‌గా అపుడు అక్కడవున్న రామకృష్ణగారికి వైర్ ఇచ్చే ఏర్పాటు చేశారు 1918 లో ఒక సమావేశంలో నేను ఆయనను మా

గ్రామాలలో కలుసుకున్నాను వారి జవాబును బట్టి నేను ఆక్స్‌ఫర్డ్‌కు వెళ్ళి, వారిని కలిశాను ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో సీటు వస్తుందనీ ధైర్యంగా ఉండమనీ వారు నాకు భరోసా యిచ్చారు వారు నన్ను తనతోపాటు ఉంచుకొని ఆక్స్‌ఫర్డ్ ప్రవేశ పరీక్షకు నాకు వారే శిక్షణ ఇచ్చారు వారు టి బి రావుగారు కలిసి నన్ను బర్సార్ ఆఫ్ ది సేంట్ కాథరిన్ అయిన బేకర్ దగ్గరికి తీసుకువెళ్ళి ప్రవేశ పరీక్ష పాస్ కాగానే నాకు సీటు ఇస్తామనే వాగ్దానం రాబట్టారు అట్లా రామకృష్ణ, రావుగారు సాయంతో నేను నా ఆక్స్‌ఫర్డ్ విద్యార్థి జీవితం ప్రారంభించాను

## భారతదేశపు పల్లె సీమల నుండి ఇంగ్లండ్ పల్లె సీమలకు

వేంమందరమూ నగరానికి రెండుమైళ్ళ దూరంలోని బోట్లీ గ్రామానికి వెళ్ళాం మిగిలిన వాళ్ళందరూ అక్కడి ప్రాచీన వ్యవసాయ క్షేత్రమయిన ఎల్మ్స్‌ఫామ్‌లో బసచేయగా నేను మాత్రం రహదారి అవతల ఆధునిక సౌకర్యాలతో ఉన్న ఎల్మ్స్‌లాడ్జ్‌లో ఉన్నాను అది నాకు చాల వసతిగా ఉంది అట్లా అప్పడప్పడు కొన్నాళ్ళు ఆ గ్రామంలో ఉంటూ వచ్చాను ఆక్స్‌ఫర్డ్ కూడ పెద్ద నగరం కాదు కాని ఒక ఆధునిక మహా నగరంలోని సర్వ,సౌకర్యాలు అక్కడ ఉండేవి. భారతదేశంలోని ఒక మారుమూల గ్రామం నుండి సరాసరి ఇంగ్లాండుకు వెళ్ళిన నాకు, ఆ ఇంగ్లీషు గ్రామం. ఆయన బోట్లీలో నివాసం ఒక అయాచిత వరం అక్కడి పొరుగు గ్రామాలైన ఎన్‌షామ్, కమ్నర్‌లకు ఆ గ్రామీణ రహదార్లమీద రోజూ నడుస్తూండే వాడ్ని. థేమ్స్, ఇసిస్ నదులు వాటి ఉప నదులు అనేకం ఆ గ్రామీణ ప్రాంతంలో పాములలాగ మెలికలు తిరుగుతూ నాకు సహచరులయ్యాయి ఇంగ్లండ్‌కు సహజమయిన మహావృక్షాలు ఎల్మ్స్, ఓక్‌స, చెస్ట్‌నట్స్, పోప్లార్స్‌లు నాకు స్నేహితులయ్యాయి నాకవి నిడుబ్రోలు- పొన్నూరు పరిసరాలలోని జామ, చింత, మర్రి చెట్లను తలపించేవి. ఆ విధంగా నేను ముందుగా ఇంగ్లీషు పల్లెసీమల ద్వారా ఇంగ్లండ్‌లో పాగావేశాను. అందు వలన తరువాత లండన్ మహానగరపు జనారణ్యంలో నేను తబ్బిబ్బుపడలేదు ఆ నగర సంస్కృతికి అచ్చెరువొందలేదు. ఇల్లు విడిచిన దాది ఈ విధంగా నిర్విఘ్నంగా, నిశ్చింతగా సాగిన నా లండన్ యాత్ర నా భావి జీవితానికి బంగారు బాటలు వేసింది.

# నా పూర్వీకులు

**నా** పూర్వీకులు గత రెండు వేల ఏళ్ళుగా కష్టజీవులుగానే ఉన్నారు వాళ్ళు దేశం కోసం యోధులుగా కూడా పోరాడారు. ప్రపంచంలోని చాల దేశాలలో వ్యవసాయదారులు అట్లాగే ఉన్నారు బౌద్ధకాలంలో ఉన్నత వర్గాలకూ, నిమ్నవర్గాలకూ మధ్య, అలానే ఆర్యులకూ, దస్యులకూ మధ్య, పూజారులుగా పవిత్రీకరించబడిన మేధావులకూ, శౌర్యం, బల పరాక్రమాలు ప్రధానంగా గల క్షత్రియులకు మధ్య ఉన్న అంతరాలను తొలగించే ప్రయత్నాలు జరిగాయి. ఆ శతాబ్దాలలో భూమి మీద యాజమాన్యం కలిగి సాంఘిక అభివృద్ధి చెంది, సాంస్కృతికంగా స్వయం పోషకమయిన వ్యవసాయదారుల వర్గాలను పశ్చిమాన క్షత్రియులని, గంగానదీ లోయలో కర్మకారులు లేదా కుర్మిలు అని, మహానది, గోదావరి, కృష్ణ, పెన్న, తుంగభద్ర నదుల మధ్యగల దక్షిణాది డెల్టాలలో కమ్మవారని పిలుస్తారు. సంస్కృత పదాలను శబ్దాలు సరళంగా మార్చేవారని అందరికి తెలిసిందే. కనుకనే ధర్మ[illegible] అని, కర్మను కమ్మ అని మార్చారు.

ఒరిస్సాలోని మహానదికి దక్షిణానగల దేశంలోని ఉదార స్వభావు మనస్కులైన, స్వేచ్ఛావర్తనులు, స్వతంత్రులయిన వ్యవసాయ జన బాహుళ్యం మొత్తం ఇలా కమ్మ, అనే పేరుతో పిలవబడింది వారు ఎంత మంచి వ్యవసాయదారులో అంత మంచి సైనికులు కూడా వారు ఎంత నిపుణులైన శక్తివంతులు శ్రద్ధాళువులైన రైతులో అంతగా తమ తమ గ్రామీణ సమిష్టి వ్యవహారాల నాయకులుగా తమపాత్ర నిర్వహించడంలో అంత శ్రద్ధ వహించేవారు

ఆనాటి సమాజం శౌర్య, పరాక్రమము కల్గిన నాయకులు. బౌద్ధం నుంచి హైందవానికి మారినప్పుడు ఈ కమ్మ (కర్మకార) జనాలను గ్రామీణ సమాజంలో గౌరవనీయ భాగస్వాములుగా అంగీకరించవలసి వచ్చింది. అస్పృశ్యులుగానో, కొండ ప్రాంతాలకు పరిమితమైన గిరిజన ప్రజలుగానో, గ్రామీణ సమాజంలోని నిమ్న వర్గాలుగానో వీరిని చూసే వీలు లేకపోయినది. మన ప్రాచీన చరిత్రలోని ఏదో ఒక దశలో సాంఘిక, రాజకీయ హోదా కోసం, స్వాతంత్ర్యం కోసం జరిగిన పోటీలో వెనుకబడిపోయిన దురదృష్టకరమైన

సాంఘిక వర్గాల దుస్థితి అదే కాని కమ్మవారి విషయంలో బౌద్ధమతం పతనం చెందిన తర్వాత హిందూ సమాజం పునర్నిర్మించబడినప్పుడు వారు తమ నాయకత్వ స్థానాన్ని నిలబెట్టుకోవడంలో భూమిపట్ల వారికి గల అపరిమిత అభిమానం భూయాజమాన్యం, అభివృద్ధి చెందిన వ్యవసాయ పద్ధతులు, తమ స్వాతంత్ర్యం కోసం, సామాజిక సాంఘిక నాయకత్వ హోదాకోసం, జాతీయ స్వాతంత్ర్యం కోసం, పోరాడడం పట్ల వారికి గల అకుంఠిత దీక్ష వారికి సహాయపడినట్టున్నాయి.

వీరందరూ జాతిపరంగాగాని, సాంఘికంగా గాని ఐక్యత కలిగి ఉన్నారా ? ఆ విషయం కచ్చితంగా చెప్పడం కష్టం తొలినాటి పల్లవుల కాలం నుంచి, చోళుల కాలం వరకు స్థానిక ప్రజలకు, పల్లవ, రాష్ట్రకూట, చాళుక్య, చోళ ప్రాంతాల నుండి తరలి వచ్చిన విజేతలకు, సైనికులకు మధ్య ఒక ప్రశాంతమైన, నిరంతరమైన సమ్మేళన క్రమం జరిగినట్లున్నది స్థానిక ప్రజలకు, పాలక వర్గానికి చెందిన వారికి మధ్య వివాహసంబంధాల ద్వారా సాంఘిక అభివృద్ధికి పురోగమింపజేసే ఒక విశాలమైన, ప్రగతిశీలమైన ఉద్యమం జరిగిందనడానికి గుర్తుగా, ఎన్నో వంశాల కమ్మవారి ఇంటి పేర్లలోను, పేర్లలోను అవశేషాలు కనబడతాయి

పల్లవులు ఆంధ్రప్రాంతాన్ని, కర్ణాటక ప్రాంతాన్ని క్రీ శ. 5,6 శతాబ్దాలలో పాలించారు రాష్ట్ర కూటులు 6 నుంచి 8వ శతాబ్దం వరకు, చాళుక్యులు 9,10 శతాబ్దాలలో, చోళులు 10,11 శతాబ్దాలలో పాలించారు. వారి తర్వాత కాకతీయులు 11వ శతాబ్దం నుంచి 13వ శతాబ్దం వరకు, విజయనగర రాజులు 14వ శతాబ్దం నుండి 17వ శతాబ్దం వరకు పాలించారు

దక్కన్‌లోను, గంగానదీ లోయలోను వివిధ ప్రాంతాలకు చెందిన పాత, కొత్త ప్రజల మధ్య ఈ ఆరోగ్యకరమైన సాంఘిక సమ్మేళన క్రమం గంగాతీరం నుంచి దక్షిణాపథ ప్రజల సాంఘిక జీవనం మీద విదేశీ ముస్లిం దురాక్రమణ దారులు ఇతోధిక ఆగ్రహంతో, విజయవంతంగా సాగించిన దాడుల వల్ల ముగిసిపోయినట్టు కనబడుతుంది

కాకతీయులు ఎవరు ? కమ్మవారు సరాసరిగా వారు తమ పూర్వీకు లేనని చెప్పకుంటారు. వెలమలు, తెలగవారు, మున్నూరు కాపులు కూడ అట్లాగే

చెప్పకుంటారు కాకతీయులకు ఖచ్చితంగా క్షత్రియ సాంప్రదాయాలలో భాగం ఉంది చోళుల పాలనా శక్తిని, చాళుక్యుల సామ్రాజ్యాధిపత్యాన్ని పల్లవుల నుంచి నిర్మాణ దక్షత, నావికా నిపుణతల వారసత్వాన్ని వారు పొందారు. వారు వ్యవసాయ సంపదకు ఉత్పత్తి దారులుగా, తమ రాజ్య తంత్రాన్ని, సైనిక బలాన్ని, సాంస్కృతిక విజయాల ఆసక్తినీ అర్థంగానే వారసత్వంగా పొందారు. ఇనాల్టికి కూడ కాకతీయ సాంప్రదాయానికి వారసులుగా ఉన్నవారు దక్షిణాపథానికి చెందిన ఆ ప్రాచీన పాలకుల పేర్లను తమ వంశాల గౌరవచిహ్నాలుగా గర్వంగా ధరిస్తారు.

ఓరుగల్లు లేదా వరంగల్‌కు చెందిన కాకతీయులు, హంపీ విజయనగర రాయలు, చంద్రగిరి, రాయవెల్లూరు రాజులు, చివరిగా తంజావూరు, మధుర నాయక రాజులు పతనమయ్యేవరకూ ఈ విస్తృత కులం ( భారత సామాజిక చరిత్రను బట్టి వారిని ఒకే తెగగా, ఒకే కులంగా లెక్కించ దలచుకుంటే) లోని వివిధ అసంఖ్యాక సాంఘిక, తదితర తేడాలు గల వంశాల మధ్య అంతర్వివాహాలు జరపడం యుగధర్మంగా ఉండేది. కాని స్థానిక నాయకులకు సంకుచితత్వమో, అభివృద్ధి నిరోధక తత్వమో ఉన్నప్పడు లేదా వారు స్థానిక, సాంఘిక మత నాయకుల ప్రభావంలో ఎక్కువగా ఉన్నప్పడు ఇటువంటి అంతర్వివాహాలవల్ల జన్మించిన శిశువులను ఆ సమాజంలోని ఒక అగ్రస్థాయికో, నిమ్న స్థాయికో చెందిన కొత్త వంశంగా గుర్తించడం ఉండేది ఆ రకంగా అనేక సాంఘిక తారతమ్యాలు ఏర్పడ్డాయి. కమ్మ ప్రజల సాంఘిక సైనిక శక్తి ఎక్కువగా బలహీన పడింది

ఆంధ్ర ప్రజల సాంప్రదాయం కూడ సాధారణ భారత ప్రజల చారిత్రక బలహీనత కన్న భిన్నమైనదేమీ కాదు. అదేమంటే, ఏ కుటుంబాల సమూహమైనా ఏ రకమైన సాంఘిక లేదా సైనిక ఉన్నత స్థాయిని సాధిస్తే ఇక వారు, వారి స్వంత వంశాలు, తెగలు ప్రత్యేక తెగలుగా అభివృద్ధి చెంది ఎవరితో కలవకుండా నన్ను ముట్టుకోకు నామాల కాకి అన్నట్లు సంకుచితమైన హోదాను అనుభవిస్తాయి. ఈ విధంగా ప్రతి కొత్త, అదృష్టవంతమైన పాలక బృందం, ప్రజా బాహూళ్యం నుంచి ఎప్పటికప్పడు వేరుపడుతూపోయే క్రమం భారత సమాజానికి మతరీత్యా వేరయినా ముస్లిం దురాక్రమణదారుల విషయంలో, యూరోపియన్‌ల విషయం ప్రధాన బలహీనతగా ఋజువైంది.

ఆరకంగా కష్ట జీవులయిన ఆంధ్ర ప్రజానీకం నుంచి విడివిడి తెగలుగా వెలమలు, రెడ్లు, మున్నూరు కాపులు, తెలగలు, కొప్పల వెలమలు, గాజుల చెట్టిలు, బలిజెలు, గౌడ్‌లు పుట్టుకొచ్చారు మిగిలిన భాగంగా ప్రస్తుత కాలపు కమ్మవారుగా మిగిలిపోయింది వారందరిలోను కూడ పల్లవులకు, రాష్ట్రకూటులకు, చోళులకు, కాకతీయులకు, రాయలకు, నాయకులకు చెందిన వీరోచిత, చారిత్రక సాంప్రదాయాలున్నాయి భారతీయ నాగరికత లోని గొప్ప పాలకుల నుంచి స్ఫూర్తిపొందిన వారి నుంచి ఈ మధ్య వారిని మాత్రమే నేనిక్కడ ప్రస్తావించాను

మూడు శతాబ్దాల పాటు సాగిన కాకతీయ పాలనాకాలంలో కమ్మ ప్రజల సైనిక నాయకులను వారి వారి సామంత స్థాయిలను, మూలాలను బట్టి, నాయకులు, నాయనింగార్‌లు, నీడులు, రాయుళ్ళు, రాయలు అని పిలిచే వారు వారి ప్రధాన సైనిక అధిపతులు ౩౦౦ మంది ఉండేవారని తెలుస్తున్నది వారి సాంప్రదాయానికి వారసత్వం వహిస్తున్న వారిని మున్నూరు కాపులని పిలుస్తున్నారు

కాకతీయ పాలకులలో ముఖ్యమైనవాడు గణపతిదేవుడు. (ఆయనకు ఉన్న దేవుడు బిరుదం, ఒరిస్సాలోని దేవ్ లాంటిదే) ఆయనకు ఒక గొప్ప శక్తివంతుడైన యువ సేనాధిపతి ఉండేవాడు. ఆ సేనాధిపతి పేరు గంగయ సాహిణి ఆయన ప్రస్తుత చిత్తూరు, కడప, అనంతపురం ప్రాంతాలలోని అప్పటి బనసీమకు ప్రధాన అధిపతిగా ఉండేవాడు ఈ గంగయ సాహిణి, మహారాజు గణపతిదేవుని కూతురు, యోధురాలు, చక్రవర్తిణి రుద్రమదేవికి ప్రధాన మంత్రిగా, ప్రధాన నాయకుడిగా (అంటే ఆధునిక కాలంలోని సైన్యాధ్యక్షుడిగా) పనిచేశాడు. గంగయ సాహిణి వంశీకులు ఒక కోటను నిర్మించి, తమ పూర్వీకుడి పేరుమీద దాన్ని గంగినేని కొండ అని పిల్చారు. అది కడప జిల్లాలో ఉంది చిత్తూరు, నెల్లూరు, కృష్ణా, ఖమ్మం జిల్లాలలో ఎన్నో గ్రామాలను ఈ గొప్పసైన్యాధ్యక్షుడిపేరుమీదస్థాపించారు. లేదా ఆయనపేరుపెట్టారు.

అల్లావుద్దీన్ ఖిల్జీ కాలంలోను, ఆయన ప్రధాన సైన్యాధ్యక్షుడు మాలిక్ కాఫర్ కాలంలోనూ ఉత్తర భారత దేశం నుంచి వచ్చిన దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా వీరోచిత పోరాటాన్ని నిర్వహించినందుకు ఈ మూడు వందల మంది సైనిక అధిపతులకు భారత చరిత్రలో సముచిత స్థానం రావలసి ఉన్నది

గణపతి దేవుని మునిమనుమడు, రుద్రమదేవి మనుమడు అయిన ప్రతాప రుద్రదేవుని వీరోచిత నాయకత్వం క్రింద వారు రెండుసార్లు ఢిల్లీ సైన్యాన్ని ఓడించారు. మూడోసారి వారు వరంగల్‌ను దృఢంగా, దీర్ఘకాలం పాటు కాపాడే సరికి ఢిల్లీ పాలకులు ప్రతాపరుద్రునితో ఒక ఒప్పందానికి రాక తప్పలేదు. కాని కమ్మ నాయకులలోని వివిధ వంశాల, స్థాయిల మధ్య అంతర్గత విభేదాలు వారిని బలహీన పరచాయి కొన్ని వంశాలు చివరికి ప్రతాపరుద్రుని సైన్యం నుంచి విడివడడానికి కూడ ఈ విభేదాలు దారితీశాయి విశాల హిందూ సంస్కృతిలోనే పరస్పర శత్రుపూరితమైన మత విశ్వాసాలను వారు అవలంబించడమే ఈ విభేదాలకు కారణం. కనుక ఢిల్లీ నుంచి జరిగిన నాలుగవ దాడి కొందరు నాయకుల ద్రోహం వల్ల గెలుపొందింది ఆ విధంగా మహత్తర కాకతీయ శక్తి విచ్ఛిన్నమైపోయింది. మాలిక్ కాఫర్ కన్యాకుమారి వరకు విజయవంతంగా దండయాత్ర జరిపితే ఆపశక్తిగల మహా హిందూ శక్తి మరేదీ లేకపోయింది

దేశానికి, దాని సంస్కృతికి, తమ వీరోచిత సాంప్రదాయాలకు తగిలిన ఈ దారుణమైన దెబ్బలు నాయకులు జీర్ణం చేసుకోలేకపోయారు కనుక వారు ఒక దశాబ్దానికి కొద్ది ఎక్కువకాలంలోనే తమ ఆ విషాదకరమైన ఓటమి కలిగించిన దిగ్భ్రాంతి నుంచి, తమ మూడు శతాబ్దాల కాకతీయ రైతు పాలన పతనం నుంచి తేరుకున్నారు వాళ్ళు మళ్ళీ ఒకసారి తమ రైతు జనావళిలోంచే ఒక నాయకుణ్ణి కనిపెట్టారు ఆయన పేరు ప్రోలయనాయకుడు. యోధుడైనా ప్రతాపరుద్రుని వంశీకుడు మూడు వందలమంది సైనికాధిపతులూ ఆయన నాయకత్వం క్రింద సంఘటితమై, గంగినేని కొండపైన, ఇతర కోటలన్నిటిపైన వరాహ ముద్ర పతకాన్ని ఎగరేసి తిరుగుబాటును ప్రకటించారు. ఆయన జ్ఞాతి కాపనాయకుడు చాల శక్తివంతమైన, క్రియాశీలమైన నాయకత్వాన్ని సమకూర్చాడు. అలా వాళ్ళు మెరుపుదాడి జరిపి వరంగల్ మీద దండెత్తి అక్కడి ఢిల్లీ ప్రతినిధిని ఓడించారు. దక్షిణాపథం స్వతంత్రమైందని ప్రకటించారు. రెండు దశాబ్దాలకు పైగా ఆ సాహసులు, స్వేచ్ఛాప్రియులు అయిన నాయకులు కలిసికట్టుగా గోదావరికి దక్షిణదిశగా ఉన్న భూభాగాన్నంతటినీ తిరిగి స్వాధీనం చేసుకోగలిగారు., శైవ, జైన, లింగాయత్, వైష్ణవ, స్మార్త మొదలైన హైందవ బృందాలకు తమ తమ శాంతియుతమైన స్వేచ్ఛాయుతమైన

సాంఘిక జీవనాన్ని గడుపుకునేందుకు వీలు కలిపించారు కమ్మ, తదితర వ్యవసాయ ప్రజలకు ఢిల్లీ పాలకుల దోపిడీ పీడనల నుంచి పరిరక్షించారు ఆస్వతంత్ర్య పోరాటంలో గంగయ సాహిణి పుత్రులు, పౌత్రులు, అనుచరులు అగ్రభాగాన నిలిచారు వారు ఢిల్లీ ముస్లిం చక్రవర్తి నియమించిన సామంతులను తరిమివేయడంలో తమ ప్రాచీన రాజ్యాన్ని విముక్తి చేయడంలో ఇతర నాయకులతో ఏకమయ్యారు మహామండలేశ్వరునిగా ప్రోలయ నాయకుణ్ణి, తర్వాత కాపయ నాయకుణ్ణి నియమించారు

ఆ సాహసులు, స్వేచ్ఛాప్రియులు, దేశభక్తులు, జాతీయ ఆత్మగౌరవాన్నీ, సాంస్కృతిక స్వాతంత్ర్యాన్ని పరిరక్షించిన వారూ అయిన వారి వారసులు ఆ నాయకుల వీరోచిత పేర్లతో తమను తాము సగర్వంగా పిలుచుకోవడం ప్రారంభించారు నా ఇంటిపేరు కూడా అటువంటిదే గంగినేని కోటను విముక్తి చేసి, ఆ తర్వాత దక్షిణాపథం మొత్తాన్ని విజయవంతంగా విముక్తి చేయడంలో ఏకమైన గంగయ సాహిణి పుత్రులు, పౌత్రులు అనుచరుల ఘనకీర్తి నుంచి వచ్చినదే అది అలా నా కుటుంబ నామం సాతనిక ఉచ్చారణను వాడుకను బట్టి గంగినేని, గోగినేని, గోవిడి, గంగ అని వేరువేరుగా పిలవబడుతూ వచ్చింది

1326 సం॥ లో మొఘుల్‌లు ఆంధ్రను తిరిగి గెలుచుకున్న తర్వాత, కమ్మ వంశానికి చెందిన ముసునూరి కాయపనాయకుని ఓటమి తర్వాత, కమ్మ, రెడ్డి, తెలగ, వెలమ, బోయ నాయకుల మహా సమ్మేళనం చీలిపోయింది అప్పుడు గంగనాయకుని(నేని) వంశం తమ ప్రధాన ప్రవృత్తియైన ఆయుధ ధారణను వదిలి, వ్యవసాయా వృత్తిని చేపట్టాలని నిర్ణయించుకున్నారు ఐనప్పటికీ తమ పూర్వీకులు ఉపయోగించిన కుటుంబ వారసత్వమయిన కరవాలాలను, డాళ్ళను కనీసం సంవత్సరానికి ఒకసారి పూజించడం ద్వారా వారు తమ యుద్ధ విజయాలను, వీరోచిత సంప్రదాయాన్ని ఆరాధించడం కొనసాగించారు. వీరకత్తిని మేమందరమూ పూజించాం. ఆ పవిత్ర కరవాలాలకు, డాళ్ళకు పూజ చేయమని నన్ను, నా సోదరులను మా తల్లిదండ్రులు ప్రోత్సహించడం నాకు చాల ఇష్టమైన బాల్య జ్ఞాపకాలలో ఒకటి వాటిని మా ప్రాచీన గృహంలోని లోపలి గదులనుంచి

పవిత్రమైన వెదురు బుట్టలలో పెట్టి ఉత్సవ మర్యాదలతో బైటికి తీసుకు వచ్చేవారు మా పూర్వీకులు చిత్తూరు జిల్లా(పుంగనూరు) లోని ప్రస్తుత గంగినాయని పాలెంకు, వరంగల్- ఖమ్మం సరిహద్దులోని గంగినేనికి నెల్లూరు, కృష్ణా జిల్లాల లోని గోగినేని పాలెంలకు కడప నుంచి ఎప్పడు ఏ విధంగా ఎందుకు చేరారో తెలియడం లేదు. వరంగల్ ముస్లింల చేతులలలో పతనమైన తర్వాత గంగ నాయకుని పుత్రులు, పౌత్రులు వారి వారి అదృష్టాలను వెతుక్కుంటూ వేరు వేరు చోట్ల స్థిరపడాలని నిర్ణయించుకుని ఉంటారు. ఐతే వీరు కొన్ని చోట్ల స్థిరపడాలని నిర్ణయించుకున్నప్పటికీ తమ కాకతీయ పూర్వీకుడైన గంగ నాయుకుని స్మృత్యర్థం కొత్త గ్రామాలు రూపొందించాలని నిర్ణయించు కోవడం గమనార్హం.

తర్వాతి శతాబ్దాలలో ఈ యుద్ధ నిపుణులవారసులు తమ సైనిక శక్తికి, వ్యవసాయ నైపుణ్యాన్ని, భూమిపై అభిమానాన్నీ విజయనగర, నాయకరాజుల కాలంలో అంటే బ్రిటీష్ పాలనా కాలం ప్రారంభమయ్యేవరకూ చూపుతూనే వచ్చారు. ఊసరక్షేత్రాలను నాగలికి తెగేలా ఎలా చేశారో, అలాగే అంత నైపుణ్యంతోనే ఆ రాచరిక ప్రాంతాల్ని పాలించారు వ్యవసాయ ఆర్థిక వ్యవస్థను మెరుగు పరిచారు. అందువల్లనే తమిళనాడు అంతటా కూడా, రాయలు పాలించిన చోటనల్లా కమ్మ, రెడ్డి, తెలగ, వెలమ, తెగలు వంశాలు కనబడతాయి ఈ అన్ని ప్రాంతాలలో కూడా ఇప్పటికీ గంగినేని సాంప్రదాయానికి చెందిన వారస కుటుంబాలు ఉన్నాయి

ఈ వీరోచిత నాయకులలో కొందరు తమ విజయాల వల్ల, త్యాగాల వల్ల, ఎంత ప్రతిష్టను సంపాదించారంటే వారి వారసులకు వీరమాచినేని, వీరగంధం, వాసిరెడ్డి, వీరపనేని, సూరపనేని, సూరిరెడ్డి వంటి పేర్లుండడం ఆసక్తిని కలిగిస్తుంది.

ఈ ఉన్నత వర్గానికి చెందిన మూడువందలమంది నాయకుల వారసులు ఆంధ్రలోని అన్ని ప్రధాన రైతు వంశాలలోను ప్రస్తుతం కనబడతారు. పూర్వీకుల సాహసకృత్యాలను, విజయాలను తమకు వివరించి చెప్పేందుకు వారు వార్షిక భత్యాలపై రెండు ప్రత్యేక గాయక తెగలను పోషిస్తున్నారు. ఆ తెగల గాయకులు భట్రాజులు లేదా క్షత్రియ భట్టులు అని, పిచ్చగుంట గాయకులని పిలుస్తారు.

ఇటీవలికాలంలోని నా పూర్వీకులు గంగినీడు, అంకమ్మ, నాగయ్య, ఆనందయ్య, అంకినీడు, అంకమ్మగారలు మా వంశం ఖచ్చితంగా ఎప్పడు సైనిక వృత్తిని వదిలేసిందో స్పష్టంగా తెలియదు ఐతే కాకతీయుల పతనం తర్వాత వరంగల్ నుంచి తరలి వచ్చిన మా పూర్వీకులలో ఎవరూ విదేశీ పాలకులకు సేవచేయలేదని మాత్రం తెలుస్తున్నది

ఏది ఏమైనా మిగిలిన ౩౦౦ నాయకుల వారసులందరి వలెనే మేము కూడా మా సైనిక (క్షత్రియ) సాంప్రదాయాల పట్ల మా వంశాలకు చెందిన ప్రమాణాలను నిలబెట్టిన వాళ్ళు, లేదా స్థాపించిన వాళ్ళ పట్ల గర్వంగా భావించే వాళ్ళం కనుక మేమందరమూ మామా కుటుంబాల బృందం ఒక్కొక్కదానికి, ఒక్కొక్క వంశంలో వీరకత్తిగా పేరొందిన ఒకటో రెండో కత్తులను కుటుంబ వారసత్వ ఆస్తిగా పవిత్రమైన వెదురు బుట్టలో పెట్టి జాగ్రత్తగా చూచుకునే వాళ్ళం మేం మా పిల్లలకు వీరదాసుల శపథం తీసుకునేటప్పడు, అటువంటి ఇతర సందర్భాలలో రాచగోచి కడతాం మా తాతలు, నానమ్మలు ఈ సాంప్రదాయాల పూజారులు. వారు మా పిల్లలకు క్షత్రియులు పాటించ వలసిన ఉన్నత లక్షణాల్ని ప్రబోధిస్తారు. నేను నా సోదరులు ఇటువంటి సాంప్రదాయంలోనే పెరిగాం మా మనసులు ఆ గాధలలో నిండి పోయాయి మా హృదయాలు ఆ ఉదాహరణలతో ఉత్తేజితమయ్యాయి మా ముత్తాతగారు సాంప్రదాయక భారతీయ పద్ధతిలో చాల ఉన్నత విద్యను అభ్యసించారు ఆయన వైష్ణవ సాంప్రదాయంలో భక్తుడయ్యారు. అప్పటి కృష్ణ, గుంటూరు సీమలో ఒక భాగానికి ఆయన భూమి శిస్తు వసూలుదారు అయ్యారు. ఆయన తండ్రిగారయిన అంకినీడుగారు నిడుబ్రోలులో స్థిరపడడానికి నిర్ణయించు కున్నట్టున్నారు. నా జన్మస్థలం అదే నాగయ్యగారు విశాలమైన కమతాలను కొని వాటిని అభివృద్ధికరమైన పద్ధతిలో సాగుచేయడానికి పథకాలు వేశారు. అందువల్ల ఆయన ఆ భూమిలో ప్రజల కోసం డొంక దారులకు స్థలం వదలి, బావులు, చెరువులు నిర్మింపజేసి ఆ స్థలాన్ని సాగుకు యోగ్యం చేశారు నిడుబ్రోలు మొట్టమొదటి పెంకుటిల్లును నిర్మించినది ఆయనే.

ఆయన తాతగారు నిడుబ్రోలుకు ౧౦మైళ్ళ దూరంలోని గూడవల్లిలో నివశించేవారు. వారి పూర్వీకులు ఎన్నోతరాలపాటు కృష్ణాజిల్లాలోని గోగినేని వారి సా [illegible]గంలో నివసించారు అది శ్రీకాకుళం గ్రామ సమీపంలోని గోగినేని

కుటుంబానికి చెందిన శివారు గ్రామం శ్రీకాకుళం క్రీ.శ రెండో శతాబ్దంలో పాలించిన శాతవాహనుల రాజధాని ఈ [illegible] గ్రామానికి వారు వరంగల్ నుంచి ఖమ్మం (జిల్లా) మీదుగా వచ్చి ఉంటారు [illegible] అయితే వారు మరే ఇతర గ్రామంలోనో నివసించడానికి ఎందుకు పూనుకోలేదు ? తమకోసం కొత్తగా, విడిగా గ్రామం నిర్మించుకోవాలని వారు ఎందుకు అనుకున్నారు ? ఆ అభివృద్ధి చెందని ప్రాంతంలో అడవిని శుభ్రం చేసి వారు తమ కొత్త గ్రామాన్ని నిర్మించుకుని ఉంటారనడానికి అవకాశం ఉంది. వారు అక్కడ ఒక చెరువు నిర్మించి దాన్ని నిర్వహించడం కోసం కొంత భూమి కేటాయించారు. మా నాన్నగారి వరకు కూడ ఈ చెరువును బాగు చేయించే ఖర్చులను మేం భరిస్తుండేవాళ్ళం. అంటే ఆ గోగినేని రైతులు తమ సాంఘిక స్వాతంత్ర్యాన్ని, సాంస్కృతిక అన్వేషణలను నిర్వహించుకోవడంలో [illegible] కనపరిచారు

నాగయ్యగారు కూడ ప్రజాసేవలో దాన [illegible] అటువంటి ధర్మనిరతిని ఉన్నత సాంఘిక ప్రమాణాలను ఏర్పరిచారు. ఆయన నిడుబ్రోలు లోని విష్ణు ఆలయంలో, పొన్నూరులోని భావనారాయణస్వామి ఆలయంలో మతాచారాల పునరుద్ధరణలో ప్రధాన పాత్ర వహించారు.

భారతీదేవి పూర్వీకుల ఇంటిపేరు వెలుగు. ఆమె పూర్వీకులు ఇటువంటి అసూయ పడదగిన మంచి ఇంటి పేరును ఎట్లా, ఎందుకు, ఎప్పుడు సంపాదించారో తెలియదు. తూర్పుగోదావరి జిల్లాలో వెలుగుబండు అనే పేరు గల గ్రామం ఉంది. ఏ పోరాటంలో ఏ పుణ్యయాత్రలో, ఏ మహోత్సవంలో, మత ఘర్షణలలో ఒక పూర్వీకుడు అవసరమైన [illegible] వెలుగు [illegible] తెలియదు ఆమె నా జీవితంలో వెలుగు తెచ్చిన మాట [illegible] ఆమె లోక జ్ఞానం, ప్రజల అంతరంగం చూడగల శక్తి, ధర్మ నిరతి అనే ప్రజ్వలిత జ్యోతి (వెలిగే కిరణాల) తో నా జీవితాన్ని వెలిగించింది. చిత్తూరు జిల్లాలోని పుంగనూరు తాలూకాలో వెలగలేరు అనే గ్రామం [illegible] ఉంది. దాన్ని ఈ వెలుగును, లేదా వెలగ కుటుంబాలకు చెందిన వారే రూపొందించి ఉంటారు.

ఆమె తాత కోటయ్యగారు అభివృద్ధిపథంలో ముందుగా సాగే రైతు. అందుకే ఆయన భారత- బర్మాల మధ్య [illegible] వ్యాపారం చేస్తున్న కాంచేడు నాయకులతో పాటు నాటాలు [illegible] మద్రాసుకు వెళ్ళి విదేశీ వ్యాపారస్తులతో [illegible] తన

గ్రామీణ కార్యకలాపాలకు వ్యాపార నైపుణ్యాన్ని ఇతర ప్రాంతాల జ్ఞానాన్ని జోడించారు ఆమె తండ్రి సుబ్బయ్యగారు ప్రముఖ వ్యవసాయదారుడయ్యారు ఆయన వడ్రంగం కూడ నేర్చుకున్నారు ఆయనకు పశువైద్యం కూడ తెలుసు ఆయన ఒక ఆదర్శనీయమైన, ఉన్నతస్థాయి సంఘసేవానురక్తిగల రైతు.

గాంధీయుగానికి చెందిన ఈ కమ్మవారు తాము తమ ప్రాచీన నాయకులయిన కాకతీయ - రాయల క్షత్రియ సంప్రదాయానికి నిజమైన వారసులమని రుజువు చేసుకున్నారు ౧౯౨౧ సం లో సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించాలని మహాత్ముడు శంఖారావం పూరించి నప్పుడు జాతీయోద్యమానికి తన ఆభరణాలన్నిటికీ మొట్టమొదటిగా ఇచ్చిన కీర్తిశేషురాలు అన్నపూర్ణ ఈ కమ్మవారికి చెందిన యువతే ఆంధ్రలో పన్నుల నిరాకరణ ఉద్యమానికి మహాత్ముడు ఆమోదం తెల్పినప్పుడు పెదనందిపాడు పోరాటాలకు నాయకుడిగా ఆవిర్భవించినది పర్వత నాయకుల (నేని) వంశానికి చెందిన పర్వతనేని వీరయ్యగారే గాంధీ మహాత్ముడు ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించినప్పుడు గుంటూరులో పోలీసు లాఠీచార్జిని వీరోచితంగా అనుభవించినది కీర్తిశేషులు నాగళ్ల క్రిష్ణయ్యగారే హెచ్చుమంది మహిళా సత్యాగ్రహులు పాల్గొన్నది బౌద్ధ కాలంలోని కమ్మ సంస్కృతికి నిలయం, కాకతీయ పాలనలోని ప్రధాని జాయప నాయకుని దుర్గం ఆ[illegible] చేబ్రోలునుంచే.

రైతులు, చేతివృత్తుల వాళ్ళు, బ్రాహ్మణులు మొదలైన ప్రజల[illegible]రి జీవితాలలో నిండి ఉండే మత, ఆర్థిక ఘర్షణలు శతాబ్దాల పాటు సాగిన భారత సాంఘిక, రాజకీయ చరిత్రను రూపొందించాయి రైతాంగంలోని కొన్ని బృందాలు కొత్త వ్యాపారానికో, అంతర్ జిల్లా లేదా అంతర్ రాష్ట్ర వ్యాపార, వాణిజ్యాలకో పూనుకోవడం అవసరమని అనుకున్నప్పుడల్లా అవి వాటి ప్రధాన సాంఘికశాఖ లేదా మాతృకులం లేదా తెగలో ఉండే రక్షణ వాతావరణం నుంచో, నిర్బంధ వాతావరణం నుంచో పరిమిత వాతావరణం నుంచో బైటపడడం ప్రారంభించేవి ఒక్క క్రొత్త పావుగా మారడం, స్వతంత్ర, సాంఘిక శ్రేణులుగా ఉండడం సాధ్యమనో లేక అవసరమనో గుర్తించేవి ఆ విధంగా ఆహార ధాన్యాల వ్యాపారం చేసే ముత్తరాసులు, ముదిరాజులు, బలిజలు ఏర్పడ్డారు. నూనె వ్యాపారాన్ని ప్రధాన జీవనాధారంగా చేసుకున్న రైతా[illegible]లోంచి గానుగ, పెరిక తెగలు ఏర్పడ్డాయి. రెడ్డి, గౌడ, యాదవ, కమ్మ,

తెలగలోని సాంప్రదాయక సోదరుల నుంచి విడివడి లింగాయిత విశ్వాసాన్ని పొందిన వారు లింగాయత్ లనే కొత్త కులాన్ని ఏర్పరచుకున్నారు. పల్లవుల వారసులు తర్వాత పాలకవర్గాల కక్షసాధింపును తప్పించుకోవడానికి సముద్రజీవనానికి, నావికా వృత్తికి, చేపలవేటకు పూనుకుని పల్లెకారులుగా గుర్తించబడ్డారు ఈ రకంగానూ, ఇతర రకాలుగా రాష్ట్రకూటుల లేదా, రాట్టకూటుల వారసులు స్థానిక రైతాంగంలో సాధారణ జీవనంలో తమ సాంఘిక స్థానాన్ని పునరుద్ధరించుకోలేక దుర్గమ పర్వతాలలోకి, అనారోగ్యకరమైన ఎవరూ చొరబారని, సముద్రతీర బురద నేలలలోకి ప్రవేశించి కొండరెడ్లు గానో పల్లం రెడ్లుగానో పిలవబడ్డారు.

తెలంగాణా, రాయలసీమ, తమిళనాడులకు చెందిన బహుళసంఖ్యాక రెడ్లు ఎట్లా ప్రత్యేకతను తెచ్చుకున్నారో, ప్రాచీన ఆంధ్ర కర్మజనుల నుంచి ఎప్పుడు ఎందుకు విడిపోయారో మనకు తెలియదు. ఆంధ్ర, కర్ణాటక, రైతుల్లో భాగమే తప్ప వారు అంతకన్న వేరేమీ కాదుగదా ? 10, 11 వ శతాబ్దాల నాటికే రెడ్లు ఒక ప్రత్యేక రైతాంగ శ్రేణిగా రూపొందారు. వారు ఇతర రైతాంగ శ్రేణులతో అంతర్వివాహాలను ఆహ్వానించారు గాని సైనిక, సాంఘిక స్థాయిలలో సమాన హోదాగల వాళ్ళనే ఎంచుకున్నారు 300 మంది నాయకులలో ఆంధ్ర ప్రాంతానికి నాయకత్వం వహించినవారిలో వీరు కూడ ఖచ్చితంగా ఉండే ఉంటారు కాకతీయ, రెడ్డి రాజ్యాల పతనం తర్వాత వీరిలో చాలా మంది ఇతర వర్గాల వలె తమ ప్రధాన జీవనాధారమైన భూమి మీదికి, వ్యవసాయ వృత్తిలోకి మరలారు తమ తమ రంగాలలోస్థానిక గ్రామ [illegible] నాయకత్వాన్ని అందించడం కొనసాగించారు. ఆంధ్రప్రాంతాలు ముస్లిం పాలన క్రిందికి వచ్చిన తర్వాత చాలాకాలానికే తెలగ వారు కూడా ప్రత్యేక సాంఘిక రూపం ధరించారు ఉత్తర భారత ముస్లిం పాలకులు కాకతీయుల పాలకుల మాతృభూమిని తెలంగాణ అని పిలవడం ప్రారంభించారు రాజస్థాన్‌లోను, మధ్యప్రదేశ్‌లోను ఉన్నట్టుగా నీరులేని విశాల ప్రాంతాలు కాకుండా ఈ ప్రాంతం సరసులతో నిండి ఉన్నందువల్ల ఇలా పిలిచి ఉంటారా ? లేక అప్పటికే ఇక్కడి భాష తెలుగుగా పిలవబడినందువల్లనా ? వారే ముస్లిం, బ్రిటీష్ పాలకుల సైన్యాలలో అధికార స్థానాలను, శ్రేణు[illegible] [illegible] ఎక్కువగా పూరించారు. **తెలంగాణాలోని** అనేక ప్రాంతాల [illegible] వర్గాల ప్రజలను నిమ్న

సాం ఘిక స్థాయి ఇవ్వడం ఇందువల్లనే జరిగిందా? వారిలో చాల మంది ఎప్పటికప్పుడు కొత్త పారిశ్రామిక, వాణిజ్య వృత్తులను చేపట్టి కొత్త సాంఘిక శ్రేణులు, కులాలు పుట్టుకురావడానికి కూడ కారణమయ్యారు

కాకతీయ సామ్రాజ్య పతనమైన తర్వాత కమ్మవారు, రెడ్లు, తెలగవారు శతాబ్దాలుగా నిర్వహిస్తూ వచ్చిన రాజకీయ బాధ్యతల నుంచి విరమించుకున్న తర్వాత వెలమవారు అధికార స్థానాన్ని చేపట్టారు ముస్లిం, బ్రిటీష్ సామ్రాజ్యాధి పతులకు సామంతులుగా ఉండడానికివారు సిద్ధపడ్డారు ఆంధ్ర రైతాంగంలోని ఇతర వర్గాలవారు మాత్రం విజయనగర పాలకుల కింద నాయక రాజుల కింద సైనిక సేవ చేసేందుకే నిర్ణయించుకున్నారు దక్షిణాపథం పతనమై పోయిన ఈ వేదనా పూరిత శతాబ్దాలలోనే బహుశా ఈ ప్రధాన విభేదం వల్లనే విచారకరమైన వైరుధ్యాలు పెంపొంది ఉంటాయి. ప్రస్తుతం మధ్యప్రదేశ్‌లో ఉన్న బస్తర్ రాజ్య పాలకులు తాము కాకతీయులకు సాంఘికంగాను, రాచరిక అధికారంలోను వారసులమని చెప్పకోవడం కొనసాగించారు. వారి పీఠభూమి దుర్గమ భూమి అయినందువల్ల మరియు, కోయదొరల వీరత్వం విధేయతల వల్ల ఢిల్లీ ముస్లిం పాలకులకు లోబడకుండా వారు తప్పించుకున్నారు

శాతవాహనుల కాలం నుంచి దక్షిణాపథ చరిత్ర సుదీర్ఘ క్రమం మీద దృష్టిసారిస్తే, ఈ రైతాంగ ప్రజల గణనీయమైన స్థిరత్వానికి, స్వాభావికమైన పట్టు ...ల, భూమిపట్ల అభిమానం, సైనికశక్తి, నిర్మాణాత్మక రాజనీతి వంటి విషయాలతో ఆర్థిక రాజకీయ శక్తిగా కొనసాగిన తీరుకు ఆశ్చర్యపోతాం ఎందరెందరో దండయాత్ర శక్తులు భూమి మీదికి తరలి వచ్చారు వారి సాంఘిక ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నం చేస్తామని బెదరించారు కాని వారు ఆగంతకులను అంతర్వివాహాల ద్వారా, తమ గ్రామీణ సమాజంలోనే కొత్తకుల విభాగాలని సృష్టించడం ద్వారా కలిపివేసుకున్నారు.

ప్రపంచమంతటా జరిగినట్టుగానే ఈ రైతు తెగలలో కూడ దాడికి సిద్ధంగా ఉండడం, సైనిక దృష్టి కలిగి ఉండడం జరిగింది సోదర తెగ ఉన్న సందర్భంలో తమ గ్రామీణ, సాంఘిక జీవనంలో అసహనానికి రెండోస్థానం ఇవ్వడం కూడా జరిగింది ఆ విధంగానే ఉత్తర భారతదేశంలోని జాట్, రాజపుత్ర తెగల మొదటి స్థానం వర్గాలు వారి ప్రధాన జీవనాధారంగా

స్వయం ఉపాధికల్పనా అవకాశంగా వ్యవసాయ వృత్తిలో ఉంటూనే తమ వర్గానికి సాంఘిక ప్రాధాన్యం సాధించడం కోసం ఒకరితో ఒకరు పోటీ పడుతూ ఉండేవారు దురదృష్టవశాత్తూ ఈ పోటీ అభివృద్ధికి కాక మానవజాతి బలహీనబడడానికే దారి తీసింది. ఈ సాంఘిక శ్రేణులకు, వంశాలకు ఉండిన ఈ అనారోగ్యకర కాంక్ష వల్లనే కాకతీయ సామ్రాజ్యం తర్వాత విజయనగర నాయక రాజ్యాలు పతనం కావలసి వచ్చింది దక్షిణ భారత ప్రజలందరిపైన విదేశీ పాలన రుద్దబడింది దక్షిణ భారతదేశంలోను, ఉత్తర భారత దేశంలోను కూడా రాజకీయాలను ప్రస్తుతం విషమయం చేస్తున్న చీడ ఇదే. ఎల్లప్పుడూ ఒకరినొకరు వ్యతిరేకించుకుంటూ ఉండే రైతాంగ ప్రజలలోని ప్రధాన బృందాలు తమ శత్రుత్వాలకు బైటి అలంకారాలుగా మన రాజకీయ సిద్ధాంతాలను, పార్టీ కార్యక్రమాలను వాడుకుంటున్నాయి. బ్రిటీష్ పాలన కొనసాగినంత కాలం ఇది అంత చురుకుగా, చొచ్చుకు వచ్చినట్టుగా జరగలేదు కాని జాతీయ స్వాతంత్ర్య సాధనతో వచ్చిన వయోజన వోటుహక్కు. ఎప్పటికప్పుడు పైకి వస్తున్న శక్తులను ఉత్సాహ పరిచేందుకు విభిన్న రాజకీయ పార్టీలపై అంతకంతకు పెరుగుతున్న ఒత్తిడి వల్ల భారతీయ సాంఘిక, రాజకీయ జీవితం ఈ సాంఘిక శత్రుత్వాలతో విషమయం అయ్యే ప్రమాదం యేర్పడింది.

ప్రాచీన బౌద్ధ సంస్కృతికీ, స్థూపాలకూ కేంద్రాలయిన చేబ్రోలు, భట్టిప్రోలు గ్రామాల మధ్య గల అనేక గ్రామాల వలెనే నిడుబ్రోలుకు కూడ విశిష్టమైన చరిత్ర ఉంది గ్రామంలో మా కుటుంబం గత శతాబ్దపు మొదటి రోజులలో (క్రీ శ 1820) స్థిరపడింది. 10-11 శతాబ్దాలలో పాలించిన ఆంధ్రచోళుల సుప్రసిద్ధ రాజధాని. ప్రస్తుతం చందోలుగా నాడుకలో ఉన్న ధాన్య కటకానికి పొలిమేరల్లోనే, నాలుగుమైళ్ళ దూరంలో మా గ్రామం ఉంది. దాని పేరును బట్టే అది నాయకులకు, నీడులకు లేదా నాయుడులకు స్వస్థలమని ఒక పెద్ద నగరమని తెలుస్తున్నది. శివాలయంలో లభించిన శాసనాలను బట్టి ఈ గ్రామాన్ని ఈ పేరుతో వ్యవహరించడం 11వ శతాబ్ది నాటికే అమలులో ఉన్నట్టు తెలుస్తున్నది. ఈ శివాలయాన్ని ఆంధ్రచోళ రాజు అయిన రాజా చోళదేవుడు క్రీ శ. 1082లో నిర్మించడం ప్రారంభించాడు. విక్రమ చోళదేవుడు (క్రీ శ. 1118-35) దీనిలో లింగ ప్రతిష్ఠాపన చేశాడు. కులోత్తుంగ చోళుడు తమిళ చోళరాజుకు మనుమడు. ఆయన కలచి రాజ్యానికి

పోటీ పడిన ప్రత్యర్థి అయిన చాళుక్య రాజును ఓడించి ఆంధ్ర తమిళనాడుల పాలకుడయ్యాడు ఆ చాళుక్యరాజుకూడ తమిళ చోళరాజుకు మనుమడే చోళులకు నిడుబ్రోలు ఎంత వ్యూహాత్మక ప్రాధాన్యంగల గ్రామమంటే కులోత్తుంగ చోళుడు ఈ గ్రామాన్ని రెండుసార్లు (1178-1216) సందర్శించారు కులోత్తుంగ చోళుని దగ్గర గుమస్తాగా ఉండిన ఎర్రం నాయకుడు తర్వాతి కాలంలో రాజ కోశాగారానికి పర్యవేక్షకుడి స్థాయికి ఎదిగాడు ఆయన ఈగ్రామానికే చెందిన నింబ్రోలు లేదా నిడుబ్రోలు సుబ్బనాయకుడిపుత్రుడు అలా అప్పుడుకూడ ఈ గ్రామానికి చెందిన నాయకులు తెలుగు చోళుల లేదా చోడుల పాలనలో ప్రధానపాత్రను నిర్వహించారు

మా గ్రామంలోని విష్ణు ఆలయం కూడ చాలా ప్రాచీనమైనదే మా గ్రామం నుంచి రెండుమైళ్ళలోపే ఉన్న ప్రముఖ అగ్రహారమైన కొండముదిలో విష్ణు ఆలయాన్ని నిర్మించినది విష్ణుకుండిన వంశపు రాజులే( క్రీ.శ 4 శతాబ్దం) మా గ్రామంలోని ఆలయాన్ని కూడ నిర్మించారు. గత 130 సంవత్సరాలుగా ఈ ఆలయానికి ప్రధాన ధర్మకర్తలుగా ఉండే అదృష్టం మా కుటుంబానికి కలిగింది

మరొక ఇంతే ఆసక్తికరమైన చిహ్నం మా గ్రామంలోని ఢిల్లీ పాలాసమ్మ గుడి (కాళికాదేవి గుడి) వరంగల్ లోని సామంతులు నిరంకుశ చర్యల నుంచి కాపాడమని కోరడానికి కొందరు ప్రతినిధులు ఈ ప్రాంతం నుంచి ఢిల్లీ పాలకులు దగ్గరకి వెళ్ళారని, ఆయాత్రకు స్మృతి చిహ్నంగా ఇక్కడ దేవిని ప్రతిష్ఠించారని అంటారు.

ఈగ్రామంలోని రైతులకు, చేతివృత్తుల వారికి చెందిన అసలు కుటుంబాలు ఏమయ్యాయో తెలియదు. నిడుబ్రోలు లేదా నిడుమోలు ఇంటి పేరుగల బ్రాహ్మణ, విశ్వబ్రాహ్మణ కుటుంబాలు ఉండేవి అలాగే ఆ ఇంటి పేరు గల రైతు కుటుంబాలు కూడ ఉండేవి. ఉదాహరణకు 12వ శతాబ్దంలోని నింబ్రోలు ఏర్రప్ప నాయకుడు, అతని తండ్రి సుబ్బనాయకుడు వారు గ్రామాన్ని ఎప్పుడు, ఎందుకు వదిలేశారో మనకు తెలియదు కొన్ని కుటుంబాలు వరంగల్ నుంచి వచ్చినవి ఉన్నాయి. వారిని ఓరుగంటి వారని పిలుస్తారు. కొసరాజు (క్షత్రియులలో చివరివారు) నన్నపనేని, రాయుడు గొంది కుటుంబాలు విజయనగర రాయల వారి ప్రాచీన రాజధాని అయిన

అనెగొంది రాయల, నన్నెచోళుల అవశేషాలను గుర్తుగా చెప్పుకొనేవి. గోలి ఇంటి పేరు కలిగిన చేనేత కుటుంబాలు ఉండేవి. వారు బౌద్ధ సంఘాలుగల శ్రీకాకుళం సమీపంలోని ప్రముఖ గ్రామం గోలి నుంచి వచ్చి ఉంటారు. పలనాటకూడా, బౌద్ధ ఆరామంగ గోలి గ్రామం వున్నది. పాముల పాటి రైతాంగ కుటుంబాలు కూడ ఉండేవి. వారు గ్రామ మునసబులుగా వంశపారంపర్యంగా ఉండేవారు. వారి పూర్వీకులు కృష్ణా జిల్లాలోని పాములపాడు నుండి రెండు శతాబ్దాల కింద ఇక్కడికి తరలివచ్చి ఉంటారు. వారికి మునసబు గిరీని ఎట్లా, ఎప్పుడు ఇచ్చారో తెలియదు.

మా తాతగారు, పాములపాడు కుటుంబానికి చెందిన రమణయ్యగారు భారతీదేవి తండ్రిగారి వలెనే ప్రముఖ వ్యవసాయదారు. ఆయన నూతన వ్యవసాయ పద్ధతులను అమలులోకి తెచ్చి తన కమతాన్ని వైశాల్యంలోను, దిగుబడిలోను అభివృద్ధి చేశారు. వంశపారంపర్యంగా వచ్చిన ఆస్తిని మూడు రెట్లకు పెంచారు. ఆయన తండ్రి గారయిన బుచ్చిరాయుడు-రాయలు-గంగినేని కుటుంబానికి చెందిన మా ముత్తాత నాగయ్యగారికి అల్లుడు. ఈ రెండు ప్రధాన కుటుంబాలకు విద్యకు విలువనిచ్చాయి. పండితులకు, బ్రాహ్మణులకు వారు అందజేసిన ఆదర సత్కారాలు చెప్పతగినవి. రమణయ్యగారు ఎంతో శ్రమించి హరిజనుల కోసం బావులు తవ్వించారు. నిరాశ్రితులకు ధర్మసత్రం నిర్మించారు. పొరుగు గ్రామపు అవసరాల కోసం ఒక చెరువును నిర్మించారు. రమణయ్యగారు, ఆయన సోదరుడు అంకినీడు గారు తమ జ్ఞాతి అయిన మునసబుతో వైరం పెంచుకున్నారు. ఆ దురదృష్టకరమైన శత్రుత్వం అప్పటి నుండి తర్వాత తరాలన్నిటికీ పాకింది. మన గ్రామాలలో అనేక గ్రామాల రాజకీయాలలో ఇది సాధారణ అంశము.

రమణయ్యగారి కొడుకైన రామస్వామిగారు తండ్రివలెనే గొప్ప ధర్మదాతగా ఉండేవారు. ఈ ప్రాంతంలో మొట్టమొదటి గ్రంథాలయాన్ని స్థాపించినది ఆయనే. ఆయన పురాణ కాలక్షేపాలు ఏర్పాటు చేయించారు. ఆయన తన చిన్నాన్నగారయిన అంకినీడుగారి లాగానే విద్యాభిమానులయ్యారు. ఆయన యవ్వనంలోనే నిస్సంతుగా మరణించారు. ఆయన తన ఆస్తి మొత్తాన్ని లక్షరూపాయలకు పై బడిన ఆస్తిని మేనల్లుళ్ళయిన మా సోదరులకీ చెందేలా వీలునామా రాశారు. ఆయన భార్య లక్ష్మీదేవిగారు, తల్లి అమ్మన్నగారు, సోదరి

మంగమ్మగారు మా ముగ్గురు అన్నదమ్ములను తమ చేతులమీదుగా పెంచారు. మాకు చదువు నేర్పించి, మంచి సంపన్న రైతులుగా వేం ముందుకు సాగడానికి దోహదం చేశారు మా రెండువైపుల పెద్దలు స్థాపించిన దాతృత్వ సాంప్రదాయం నేర్చుకోవాలనే తపన, దాన్ని పదుగురికీ పంచాలనే కోరిక ఈ రోజు వరకు కూడ కొనసాగుతూ వస్తున్నాయి అంకినీడు గారి కొడుకైన పి బి నాయుడుగారు ( బుచ్చినాయుడుగారు ) ।౨5। లో మా గ్రామంలో మొదటిశ్రేణి కళాశాలను నెలకొల్పి నడిపారు మా గ్రామీణ ప్రాంతాలలో అటువంటి కళాశాల అదే మొదటిది

రమణయ్యగారు స్థాపించిన ధర్మసత్రం ఆ తర్వాత ।౨౩౩లో మేం ప్రారంభించిన భారతరైతు సంస్థ ప్రధాన కేంద్రంగా వినియోగపడుతున్నది

।।౬ ఏళ్ళకంటె పూర్వం సర్ ఆర్థర్ కాటన్ నిర్మించిన కృష్ణా ఆనకట్ట నుంచి మా గ్రామానికి రక్షిత నీటి సరఫరా పంట పొలాలకు సేద్యపునీటి సౌకర్యం ఉన్నది. కనుక మా ముత్తాత నాగయ్యగారు ఇతోధికంగా ఎక్కువ భూమిని కాల్వల కింద కి తేనడంలో శ్రద్ధ వహించారు. అప్పటి నుంచి మా రైతులకు వ్యవసాయ పంటల విషయంలో భద్రత ఏర్పడింది మన ప్రాంతం లోని అనేక భాగాలు ఈ నీటి పారుదల వసతి ఇంకా సాధించవలసే ఉండడం విచారకరం ఈ నీటిపారుదల సౌకర్యపు అదృష్టం వల్లనే ఆంధ్రకోస్తా ప్రజలు ఇతరుల కన్న సాంస్కృతిక, ఆర్థిక విజయాలు సాధించడంలో ముందున్నారు

పీఠభూములలో విశాలమైన నేలల్ని సాగుచేసే రైతులు పంటలు నష్టపోతామనే భయం నుండి, ఆర్థిక స్వాతంత్ర్యం పెరగకుండా అడ్డుకునే కరువుల భయం నుండి, ఈ నీటిపారుదల సౌకర్యం రైతులను విముక్తి చేసింది తమ సాంఘిక రాజకీయ అవకాశాల గురించి, బాధ్యతల గురించి ఆలోచించే అవకాశాన్ని కల్పించింది అందువల్లనే ఈ డెల్టా ప్రాంతంలో ప్రైవేటుగా నడిచే ఉన్నత పాఠశాలలు, కళాశాలలు పెద్ద సంఖ్యలో యేర్పడ్డాయి ఈ గొప్ప అవకాశం వల్లనే, ఈ శతాబ్దంలో మనదేశంలో ఆవిర్భవించిన అనేక సంస్కరణల ఉద్యమాలు, విప్లవ ఉద్యమాలు ప్రారంభమైనా వాటికి మొట్టమొదటి విస్తృతమైన మద్దతును ఈ ప్రాంతంనుంచే పొందాయి ప్రధానంగా వ్యవసాయ దేశమైన ఈ దేశంలో ఎందరో ఇతర ప్రజలకు

ప్రతిబంధకంగా వుండే ఉద్యోగ, ఆదాయ భద్రతా రాహిత్యం ఇక్కడి ప్రజలకు లేనందువల్లనే నేను 1923 నుంచి ప్రారంభించిన ప్రతికొత్త సైద్ధాంతిక ప్రతిపాదనలకు చాల శ్రద్ధతో గూడిన ప్రశంసను మద్ధతును నేను పొందాను. నేను పుట్టింది, తదుపరి 1916-20 సం..ల మధ్యకాలం వరకు ఒక జాతీయ వాదరైతు యువకుడిగా పెరిగింది, ఇటువంటి వాతావరణంలోనే.

## ఆక్స్‌ఫర్డ్‌లో మొదటి సంవత్సరం విశ్వవిద్యాలయ విద్యకోసం ప్రయత్నాలు

గత నలభై సంవత్సరాలలో మనదేశంలో, మన ప్రజలలో ఎన్నో ఆనంద దాయకమైన, అభివృద్ధికరమైన మార్పులు వచ్చాయి. 1957 ఆగస్టు 16న మనం ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ దశాబ్ది ఉత్సవాలు జరుపు కుంటున్నాం. ఈ ఉత్సవాలకు భారత గణతంత్ర రాజ్యపు రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ అధ్యక్షత వహించారు. గణతంత్ర రాజ్యపు ఉపరాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ బ్రిటీష పాలనకు వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాట్లకు రెండు వందల సంవత్సరాల చరిత్ర ఉన్నదని, తిరువాన్కూరు అధిపతులు, తమిళనాడు, ఆంధ్రుల నాయకులు, బెంగాల్ సన్యాసులు జరిపిన పోరాటాలను ఉదహరిస్తూ గుర్తు చేశారు. ఆ సభకు పదిలక్షల మంది హాజరయ్యారు. స్వాతంత్రం పొందిన ఈ పది సంవత్సరాలలోను స్వతంత్ర భారతం ఎందరెందరో వలస ప్రజానీకానికి స్వాతంత్ర్యం సముపార్జించేందుకు పోరాడేందుకు సహాయాన్ని, ప్రోత్సాహాన్నీ అందించిందని, ఆసియా ఖండాన్ని విముక్తి చేయడంలో తోడ్పడిందని ప్రపంచ శాంతిని కాపాడడానికి సాయపడిందని, రెండు శిబిరాల మధ్య ఉద్రిక్తత సడలించడానికి సహకరించిందని డాక్టర్ రాధాకృష్ణన్ అన్నారు. ఆ విధంగా భారత ప్రజలందరినీ తమకు పెరుగుతున్న ప్రపంచ బాధ్యతను గుర్తించవలసిందిగా అవసరాలకు తగినట్టుగా పురోగమించి, ఆధునిక ప్రపంచంలో తమ కర్తవ్యాన్ని నెరవేర్చవలసిందిగా ఆయన కోరారు. 37 సంవత్సరాల క్రితం యూరప్‌లో చదువుతున్న భారత విద్యార్థులమైన మాలో కూడ ఇటువంటి కర్తవ్య, బాధ్యతా స్పృహ కలిగించబడింది. కాని అప్పడు మేం కొన్ని వేలమందిమి కాగా ఇప్పడు ఈ కర్తవ్యాన్ని చేపట్టవలసిన వారు స్వాతంత్ర్య సాధన నుంచి వచ్చే ఆత్మవిశ్వాసాన్ని

ప్రోది చేసుకోవలసినవారు కోట్లాది ప్రజా బాహుళ్యం ఉన్నారు ఇది ఒక యుగం మారుతున్నటువంటి మార్పు ఇటువంటి మార్పు గురించే యూరప్ లోని భారత విద్యార్థులమైన మేము కలలు కంటుండేవాళ్లం ఆ యూరోపియన్ సమాజంలో అటువంటి మార్పునే మేం చూస్తుండేవాళ్లం అప్పుడు కొన్ని వేల మందికి మాత్రమే పరిమితమైనది మన ప్రజలందరినీ ప్రతి దినమూ ప్రోత్సహపరచిన ఆలోచన అయింది

ఆ ఉత్సవంలోనే ప్రధానమంత్రి నెహ్రూ ఆ బ్రహ్మాండమైన ప్రజాసమూహానికి, రేడియోద్వారా, పత్రికల ద్వారా భారత ప్రజలందరికీ ఆలోచనా ప్రేరకమైన, ఉత్సాహకరమైన ప్రతిజ్ఞను, ప్రమాణాన్ని, రక్షాబంధనను ఇచ్చారు. వేలాదిగా ఉన్న మా స్థానిక అవసరాలకన్నా, ఫిర్యాదుల కన్నా, కోర్కెల కన్నా యావత్తు భారతదేశ ప్రయోజనాలనే ప్రథమ స్థానంలో గుర్తిస్తాము అని ఆ ప్రతిజ్ఞ జాతీయ ప్రయోజనాల వేదిక మీద ఉన్న సంస్కరణ అవసరాల కోసం స్థానిక అసంతృప్తిని కారణాలను, సంక్షేమ అవసరాల ఒత్తిడిని, భావోద్వేగపూరితంగా సన్నిహితమైన సాంఘిక కోర్కెలను ప్రతివారు వెనక్కి పెట్టే వరకు ఇటువంటి ప్రమాణాలు ఎన్నెన్నో కావలసి ఉంది. జాతీయ ఐక్యత, సేవ, సర్వతోముఖ స్వాతంత్ర్యం గల యూరోపియన్ సాంఘిక, రాజకీయ వాతావరణం వల్ల ఆ గత కాలంలో ఆక్స్‌ఫర్డ్‌లోను, ఇతర యూరోపియన్ విశ్వవిద్యాలయాలోను చదువుచుండిన భారతీయ విద్యార్థులలో అధిక సంఖ్యాకులకు ఈ గుర్తింపు కలిగింది. ఈ మధ్య కాలంలో ఆ మార్గం నుంచి కొందరు తప్పకొని ఉండవచ్చు మరికొందరు ఆ గుర్తింపునే మర్చిపోయి ఉండవచ్చు. కాని నేను మాత్రం ఆ భావాన్ని సుధృడం చేసుకోవడానికి, ఆ గుర్తింపును ఆచరణలో పెట్టడానికి ముఖ్యంగా వేలాది రైతు, కళాకార ప్రజలలో ఆ నమ్మకాన్ని వ్యాప్తి చేయడానికి ప్రయత్నిస్తున్నాను నా సన్నిహిత సహచరులైనా దాన్ని ఆచరించేలా చేయడంలో నేను విజయం సాధించానని కాదు! అందుకనే నిన్న చేసిన ప్రతిజ్ఞ అవసరం వచ్చింది. మన ప్రజలందరికీ ఒక కొత్త పాఠంగా నెహ్రూ వక్కాణించడాన్ని నేను ఆహ్వానించాను.

ఆ యుద్ధానంతర కాలంలో భారత విద్యార్థులందరిలోను ప్రబలంగా ఉన్న భావాలు ఏమంటే భారతదేశం పట్ల మా అసాధారణ బాధ్యతను నెరవేర్చాలని అందువల్ల మేము మా విషయంలోనూ, భారత, ఇంగ్లండ్‌ల

మధ్య ఉన్న అనేక సమకాలీన విషయాలలోను చాల గంభీరమైన బాధ్యతా యుతమైన అంతర్జాతీయ చైతన్యంతో కూడిన శైఖలి తీసుకునేవాళ్ళం ఇంగ్లీషు, యూరోపియన్ జీవితంలోని సంపూర్ణ స్వేచ్ఛాయుతమైన, సాంఘిక సమానత్వం కలిగి దాదాపు స్వర్గతుల్యమైన వాతావరణంలో జీవిస్తున్నందువల్ల అటువంటి స్థితికే మనప్రజలు అభివృద్ధి చెందేలా చూడడం మా ప్రత్యేక విధి అని మేం భావించేవాళ్ళం ఆర్ సి దత్, బెనర్జీ వంశానికి చెందిన ఇద్దరు మహాపురుషులు, ఆలీ సోదరులు, మహాత్మాగాంధీ, అరవింద ఘోష్, సురేంద్రనాథ్ బెనర్జీ, మోతీలాల్ నెహ్రూ, సి ఆర్. దాసు, ప్రకాశంపంతులు ఇంకా మరెందరో జాతీయోద్యమ నాయకులు ఇంగ్లండ్‌లో చదివారని మాకు తెలుసు మా కోట్లాది ప్రజల మధ్యనుంచి కొన్నివేల మందిమైన మేం దైవిక ఘటన వల్ల స్వతంత్ర యూరప్ ప్రజల జీవనాన్ని చూసేలా, వారికి స్వేచ్ఛపట్ల గల ఆలోచనలను, దీక్షను సంతరించుకునేలా, తెల్లవారి మధ్య వారితో సమానంగా తిరిగేలా మారాం. ఆ తెల్లవారిని తూర్పుదేశాలలో, ప్రాచీన ప్రజలు తమకు దైవమిచ్చిన పాలకులుగా అంగీకరిస్తున్నారు కనుక ఆ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు గల యూరోపియన్ ప్రజల జీవనంలోని, ఆలోచనలలోని వారి నాగరికతలోని మంచిని మా ప్రజలకు అందజేయడం, అట్లాగే వారు కూడ ఇటువంటి జాతీయ స్వాతంత్ర్యాన్ని, సాంఘిక అభివృద్ధిని సాధించేలా సాయం చేయడం మా పవిత్ర కర్తవ్యంగా భావించాం ఆ విధంగా మాపై ఉన్న ప్రత్యేక కర్తవ్యం పట్ల మేం విశ్వాసం పొందాం గ్రామీణ భారతంలోని మా పల్లెసీమలలో ఆరు సంవత్సరాల క్రియాశీల భాగస్వామ్యం వల్ల నేను ఈ వాతావరణానికి పూర్తిగా అనుకూలుణ్ణయ్యాను. ఓడమీద మూడునాళ్ళ పాటు కలసి ఉన్నప్పుడు సర్ సి సి.రే నాలో ఆ భావాన్ని రేకెత్తించారు. నేను మా జిల్లాలు, ప్రాంతాలు అనే పద్ధతిలో ఆలోచించడం మానేసి యావత్ భారతదేశం గురించి ఆలోచించడం, పనిచేయడం నేర్చుకోవాలని ఆయన అన్నారు. సముద్ర తరాంగాల మీద, ఖండాంతరాల మీద చర్చించడం అంటే స్వాతంత్ర్య సమరయోధుల ఉద్వేగభరిత సైన్యంలో చేరడం అన్నమాట. రామకృష్ణగారు నాలోని ఈ కర్తవ్య దీక్షను ఇనుమడింప చేశారు ఈ రకంగా 1920 సంవత్సరమంతా నేను భారత గ్రామీణ ప్రజలకోసం 1921 లో గాంధీ మహాత్ముడు ప్రారంభించనున్న ఉద్యమపు పూర్తి ప్రాధాన్యాన్ని అర్థం చేసుకోవడంలో మునిగిపోయాను.

ఇంగ్లండ్‌కు వెళ్ళిన మా అందరిలో చాల మందికి కొన్ని నెలలపాటు అక్కడ ఉన్న తర్వాత అద్భుతమైన పరిణామం కలగడం మొదలైంది మా భారత సాంఘిక వాతావరణంలోని ఎన్నెన్నో కట్టుబాట్ల నుంచి మేం విముక్తమయినట్లుగా భావించాం భారతదేశంలో బయల్దేరడానికి ముందుగాని, ఇంగ్లండ్ చేరిన తర్వాత గాని అనిపించినట్టుగా ఐ సి ఎస్ ప్రొబేషనర్లు సవ్యసాచుల్లా కనిపించడం మానేశారు అప్పటిదాకా చాలమంది విద్యార్థుల మనసుల్లో ఒకానొక జాతీయ నాయకుడిగా మాత్రమే ఉండిన గాంధీ మహాత్ముడు మా మనసుల్లో మహానుభావుడైన జాతీయ నాయకుడిగా రూపుదిద్దుకోవడం ప్రారంభించాడు భారతీయ విద్యార్థులందరూ, జాతీయ కాంగ్రెస్‌ను ఎంత గాఢంగా అభిమానించారంటే అనీబిసెంట్, శ్రీనివాస శాస్త్రిల వంటి మహోపన్యాసకులైన జాతీయ నాయకులు, శత్రువులుగా కనిపించడం మొదలెట్టారు ఇంగ్లీషు పౌరులు వారి నిర్నిబంధ రాజకీయ స్వేచ్ఛను అనుభవించడం మేం కళ్ళారా చూశాం వారి దిగువ సభకు ఉన్న శక్తిని, ప్రజాస్వామిక స్వభావాన్ని మేం గుర్తించాం ఆ ప్రజలకున్న రాజకీయ స్వాతంత్ర్యం, సాంఘిక ఉద్ధరణ, ఆర్థిక సౌభాగ్యం గల వాతావరణాన్ని మేం సంతరించుకున్నాం. మన దురదృష్టకరమైన భారతదేశంకన్నా, సాపేక్షికంగా చాల ఎక్కువ సౌభాగ్యమూ, శక్తి కలిగిన ఇంగ్లండ్ ప్రజలకు మధ్య ఉన్న విభేదాల్ని గుర్తించడానికి మేం ఏమీ శ్రమించనవసరం లేకపోయింది స్వతంత్రంగా ఉండాలని, స్వతంత్ర భారతాన్ని సాధించడానికి కృషి చేయాలని, ఆ సాధనకోసం మమ్మల్ని మేం సిద్ధంచేసుకోవాలని మాలో వినూత్నమైన, ఆపుకోలేని ఆకాంక్ష కలగడంతో మేం ఉత్తేజపూరితం కావడం సహజమే ఆ రకంగా యూరప్‌లోని వాతావరణమే రాజకీయంగా విముక్తి కొరకై మమ్ములను, నిమగ్నం చేసేంత ప్రేరణాత్మకమైన ప్రభావాన్ని వేసింది. అంతే గాక ఇంగ్లండ్‌లోని దిన, వార పత్రికలలో యుద్ధానంతర జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై చర్చలు మమ్మల్ని ఒక కొత్త జ్ఞాన ప్రపంచంలోకి తీసుకుపోయాయి. ఎన్నో సాంఘిక, రాజకీయ ఐక్యతా శక్తులు, ఘర్షణ శక్తులు ఉనికిలో ఉన్న ప్రపంచం మాకు అవగతమయిన దాని వల్లనే దక్షిణాదిలోని బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం, ఉత్తరాదిలోని హిందూ-ముస్లిం సమస్య, కులతత్వం, బ్రాహ్మణవాదం, విగ్రహారాధన, మధ్యతరగతి నిరుద్యోగం వంటి

స్థానిక, సాంఘిక సమస్యలనెన్నిటినో అత్యవసరమైన జాతీయ దృక్పథం నుంచి చూడడానికి మాకు అది మాత్రమే సాయపడింది. ఆ 1920 సంవత్సరం నా విషయంలో అత్యధిక రాజకీయ ప్రాముఖ్యత గల సంవత్సరం. ఆ సంవత్సరమే లోకమాన్య తిలక్ మరణించారు మహాత్ముడు కాంగ్రెస్‌కు తిరుగులేని నాయకుడుగా ఎన్నికయ్యారు కాంగ్రెస్ బహిష్కరించిన సమితులలో ప్రవేశించడానికి అంగీకరించిన బ్రాహ్మణేతర పార్టీ దాని ఆకర్షణను కోల్పోయింది బ్రిటీష్ ప్రధానమంత్రి లాయిడ్ జార్జ్ నానాజాతి సమితిని రక్షించడానికి ప్రయత్నించాడు. భారత జాతీయోద్యమాన్ని సమర్థిస్తున్నందువల్ల తాము ఎంతో ప్రగతిశీలురమని భారతీయ విద్యార్థులు గర్వపడుతున్న తరుణంలో యూరప్‌లోని ప్రజ్ఞావంతులైన మేధావులు కొందరు ఇటువంటి జాతీయవాదం ప్రగతి నిరోధకమని, ప్రపంచ ప్రభుత్వానికి, విశ్వపౌరసత్వానికి వ్యతిరేకమని భావిస్తూ పూర్తిస్థాయి వసుధైక కుటుంబాన్ని, ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి పునాదులు వేయాలని కలలు కంటున్నారని మాకు హెచ్.జి.వెల్స్ రాసిన (ఔట్‌లైన్స్ వరల్డ్ హిస్టరీ) చదివితే అర్థమైంది ప్రపంచ పౌరసత్వం గురించిన అనుకూలమైన, ప్రతికూలమైన వాదనలకు పెరుగుతున్న ప్రభావాన్ని గురించి మమ్మల్ని హెచ్చరించడానికా అన్నట్లు, యూరోపియన్ రాజకీయాల్లో నానాజాతి సమితి రోజురోజుకూ పురోగమించడం మొదలైంది మరోవైపు అమెరికా ఎన్నికలలో నానాజాతి సమితి వ్యతిరేకులు గెలుపొందారు. ఈ చర్చల మధ్యకు మేం కూడ వెళ్ళవలసి వచ్చింది మేం కూడ తీవ్రంగానే ఈ చర్చల్లో పాల్గొనడం మొదలుపెట్టాం. ఈ విషయంలో మమ్మల్ని ఉత్సాహపరచినవి హెచ్.జి.వెల్స్ రచనల ముఖ్యంగా "ది సాల్వేషన్ ఆఫ్ ది వరల్డ్" అనే పుస్తకం నార్మల్ ఏంజిల్స్ రాసిన "దిగ్రేట్ ఇల్యూజన్" అనే పుస్తకం

ఇంకో కోణం నుంచి సోషలిస్టు దృక్పధానికి పెరుగుతున్న ప్రభావం పట్ల మేం ఏదో ఒక అభిప్రాయాన్ని కలిగి ఉండక తప్పలేదు. ఇంగ్లండ్‌లో లేబర్ పార్టీ ఎక్కువ విజయాలు సాధిస్తుండేది. దాని నాయకులు యుద్ధ మంత్రివర్గంలో ఉన్నారు. సోషలిజం గురించి చాల ఎక్కువగా చర్చిస్తుండే ఇంగ్లండ్‌లో లేబర్ పార్టీ సోషలిజంలోని వేరు వేరు అంశాల గురించి చాల పుస్తకాలలో ప్రచురిస్తుండేది. విశ్వవిద్యాలయ బృందాలలో ఫేబియన్ సొసైటీ,

విషయాలు చర్చిస్తుండేవాళ్లం కమ్యూనిస్టు రష్యాలోని కార్మిక వర్గాలూ, రైతు జనావళి రాజకీయ ఆధిపత్యాన్ని సాధించగలిగారని నాకు అనిపించింది ఇంగ్లండ్‌లో లేబర్ పార్టీ అధికారాన్ని పొందగలనని భావిస్తున్నప్పుడు, రష్యన్ రైతుల కార్మికులు రాజకీయ అధికారాన్ని సాధించినప్పుడు, మార్క్స్ లెనిన్ వంటి రచయితలు, కమ్యూనిస్టు నాయకులు ప్రపంచ వ్యాప్తంగా అటువంటి సాంఘిక ధర్మాన్ని బోధిస్తున్నప్పుడు భారతదేశంలో కూడ ఒక స్వతంత్ర గణతంత్ర రాజ్యంలో మన రైతులు, కార్మికులు కూడ అధికారాన్ని చేపట్టి అత్యున్నత వ్యక్తులు కాగల రోజు, యుగం వస్తుందని నేను కూడ ఆశించవచ్చుననిపించేది

నేను భారతీయ మజ్లిస్, ఆక్స్‌ఫర్డ్ విద్యార్థి సంఘం, ఏషియాటిక్ క్లబ్, లోటస్ క్లబ్‌లకు వెళ్లటం వారి చర్చలను అర్థం చేసుకోవడం మొదలు పెట్టాను ఆ విశ్వవిద్యాలయ విద్యార్థులు వర్తమాన వివాదస్పద, ప్రాముఖ్యత ఉన్న జాతీయ, అంతర్జాతీయ విషయాల నెన్నిటినో అంత ఉన్నతస్థాయి బాధ్యతతో చర్చించడం చూసి నాకు చాల గౌరవం కలిగింది వారు ఆ చర్చలలో బాధ్యతతో మాత్రమే కాక ఆత్మ విశ్వాసంతో, స్వతంత్రంగా వ్యవహరించేవారు బ్రిటీష్ కాబినెట్ మంత్రులు అమెరికన్ రాజనీతిజ్ఞులు, ఫ్రెంచి ప్రీమియర్లు, భారతదేశపు మాజీ బ్రిటీష్ వైస్‌రాయ్‌లు ఈ చర్చలలో పాల్గొనేవారు ఆ చర్చల తమ పక్షం వాదనను ప్రవేశపెట్టడానికి విద్యార్థులతో వారు పోటీ పడేవారు. ఆవిద్యార్థులతో వారు గౌరవంగా, సాంఘిక స్వాతంత్రంతో సమాన స్థాయిలో వ్యవహరించేవారు

ఆ 1920 సం.. కల్లా ఇంగ్లీషు స్త్రీలు ఓటింగ్ హక్కులో కొంత భాగాన్ని పొందారు. స్త్రీ స్వాతంత్ర్యం గురించి జె. ఎస్. అర్ మిల్ చేసిన ఊహలు ఫలించాయి. భారతీయ స్త్రీలకు కూడ ఇటువంటి ప్రతిపత్తి ఉండాలని మేం వాంఛించాం.

ఎగువ సభను రద్దు చేస్తారని ఒక వాదన ఉండేది. సోషలిస్టులు దాన్ని రద్దు చేయాలని కోరుకున్నారు. లిబరల్‌లు దాన్ని సంస్కరించాలని కోరు కున్నారు. లార్డ్ బ్రైస్ కమిటీ దానిలో మౌలిక సంస్కరణలను సూచించింది కనుక భారతీయ రాచరికం పట్టునుంచి మనం కూడ విడిపించుకోలేమా అనే ఆలోచనలు మాలో తలెత్తాయి మేం ఫ్రెంచివిప్లవం గురించి కూడ

చదివాం. ఆక్స్‌ఫర్డ్‌లో ప్రొఫెసరు, విద్యాశాఖ మంత్రి అయిన ఎచ్ ఎల్ ఫిషర్ పందొమ్మిదో శతాబ్దపు యూరోపియన్ విప్లవాల గురించి ఒక పుస్తకం వ్రాశారు. జార్ చక్రవర్తి కుటుంబంతో సోవియట్ రష్యా వ్యవహరించిన విలక్షణ పద్ధతి సహించరానిదిగా ఉండింది. ఈ సంఘటనలన్నీ కూడ రాచరికం పట్ల భారతీయ భావన గురించి, భారతీయ రాజుల పట్ల జాతీయ అభిమానం గురించి మాలో ఉన్న సాంప్రదాయక విధేయతను బలహీనపరిచాయి

నాకు సేంట్ కాథరీన్స్ డెలిగసీలో సీటు దొరుకుతుందనే హామీ దొరికిన తరువాత ఆక్స్‌ఫర్డ్‌లో కలిసినటువంటి సహచరులు, మిత్రుల్ని పొందగలిగి నందుకు నేను చాల అదృష్టవంతుణ్ణని చెప్పకోవాలి. మద్రాసు రాష్ట్రం నుంచే వచ్చిన ఆరుగురు ఐసిఎస్ ప్రొబేషనర్లు నన్ను సంతోషంగా ఆహ్వానించి తమ స్నేహం కలుపుకున్నారు ఆ తర్వాత వాళ్ళందరూ కూడ బ్రిటీష్ పాలనా కాలం లోనూ, ఆ తర్వాత భారతీయ అధికార వర్గంలో అత్యున్నత స్థానాల్ని చేపట్టారు. వాళ్ళందరూ భారతదేశపు సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యలను ఒక దేశభక్తి కోణం నుంచి చర్చించేవారు. కనుక వారానికి రెండుసార్లు జరిగే మా సమావేశాలు, చర్చలు నాకు ఎంతో ఆసక్తికరంగాను, ఉత్సాహజనకంగాను ఉండేవి. వారిలో చట్ట, రాజ్యాంగ వ్యవహారాలు చాల ఎక్కువగా ఆలోచించే షహబుద్దీన్ గారు ఆ తర్వాత పాకిస్థాన్ సుప్రీంకోర్టు ప్రధానన్యాయమూర్తి అయ్యారు. ఆక్స్‌ఫర్డ్‌లో ప్రముఖ భారతీయ ఉపన్యాసకుడు, బొంబాయి ప్రధాన న్యాయమూర్తి స్థాయికి ఎదిగినవారు, ఇప్పుడు భారత ప్రభుత్వంలో విదేశాంగ శాఖా మంత్రిగా ఉన్నవారు అయిన ఎం సి. చాగ్లా గారిని ఆయన అభిమానిస్తుండే వారు మలబార్ నుంచి వచ్చిన ప్రశాంతంగా, చిరునవ్వుతో, మెత్తగా మాట్లాడుతూ ఉండే వెల్లోడీ గారు స్వతంత్ర భారతానికి లండన్‌లో డిప్యూటీ కమీషనర్‌గాను, తర్వాత కాలంలో నెహ్రూ మంత్రి వర్గానికి కార్యదర్శి గాను పనిచేశారు టి భాస్కరరావుగారు కలెక్టరుగా పనిచేసి రిటైర్ అయ్యారు. ప్రస్తుతం ఆయన ఒక పెద్ద పారిశ్రామిక సంస్థలో భాగస్తులుగా ఉన్నారు. వి. రామకృష్ణగారు ఈ రోజు చాల చురుకైన నిర్మాణాత్మకమైన పారిశ్రామిక నాయకులుగా దక్షిణ భారతదేశంలో భారీ పరిశ్రమల నిర్వాహకులుగా ఉన్నారు

రామకృష్ణగారు నాకు డైసీ, లార్డ్ బ్రైస్, [illegible] రచనల సహాయంతో ఇంగ్లీషు రాజ్యాంగపు ప్రాథమిక సూత్రాలను, ఇంగ్లాండు రాజ్యాంగ

చరిత్రను, ఫ్రాన్స్ అమెరికా రాజ్యాంగ చరిత్రను, రాజనీతి శాస్త్రాన్ని, అర్థ శాస్త్రాన్ని అర్థం చేసుకోవడం నేర్చారు ఆయన దగ్గర ఈ విషయాలపై ఉన్న పుస్తకాలన్నిటినీ నేను చదివేశాను ఆయన సూచనపైగాని, నా అంతట నేనుగాని ఈ విషయాలపై నేను వ్యాసాలు వ్రాసేవిగా, వీటిని ఆయన ఓపిగ్గా చదివి, అంతే ఓపిగ్గా వాటిని బాగుపరచడానికి, చాల ఆహ్లాదకరమైన పద్ధతిలో సూచనలు ఇస్తుండేవారు నేను ఆత్మ విశ్వాసాన్ని పొందడాన నాకు అన్నిటికన్న ఎక్కువగా ఈ సూచనలు ఉపయోగపడ్డాయి ఆ తర్వాత నాకు ఆక్స్‌ఫర్డ్‌లో మంచి ఉపాధ్యాయులలో కొందరి దగ్గర మంచి శిక్షణ పొందే భాగ్యం కలిగింది గాని నా కోసం కేటాయించిన సమయాన్ని బట్టిగాని, ఆదరమైన ఓపికైన బోధనా పద్ధతిలోగాని వాళ్ళెవరూ రామకృష్ణగారికి సాటిరారు

అది ఒక సుదీర్ఘమైన చలికాలం చాల చలిగా, నిరాశాజనకంగా ఉండేది. ఎల్ వి బి చౌదరి గారు దానితో నిరుత్సాహ పడ్డారు రామకృష్ణగారు తప్ప మిగిలిన ఐసిఎస్ ప్రొబేషనర్లందరి స్థితీ అంతే అటువంటి భౌతిక విషయాల పట్ల ఆయన పూర్తిగా నిర్లిప్తంగా ఉండేవారు. బోట్లే చుట్టూ ఉన్న ప్రశాంతమైన, విశాలమైన గ్రామీణ రహదారులపై ఆయనా, నేను ప్రతి సాయంత్రం చాల దూరం నడుస్తుండే వాళ్ళం ఆర్థిక, సాంఘిక సమస్యల గురించిగాని, ఇంగ్లీషు ప్రజలు లేదా భారత ప్రజల జీవితం గురించిగాని ఏదో ఒక అంశం మీద మేం చర్చించుకునే వాళ్ళం రెండు జీవితాలను ఒకదానితో ఒకటి పోల్చి మన లోపాలకు కారణాలను గురించి ఆలోచించే వాళ్ళం. మన సమస్యల పరిష్కారాలను అన్వేషించేవాళ్ళం. మన స్థితి గతుల మెరుగుదలను కోరుకునేవాళ్ళం. మేం అప్పటికి చదువుతున్న పుస్తకాలను వార్తా పత్రికల వ్యాసాలను ప్రస్తావించుకుంటూ ఉండేవాళ్ళం ఈ సాక్రటీసు బోధనా పద్ధతి నడక కోసం, చర్చల కోసం నేను రోజూ ఎదురు చూస్తూ ఉండేవాణ్ణి. అటువంటి ప్రతి సాయంత్రపు నడక నాకు బలవర్ధక ఔషధంగా పనిచేసేది అలా నేను నా ప్రతి రోజు కార్య కలాపాలకు, నా కర్తవ్యానికీ ఉన్న సంబంధాన్ని గురించి అంచనా కట్టుకునే అలవాటు చేసుకున్నాను

అదే రకమైన రైతు నేపథ్యం నుంచి వచ్చిన మరో ఇద్దరు సహ విద్యార్థులుండేవారు. వారు ఎల్ వి.బి.చౌదరిగారు, వి.ఎస్ కృష్ణగారు వారికి

కూడ వెలగపూడి రామకృష్ణగారి పట్ల అభిమానం ఉండేది ఆ ఐసిఎస్ ప్రొబేషనర్ల బృందంలో వారు కూడ చేరారు చౌదరి గారికి తెలుగు సాహిత్యం పట్ల ప్రత్యేక శ్రద్ధ ఉండేది కృష్ణగారికి ఇంగ్లీషు సాహిత్యంపై శ్రద్ధ ఉండేది వారి పరస్పర చర్చలతో వారి ఆలోచనల నుంచి అధ్యయనాల నుంచి నేను నిశ్శబ్దంగా నేర్చుకోవడానికి చేసిన ప్రయత్నంతో నా సాహిత్య పరిజ్ఞానాన్ని పెంచుకోవడానికి ప్రయత్నించాను చౌదరిగారు నన్ను పుస్తకాల పురుగుగా లెక్కించేవారు. వాదనలలో ఐసిఎస్ ప్రొబేషనర్ల మీద విజయం సాధించడానికి ఆయన తన వ్యంగ్యానికి పదును పెట్టుకుంటుండేవారు. కృష్ణగారు వయసులో చిన్న, మౌనంగా ఉండేవారు. తనలో తానే ఆలోచించు కుంటుండేవారు. కనుక మేం ముగ్గురం ఆ ఆక్స్‌ఫర్డ్ జీవితంలో ఎక్కువగా లాభపడదలచుకున్న ఉత్తమ, విభిన్న త్రిమూర్తులంగా ఉండేవాళ్లం.

విశ్వవిద్యాలయ యువకులలాగ నేను ఇంగ్లీషు సాంఘిక జీవితపు సుడిగుండంలో పడిపోలేదు. అది భారతీయ విద్యార్థులెందరికో చాల ఆకర్షణీయంగా. చాల ప్రమాదకరంగా ఉండేది. నేను అప్పటికే గ్రామీణ భారత జీవితాన్ని గడిపి ఉండడంవల్ల, రామకృష్ణ పరమహంస, వివేకానందుని, రామతీర్థ బోధనలను చదివిన ప్రభావం ఉండడం వల్ల నేను ఈ ప్రమాదానికి లోనుగాలేదు. సమకాలీన భారత, బ్రిటీష్ తదితర సమస్యలపై రామకృష్ణ గారితో రోజూ జరిపిన చర్చలు, సాహచర్యం నాకు చాల ఆహ్లాదకరంగా, ప్రేరణాత్మకంగా నిలచాయి భారతీయ గ్రామీణ ప్రజల ఆర్థిక స్థితిగతులను మెరుగు పరచడానికి, వారి సాంఘిక వాతావరణాన్ని పునరుజ్జీవింప జేయడానికి మార్గాలు, సాధనాలను అన్వేషించడంలో రామకృష్ణ గారిలో ఉన్న ఆసక్తి నా హృదయానికి దగ్గరగా, నా ఇష్టాలలో ఒకటిగా కనిపించింది. ఆ విధంగా, ఇంగ్లండ్ ఇతర పాశ్చాత్య ప్రపంచం పొందుతున్న వేగవంతమైన అభివృద్ధి గురించి నేను ఇతోధికంగా పొందిన జ్ఞానం ద్వారా నాకు కొత్తగా అందిన దృక్పథం నుంచి నేను భారతదేశాన్ని దర్శించడంలో తీవ్రతతోను, ఉత్సాహంలోను మునిగిపోయాను. నేనప్పటికింకా ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయంలో సంపూర్ణ విద్యార్థి కాలేదు కాని అప్పటికే భారతదేశానికి సాంకేతిక ప్రగతిని, సాంఘిక విప్లవాన్ని సాధించ[illegible] ఆత్మ విశ్వాసపూరిత కర్తవ్యాన్ని సాధించడానికి సిద్ధపడ్డాను నా ఆలోచనల్లో, అధ్యయనంలో, నా

ఆదర్శాలను ప్రణాళికల్లోకి అనువదించే శక్తిలో నేను పొందుతున్న త్వరిత అభివృద్ధిపట్ల రామకృష్ణగారు సహజంగానే ఆనందించారు నా ఆలోచనలను ఆయన మంచి సమర్థమైన ఇంగ్లీషు రూపంలోకి మారుస్తుండేవారు. విశ్వ విద్యాలయ సంఘంలోని మంచి ఉపన్యాసకులతో కూడ వాదనా అంశాలను నేను పోటీ పడగలననే విశ్వాసం ఉన్నప్పటికీ, రామకృష్ణగారు ఇంగ్లండ్ నుంచి వెళ్ళిపోయేటప్పుడు నాకు ఒక సూచన చేశారు నా ఆలోచనలను, పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవడంలోనే గాక, ధారళమైన, సమర్థమైన ఇంగ్లీషులో నన్ను వ్యక్తీకరించుకోగల శక్తి వచ్చేవరకు కనీసం ఒక సంవత్సరంపాటు విశ్వ విద్యాలయ సంఘంలో ఉపన్యాసం ఇవ్వవద్దని ఆయన సూచించారు. ఆయన సూచనను నేను అంగీకరించాను నేను ఇండియన్ యూనియన్, మజ్లిస్, లేబర్ క్లబ్ తదితర స్థలాల్లో 1922లోనే ఉపన్యసించడం ప్రారంభించాను

# కారణజన్ముడు రంగాజీ

కారణజన్మ అనేది గొప్ప అర్థములో వాడబడినట్లు కారణజన్ములనేవారు అసాధారణ వ్యక్తులుగా వుంటారు అనన్య సామాన్యములైన కార్యములను సిద్ధింపజేయుటకు యుగయుగాలుగా దేశదేశాలలో జన్మిస్తూ వుంటారు. అలాంటి మహోన్నత వ్యక్తులను దైవాంశ సంభూతులుగా పరిగణించబడటం జరుగుతుంది మన దేశమునుండే ఒక ఉదాహరణము బుద్ధుడు బుద్ధునికి పూర్వం మతాధిపతులు, పీఠాధిపతులు, పురోహిత గణాలు తమ ఇష్టారాజ్యంగా పాలనచేసి ప్రజలను అనేక విధాలుగా హింసించడం జరిగింది. మానవత్వ విలువలనే నశింపజేశారు మానవులను కులమత, సంకుచిత వర్గాలుగా చీల్చి, జాతిని చీల్చి, జాతిని నిర్వీర్యం చేశారు. మతాధిపతులదే రాజ్యం మతాధిపతులే మానవుని యొక్క మనుగడను శాసించారు. అశేషంగా మిగిలిన జనాలు బానిసలుగా, బానిసలకంటే హీనంగా, పశుపక్ష్యాదుల కంటే నికృష్టంగా జీవించడం జరిగింది

ఈ నేపథ్యంలో ఒక చిన్న రాజకుటుంబం నుండి గౌతముడు జన్మించాడు ఆయన తన అసమాన ప్రతిభా సంపన్నతచే సంఘంలో పేరుకొని పోయిన కుళ్ళును కూకటివ్రేళ్ళతో పెకలించి వేసినట్లు ప్రక్షాళన చేశాడు. కులాలను నిర్మూలించాడు మతమౌఢ్యాలను అరికట్టాడు సమసమాజాన్ని నిర్మించాడు. కారణజన్ములంటే ఈ కోవకు చెందినవారే ఆనాటి ఆ సమాజములో అప్పటికి ఉన్న వారెవరూ చేయలేని ఒక కార్యక్రమాన్ని చేసి అద్భుతంగా సాధించాడు అందుకే ఆయనను కారణజన్ముడన్నారు. [illegible] కారణ జన్ములనేవారు ఒక ప్రత్యేక కార్యక్రమ నిర్వహణ కొరకే జన్మించి [illegible] ప్రజల మధ్య దైవాంశసంభూతులుగా అంతేకాదు దేవాంశములుగా కొనియాడబడ్డారు.

ఇలా చెప్పుకుంటూ పోవాలంటే జీసస్ క్రీస్తు, మహమ్మద్ ప్రవక్త, సోక్రటీస్, అరిస్టాటిల్, ప్లేటో మరి అలాగే మనదేశంలో శ్రీరామచంద్రుడు, శ్రీ కృష్ణ భగవానుడు మొదలగు మహానుభావులందరు కారణజన్ములైనవారే. అందుకనే ఒక ధర్మసూక్ష్మాన్ని గీతలో జ్ఞానయోగమునందు శ్రీకృష్ణభగవానుడు తాను జన్మించుటకు గల కారణములను ఈ క్రింది శ్లోకము ద్వారా చెప్పాడు చూడండి

ఆయనను కారణజన్ముడని కూడా పలువురు మహాపురుషులు అభివర్ణించారు కమ్యూనిస్టుల, నిరంకుశ, పాశవిక, అరాచక విధానములను ప్రప్రధమంగా వెలుగులోనికి తెచ్చి ఖండించి దాని అంతమును తన కళ్ళముందే చూచిన దార్శనికుడు

రంగాజీ 1924 ఇంగ్లండులో చదువులు సాగిస్తున్న కాలంలోనే మార్క్సిజం, కమ్యూనిజం, సోషలిజంల ప్రభావానికిలోనై సుత్తి, కొడవలి చిహ్నంగా ఎర్రజండాను ఎగురవేసిన తొలి యువతరంలోని వారు

పదేండ్లు గడిచాయో లేదో 1934,35ల నాటికే నేతి బీరకాయలో నెయ్యిలేనట్లు, రష్యాలో, దాని మిత్ర దేశాలలో నడుస్తున్న కమ్యూనిస్టు ప్రభుత్వా లలో కమ్యూనిజంలేదు సోషలిజం లేదు చివరకు సంక్షేమ తత్త్వమేలేదని కనిపెట్టిన రాజనీతిజ్ఞుడు రంగాజీ

1935-40 ల మధ్య కాలంలోనే కమ్యూనిజమంటే ఏకపక్ష కార్మిక నియంతృత్వమేనని ముందుగా ముందుగా అవగాహనకు వచ్చిన ఇరువురు మహామేధావులలో రంగాగారొకరు. రెండవ వారు యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ నిర్మాత ఆదేశ కమ్యూనిస్టు ప్రభుత్వాధినేత మార్షల్ టిటోకు గురువు "మిహిలోవ్ జిలాస్", "న్యూక్లాస్" అనే గ్రంథం ద్వారా ప్రపంచానికి తెలియచెప్పారు.

అంతకంటే ముందు ముందు అంటే రష్యాలో వి.ఐ లెనిన్ ప్రధానిగా అధికారం చేపట్టిన తొలినాళ్ళలోనే- ప్రజాస్వామ్యానికి నీళ్ళు ఒదిలి, ఏకపక్ష కార్మిక నియంతృత్వం ప్రభుత్వ విధానంగా ప్రకటించారు.

అప్పుడే ఆరోజుననే లెనిన్ సమకాలికురాలు బోల్షివిక్ పార్టీ వ్యవస్థాపకురాలు "మేడం లగ్జెంబర్గ్" నీవు తప్పుదారి తొక్కుతున్నావు ప్రమాదంలో పడగలవు. ప్రజాస్వామ్యమే మానవుని వ్యక్తిత్వ వికాసానికి, అభ్యుదయానికి మనుగడ అంటూ హెచ్చరించింది. లెనిన్ పెడచెవిన పెట్టాడు. ఆమెను పార్టీ నుంచి బహిష్కరించాడు. దేశాన్నుండి పారద్రోలాడు. జర్మనీ వెళ్ళింది. అకాల మృత్యువాత పడింది. (ఆమె ప్రతిపాదించి ప్రచురించిన ప్రజాస్వామ్య సిద్ధాంత డాక్యుమెంటు విశాలాంధ్ర పబ్లికేషన్సువారు ప్రచురించారు, ఆసక్తిగల వారు పరిశీలించండి.)

రంగాజీ 1935-36లలోనే కమ్యూనిజం పెడదారులు త్రొక్కుతుందని అనుమానించారు పరిశీలించడం ప్రారంభించారు. యదార్థమేనని నిర్ణయించారు 1938 నుండే కమ్యూనిస్టులకు దూరంగా ఉండడం ప్రారంభించారు 1940 చేరుకొనే నాటికి దాని నుండి తప్పు కోవాలని నిర్ణయించుకొన్నారు అవాళ్లలోనే ఎదిరించి బయటపడ్డారు.

మార్క్సిజం, కమ్యూనిజం, ఏకపక్ష కార్మిక నియంతృత్వ సిద్ధాంతానికి, మార్క్సు క్యాపిటలు గ్రంథానికి ప్రత్యామ్నాయంగా ప్రజాస్వామ్యం, ప్రాతి పదికగా, దానినే ప్రాణ పదంగా ఎంచుకొనే విధంగా "కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్" సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.

1944లో జైలు నుండి విడుదలవుతూనే గాంధీతో చర్చించి ఆమోదింప చేశారు. ఈ కథలన్ని కాలగర్భంలో కలసిపోకుండా వెలుగులోనికి తేవాలనేదే నా సంకల్పం. ఇందుకు ప్రభుత్వంతో చర్చలు సాగించాలి. అంగీకరింప చేయాలి.

రంగాజీ జీవితంలో ఎన్నో ఘట్టాలు – మరెన్నో ఘటనలు – ఈ ఘట్టాలు, ఘటనలు, ఘర్షణలుగా, సంఘర్షణలుగా ముసురుకున్నాయి. అన్నింటిని ఎదిరించి నిలచిన ధీరోదాత్తుడాయన

అపోహలతో, అపార్థాలతో, అబద్ధాలు సృష్టించి, అక్రమాలు సాగించి ఆయనను జీవితమంతా ఎదిరించారనేకులు వేధించారు మరికొందరు.

ఇక ప్రదాని పండిట్ నెహ్రూతో సిద్ధాంత పోరాటాలు, అపజయాలు, పరాజయాలు పొందుతూనే విజయాలు సాధించిన యోధులు రంగాజీ. అందువలన రంగాజీ జీవిత ఘట్టాలు ఘట్టాలుగా, ఘటనలు ఆధారంగా ఘర్షణలు, సంఘర్షణలు జరిగిన తీరుతెన్నులను మరోమారు నెమరువేసుకొన వలసియున్నది అందుకే యీ చిన్న గ్రంథం. ఇది సంక్షిప్తం. దీని నుండి పరిశోధకులు లోతుగా పరిశీలించి, పరిశోధించి, గ్రంథస్తం చేయవలసి వున్నది. ఆ పనిని ముందు తరాలకు వదులుదాం.

ఆచార్య యన్. జి. రంగా అరవై అయిదు సంవత్సరాలు పార్లమెంటులో ఉన్న ప్రముఖ గాంధేయవాది, ఆర్థిక శాస్త్రంలోను, చరిత్రాధ్యయనంలోను

ఆక్సుఫర్డులో పట్టంపుచ్చుకొన్న ప్రముఖ శాస్త్రవేత్త గుంటూరు జిల్లా నిడుబ్రోలులో 1900 సంవత్సరములో జన్మించారు 1924లో భారతీదేవి రంగాను వివాహమాడారు.

రంగాజీ గాంధేయ సిద్ధాంతాలను వరించిన గిల్డుసోషలిస్టు అంతర్జాతీయ రైతాంగనేత భారత పార్లమెంటులో 1930 నుండి ఇటీవల వరకు కాంగ్రెసులోను, ప్రతి పక్షంలోను అగ్రగామిగా నుండి ప్రపంచ పార్లమెంటరీ వేదికలైన, వివిధ దేశాల సంయుక్త పార్లమెంటు సమాఖ్యలలోను, కామన్‌వెల్తు పార్లమెంటు సమాఖ్యలలోను, గణనీయమైన పాత్ర నిర్వహించారు కాంగ్రెసు ఆర్థిక, ప్రణాళికా విభాగ కార్యక్రమాల్లోను, ప్రభుత్వరంగ పరిశ్రమ సంస్థల కమిటీలలోను, పబ్లిక్ ఎకౌంట్స్ కమిటీ ఛైర్మన్‌గా ఉండి బహుముఖంగా ఖ్యాతి నార్జించారు

## జాతీయ అంతర్జాతీయ సంస్థల స్థాపన

అంతర్జాతీయ వ్యవసాయోత్పత్తి దారుల సమాఖ్యను స్థాపించిన ప్రముఖులలో రంగాజీ ఒకరు వారు అఖిల భారత కిసాన్ కాంగ్రెసుకు వ్యవస్థాపక అధ్యక్షులు, భారత రైతాంగ విద్యాలయం, నిడుబ్రోలు, విదేశ వ్యవహారాల సంఘం, న్యూఢిల్లీ, గ్రామీణ ప్రజా సమాఖ్య, చేనేత చేతివృత్తుల కాంగ్రెసు సంస్థలకు వ్యవస్థాపక అధ్యక్షులు కూడా "రైతు కూలీ ప్రజా రాజ్య" సిద్ధాంతాన్ని ప్రవచించి మహాత్మాగాంధీజీచే ఆశీస్సుల నందిన మహాతత్త్వవేత్త.

భారత ప్రతినిధిగా అనేక అంతర్జాతీయ సభల్లో పాల్గొన్నారు. శాన్ ఫ్రాన్సిస్కోలో జరిగిన అంతర్జాతీయ కార్మిక మహాసభలోను, కోపెన్ హాగన్‌లో జరిగిన ఆహార, వ్యవసాయ మహాసభలోను, టోకియో ప్రపంచ శాంతి మహాసభలోను, మిత్ర రాజ్య సమితి పారిస్‌లో నిర్వహించిన గాంధీ శత జయంతి సదస్సులోను, 1969లో పాల్గొని చరిత్రాత్మక పాత్ర నిర్వహించారు. 1986లో జరిగిన నానాజాతి సమితి సమావేశంలో భారత ప్రతినిధివర్గ ఉపనాయకునిగాను, 1991 లో అలీన రాజ్యాల సభలకు భారత ప్రతినిధిగాను పాల్గొన్నారు.

## పరిశోధనలో పరిణతుడు

ఆర్థిక, రాజకీయాధ్యయనంలో ఆక్సుఫర్డు విద్యాలయం డి లిట్‌ను సామాజిక శాస్త్రంలోనూ, ఆక్సుఫర్డు డిప్లొమాను పొందిన ఆంధ్ర విశ్వ విద్యాలయం చేత గౌరవ డి లిట్ కూడా పొంది గౌరవించబడ్డారు.

## పార్టీల స్థాపనలో, ప్రముఖ పాత్ర, నడిపిన ప్రజా ఉద్యమాలు

వ్యవసాయీకులైన ఆచార్య రంగా 1917 నుండి ఇప్పటి వరకు జాతీయ కాంగ్రెసు నాయకునిగా ఉండి స్వాతంత్ర్య సంగ్రామంలో ఆరుసార్లు జైలుశిక్ష అనుభవించారు. భారత కృషికార్ లోక్‌పార్టీ, స్వతంత్ర పార్టీలలో అధినేతగా ఉండి గణనీయంగా కృషిచేశారు. వలస ప్రజల రంగు జాతుల స్వాతంత్ర్య సిద్ధికి, స్వయం వృత్తుల రైతాంగాన్ని, చేనేత, చేనేత కార్మికుల, గ్రామీణ ప్రజల స్వాతంత్ర్యానికి, వారి హక్కుల పరిరక్షణకు, వారి అభ్యున్నతికి నిర్విరామంగా కృషి సల్పారు. 1931 నుండి అనేక సత్యాగ్రహ సమరాలు, కిసాన్ యాత్రలు, పికెటింగ్‌లు నిర్వహించారు రైతుల స్వంత కమతాలను స్వాహాచేయడానికి, రద్దు చేయడానికి ఉద్దేశించబడిన 17వ రాజ్యాంగ సవరణ బిల్లును సాహసోపేతంగా ఎదిరించి, దేశవ్యాప్త ఉద్యమం నిర్వహించి పార్లమెంటులో విజయం పొంది, స్వయం వృత్తుల వారైనరైతాంగాన్ని కాపాడారు.

వారి 65 సంవత్సరాల పార్లమెంటరీ జీవితంలో ప్రజల అభ్యున్నతికి పాటుబడి, నిరాడంబరుడుగా, శీల సంపదలు కల్గిన గాంధేయవాదిగా గణుతి కెక్కారు పార్లమెంటులో 50 సంవత్సరాల రికార్డు స్థాపించిన సందర్భంగా, ప్రత్యేక గౌరవానికి చిహ్నంగా ప్రభుత్వ పరంగా, స్పీకరు అధ్యక్షతన జరిగిన సభలో ప్రధాని ఇందిరా గాంధీ పార్లమెంటు చిత్తరువు పొదగబడిన లోహపత్రంతో సన్మానించారు. తోటి పార్లమెంటు సభ్యులందరు దానిలో పాల్గొని నీరాజనాలందించారు.

గత 10 సంవత్సరాల వరకు కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ ఉప నాయకునిగా ఉంటూ వచ్చారు.

వారి 75 ఏండ్ల రాజకీయ, సాంఘిక సేవారంగాల్లో ఒనరించిన సేవలను గుర్తింపుగా వివిధ అవార్డులు పొందారు భారత్ కృషిక్ సమాజ్‌చే

1983 లో కృషిక్ రత్న అఖిలభారత రాజాజీ సమాఖ్యచే "రాజాజీరత్న" అవార్డు, 1982-83 లోను, ఆల్ ఇండియా ఎడల్ట్ ఎడ్యుకేషన్ సొసైటీ న్యూఢిల్లీ వారిచే ప్రఖ్యాతమైన "జవహర్‌లాల్ నెహ్రూ లిటరరీ ఎవార్డును", 1984 లో ఆంధ్ర మహాసభచే "ఆంధ్రరత్న" అవార్డును, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నవంబరు 7 వారు పుట్టిన తేదీని "కిసాన్ దినం"గా పరిగణించమని ప్రకటించారు న్యూఢిల్లీ శిరోమణి సంస్థవారు "శిరోమణి" ఎవార్డును, 1991 లో ఇండో జపనీస్ సంఘము వారు టోక్యో "ఓస్కా" ఎవార్డును అందజేశారు ఇండియా కోలియో ట్రిక్ సంస్థవారు "పార్లమెంటు పెద్దగా" గుర్తించి సన్మానించారు.

## మేధావుల, జాతీయ నాయకుల సరసన రంగాజీ

భారత జాతీయ నాయకులుగా ఉండి, పార్లమెంటులో అగ్ర నాయకులుగా ఉండి నిర్మాణ కార్యక్రమం నిర్వహించిన రచయితల్లో మేటి రచయిత రంగాజీ ప్రసిద్ధ జాతీయ నాయకులుగా త్యాగులుగా ఎంచబడిన గాంధీజీ, రాజాజీ, నెహ్రూ, సర్దార్ పటేల్, డాక్టరు రాజేంద్రప్రసాద్, రాధాకృష్ణన్, నేతాజీ సుభాస్ బోసు, ప్రకాశం, లాల్ బహదూర్, గిరి, యన్.యం జోషి, సహజానంద్, యాగ్నిక్ నాయకులుగా సహచరుడుగా ఉండి స్వాతంత్ర్యోద్యమంలోను, కిసాన్ ఉద్యమాల్లోను, కార్మిక ఉద్యమాలలోను అనేక కార్యక్రమములు సంయుక్తంగా నిర్వహించిన విషయం అందరికీ విదితమే. అంతేగాక అతివాద కార్యక్రమాలలోను, సోషలిష్టు, నిర్మాణ కార్యక్రమాలలోనూ వారితో కలిసి పనిచేశారు రంగాజీ, జయప్రకాశ్ నారాయణ్, అశోక్ మెహతా, కమలాదేవి, అరుణా అసఫాలీ, లోహియా, నాథ్‌పాయ్, మొదలగు అనేకమంది అతివాద సోషలిస్టు నాయకులతో కలిసి కార్యరంగం నడిపారు. అంతేగాక నిర్మాణ కార్యక్రమాలు నిర్వహించే అనేక మంది సంఘసేవకులతో, ఆధ్యాత్మికవాదులతో సన్నిహితంగా ఉన్నారు

స్వతంత్రపోరాట నిర్వహణలో పనిచేసిన, సాంఘిక విప్లవకారుల, రైతాంగనేతల, కార్మికనాయకుల కార్యకలాపాలపై భావాలతో, విలువలతో 65 సంవత్సరముల రంగాజీ అనుభవాలు, అభిప్రాయాలకు అద్దంపట్టే రీతిని సంతరించుకొంటుందంటే అతిశయోక్తి కాదు

## అందుకు దర్పణంగా రంగాజీ రచనలు, ప్రచురించిన గ్రంథాలు : ( ఆంగ్లంలో)

రంగాజీ రచించి ప్రచురించబడిన ఈ క్రింది గ్రంధాలతో పాటు మొత్తం అరవై ఐదు(65) 1) "క్రెడో ఆఫ్ వరల్డ్ పెజంట్రీ ", 2) " ఏగొని అండ్ సొలేస్" - 2 భాగాలు, 3) "డిస్టింగ్విష్డ ఎక్వయింటెన్సెస్" 1976 - 2 భాగాలు, 4) "కలోనియల్ అండ్ కలర్డ్ పీపుల్సు ఫ్రంట", 1957, 5)" ఫైట్‌ఫర్ ఫ్రీడమ్ " (జీవిత చరిత్ర) 1967, 6)"గాంధియన్ ప్లాన్", 7) "హిస్టరీ ఆఫ్ కిసాన్ ముప్‌మెంట్", 8)"రివల్యూషనరీ పెజెంట్" 1954, 9) "బాపూ బ్లెసెస్" (మహాత్మాగాంధీతో చర్చలు, సంభాషణలు) 1969, 10) "అలీన ఉద్యమం" ( "Quintessence of Non-aligned movement"), 11) "ఇండియా ఇన్ ది యు. యస్.రంగాస్ పార్టిసిపేషన్" 1983, 12) "ప్రొటెక్షన్ ఆఫ్ ది సెల్ఫ్ ఎంప్లాయిడు పెజంట్స్ అండె ట్రైబల్ క్లాసెస్", 13)"ట్రైబ్స్ ఆఫ్ నీలగిరీస్", 14)" సెల్ఫ్ ఎంప్లాయిడ్ సెక్టర్", 15)"స్మృతీస్ ఆఫ్ భారతీదేవి" 1973, 16) "ఇండియన్ పొలిటికల్ ఇన్‌స్టిట్యేషన్స్" - 2 భాగములు, 1933, 17) "హరిజననాయకుడు" - 1934, 18)"ఏరియల్-ఐ -వ్యూ ఆఫ్‌యు. ఎస్. ఎస్. ఆర్ అండ్ యుగోస్లావియా "- 1958, 19) "ఔట్‌లైన్స్ ఆఫ్ నేషనల్ రివల్యూషనరీ పాత్ "- 1945, 20) "వరల్డ్ రోల్ ఆఫ్ నేషనల్ రివల్యూషన్ " - 1946, 21) "మెనీమోనో గ్రాఫ్స్ ఆన్ పార్లమెంటరీ డెమోక్రసీ ఇన్ ఇండియా అండ్ ఎబ్రాడ్", 22) "ఎకనామిక్ కండిషన్స్ ఆఫ్ ఇండియన్ విలేజస్" - 2 భాగములు.

రంగాజీ తన 75 ఏళ్ల ప్రజా జీవితంలో- అధికార పదవులను ఏమీ ఆశించలేదు. అదే తను అనేక ప్రజా సంస్థల్లో వివిధ హోదాలలో నైతికస్థాయిని నిలబెట్టి, గాంధేయవాదిగా, విప్లవ పంథాలో, ప్రజానాయకుడుగా ప్రఖ్యాతి గాంచారు. సంపూర్ణ జీవితం గడిపి ప్రపంచంలోనే ఒక ఉత్తమ అగ్రగామి పార్లమెంటేరియన్‌గా విఖ్యాతి గాంచారు

## ఇదివరలోను, ఇటీవల నిర్వహించిన పదవులు- బాధ్యతలు

1926-30 ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వానికి గౌరవ ఆర్థిక సలహాదారు మరియు స్పెషల్ ఆఫీసరుగా ఉన్నారు.

| | |
|---|---|
| 1927-30 | ప్రధాన ఆచార్యునిగా, ఆర్థిక శాస్త్రంలోను, రాజకీయ శాస్త్ర విభాగంలోను మద్రాసు విశ్వవిద్యాలయంలో ఉన్నారు |
| 1928-30 | అఖిల భారత వయోజన విద్యా సంస్థ- వ్యవస్థాపక ఉపాధ్యక్షులు |
| 1930 | కేంద్ర శాసనసభకు ఎన్నికయ్యారు |
| 1930-51 | అఖిలభారత కాంగ్రెసు సభ్యులు |
| 1933 | రాష్ట్ర కేంద్ర భూమి తనఖా బ్యాంకు డైరక్టరు, మద్రాసు ప్రభుత్వంలో ఉన్నారు |
| 1935-45 | కేంద్ర శాసనసభలో ఉన్నారు |
| 1946-51 | ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షునిగా ఉన్నారు |
| 1947-51 | అఖిల భారత కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు |
| 1933 | ఇండియన్ పెజెంట్ ఇన్‌స్టిట్యూట్, నిడుబ్రోలుకు - ప్రధానాచార్యులుగా ఉన్నారు |
| 1935 | ఆల్ ఇండియా కిసాన్ మహాసభ- ఫైజపూర్‌కు - అధ్యక్షులుగా వున్నారు |
| 1936 | ఆల్ ఇండియా కిసాన్ కాంగ్రెసు మహాసభకు - ఢిల్లీకి అలాగే 1946, 1949, 1951, 52 సంవత్సరాల్లో అధ్యక్షులుగా నిర్వహించారు |
| 1936 | ఆల్ ఇండియా కిసాన్ సమ్మేళన్‌కు వ్యవస్థాపకులుగా, అధ్యక్షులుగా ఉన్నారు |
| 1940 | రాష్ట్ర చేనేత సహకార సంఘాధ్యక్షుడుగా, అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఉన్నారు. |
| 1947 | అఖిల భారత రూరల్ పీపుల్స్ ఫెడరేషనును స్థాపించారు |
| 1946-50 | కేంద్ర శాసనసభలో ఉన్నారు. పార్లమెంటరీ పార్టీ కార్యదర్శి |
| 1947-50 | ఆర్థిక సంఘంలో ఉన్నారు |

1947-51 ప్రొవిజనల్ పార్లమెంటులో ఉన్నారు.

1950-51 ఎస్టిమేట్సు కమిటీలో ఉన్నారు.

1947-85 అఖిల భారత చేనేత కాంగ్రెసు అధ్యక్షులుగా ఉన్నారు

1952-56 రాజ్యసభకు ఎన్నికైనారు, కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ కార్యదర్శిగా ఉన్నారు

1957-62 రెండవ లోక్‌సభకు పార్లమెంటుకు ఎన్నిక.

1958-59 ఛైర్మన్ : పబ్లిక్ ఎకౌంట్సు కమిటీ - పార్లమెంటులోని నాయకులందరిచే మన్ననలు

1962-67 మూడవ లోక్‌సభకు ఎన్నిక.

1967-70 నాల్గవ లోక్‌సభకు ఎన్నిక.

1967-68 పార్లమెంటులో అతిపెద్ద ప్రతిపక్ష గ్రూపుకు నాయకుడిగా ఉన్నారు.

1977 జాతీయ వ్యవసాయ సమాఖ్య వ్యవస్థాపక అధ్యక్షులు

1977-79 రాజ్యసభకు ఎన్నిక

1980-84 1984-89 మరియు 1989లో మరలా పార్లమెంటుకు ఎన్నిక

1980-90 పార్లమెంటరీ కాంగ్రెసు పార్టీకి ఉపనాయకులుగా వ్యవహరించారు.

చట్టసభలైన పార్లమెంటు, రాజ్యసభల్లో, ప్రజల కొరకు నిర్విరామంగా కృషిచేస్తూ బయట కూడా అనేక కార్యకలాపాలు రైతు, గ్రామీణ జనాలకై నిర్వహించి, అవిశ్రాంతంగా పోరాడారు. అంతేగాక అనేక అంతర్జాతీయ సభల్లోను, వేదికలపైన ఉపన్యసించి తమ అమూల్య సలహాలనిచ్చారు

1946 ప్రపంచ వ్యవసాయదారుల మహాసభ లండన్‌కు భారత ప్రతినిధి గాను.

1947 కోపెన్‌హోగన్‌లో 1949 - గల్ఫ్ దేశాల్లోను, కెనడాలోను 1959

1984 ఢిల్లీలోను భారత్‌కు ప్రాతినిధ్యం వహించారు ఇంటర్నేషనల్, వ్యవసాయ ఉత్పత్తి సమాఖ్యకు మెంబరుగా ఉంటున్నారు

1948 ప్రపంచ కార్మిక సదస్సు, శాన్ ఫ్రాన్సిస్కోకు - భారత ప్రతినిధి

1957 సహకార కాంగ్రెసు - బల్గేరియాకు- భారత ప్రతినిధి.

1954-69 కామన్వెల్తు పార్లమెంటరీ మహాసభకు - భారత ప్రతినిధి

1964-65 ఉమ్మడిదేశాల పార్లమెంటరీ మహాసభ ప్రతినిధి

1969 గాంధీ శత జయంతి ఉత్సవాల ప్రతినిధిగా సూడాన్, ఈజిప్టు, ఫ్రాన్సు, యు.కె దేశాల్లో పర్యటించారు

1983 మిత్రరాజ్య సమితి అసెంబ్లీకి భారత ప్రతినిధి వర్గఉపనాయకునిగా వెళ్ళారు

1983 అలీన రాజ్యాల సభ - ఢిల్లీకి - భారత ప్రతినిధి వర్గ సభ్యులు.

ఇండియా - శ్రీలంక ఒడంబడిక్పై సంతకాలు చేయడానికి ప్రతినిధి

ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ ఆఫ్ఘనిస్థాన్ అంతిమ క్రియలకు భారత్ తరఫున ప్రతినిధి

1949 అంతర్జాతీయ వ్యవసాయదారుల సమస్యలు చర్చించడానికి

అమెరికా అధ్యక్షులు హారీట్రూమన్‌తో సమావేశం, మరియు గాంధీ శాంతి సంఘ సభ్యులుగా అనేకదేశాల్లో గాంధీ సందేశాన్ని వినిపించారు. గాంధీ స్మారకనిధి సంస్థకు అధ్యక్షులుగా ఉన్నారు

**ఆచార్య రంగాజీ - జీవితం అనుక్షణం ఉత్కంఠ భరితంగా నడిచింది. అదొక విలక్షణంగానూ సాగింది.**

అందుకే యీ గ్రంధానికి ఘటనలు, ఘట్టాలు, ఘర్షణలు, సంఘర్షణలు - అపార్ధాలు, అపోహలు, అనుమానాలు అలానే మరెన్నో సంక్లిష్ట విషయాలు చోటుచేసుకున్నాయి. ఇదొక చర్చనీయాంశ గ్రంథం. సునిశిత దృష్టితో చదవండి. పరిశీలనాత్మకంగా చదవండి.

రంగాజీ 1900 సంవత్సరం నవంబరు 7 వ తేది జన్మించారు. తొంభై అయిదేళ్ళ పరిపూర్ణ జీవితం గడిపి 1995 జూన్ 8 వ తేది పరమ పదించారు

అంటే 19వ శతాబ్దాంతమున జన్మించి 20వ శతాబ్దాంతమున స్వర్గారోహణ చేశారు. కాబట్టి రెండు శతాబ్దములను పావనం చేశారు. అందుకే రంగాజీ అనేకమంది జాతీయ, అంతర్జాతీయ రాజనీతిజ్ఞులు, మరెందరో వివిధ వర్గములకు, తరగతులకు చెందిన ప్రముఖులు బహుముఖ ప్రజ్ఞాధురీణునిగా, దేశభక్తునిగా, పావనచరితునిగా, పూర్ణపురుషునిగా అభివర్ణించారు.

ఆయన జీవితం - జీవితగమనం ఋషిగా, మహర్షిగా, బ్రహ్మర్షిగా రూపాంతరములు చెందుతూ మానువులలో మనీషిగా, మహనీయునిగా, మానవఅవతారము నుండి పరిణతి చెందిన మాధవుడిగా ఎంచుకొను చున్నారు.

రంగా మాతృగర్భము నుండి యీ పరమ పవిత్రమూ, పరమ పావనమూనైన పుణ్యభూమి పై జన్మించిన పుణ్య పురుషుడుగా పరిణతి చెందిన పరమ భాగవతోత్తముడుగా రూపుదాల్చిన మహోన్నతవ్యక్తి

మహామనీషి, స్థిత ప్రజ్ఞుడని కూడా గీత చెప్తూ ఉంది ఒక్కొక్కప్పుడు సాధారణ మనిషైనా, మహామనీషైనా, స్థితప్రజ్ఞుడైనా దైవికంగా కొన్ని అప్రియమైన సంకటాలను ఎదుర్కొనవలసి వస్తుంది. అనుకూల్యాల పట్ల సంతోషంగాని, అప్రియాల పట్ల విచారంగాని అతడు వ్యక్తం చేయడు హిమగిరి వలె అచంచులుడై, నిర్వికారుడై నిలుస్తాడు ఇదే స్థితప్రజ్ఞునిలోని దైవాంశము తాబేలు తన అవయవాలను డిప్పలోనికి ముడుచుకొనునట్లు, స్థితప్రజ్ఞుడు తన ఇంద్రియాలను విషయలోలత్వం నుండి మరలిస్తాడు

ఉ .. **"ఆపదలందు ధైర్యగుణ మంచిత.సంపదలందు దాల్మియున్**
**భూపసభాంత రాళమున పుష్కల వాక్చతురత్వమాజిబా**
**హాపటుశక్తియున్, యశమునందనురక్తియు, విద్యయందు వాం**
**ఛాపరివృద్ధియున్, బ్రకృతి సిద్ధగుణంబులు సజ్జనాళికిన్ "**

ఈ నేపథ్యంలో ఆలోచిస్తే రంగాజీ తొంబదైదేండ్ల జీవయాత్రకు జీవగఱ్ఱ అనదగ్గది. వారి స్థితప్రజ్ఞత్వమే. తన తొంబదైదేండ్ల జీవితంలో ఎనభై ఏళ్ళ పాటే నిస్వార్థంగా, నిర్విరామంగా, నిరంతరంగా ప్రజాసేవలో పండిన మహామనీషి ఆచార్య రంగాజీ

ఈలోకంలో దైవ సమానులుగా ఆరాధింపబడిన వారు కొందరున్నారు వారిలో ప్రథమ గణ్యుడు రెండువేల ఐదువందల సంవత్సరాలకు పూర్వం మన పుణ్యభారత భూమిలో జన్మించిన బుద్ధభగవానుడు. రెండువేల సంవత్సరాల క్రితం జెరూసలేంలో ఒక వడ్రంగి ఇంట జన్మించిన జీసస్ క్రీస్తు తనే స్వయంగా "నేను దేవుని కుమారుడనే తప్ప దేవుడనుకాను" అన్నప్పటికి అనేకదేశాల వారు అతన్ని దైవంగా ఆరాధిస్తూనే ఉన్నారు. క్రీస్తు తర్వాత ఐదువందల సంవత్సరాలకు మహమ్మదు ప్రవక్త "అల్లా" గా ఆరాధింప బడసాగాడు. మరో ఐదువందల సంవత్సరాల తర్వాత శంకరాచార్యులు, ఆ తరువాత రామానుజాచార్యులు, మధ్వాచార్యులు, జన్మించి మానవులకు జ్ఞానభిక్ష పెట్టారు. ఇట్లా ఎందరో మహానుభావులు ! వారందరిని దైవాంశ సంభూతులుగా భావించి పూజిస్తున్నాం. ఇహలోకపు సామాన్య మానవుల నుండే పై జెప్పబడిన మహానుభావులు. ఉద్భవించి, మనిషి, మనీషి, మహా మనీషిగా పరిణమించి వన్నెకెక్కారు తప్ప, పుడుతూనే వారు మహాత్ములు కాలేదు

ఇంత కథ ఎందుకు చెప్పవలసివచ్చిందంటే, ఈ నాటికీ గ్రహించి ఉండక పోరు ఇట్టి దైవాంశ సంభూతుల కోవలో చేర్చి అశేష ప్రపంచ కర్షక జనావళి ఆరాధిస్తున్నది రంగాజీని

మానవులందరూ, మాధవులుగా పరిణతి చెందగలిగిన వారేనని భారతీయ ధర్మం ఉగ్గడిస్తున్నది అందరి స్వభావమూ నిర్మలమైనదే నిష్కల్మష మైనదే. ఐనా అది కొన్ని ప్రకృతి సిద్ధదోషాల వల్ల, అరిషడ్వర్గాది మనోవికారాల వల్ల మలినమైపోతుంది ఈ దోషాలను మించినది అజ్ఞానదోషం. ఈ అజ్ఞానాన్ని రూపుమాపడానికి స్థిరచిత్తం కావాలి నియమపాలన కావాలి. వానిని వశపఱచుకొన్న స్థిత ప్రజ్ఞుడు ఆచార్య రంగాజీ.

రంగాజీలో దైవాంశ, అంతర్లీనంగా నిక్షిప్తమై ఉన్నదన్న సత్యాన్ని రుజువు పఱచుకొనేందుకు ఒక మార్గమున్నది ఈ సందర్భంలో ప్రసిద్ధతత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తిగారు అన్నట్లు “ఆ మార్గాన్ని అంటే చెకుముకి రాయితో ఇనుప బిళ్లను రాపిడి చేసినప్పుడు అగ్ని ప్రజ్వలిస్తుంది. అదే మాదిరి ప్రకృతిని దర్శించడంలో ప్రజ్ఞను జోడించినప్పుడు నిశ్చలతత్వం బహిర్గమవుతుంది” ఆ మార్గంలోనే ప్రతి మానవునిలోనున్న మహత్తత్త్వాన్ని దర్శించి తన ప్రజ్ఞతో ప్రపంచ కర్షకావళిని ఉద్దీపింపజేసి, ఉద్ధరించిన ప్రజ్ఞా నిధి పూజ్య రంగాజీ!

ఇలా సత్యదర్శనం చేసిన రంగాజీ తన ౮౧ ఏండ్ల ప్రజాహిత రాజకీయ జీవితంలో అణగారిన, కర్షక జనావళిలో నిక్షిప్తమై యున్న సృజనాత్మశక్తిని, తన ప్రజ్ఞాపాటవంతో రగుల్కొల్పి చైతన్య వంతం చేశారు ఆ జాగృత చైతన్యమే “కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్య” సిద్ధాంతంగా అవతరించింది ఈ సిద్ధాంతం ఒక విప్లవజ్యోతి అది ఉత్పత్తిదారులయిన కష్టజీవుల పాలిటి ఆశాజ్యోతి

కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్యం, ప్రజాస్వామ్య పాలనకు ఉత్తమమార్గమన్న రంగాజీ ప్రవచనంతో, మహాత్మాగాంధీ ఏకీభవించారు. గాంధీజీ ఆశీస్సులందిన ఈ “కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్య” సిద్ధాంతాన్ని ఏభై ఏళ్లుగా రంగాజీ ప్రపంచ వ్యాప్తంగా ప్రచారం గావించాడు. కారల్‌మార్క్స్ ప్రతిపాదించిన ఏకపక్ష కార్మిక నియంతృత్వ సిద్ధాంతం ప్రాతిపదికగా 1917లో వెలసిన సోవియట్ యూనియన్ నేడు కుప్పకూలిపోయింది. దానికి ఉపగ్రహాలుగా వ్యవహరించిన దేశాలన్నీ, ఏకపక్ష కార్మిక

నియంతృత్వ పాలన భీత్కారాలకు గురై, అదృశ్యమైపోయింది ప్రత్యామ్నాయంగా రంగాజీ ప్రవచించిన "కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్య" సిద్ధాంత మొక్కటే ప్రపంచ శ్రమజీవులకు శ్రీరామరక్షగా మిగిలింది

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుద్ధానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ".

అంటూ శ్రీ కృష్ణభగవానుడు గీతలో చెప్పినట్లు రంగాజీ సహితం వ్యవసాయదారులకు, గ్రామీణప్రజలకు, హస్తకళాకారులకు చేనేతవారికి, బుద్ధిజీవులకు, ఎప్పుడు ఎక్కడ ఏరూపంలో ఎవరివల్ల హాని జరిగినా వారెంత వారైనా, అప్పుడు అక్కడ తదుచిత రూపంలో ప్రత్యక్షమై కష్టాల కడలి నుండి వారిని దరిజేర్చి కాపాడారు దశదిశలా స్వేచ్ఛావాయువు లెగయడానికి ప్రజా స్వామ్యం విరియడానికి కారకులయ్యారు

## బహుముఖ ప్రజ్ఞాశాలి, ప్రజ్ఞానిధి, మనీషి, మహామనీషి, మహోన్నత వ్యక్తి జ్ఞాన సంపన్నుడు, స్థితప్రజ్ఞుడు రంగాజీ

కారుణ్యమూర్తి, కరుణామయుడు, ఆర్తత్రాణపరాయణుడు, మానవతావాది, సత్యవాక్ పరిపాలకుడు, న్యాయ, ధర్మనిరతుడు, ధార్మికుడు, మనీషి, మహామనీషి.

శాంతమూర్తి, సౌజన్యమూర్తి, సౌశీల్యమూ, సౌకుమార్యం, నిర్దుష్ట ప్రవర్తన, నియమపాలన, నీతి నిజాయితీ, సేవాభావం, సేవాదృక్పథం అణువణువునా నిండి నిబిడీ కృతమైన మహామనీషి, మానవోత్తముడు, మహర్షి, బ్రహ్మర్షి రంగాజీ.

సౌందర్యోపాసకుడు, కళాపోషకుడు, కళారాధకుడు, ప్రకృతి ఆరాధకుడు, ప్రకృతి ఉపాసకుడు, ప్రకృతిలోనే సర్వచరాచర జీవకోటినీ వాటి మనస్తత్వాన్ని పరిశోధించి, పరిశీలించి మానవులతో పోల్చుకుని తన్మయత్వం పొందుతూ తాదాత్మ్యం చెంది తాను పరవశించి ఎదుటి వారిని పర[illegible]ంప చేసిన ప్రకృతి ఆరాధకుడు రంగాజీ.

కుడుమిస్తే పండగ అనే గ్రామీణ శ్రామిక జనాల నానుడికి ప్రతిరూపం. భోళా శంకరుడు, పరమ సాధుపుంగవుడు, అజాత శత్రువు పరోపకారమే పరమ ధర్మంగా అదే జీవిత ధ్యేయంగా, జీవన విధానంగా జీవికను సాగించిన పరోపకార జీవి రంగాజీ.

ఎవరీ సుగుణాల రాశి, ఎవరీ సుగుణాల ప్రోది. ఆశ్చర్యం లేదు అనుమానం అంతకన్నా ఉండవలసిన పనిలేదు ఆయనే మహామనీషి మానవోత్తముడు ఆచార్యరంగా. శ్రీ రంగాజీ ఎనిమిది దశాబ్దాలుగా సమకాలీనులలో, సమకాలీనుల మధ్య నిరంతరం నిర్విరామంగా నిరాడంబరంగా మానవసేవే మాధవసేవగా రైతు కూలీ, చేతి వృత్తుల, బుద్ధి జీవుల మధ్య వారికి సేవలందిస్తూ, వారిచే ఆరాధించబడుతూ, ప్రస్తుతించ బడుతూ, ప్రేమించబడుతూ, తొంభైఐదేళ్ళ సుదీర్ఘకాలం జీవించి తొంభై ఐదవయేట 1995 జూన్‌9 వ తేది ప్రశాంతంగా కన్నుమూసిన మహోన్నత వ్యక్తి పుణ్యపురుషుడు రంగాజీ.

ఇంతటి సుదీర్ఘకాలం ప్రజాసేవకుడిగా, ప్రజానాయకుడుగా అశేష ప్రజల ఆదరాభిమానాలు, గౌరవ ప్రతిష్టలు పొందుతూ జీవించిన మహా నాయకుడు ప్రపంచంలోనే అరుదుగా ఉంటారని ఎందరో ప్రశంసలను కురిపించారు

ఈ మన ఆరాధ్య నాయకునికి, ఇన్ని సుగుణాలు అ[illegible] ఉండటం ఆశ్చర్యంగానే ఉంటుంది కదూ ఈ సుగుణాలలో ఏ ఒక్క సుగుణం ఉన్నా ప్రశంసనీయమే ఆరాధనీయమే. మనీషిగా అట్టి వ్యక్తిగా ప్రస్తు[illegible]వచ్చు. ఈ సుగుణాలలో ఒక సుగుణమో లేదా రెండు మూడు సుగుణములో ఏదో ఒకరిలో ఉండటం సర్వసామాన్యమైన విషయం కావచ్చు, అలా కాకుండా ఈ సుగుణాలన్నీ ఒకే వ్యక్తిలో మూసపోసినట్లు ఉండటం సామాన్య జన జీవితంలో మనం చూడలేము. కాకపోతే పురాణాలలో, ఇతిహాసాలలో, అదీ వ్యాస, వాల్మీకి, కాళిదాసు, భవభూతి, క్షేమేంద్రుడు మున్నగు మహర్షుల కోవకు చెందిన కారణ జన్ములూ పరా విద్యా సంపన్నులూ నైన దార్శనికులూ, పండితులూ తమ కవనాలలో వర్ణించిన దేవతామూర్తులను మాత్రమే అంతటి మహా సుగుణాల రాశులుగా ఎంచుకుంటాము. అట్టి పుణ్యపురుషుడు, పురాణపురుషుడు ఆచార్య రంగాజీ అనుటలో సందేహమే లేదు.

ఇచ్చట మనం పైన పేర్కొనబడిన సుగుణాల రాశులైన మహోన్నత వ్యక్తుల పరిపూర్ణత్వం ఎంత విలక్షణంగా ఉంటుందో ఒకటి రెండు ఉదాహరణలు చూద్దాం "జాజికాయ, జాపత్రి, లవంగం, యాలక్కాయ, కుంకుమ పువ్వు, కస్తూరి ఇలా ఇంకెన్నో సుగంధ ద్రవ్యములున్నాయి ఇందులో దేనికదే సుగంధభరితమే సువాసనలు వెదజల్లుతూనే ఉంటాయి అవునా? అయినా పై సుగంధ ద్రవ్యములన్నీకలిపి వాడితేనే దానికి పరిపూర్ణత్వం లభిస్తుంది కదూ?" అలానే ఇంకో ఉదాహరణ చూడండి తమలపాకు, వక్కపలుకూ, సున్నమూ, కాసు కలగలపి నవలందే నోరు, నాలుకా పెదవులూ సింధూర వర్ణము వచ్చి మానసికోల్లాసం కలుగదు దీనికి తోడుగా పైనపేర్కొన్న సుగంధ ద్రవ్యములు జోడించామా? చెప్పనే అక్కరలేదు ఆ ఆనందానికి

మరో ఉదాహరణ చూడండి. లవంగం, దాల్చిన చెక్క, అల్లం, గసగసాలు, కొబ్బరి కలగలిపి మొత్తంగ వెన్నముద్దవలె నూరి ఆ ముద్ద తాలింపులో వేస్తేనే గానీ ఆ కూర సుగంధం నాశికాగ్రములకు అంటదు కదా ఇలా చెప్పకుంటూపోతే ఇంకెన్నైనా ఉదాహరణలు సోదాహరణంగా వివరించవచ్చు

రంగాజీని సుగుణాల రాశిగా చెప్పకున్నాము. ఆ సుగుణాలలో ప్రతి సుగుణం దేనికదే ఉత్తమోత్తమము అయినదే ఇక అట్టి అనేక సుగుణాల రాశిపోస్తే ఎలా ఉంటుందో ఊహించవచ్చు

## రంగాజీ జన్మ నక్షత్రం

రంగాజీ ౧౯౦౦ సంవత్సరం నవంబరు 7 న జన్మించారు అందు లోనూ ఒక విశేషమున్నది ! అదేమంటే ఆయన ౧౯వ శతాబ్దాంతమున జన్మించారు కదా ? అందువలన ౧౯వ శతాబ్దములో ఆయన జననాన్ని ప్రస్తావించే ముందు ఇంకొక ఆసక్తికరమైన విషయం చెప్పకోవచ్చు. వారు ౧౯౯౫ జూన్ 8 వతేదీ పరమ పదించారు. అందువలన ౧౯వ శతాబ్దంలో జన్మించి ౨౦ శతాబ్ద అంతమున పరమపదించిన రంగాజీ రెండు శతాబ్దాల మేలు కలయికగా ఒక చరిత్ర సృష్టించిన మహానుభావుడుగా మనం చెప్పకొని గర్వించవచ్చు

రంగాజీ జన్మదినము యొక్క విశిష్టత ప్రాధాన్యత చారిత్రక ప్రసిద్ధిని కొనియాడుతూ ప్రశంసిస్తూ ఉండేవారు. ఎందుకనగా నవంబరు 7 రష్యాలో బోల్షివిక్ విప్లవం జయప్రదంగా ముగిసి సోషలిష్టు సమాజ ఆవిర్భావానికి నాంది పలికిన దినమది ప్రపంచ పరివ్యాప్తంగా శ్రమ జీవులకది పర్వదినం ఆ దినం రంగాజీ జన్మదినం కావడం గర్వకారణమంటూ 20వ శతాబ్దపు రెండు మూడు దశాబ్దాలలో పలువురు పలురకాలుగా ప్రశంసిస్తూ ఉండేవారు

## మార్క్సిజం పట్ల రంగాజీ మోజు

నవంబరు 7 కు గల చారిత్రక ప్రాధాన్యమనండి మరేదైన కారణం కానివ్వండి లండనులో విద్యాభ్యాసం చేస్తున్న కాలంలోనే రాజకీయాలవైపు మొగ్గడం అందులో భాగంగా మార్క్సిజంపట్ల అభిమానం పెంచుకోవడం జరిగింది

సమసమాజం ధ్యేయంగా "మార్క్స్ క్యాపిటల్ "అనే పరిశోధన అర్థశాస్త్ర గ్రంథం రచన చేయడం జరిగింది. 18వ శతాబ్దపు మధ్యభాగంలో "క్యాపిటల్" చదివిన విద్యార్థికులలో అత్యధికులు కమ్యూనిష్టు సిద్ధాంతం పట్ల మోజు పెంచుకున్నారు. యూరప్ అంతటా మార్క్సిజం పట్ల అభిమానం పెంచుకున్న గిల్డ్‌సోషలిస్టులతో రంగాజీ సహపాఠికావడం, రాజకీయాలలో వారితో కలిసి పనిచేయడం కారణంగా దోపిడీ వ్యవస్థకు వ్యతిరేకంగా సాగిన కమ్యూనిష్టు ఉద్యమంతో పరిచయం కలగడం జరిగింది [illegible] కమ్యూనిష్టు సుత్తి, కొడవలి చిహ్నాంగల పతకాన్నే రంగాజీ కూడా పట్టుకు తిరిగారు ఆ నేపథ్యం లోనే ఇండియా తిరిగి వచ్చిన రంగాజీ రాజకీయ రంగాలలో ప్రవేశిస్తూనే రైతు సంఘాలను స్థాపించారు. వ్యవ[illegible]య కూలి[illegible] సంఘాలను స్థాపించారు. చేనేత పారిశ్రామికులకు ఆర్థిక సహాకారాన్ని అందించేందుకు కో-ఆపరేటివ్ సంస్థలు స్థాపించారు. గ్రామీణ శ్రామిక జనాల్లో విద్యావ్యాప్తి కొరకై వయోజన పాఠశాలలను నడిపారు. విద్యార్థులైన యువకులలో అభివృద్ధిదాయకమైన రాజకీయ, సాంఘిక ఆర్థిక శాస్త్రములలో అవగాహన కలిగించేందుకు రైతాంగ వయోజన రాజకీయ పాఠశాలలను నెలకొలిపారు. ఈపైన పేర్కొన్న అన్ని సంస్థలకూ సుత్తి, కొడవలి చిహ్నంగల ఎర్ర జెండానే ప్రతిష్టించడం జరిగింది. అప్పట్లో - ఆ 1928 దాక

ఈ అన్ని కారణాలతో తాను సాగించే ఉద్య[illegible] కమ్యూనిస్టులనే తోడు

చేసుకున్నారు అన్నిటికంటే ముఖ్యంగా రైతు సంఘస్థాపన, జమీందారీ, జగర్దారీ, ఇనాందారీ వ్యవస్థలను రద్దుచేసి భూములపై రైతులకు పట్టా లిప్పించే మహోద్యమాలలోనూ కమ్యూనిష్టులను వెంట బెట్టుకొనే కలిసి పని చేశారు అయితే ఇంత జరుగుతున్న కమ్యూనిష్టు పార్టీలో కార్డు హోల్డర్‌గా గానీ, కమ్యూనిష్టు పార్టీ ఉద్యమాలలో పాల్గొనడం గానీ జరుగలేదు. కమ్యూనిష్టులతో కలిసి పనిచేయడానికి ఆయనకెందుకో మనస్కరించలేదు కమ్యూనిజంలో ఏదో లోపం ఉందని భావించారాయన

ఇప్పుడు మనం ఆంగ్లకాలమానం ప్రకారం చరిత్ర ప్రాధాన్యం సంతరించుకున్న నవంబరు 7 ప్రాధాన్యత గూర్చి చర్చించుకుంటున్నాము. రాజకీయాలలో ప్రవేశించిన ప్రాథమిక దశలో ఆయన కమ్యూనిజం పట్ల అభిమానాన్ని పెంచుకుని వారి సహచర్యంతో ప్రజా ఉద్యమాలను నడుపుతూ ఉన్న ఆనాటి పరిణామాలకు అనుగుణంగా నవంబరు 7 అనగానే బోల్షివిక్ విప్లవ విజయకేతనంగా ఆ తేదీ సంతోషంగానే ఉండేది అభిమానంగానే ఉండేది. అది ఒక గర్వకారణంగానే సహచరులూ భావించారు. అనుచరులూ మెచ్చుకున్నారు. ప్రజలూ భళాభళి అన్నారు తాను గర్వంగా ఎంచుకున్నారు

## చాంద్రమాన, మార్గశిర శుద్ధ పౌర్ణమి ప్రాశస్త్యం

రంగాజీ ఆంగ్లకాలమానం ప్రకారం 1900 సంవత్సరం నవంబరు 7 వ తేదీ జన్మించారనీ దానికొక చారిత్రక ప్రాధాన్యం ప్రపంచంలోనే కలదని కూడా చెప్పకున్నాం. దానిని కాదనలేదు ఆయన. ఆలీత్యాకూడా అది తనకు గర్వకారణమే అంటారు. అయితే అంతకంటే విశిష్టమూ, పవిత్రమూ, పరిశుద్ధమూ పరమ పావనమూ అయిన ఒక నక్షత్రంలో జన్మించానంటారు అదే చంద్రమాన సంప్రదాయం ప్రకారం మార్గశిర శుద్ధ పౌర్ణమి శుభ దినమది. ఆ పవిత్ర ఘడియలలోనే జన్మించానని ఆయనకు ఒక గొప్ప తృప్తి. సంతోషము. ఆనందము.

ముప్పయ్యేళ్ళకు పూర్వం ఒకనాడు ఢిల్లీ విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షుడు ఆంగ్ల, ఆంధ్ర, సంస్కృత భాషలలో మహా పండితుడు శ్రీ గంటి జోగి సోమయాజులుగారు రంగాజీని దర్శించుటకై ఢిల్లీలోని రెండవనెంబరు విండ్సర్ ప్లేస్‌కు వచ్చారు. అది వసంత ఋతువు. వసంత ఋతువు ఈ విశ్వం

లోని సర్వ చరాచరజీవకోటికి సంతోషదాయకమైన ఋతువు ఆహ్లాద కరమైనది ఇక మానవుల సంగతి చెప్పనవసరం లేదు

ఆనాటి రంగాజీ, సోమయాజులుగార్ల మధ్య జరిగిన సంభాషణ రసవత్తరంగాను, ఆసక్తిదాయకంగాను ఉన్నది, మనమూ పాలు పంచు కుందామా? ఇరువురూ సాయం సమయాన ఆరుబయట కుర్చీలు వేసుకుని అనేక విషయాలు, అందులో రాజకీయాలూ ఉన్నాయి. సాంఘికాలు ఉన్నాయి ఆర్థికములూ ఉన్నాయి. మధ్య మధ్య భాషా సమస్యలు తెలుగు నుడికారముల లోని తియ్యదనము, కాళిదాసు కవిత్వంలోని మాధుర్యం, వాల్మీకి మహర్షి తన రామాయణ మహాకావ్యం ద్వారా కుటుంబంలోని తల్లి, తండ్రి, అక్కాచెల్లెళ్ళు, అన్నదమ్ములువారి మధ్య ఉండవలసిన ప్రేమ వాత్సల్యాలు, అభిమానం, సౌజన్యం చర్చించుకుని వాటి వరసలు ఎలా ప్రారంభ మయ్యాయో సుదీర్ఘమైన చర్చలు సాగాయి. సాయం సమయమైనది. ప్రొద్దు కుంకినది. సూర్యుడు అస్తమించాడు. రంగాజీ అన్నారు. సోమయాజులు గారూ అలా కొంత తడవు నడచుకుంటూ పోదామా? అయినా నా మనస్సులోనూ అదే ఉంది అని బయలు దేరారు. కొత్త ఢిల్లీలోని విశాలమైన వీధులలో వీధికి ఒక రకమైన చెట్లను నాటి పెంచడం జరిగింది. నేరేడు చెట్లు వీధిగుండా బయలు దేరారు శివుని పూజా ద్రవ్యాలలో నేరేడు, మారేడు, గన్నేరులలో ఈ నేరేడు ప్రథమం కదా? దాని ప్రాశస్త్యం ఏమిటి ? అని అడిగారు సోమయాజులుగారు నేరేడు ప్రాశస్త్యం గురించి ఇలా చెప్పారు. పరమశివుడు శ్రామిక జనాలకు అధిదేవత. ఆయన సాహచర్యమంతా ఆటవికులతోనే. అందువలన మానవులకు అవసరమైన ఈ వృక్షాల ఆకులు, అలవములు, పండ్లు ఆయనకు ప్రీతిదాయకములు. ఇక నేరాడా? గృహోపయోగ కరములైన అనేక పనిముట్లకు ఈ వృక్షమే ఆధారం. నేరేడు పండా? ఇందులో రోగ నిరోధక శక్తి ఊహాకందనిది. పంటకాలంలో రోజుకు ఒకటి రెండు పండ్లు తిన్నా అది రోగ నిరోధకశక్తిని పెంచుతుంది. ఇలా చెప్పకుంటూ పోతూ ఉండగా వసంత ఋతువును రంగాజీ వర్ణిస్తూ పులకించిపోతున్నారు. పరవశించిపోతున్నారు. వసంత ఋతువును వర్ణించిన విధం గమనించినసోమయాజులుగారు రంగాజీని ప్రసంశిస్తూ రంగాజీ వసంత ఋతువును కాళిదాసు, భవభూతులు కూడ ఇంత శక్తివంతంగా

వర్ణించలేదయ్యా ! అని మెచ్చుకున్నారు అప్పడు చెప్పారు రంగాజీ. నేను మార్గశిర శుద్ధ పౌర్ణమి పవిత్ర దినాన జన్మించాను ఆ దినం పవిత్రమైనదని, పుణ్యప్రదమైనదని చెప్పారు మా పెద్దలు అటు తరువాత నా అభిమాన గురువు శ్రీ జంపని ఆంజనేయులుగారు ఒక రోజు నన్ను చేరబిలిచి ఓరేయ్ రంగనాయకులూ ఈ ముహుర్తాన జన్మించిన వారు సౌందర్యోపాసకులు, సౌందర్య ఆరాధకులు, కళాపోషకులు, కళారాధకులు అవుతారురా అబ్బాయి అని అంటుండేవారు అప్పడు దానిని నేను అంతగా పట్టించుకోలేదు. ఎందుకంటారా ? సరిగ్గా ఆముహుర్తాన ఈ విశ్వంలో వేల మంది పుడతారు వారంతా ఇంతటి గొప్ప సౌందర్యోపాసకులు, సౌందర్యా రాధకులు అవుతారా? అనుకుంటూ దానిని అంతగా పట్టించుకునేవాడిని కాను. ఒక రోజు ఆయనే చెప్పారు. అందరూ అలా అవుతారని కాదు ఆ ముహూర్తాన పుట్టిన వారికి ఆ అంశఉంటుంది. దానిని పొందే అనుభవం, అనుభూతి అలవరచుకోవాలని

ఇక సోమయాజులుగారు ప్రారంభించారు. మార్గశిర శుద్ధ పౌర్ణమి పవిత్రత, విశిష్టతలపై వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు, ఖగోళ శాస్త్రం మున్నగు విషయాలను త్రవ్వి పోశారు. హిందువుల పవిత్ర గ్రంథం భగవద్గీతకు రూప కల్పన జరిగింది. ఈ ముహూర్తంలోనే. వైదికులు (హిందువులు) ఆరాధించి, పూజించి, అర్చించే శ్రీరామచంద్రుడు కూడా ఈ నక్షత్రంనందే జన్మించాడు.

భగవద్గీత విభూతి యోగంలో మార్గశిర మాసంను వర్ణించిన విధం ఆయన కంఠస్థంగా ఇలా చెప్పారు.

"బృహత్సామ తధా సామ్నాం గాయత్రీ చంద్ర సామహమ్ మాసాం మార్గశీర్షోహం రుతునాం కుసుమాకరం."

దీని తాత్పర్యం వల్లె వేస్తుంటే హృదయం పల్లవిస్తుందంటారాయన.

తా .. సామవేద గానములలో బృహత్సామమున్నా చందస్సులలో గాయత్రియూ, మాసములలో "మార్గశిర " మూ, ఋతువులలో వసంత ఋతువునూ నేనై యున్నాను అంటారు శ్రీ కృష్ణ పరమాత్మ భగవద్గీతలో.

రంగాజీ ప్రశ్న? అయ్యా ! సోమయాజులుగారూ శ్రీరామ చంద్రుని

జననం చైత్రశుద్ధ నవమి అంటారే. మరి మార్గశిర పౌర్ణమి ఎలా అయింది? నాకు అంతా తికమకగా ఉంది వివరించండి

సోమయాజులు సమాధానం వినండి! పూర్వము మహాభారత రచనకు ముందు అంటే (5,6 వేల సంవత్సరాలకు ముందు)

నూతన సంవత్సరం మార్గశిరంతోనే ప్రారంభమయ్యేది ( మహాభారతం అను 106 నుండి 109 వరకు గల అధ్యాయాలలో యూడండి) ఇప్పడు తెలిసిందా నూతనసంవత్సరం నేటివలె చైత్రమాసంతో కాక చాంద్రమానం ప్రకారం మార్గశిరమే నూతన సంవత్సరానికి మొదటి మాసంగా ఉండేదని చరిత్రపాఠం

మార్గశిరమాస ప్రాముఖ్యత, విశిష్టత పవిత్రతల గురించిన కథలు, గాథలు తామర తంపరగా వైదిక వారసత్వం నిండా ఉన్నాయి.

అందు ప్రథమమూ, ప్రధానమూ, పవిత్రమూ అయిన భగవద్గీత నుండి చూడండి.

ధనుర్మాసం అగు ఆ సమయం మహా పవిత్రమైనది వ్రతోపాసనకు మంచి తరుణం. అది మంచి ఫలితములనిస్తుంది ఆ కాలములోనే పంటలు పండి ఇండ్లకు చేరి ప్రజలు సుఖసంతోషాలతో ఉంటారు. చెట్లు చిగురిస్తాయి. ఫలముల నందిస్తాయి.

వాల్మీకి రామాయణం నందు వాల్మీకి మహర్షి మార్గశిర మాసం సంవత్సరం మొత్తానికి భూషణమన దగినదని వర్ణించారు. భగవద్గీత ఈ మార్గశిర మాసమునందే శుద్ధ ఏకాదశినాడు ఆవిర్భవించింది.

అవతార పురుషుడు "దత్తాత్రేయులు" ఈ మాసంనందే జన్మించిరి. (మార్గశిర శుద్ధ పౌర్ణమి) రంగాజీ జన్మించిన ముహూర్తం అదేకదా ? వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది.

"ఋతునాం కుసుమాకరం" అన్నారు కదా గీతాకారుడు.

ఇచ్చట గమనించదగిన ప్రధానమైన విషయమేమనగా ఇంతకు ముందే మనం చెప్పకున్నట్లు శ్రీరామచంద్రుని జననం చైత్రశుద్ధ నవమిగా వాడుకలో ఉన్నది కదా ? మహాభారత రచనా కాలానికి ముందు సంవత్సరాది మార్గశిర మాసంతో మొదలయ్యేది.

సమకాలీన సమాజమునందు మార్గశిర పుష్యమాసములు హేమంత ఋతువుగా ఉన్నది మహాభారత కాలమున అది వసంత ఋతువై ఉండవచ్చును. మార్గశిర శుద్ధ పౌర్ణమి తన జననం కావడం రంగాజీకి ఆనంద దాయకం. సంతోషదాయకం. అప్పుడప్పుడూ తన జన్మదినోత్సవానికి ముందు మనస్సులో మహా పండితుడు జోగి సోమయాజులుగారు ఆనాడు మార్గశిర ప్రాశస్త్యాన్ని గురించి చెప్పిన విషయాలను మననం చేసుకొని ఆహ్లాదముతో ఉప్పొంగి పోతూ ఉంటారు. మహాభారతం, భగవద్గీతల నుండి మార్గశిరమాస ప్రాశస్త్యాన్ని వర్ణిస్తూ సోమయాజులుగారు తనకు పంపిన శ్లోకాలను వల్లెవేస్తూ ఉంటారు.

## పెంచిన తల్లి నేర్పిన ప్రకృతి పాఠాలు ?

తన చిన్ననాట ప్రాథమిక విద్యాభ్యాసపు రోజులలో ఏ కొద్దిపాటి సమయం లభించినా తన పెంపుడు తల్లి, నా ప్రథమ గురువు అని చెప్పేకొనే మంగమ్మ. తన వెంట పొలాలకు తీసుకొని వెళ్ళి పంటలు, పైరులు, పశువులు, పక్షులను చూపిస్తూ వాటి ఆకృతులను వర్ణిస్తూ వాటి జీవిత విధానం, ప్రవృత్తుల గురించి పాఠాలు చెబుతూ ఉండేది. ఈ సంభాషణ అంతా ప్రశ్నలు సమాధానాల రూపంలోనే ఉండేదట. మాగాణులలో పాములు తిరుగుతూ ఉండేవి. వాటిని చూచి భయ విహ్వలుడై పరిగెత్తుకొనివచ్చి తల్లి వడిలో దూరేవాడట. ఆమె పకాపకానవ్వి అవి నిన్ను ఏమి చేయవయ్యా ? వాటి జోలికి పోవద్దు. తెలిసికానీ, తెలియకగానీ నీవు వాటికి బాధ కలిగించే పనిచేస్తే అవి నిన్ను భయపెట్టడానికి బుస కొడతాయి. అంతకంటే విశేషమేమిటో తెలుసా! అవి మనకు ఆప్తమిత్రులు. మనకు సహాయకారులు. న్యాయానికి మనం వాటిని పోషించాలి. కానీ అవి మన సహాయాన్ని అర్థించకుండా మన వలన ఎలాంటి ఉపకారాన్ని ఆశించకుండా మనకెంతో మేలు చేస్తాయి. పాములు మనకు మేలు చేయటమేమిటమ్మా ? అని రంగా ప్రశ్న

మన పంట పొలాలను ధ్వంసం చేసి విచ్చలవిడిగా పైరులు నాశనం చేసే ఎలుకలను పట్టుకొని తింటాయి. అవి చేసే మేలుకు వెలకట్టడం సాధ్యం కాదు

అలానే మరోమారు వందల కొలది పక్షులు పంట పొలాలపై వాలి పంటను తింటూ నష్టం కలిగిస్తూ ఉంటుంటే రంగాజీ తల్లిని ప్రశ్నించాడు. పాములు ఎలుకలను తిని మనకు మేలు చేస్తాయని అన్నావు. రకరకాలైన

ఈ పక్షులు మన పంట పొలాలను నాశనం చేస్తున్నాయి కదా ? ఇవీ మనకేమయినా మేలు చేస్తున్నాయా అని అడిగారు రంగాజీ అవును మనకు మేలే చేస్తున్నాయి రంగడూ ! ఎలాగో చెప్తా మన పైర్లను, పంటలను సర్వనాశనం చేసే వందలకు వందల రకాలైన కీటకాలను పట్టి తినేస్తాయి. అది ఎంత లాభమో తెలుసా నీకు ? ఒక్కొక్క పురుగును పట్టి మనం చంపగలమా? పుట్టలు పెట్టిన చెదలును చూపిస్తూ ఒరేయ్ ! రంగడూ ఇటురారా ఇటు చూడు. ఇవి వందలు వేలే కాదు లక్షలలోనే ఉన్నాయి చిన్న చిన్న బుల్లిబుల్లి అందమైన చెదలు ఇవి ఒక రకంగా మనకి నష్టం చేస్తాయి. కొన్ని పంటలను చెదలుపట్టి నాశనం చేస్తాయి కానీ మేలు ఎలాచేస్తాయో తెలుసా? మన పొలాల్లో చెత్త చెదారాన్ని గుల్లచేస్తాయి? భూమిని కూడా పాటు చేస్తాయి ఒక రోజున వర్షం పడుతూంది. చెట్టు క్రిందకు పరిగెత్తారు. అక్కడ చిన్న పాముల వలె వందలు వందలు జట్లు జట్లుగా లుకలుకలాడుతున్నాయి అమ్మో! పాములు అని కేకవేసి వాటిని చెప్పులతోటి కొట్టి చంపుతున్నాడు . అయ్యో అయ్యో అవి మన ఆప్త బంధువులు, అవి మనకెంతో మేలుచేస్తాయి. మానవ శ్రమతో చేయలేని సహాయం అవిచేస్తాయి ఈ బండబారిన భూమిని గుల్ల చేస్తాయి ఇలా ప్రకృతి పాఠాలను ఆ తల్లి చెంగుపట్టుకుని వెంట తిరుగాడుతూ ప్రశ్నలు, సమాధానాల రూపంలో తెలుసుకున్నానంటాడు రంగాజీ. అందుకే నా ప్రధమగురువు మా అమ్మ మంగమ్మ అని ఆసక్తికరంగా ఒక వ్యాసమే వ్రాశారు. ఆయన.

*సౌందర్యోపాసకుడు, సౌందర్యారాధకుడు, కళోపాసకుడు, కళారాధకుడు, ప్రేమ స్వరూపుడు, కరుణామయుడు, కారుణ్యమూర్తి, ఆర్తత్రాణ పరాయణుడు, ధర్మనిరతుడు, సర్వజ్ఞుడు, స్థితప్రజ్ఞుడు అంటూ అశేష ప్రజలు ఆరాధించే, ప్రస్తుతించే ఆచార్య రంగాజీ మానవులలో మాధవుడు..*

ఆయనలోని సౌందర్యోపాసన, సౌందర్యారాధన, ప్రకృతి ఆరాధన, కళా పోషణల గురించిన యదార్ధగాధలను, కొంతగాకపోతే కొంతయినా ఇచట మీముందుంచే ప్రయత్నం చేస్తా.

రంగాజీ సౌందర్యానికి, కళలకు, సాహిత్యానికి అత్యధిక ప్రాధాన్యత ఇస్తారు. రాజకీయాలను ప్రవృత్తిగానే తీసుకుంటారు. దానినే వృత్తిగా స్వీకరించరు అన్నింటికంటె మొదటి ప్రాధాన్యత ప్రకృతి ఆరాధనకే ఇస్తారు.

వృక్షాలను శాస్త్రజ్ఞులు కొన్ని కుటుంబాలుగా విభజిస్తారు వేల కొలదిగా ఉన్న ఈ వృక్షాలను గుర్తుపట్టాలంటే ఈ వృక్ష విభజన ద్వారానే సులభమవుతుంది. ఆయనలోని ఈ ప్రకృతి ఆరాధనా ప్రవృత్తి తనకు సంబంధించిన ప్రక్రియ కాకపోయినా బోటనీని ఢిల్లీలోని వ్యవసాయ పరిశోధనా సంస్థల నుండి బోటనీ సబ్జెక్టుపై అనేక గ్రంధాలు తెప్పించుకొని చదివారు సాధారణంగా పుష్పాలనగానే ప్రజానీకంలో మల్లె, మందార, చామంతి, బంతి, గులాబి, సంపెంగ, జాజి, విరజాజి మున్నగు పరిమళభరితములైన ఈ పుష్పాలనే ప్రశంసిస్తూ ఉంటారు కొనియాడుతూ ఉంటారు భక్తులైతే భగవంతునికి పూజాద్రవ్యంగా అర్పిస్తారు. తమ భార్యాబిడ్డలకు తలలో తురుముతారు. వివాహాది శుభసమయాలలో గృహాలంకరణకు వినియోగిస్తారు ఇవన్నీ రంగాజీకి కూడా అభిలషణీయములే, అనుకరణీయములే, అనుసరణీయములే ఈ పరిమళాలు వెదజల్లే పుష్పాలన్నా ఆయనకు కూడా ఎనలేని ప్రీతి పాత్రములే. కానీ ఆయనలో పై పుష్పాలకంటే పంటపొలాలలో, బీడు భూములలో చెరువులలో దొరువులలో పుష్పించే వందలాది పుష్పాలను గురించి కథలు, గాథలుగా చెబుతూ హర్షాతిరేకముతో ఉప్పొంగి పోతుంటారు.

ఉదాహరణకు గ్రామాలలోని చెఱువులలో దొఱువులలో కలువ, తామర, మెట్టతామర, తంగేడు, ఉమ్మెత్త, జిల్లేడు, ఈ తరహా పుష్పాలను కూడ చూసి ఆనందించి కవిత్వ ధోరణిలో వేదాంతాన్ని గుప్పించి అనేక ఉదాహరణలతో ప్రశంసిస్తుంటారు. వరికోత అనంతరం పంటపొలాల్లో జనుము, కంది, నూవు విరగబూసి ముదిపసుపు పచ్చగా జనుము లేత పసుపు రంగులో మొగ్గలుగా ఉన్న కందిపూత కనుచూపుమేరలో ఉన్న పొలాలకు సాయం సమయాల్లో షికారు చేయడం ఆయనకెంతో తృప్తి. ఆ సీజనులో నిడుబ్రోలు వచ్చాడా ? ఎవరి అందుబాటులో ఉంటే వారిని తోడు చేసుకుని ఆ పొలాల మధ్య తిరుగుతూ ఆహా, ఓహో అని ప్రతిస్పందిస్తూ ఎదుటి వారిని ఆనందింప చేస్తారు.

పుష్పం అనేది కేవలం సుగంధ భరితమే కాదు, సువాసనలకే కాదు. అలంకరణలకే కాదు. ఒక్కమాటలో చెప్పాలంటే వాటి ఉపయోగం సర్వకాలీనం. సార్వజనీనం

కాని ఈ అన్నింటికంటే ఒక గొప్ప శక్తి దానిలో నుండి ఉద్భవిస్తుంది. కాయ, కసరు, ఫలం, భూమాత నుండి ఉత్పత్తి అయ్యే ఏ వస్తువైనా దాని ఫలితం పుష్పంతోనే ప్రారంభమవుతుంది అందుకనే స్త్రీల ఋతుక్రమాన్ని రజస్వలఅని, పుష్పావతి అనే నానుడి వచ్చింది. ఇలా ప్రకృతి రహస్యాలు పొరాలుగా చెప్పి తాను ఆనందించి ఎదుటివారిని ఆనందింపచేస్తుంటారు

ఆయనకు కొబ్బరికాయ కంటబడిందా! అందరిలాగే పీచుతీసి, కొబ్బరి తీసి ఉపయోగించుకోవడం కాదు. దాని జన్మవృత్తాంతాన్ని లాగుతుంటారు చూడండీ కొబ్బరికి రక్షణగా టెంక, దాని రక్షణకు పీచు, లోన ఉన్న కొబ్బరికి అక్సిజన్ అందించే మూడుకళ్ళు. కొబ్బరికి అహారంగా నీరు ఎవరందించారు? ఈ సృష్టి రహస్యం ఎంత విశేషమైంది ? భగవంతుడు వేరే ఎక్కడ ఉన్నాడు. ఏమతం దీనికి ఆధార భూతం ? అలానే ఒక వస్తువును ఇంపితంగా భోజనం చేయాలంటే దానికి షడ్రుచులు కావాలి. ఇవి ఉప్పు, కారం, పులుపు, తీపి, చేదు, వగరు. ఈ వస్తువులను సృష్టించినది ఎవరు ? ఏ మతం? ఇదంతా ప్రకృతి సృష్టి ఇలా ప్రతి వస్తువుని గురించి ఏది తన చేతిలో ఉన్నా దానికి ఒక వివరణ దాని సృష్టి రహస్యం ఒక పాఠంగా చెబుతూనే ఉంటారు. ఆయన అర్ధశాస్త్రంలో ఆచార్యుడే కాదు ఏ విషయం ప్రస్తావనకు వచ్చినా దానికొక శాస్త్ర విజ్ఞానం అన్వయించి చెబుతూనే ఉంటారు ఆయన వేదాలను గురించి ప్రసంగం ప్రారంభించినా, పురాణాలు, ఇతిహాసాలను గురించిన ఉపన్యాసాలు ప్రారంభించినా, బైబిల్ ఖురాన్‌లపై చర్చ ప్రారంభించినా దానిలో ప్రకృతి రహస్యాలనే వెలికి తీస్తుంటారు ఆయా బోధనలన్నింటినీ ప్రకృతి రహస్యాలకు అనుకూలంగానే అన్వయిస్తుంటారు. ఈ విశాల విశ్వమంతా సృష్టి, స్థితి,లయ ప్రధానం ప్రకృతే ఆరాధ్య దైవం. ప్రకృతే జీవరాశి కంతటికీ ఆహారపానీయాలను అందిస్తుంది అందువలననే మన పూర్వులు పెద్దగా వేదాంతం చదువుకోకపోయినా ఈ సృష్టి, స్థితి, లయలకు ప్రధాన కారణం ప్రకృతేననేది వారి ఆత్మలకు తెలుసు అది బయటకు కనపడదు. అందుకనే భగవంతుని వారు చెట్టులో, పుట్టలో, రాతిలో, రప్పలో, పశువులలో, పక్షులలో చివరకు సూక్ష్మాతి సూక్ష్మములైన కీటకాలలో కూడా ఆరాధించ దగిన, పూజింపదగిన జీవినే చూస్తుంటారు వారే ప్రకృతి ఆరాధకులు. వారు ప్రకృతినే దైవంగా ఆరాధిస్తారు.

## సౌందర్యోపాసన- సౌందర్యారాధన- కళారాధన- కళోపాసన

సౌందర్యోపాసన, సౌందర్యారాధన విషయాలకు వస్తే ఆయన ప్రవృత్తి అదొక విలక్షణంగా ఉంటుంది. మన ప్రాచీన ప్రబంధకవుల రచనలలోని సౌందర్యం కాదు ఆయన చూచేది ఆయన ప్రకృతిలోని ప్రతిజీవియందు ఒక విశేషమైన సౌందర్యాన్ని గమనిస్తారు మీకు కొన్ని ఉదాహరణలిస్తాను సౌందర్యవతి ఆయన ఒక స్త్రీ. ఆ స్త్రీని అంగాంగవముల శల్య పరీక్ష చేయరాయన. ఇతరులంతా కురూపిగా చూసే మనిషిలో ఎక్కడో దాగియున్న ఒక అందాన్ని చూచి దానినే ఆ వ్యక్తికి అందమైనదిగా అభినందిస్తుంటారు నల్లగా నేరేడు పండు వర్ణంలో ఉన్న స్త్రీనిగానీ, పురుషుని గానీ చూసినప్పుడు ఆయన అది క్రిష్ణ వర్ణమయ్యా! అంటూ అభివర్ణించుతారు ఆముక్కు చూడు ఆ అమ్మకు ఎంత అందంగా ఉందో కోటేరులాగ విద్యుత్‌లీనే ఆ కళ్ళు చూడు విశాలంగా ఎంత ఆకర్షణీయంగా ఉన్నాయో, ఆనడక తీరు చూడు ఇలా ఆ వ్యక్తిలోని ఏదో ఒక భాగాన్ని తీసుకుని ఆ అందాన్ని వర్ణిస్తారు.

రంగాజీ కనీసం వేయి మంది కలం చిత్రాలు (జీవితం) రాసి ఉంటారు. ఒక్కమారు ఆసక్తి ఉన్నవారు ఆ కలం చిత్రాలు చదివితే ఆయనలోని సౌందర్యోపాసన, సౌందర్యారాధన అర్థమవుతుంది. రచన ప్రారంభంలోనే ఆ వ్యక్తి యొక్క ప్రధానమైన భాగాలను తీసుకుంటారు. ఉదాహరణకు ఆ బలిష్టమైన భుజాలు, ఆ విశాలమైన వక్షస్థలం కోటేరులాంటి ముక్కు, ఉబ్బెత్తుగా విశాలంగా ఉండే ఆ ఫాలభాగం ఇలా ఉంటాయి ఆయన వర్ణనలు.

## సాహిత్యంలోనూ, సౌందర్యారాధనే, ప్రకృతి ఆరాధనే

రంగాజీ నిత్య జీవితంలో ఎచ్చట ఏ కించిత్ సౌందర్య, ప్రకృతి పరిమళం తన అవగాహనకు వచ్చినా, తానున్న పరిధిలో చర్చకు వచ్చినా ఎంతగానో పరవశించి పోతారనుకున్నాం కదా! మరెంతగా ఆనందిస్తారో చర్చించుకున్నాము. ప్రకృతి రహస్యాలను శాస్త్రీయ విజ్ఞానానికి, చారిత్రక పరిశోధనకు ఉపయుక్తంగా మలచుకుంటారో చూశాం ప్రసంగాలలో, రచనలలో, చర్చలలో ఆయనదదే బాణి. ఆయన సాహిత్య సేవ గురించి మహాత్ముని ఆస్థాన కవిగా ప్రసిద్ధి పొందిన తెలుగు లెంక, అభినవ తిక్కన శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు ఆయన సాహిత్య సేవను అభివర్ణిస్తూ ఈ చిన్ని ఆణిముత్యంలాంటి గీత పద్యంతో ప్రారంబిద్దాం.

"నిను దేశభక్తునిగా మెచ్చిన వారల్
కలరు మహి నశేష ప్రజ నీ
ఓనరించిన భాషా సేవ నెరింగిన వార
లెన్ని వందలు కలరో ?"

కళా ప్రపూర్ణ, తెలుగులెంక, అభినవ తిక్కన, మహోత్మని ఆస్థాన కవి, గాంధేయవాది శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారన్నట్లు రంగాజీకి రాజకీయ నాయకుడిగానే ప్రశస్తి. ప్రపంచంలో రాజకీయ నాయకుడిగానే పరిగణన కానీ ఆయన సాహిత్య, సాంస్కృతిక, చారిత్రక ప్రక్రియలపై సాగించిన కృషి సాహిత్య కృషి పండితులైన బహుకొలది మందికి మాత్రమే తెలుసు.

రంగాజీ ఆంగ్లములో ఎన్ని గ్రంథములు రచించారో అంతకంటే హెచ్చుగానే తెలుగులో కూడా గ్రంథ రచన చేశారు. (ఆంగ్లములో 45 గ్రంథాలు రచించారు) చెబితే ఆశ్చర్యంగా ఉంటుందేమో! ఆయన రాజకీయ, అర్థశాస్త్ర, సాంఘిక సంస్కరణ, సాహిత్య సాంస్కృతిక, చారిత్రక రంగాలకు సంబంధించిన వేయి మందికి పైగా ప్రముఖుల జీవిత చిత్రణలను (కలం చిత్రాలు) రచించారనే విషయం నేటితరం వారికి అంతగా తెలియకపోవచ్చు.

రంగాజీ రచనా పాటవాన్ని, ఆ రచనలలోని సాహిత్యం విలువలను, అందులో ఆయన వెలయించిన సౌందర్య పోషణ, ప్రకృతి ఆరాధనల ప్రాశస్త్యాన్ని పలువురు ఆంధ్రకవి పండితులు, చారిత్రక పరిశోధకులు బహుముఖాలుగా కీర్తించారు. అందులో కొన్ని

బహుగ్రంథకర్త, జీవిత చరిత్రల రచనలలో అగ్రగామి పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు కేవలం ఆయన సాహిత్య సేవపైనే అనేక వ్యాసాలు రచించారు ఆయన గ్రంథాలకు ఆ ముఖాలు రచించారు. రంగాజీ సాహితీ ప్రక్రియ ప్రాశస్త్యాన్ని గురించి ఆచార్య రంగాపై "కవితాంజలి" అనే గ్రంథానికి శ్రీ గొర్రెపాటి వారు రచించిన "ఆ ముఖాన్ని" ఒక మారు చదవండి మీకే తెలుస్తుంది.

రంగాజీ రచనలలో తెలుగు, జిలుగు, వెలుగుల సౌరభాలు ఆఘ్రాణించడానికి సులభగ్రాహ్యములు. ఆయన గద్యరచన పద్యంవలె ఛందో బద్ధంగా ఉంటుంది గేయం వలె లయబద్ధంగా ఉంటుంది ఆయన రచన

ప్రారంభించారంటే ఆంగ్లములోనైనా, తెలుగులోనైనా రాకెట్ వేగంతో పోటీ పడి పరుగులు తీస్తున్నదా అన్నట్లు ఉంటుంది ఆయన రైల్లో ప్రయాణిస్తున్నా, పార్లమెంటు చర్చలో పాల్గొంటున్నా, ప్రపంచ పర్యటనకు విమానంలో బయలు దేరినా ఒక చోట అనేదేమిటి ఆలోచనరావాలేగాని అచటనే ఆ నిమిషాన్నే రచనకు ఉపక్రమిస్తారు. ఆ రచన ఆలనాటి వీరేశలింగం గారి ధారయే కొట్టి వేతలు, తుడుపులు మచ్చుకైనా ఉండవు ఏకంగా, నేరుగా ముద్రణకు పోవలిసిందే అందుచే ప్రముఖ రచయిత ఆవుల గోపాల క్రిష్ణమూర్తి, ప్రముఖ కవి పండితుడు మరుపూరి కోదండరామిరెడ్డి, బాషా శాస్త్రవేత్త పూతలపట్టు శ్రీరాములరెడ్డి లనేక సమీక్షా వ్యాసరచనలు చేశారు

తెలుగు నుడికారపు సొంపు, ఇంపు పసందులలో ఆయనకు ఆయనే సాటి. పలుకుబడులలో, నుడికారములో ప్రాంతీయం పారిభాషిక పదజాలములలో ఆయనదొక ప్రత్యేకమూ విశిష్టమూనైన బాణి సర్కారు, రాయలసీమ, ఉత్తరాంధ్ర, దక్షిణాంధ్ర, తెలంగాణా పలుకుబడులు, నుడికారములు, శైలి కలగాపులగంగా ఉండి పడుగు పేకల వలే సాగుతుంది. ఆయన రచనేగాని, ప్రసంగమే గాని గ్రంథ రచనకు పూనుకుంటూనే ప్రచురణ కొరకు రైతు గ్రంథమాల అనే సంస్థను స్థాపించారు.

రంగాజీ సౌందర్యారాధన, సౌందర్యోపాసన కేవలం ప్రకృతి ప్రసాదించే పరిమళములను, సుగంధములను, సృష్టి, స్థితి, లయ కారణములను చూచి పరవశత్వము చెందటమే కాదు ఆనందోత్సాహాలను అనుభవించడమే కాదు శృంగార రసభరితంగా కూడా ఉంటుంది. రంగాజీ సౌందర్యోపాసనలోని శృంగారము ప్రాచీన ప్రబంధకవుల పచ్చి శృంగారము కాదు భర్తృహరి ప్రతిపాదించిన సునిశితమూ, సుజన రంజకమూ, హృదయములను పల్లవింపచేసే శృంగారము అనునది భర్తృహరి ప్రతిపాదించిన సుభాషితములు మూడు. దానిని సుభాషిత త్రిశతి అని కూడా అంటారు. ఇందు నీతికి, వైరాగ్యానికి, శృంగారము అను మూడు విధములుగా ధర్మములను చెప్పారు. నీతి ఎంత ధర్మ పథంలో ఉండాలో వైరాగ్యమునకూ అంతటి ధర్మపథం నిర్దేశించారు. ఈ రెండు ధర్మములకు సమానమైన ధర్మముగా శృంగారమును కూడ వర్ణించారు. శృంగారమనగానే స్త్రీ పురుషుల అంగాంగ నిర్మాణ రహస్యముల వర్ణించుటయే కాదు. శృంగార

మనేది స్త్రీ పురుషుల మధ్య సృష్టి, స్థితి, లయ కారకమ్మైనదిగా ఉండాలి ఇదే రంగా గారి ఆశయం. ఇదే ఆయన ఆదర్శం

రంగాజీ సౌందర్యోపాసనలో శృంగారమనేది అతి ప్రాముఖ్యమైన అంశము ఆ శృంగారము సృజనాత్మకమ్మైనదిగా ఉండాలి ప్రతి మానవుని మనఃఫలకంపై ఆనందానుభూతిని, ప్రేమామృతమునూ వర్షించేదిగా ఉండాలనేది రంగాజీ ఆశయం అందుకాయన భర్తృహరి శృంగార శతకమునే ప్రామాణికంగా ఎన్నుకున్నారు. భారతీదేవి జీవితమును సౌందర్యము, కళా వైదుష్యము, శృంగార రసభరితములూ అయిన వర్ణనలతో రచించారు రంగాజీ. ఆ గ్రంధం వందకు పైగా శీర్షికలతో రసవత్తరంగా, మనోహరంగా రచించారు అది రైతు ఉద్యమంగానీ, రైతాంగ పోరాటమేగానీ, రైతు రక్ష యాత్రలేగానీ, దైనందిన జీవిత విధానాన్నే గానీ, విహార యాత్రలేగానీ మరేదైనా గానీ అదొక శృంగార రసభరితంగానే ఉంటుంది. శ్రీమతి భారతీదేవి హృద్రోగముతో గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రిలో మృత్యువుతో ఆమె సాగించిన పోరాటాన్ని రోజుకో శీర్షిక క్రింద ఆమె అనుభవించే బాధలను పాఠకుల హృదయాలను కదిలించేదిగా, కనుగొనుకుల వెంట నీరు కార్పించేదిగా సాగింది. ఆయన రచన

ఒక రోజు భారతీదేవి ఆసుపత్రిలో మృత్యువుతో పోరాడుతూ, బాధపడుతూ అచట చేరిన బంధుగణాన్ని సహచరులను, అనుచరులను, శిష్యులను, ఓదార్చడం అనునయ వాక్యాలు పలకడం చూస్తుంటే ఆశ్చర్యంగా ఉండేది. ఆ సందర్భంలోనే అచట చేరిన వారికి ఒక ధర్మోపదేశం చేశారు.

"జాతస్య మరణం ధృవం" ఇది ప్రాచీన ఆర్యోక్తి వేదాంత సారము కూడా. జననమొందిన ప్రతిజీవి మరణించడం అనివార్యం. ఇది సృష్టియొక్క రహస్యం. అందుకే మన పూర్వులు మృత్యువును దైవంగా అభివర్ణించారు. పూజించారు ఆరాధించారు. ఉపాసించారు. ఎందుకో తెలుసా ? ప్రతిజీవికి మిత్రుడు, బంధువు, పోషకుడు, రక్షకుడు మృత్యుదేవతే మృత్యువు ప్రతిక్షణం జీవిని అంటిపెట్టుకొనే ఉంటుంది. తోడు నీడగానే ఉంటుంది తల్లిదండ్రులు తమ బిడ్డల పోషణలో ఎంతటి జాగరూకులై ఉంటారో మృత్యుదేవతకూడా అంతటి జాగ్రత్తగా ఉంటుంది. ఎప్పుడూ హెచ్చరిస్తుంది. ఏమని? జాగ్రత్త అని

# ఋషి- మహర్షి- రాజర్షి- బ్రహ్మర్షి
# బ్రహ్మర్షిగా పరిణతి చెందిన రంగాజీ

స్థితప్రజ్ఞుడు కావాలంటే అందుకు కొన్ని అర్హతలు చెప్పింది గీత మరెన్నో సుగుణాలు కూడ సూచించబడ్డాయి అవన్నీ వివరంగానే పొందుపరచడం జరిగింది. ఒక విషయమైనా, విషయాన్నైనా, ఒక వస్తువునైనా, ఒక వ్యక్తినైనా అలానే ఒక జాతినైనా కూడా విశ్లేషించాలంటే అందుకొక సూత్రం కావాలి అది కొలమానం కావచ్చు తూకం కావచ్చు, గీటురాయి కావచ్చు ఏదో ఒక రకమైన సాధనం కావాలి కదా ! ఉదాహరణకు చూద్దాము హిమవత్ పర్వత శ్రేణులలో ఎవరెస్టు పర్వతం ప్రపంచంలోనే ఎత్తైనదని ఋజువైనది కొలమానం ద్వారా నిర్ణయించబట్టేకదా అలానే రంగాజీ స్థితప్రజ్ఞుడనేది ఎందుకు? ఎలా? అర్హత లేమిటి ? అందుకాయన సాగించిన కృషి ఏమిటి? ఆయనలోని ప్రవృత్తి ఏమిటి ? ఆయన జీవన గమనం ఎలా సాగింది ? ఇలానే మరికొన్ని ఉపకరణములు ఆధారంగా చేసికోవాలి.

ఈ విధంగా రంగాజీని విశ్లేషించటం జరిగితే గీత చెప్పిన సుగుణాలాధారంగానేమి, ఆయన సుదీర్ఘ జీవన గమనంలోనేమి ? విస్పష్టంగా స్థిత ప్రజ్ఞుడనేది ఋజువుకాగలదు. గీత పదహారవ అధ్యాయంలో ఇరువది ఆరు సద్గుణములు పేర్కొనటం జరిగింది కదా ! ఇక వివరంగా చూద్దాము భయరాహిత్యం దాన్ని గురించి చెప్పకున్నాము. చిత్తశుద్ధి, ఏకార్య క్రమాన్ని ప్రవేశపెట్టినా దానిలో చిత్తశుద్ధికనబడుతుంది ఇందు ప్రధానమైన తపస్సు యజ్ఞాన్ని గురించి పరిశీలిద్దాము. తపస్సనగానే తలక్రిందికి, కాళ్ళుపైకి పెట్టి ఉచ్ఛ్వాస నిశ్వాసలను బంధించి సమాధిస్థితిలోనికి పోవడంగా భావిస్తుంటారు. సాధారణంగా ఇంకా చెప్పాలంటే తపస్సు చేయటానికి అర్హమైన స్థలాలు జనార్హవాలు కాదన్నారు. ఏ అరణ్యాలకో, కొండకోనలకో, గుహలకోపోయి అచ్చట తపస్సు చేయాలన్నారు. ఇదంతా తప్పు, పొరపాటు, దురభిప్రాయము అని చెప్పతూ, సత్యాన్ని, అహింసనే, ధర్మాన్ని, పరోపకారాన్ని దీక్షతో, చిత్తశుద్ధితో కొనసాగించటమే తపస్సని గీత అనేక సందర్భాలలో చెప్పింది. రంగాజీ గత డెబ్బై అయిదేళ్ళ సుదీర్ఘ ప్రజాహిత జీవన రంగంలో గాంధీజీ నాయకత్వాన సత్యం, అహింస, ధర్మం, పరోపకార కార్యక్రమాలను

కొనసాగించారనేది స్పష్టము క్రోధం, ద్రోహం, మున్నగు అసురసంపదకు సంబంధించిన విషయాలను ఆయన ఎన్నడూ తన దరికి చేరనీయలేదు మొత్తంగా సమాజాన్ని ఎలా ప్రేమించి, అభిమానించి, ఆదరించి, గౌరవించారో అలానే మిత్రులను, స్వకీయ పక్షం వారిని మాత్రమే కాక, ఎదుటి పక్షం వారిని కూడ అంతగానే అభిమానించి, ప్రేమించి, ఆదరించి, గౌరవించారు. ఈ విషయాన్ని నిర్ధారణ చేసికోవడానికైనా ఆయన రచించిన అరవై పుస్తకాలకు పైగా ఉన్న రచనలలోనేమి, అరవై సంవత్సరాల పార్లమెంటరీ జీవితంలోనేమి వేల సంఖ్యలో చేసి ప్రసంగాలలోనేమి, పుంఖాను పుంఖలుగా వివిధ సమస్యలపై ఆయన చేసిన రచనలలోనూ, ప్రసంగాలలోనూ ఎక్కడా పొరపాటున కూడ వ్యక్తిగత విద్వేషపూరిత విమర్శలు రానివ్వలేదంటే అవే కొలబద్దలు, కొలమానాలు, గీటురాళ్ళు, మృదుత్వము, సిగ్గు, ప్రతిభ, ఓర్పూ, శుచిత్వమూ ఈ గుణము గురించి ఆలోచించవలసిన పనేలేదు. ఆయన ప్రతిభా సంపన్నుడు. అందుకే తనలో బ్రహ్మతేజస్సు ఉట్టిపడుతుంది. ఓర్పా! భూమాతకున్నంత ఉన్నది. శుచిత్వం విషయంలో ఆయనకాయనే సాటి. ఇలా చెప్పకుంటూపోతే గీతాకారుడు నిర్వచించిన ఇరవై ఆరు సుగుణాలే కాదు అంతకు ఇబ్బడి ముబ్బడిగా ఉన్నాయి.

## "సల్లేఖనం ప్రక్రియద్వారా స్వర్గారోహణ"

ఋషి - మహర్షి-రాజర్షి-బ్రహ్మర్షి వైదికమత ప్రవక్తలలో నేమి బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయ మత ప్రవక్తలలోనేమి మనం పైన పేర్కొన్న ఋషి-మహర్షి-రాజర్షి-బ్రహ్మర్షిగా ఎదగటానికి ఏ ఏ అర్హతలు, ఏ ఏ సద్గుణాలు సూత్రీకరించబడి ఉన్నాయో ఆ అన్ని సుగుణాలు రంగాజీలో ఉన్నాయని అనుటలో సందేహము లేదు. ఇచట ఒక విషయం గమనించవలసి వున్నది. అదేమంటే ఋషి అనగానే అది మహర్షిగాని, రాజర్షిగాని, బ్రహ్మర్షిగాని ఎలా వుంటాడో ప్రాచీన పురాణాలు ఇతిహాసాలు, ఉపనిషత్తులు, వేదాలు అలానే బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయ మత గ్రంధాలలో పెద్దగా పెరిగిన గెడ్డాలతో, ఉండలు గట్టిన జరాజుటాలతో, అర్ధనగ్న దృశ్యములతో కమండలము, దండములతో కేవలం భిక్షాటనతోనే బ్రతుకుతారనే ఒక ఆలోచన ఉన్నది. 20వ శతాబ్దపు పై ఋషి గణాలు కేవలం తత్త్వములో [illegible] తప్ప, ఆచరణలో అలా ఉండవలసిన పనిలేదు. ఇప్పుడే పై పేరాలో చెప్పబడ్డట్లు శుచి, శుభ్రతలతో

బ్రహ్మ తేజస్సును కలిగి వుండటమే చాలు ఎందరో విజ్ఞులైన, నీతిజ్ఞులైన విద్యాధికులు రంగాజీని మన ప్రాచీన వైదిక ఋషులతో పోల్చి ప్రశంసించు చుండటం చూస్తున్నాము భగవద్గీత, ఉపనిషత్తులు, వేదాలు, అభివర్ణించిన సుగుణములూ, అన్నీ రంగాజీలో పుణికి పుచ్చుకున్నారు ఆయన ఈ భూమిపైన జీవించిన ౯౫ సుదీర్ఘ కాలం జీవితములో ఎన్నడూ పైన చెప్పుకున్న సుగుణముల నుండి వైదొలగలేదు చివరకు మరణం కూడా జైన సంప్రదాయం ప్రకారం (సల్లేఖనం అనే జైన మత పవిత్రక్రియ) తోనే మరణించాలనే సంకల్పంతో మరణించారు జీవితకాలమంతా ప్రజలను సేవించారు. ఇక వయస్సు పై బడింది. జవసత్వాలుడిగాయి. జ్ఞాపకశక్తి తగ్గిపోతూవుంది స్పర్శ కూడా తగ్గింది ఇక జీవించాలని ఎంతమాత్రం కోరుకోకూడదనుకొన్నారు. అందుకే భగవంతుని సముఖానికి చేరాలను కున్నారు. ప్రకృతిలో లీనం కావాలను కొన్నానని అన్నారు అందుకు సాధన సాగించారు. రోజూ ఆహారాన్ని తగ్గించు కుంటూ పోతూ చివరకు ఒక స్పూను పాలు లేదా కొబ్బరి నీరు నోట్లో పోసినా చెలమలగుండా బయటకొదిలేశారు అలా మరణించాలనే తన దృఢసంకల్పాన్ని, వాంఛను నెరవేర్చుకున్నారు

క్రీ.శ. ౧౯౦౦ సంవత్సరము నవంబరు 7 వతేది నిండు పౌర్ణమినాడు జన్మించారు. పున్నమి చంద్రునివలె చల్లని జీవితం సాగించారు అశేష గ్రామీణ జన సామాన్యానికి చల్లని సేవలందించారు. పున్నమినాటి చంద్రునివలె విశ్వానికిచల్లదనాన్ని, ధవళ వర్ణాన్ని, తేజస్సును కలిగించారు. సల్లేఖనం ప్రక్రియ ద్వారా ౧౯౯౫ జూన్ ౮ వ తేదీన చంద్రునిలో ఐక్యమయినారు. ఒక శతాబ్దం దాదాపు ఈ భూమిపై నడయాడి ప్రజలను సేవించి జీవన్ముక్తులైనారు అందుకే ఆయనను బ్రహ్మర్షి అందాము.

## స్థితప్రజ్ఞులలో స్థితప్రజ్ఞుడు రంగాజీ

మానవులలో స్థిత ప్రజ్ఞత అనేది ఉత్తమ లక్షణం. స్థిత ప్రజ్ఞుడైన వ్యక్తిని నరులలో నుండి ఉద్భవించిన నారాయణునిగా భావించి ఆరాధించటం ఈ విశ్వంలోని అన్ని మతాలలోని సామాన్య లక్షణం. స్థితప్రజ్ఞునికి మరణం లేదు చిరంజీవి. స్థితప్రజ్ఞుని కుండదగిన వుండవలసిన లక్షణములను గురించి

ఎందరో మహానుభావులు, మహర్షులు అనేక గాధలను యుగయుగాలుగా మానవుల కందించారు. స్థిత ప్రజ్ఞునికి ధైర్యము, నిర్భయత్వము అత్యంత ప్రధానమైనవన్నారు సాధారణ మానవులకు, ఓస్ ఇంతేనా, ధైర్యము, నిర్భయత్వమేనా ? అలా అయితే నూటికి తొంభైమందికి ఈ సుగుణాలు వున్నాయి అనుకుంటారు. గీతాకారుడు ఒక విషయం చెప్పాడు ధైర్యము, నిర్భయత్వము రెండూ వుంటే ఇంకో వేయి సుగుణములు వాటంతట అవే వచ్చి చేరుతాయన్నాడు భగవద్గీత । ౧౬ వ అధ్యాయము ప్రారంభంలో ఉత్తమ మానవునికి అదే స్థితప్రజ్ఞుడైన వానికి ఇరువది ఆరు సుగుణములను పేర్కొన్నారు. అందు తొలుతనే “నిర్భయం” అంటే భయరాహిత్యం ఇంకా వివరంగా చెప్పాలంటే నిర్భయత్వం, కాబట్టి ధైర్యానికి, నిర్భయత్వానికి భాష్యం ఎంతైనా చెప్పకోవచ్చు. వేదకాలం నుండి నేటిదనుక ఎందరో మహానుభావులు ఈ విషయంపై వారివారి అనుభూతులు, అభిరుచులు, సంస్కారములను బట్టిఅనేకా నేకములైన భాష్యాలు చెపుతూనే ఉన్నారు. భగవద్గీతలో ఒక శ్లోకాన్ని చూడండి.

**“ఉత్సాహం - సాహసం - ధైర్యం బుద్ధిశక్తిః పరాక్రమః**
**షడేతే యత్ర తష్ఠంతి తత్ర దేవో పి తిష్ఠతి.”**

తా : “ఉత్సాహము, సాహసమూ, ధైర్యమూ, సద్బుద్ధి, శక్తి, పరాక్రమము” ఈ ఆరు సుగుణములు ఎచ్చట నుండునో అచ్చట సాక్షాత్ భగవానుడు కాపుర ముండునని మన పూర్వులు చెప్పదురు. అందువలననే మన సుఘ ంటువులలో స్థితప్రజ్ఞుడంటే పై గుణములు కలవారని చెప్పియుంగిరి. వీటన్నిటినంటే అతి సూక్ష్మమైన ఉపమానం సుబోధకంగా చెపుతుం. ారు. ిన పెద్దలు (పూర్వీకులు). మనం ప్రస్తుతం చర్చిస్తున్న అంశము స్థిత ప్రజ్ఞులలో స్థితప్రజ్ఞుడు రంగాజీ'అన్నది కదా! రంగాజీని అనేకమ ంది సుహాసుండితులైన వారు అనేక సందర్భాలలో ఆయన స్థితప్రజ్ఞుడన్నారు. ఒక సందర్భములో రాజాజీ, రంగాజీ స్థిత ప్రజ్ఞత గురించి ఒక మాట అన్నారు. స్వతంత్రపార్టీ స్థాపించి దానికి అధినాయకునిగా వుండి నడిపించవలసిందిగా రంగాజీని కోరారు. అపుడు రంగాజీ “నేనందకు తగుదునా ? అంతటి శక్తి నాకు కలదా? జయప్రకాష్ ఉన్నారు. ఆయనను అడిగి చూడండి. అదేకాదు. మీరే ఉన్నారు కదా ? ప్రపంచంలో మిమ్మల్ని మించి రాజనీతిజ్ఞు గేరే. కాబట్టి మీరే మనం స్థాపించబోయే స్వతంత్ర పార్టీకి అధినాయకునిగా ఉండవచ్చుకదా మేమంతా

మీ ఆజ్ఞను శిరసావహించి దానిని సుగ్రీవాజ్ఞగా భావించి మిమ్ము సేవిస్తూ పార్టీని సేవిస్తూ ప్రజలను సేవిస్తాము"

రాజాజీ చిరుదరహాసంతో రంగా! నీ శక్తి నీకు తెలీదయ్యా! నీవు రైతు నాయకుడవు నీ జీవితకాలమంతా రైతులను సేవిస్తూ వున్నావు రైతంటే కేవలం భూములు కలిగినవారేకాదు భూమిలేని, భూమినే నమ్ముకుని పనిచేసే వ్యవసాయ కార్మికులంతా రైతులే అంతే కాదు వ్యవసాయం మీదనే ఆధారపడి వ్యవసాయక ఉపవృత్తులైన కమ్మరం, కుమ్మరం, వడ్రంగం అన్నింటికి మించి చేనేతలలో పనిచేసే శ్రామికులంతా రైతులే. ఈ అందరినీ కలిపే కదా, నీవు "కిసాన్ మజ్దూర్ ప్రజరాజ్ "అంటూ సిద్ధాంతాన్ని ప్రతిపాదించావు ఆసిద్ధాంతానికి గాంధీజీ ఆశీస్సులను కూడా పొందావు అంటూ ఆయన చివరగా ఇలా అన్నారు. మహాభారత యుద్ధములో అర్జునుడు యుద్ధముపై విరక్తి చెంది ఎదురుగా ఉన్నవారంతా నా రక్తబంధువులు, గురువులు, పెద్దలు పూజనీయులు యిందర్ని చంపి నేను సాధించదగినదేమున్నది అంటూ విరక్తిగా గాండీవమును క్రింద పడవైచి నిస్సహాయుడుగా తలవంచి నమస్కరించి నపుడు శ్రీకృష్ణ భగవానుడు అర్జునుని యొక్క శక్తిసామర్ధ్యాలను, పరాక్రమాలను, ధైర్యసాహసాలను ఎరుకపరచి కర్తవ్యతా విముఖుడవు కావద్దు తీసుకో గాండీవం, పద రణరంగానికి. శతృవులను దనుమాడి విజయ పథంలోకి పయనించు అని ఎలా ప్రబోధించాడో అదేవిధంగా భగవద్గీతలో చెప్పినట్లు ఉత్సాహము, సాహసము, ధైర్యము, సద్బుద్ధి, శక్తి, పరాక్రమ గుణాలను అలవరచుకో. పార్టీకి నాయకత్వం వహించు అంటూ ప్రబోధించారు. స్వతంత్రపార్టీ నిర్మాణం కావటం, పార్టీ నాయకుడుగా రంగాజీ ఎన్నిక కావటం జరిగాయి (ఆ కధంతా ఇచట ప్రస్థావించటం సందర్భం కాదు. వేరొక అధ్యాయంలో ఎలాగు వస్తుంది.)

## వాల్మీకి మహర్షి దృష్టి పథంలో స్థితప్రజ్ఞుడు

ఒకమారు రామాయణ మహాకావ్య పరిశీలన చేద్దాము ఆ కథ చూడండి. శ్రీరామ చంద్రునకు యుక్త వయస్సు వచ్చింది. అయోధ్యకు రాజుగా పట్టాభిషిక్తుని చేయతలపెట్టారు. ముహూర్తం నిర్ణయించ బడినది దశరధ మహారాజు వారి కులగురువు వశిష్ట మహాముని, ఇతర మహాముని

గణాణ్ని రావించి ఈ విధంగా చెప్పారు అయ్యా! నాకా వయస్సుపైబడింది. జవసత్వాలుడిగాయి రాజ్యభారము వహించలేను సర్వ సుగుణరాశి ప్రజానురంజకుడు నా జ్యేష్ఠపుత్రుడు శ్రీరామచంద్రమూర్తికి పట్టాభిషేకం చేయనిర్ణయించాను. మీ సలహా చెప్పండి. ఏమి చేయమంటారో అని అడిగారు అందరూ ఒకేమారు బేష్ బేష్ అన్నారు రామచంద్రమూర్తికి కబురు పంపారు

ఈ లోగా ఇచట కైకేయి, మంధర సాగించిన కుట్రల ఫలితంగా ఒక విషాద కథనం ప్రారంభమైనది దేవాసుర యుద్ధంలో సహాయకారిగా వున్న కైకేయికి దశరథుడు రెండు వరాలిచ్చి వున్నాడు. కోరుకోమన్నాడు. ఇప్పుడు కాదు సమయం వచ్చినపుడు అడుగుతాను అప్పుడియ్యమన్నది ఆ సమయమేదో ఇప్పుడొచ్చింది. అనేక చర్చలు జరిగిన తరువాత కోరుకున్నది. "ఒకటి భరతుని పట్టాభిషేకం. రెండోది రామునికి అరణ్యవాసం" హతాశుడై నేలకొరిగాడు దశరథమహారాజు. పట్టాభిషేక మహోత్సవ విషయాన్ని చెప్పడానికి పిలిపించిన రాముడు అదే సమయంలో వచ్చాడు మరోవైపున అయోధ్యా పట్టణమంతా రంగరంగవైభవంగా అలంకరించబడుతూ వుంది. రాముడు చూచాడు హతాశుడై స్పృహలేకుండా పడివున్న దశరథ మహారాజును ఇదేమిటి? ఆశ్చర్యంగా వుందే తండ్రి దశరథుడు కటిక నేలపై స్పృహలేకుండా పడి వున్నారు మరోవైపున పినతల్లి కైకేయి శక్తి స్వరూపంతో ఉగ్రురాలైవున్నది? అని మనస్సులో అనుకున్నారు. పెద్దగా భువన భువనోంతరాళాలు దద్దరిల్లేట్లుగా తండ్రీ ఏమి సెలవు ? ఏమి ఆజ్ఞ ? అంటూ విలపిస్తున్నాడు. తండ్రి ఉలుకూ, పలుకూలేదు. తల్లీ కైకేయిని చూచి నీవు నన్ను నీ కడుపున పుట్టిన భరతుని కంటే మిన్నగా ఆదరించి, ఆప్యాయంగా పెంచావు. నీవైనా చెప్పమ్మా ? కైకేయి చెప్పంది. మీనాన్న నాకిచ్చిన రెండు వరముల ప్రకారం నీ తమ్మునికి అయోధ్యకు రాజుగా పట్టాభిషేకం, నీవు అరణ్యవాసం చేయాలి. ఓస్ ! ఇంతేనా ? తండ్రి ఆజ్ఞకంటే నాకు మించిన దేమున్నది? చాలా సంతోషంగా ఉంది. అంటూ ఆమెకు హామీ ఇచ్చారు. పట్టాభిషేకం కొరకొచ్చిన రాముడు అరణ్యవాసం కెళ్ళడం కంటే ఘోరం ఇంకేముంటుంది ? కానీ రాముడు ఈ రెండింటి మధ్య ఎలాంటి వ్యత్యాసం చూపలేదు. పట్టాభిషేకము కంటే వనవాసము తక్కువేమి కాదు. తప్పేమికాదు. స్థితప్రజ్ఞుడైన వానికి రెండూ

ఒక్కటే అని చెప్పటంలో వాల్మీకి మహర్షి గొప్ప నీతిని బోధించాడు మానవజాతి, సుఖాలకు పొంగిపోవటం, కష్టాలకు కృంగిపోవటం స్థితప్రజ్ఞుల లక్షణం కాదు ( ఇచ్చట మనం రామాయణ, మహాకావ్యంలో వాల్మీకి మహర్షి స్థితప్రజ్ఞతను గురించిన భాగంలో ఒక చిన్న అంశము మాత్రం తీసుకున్నాము.)

ఈకథంతా చదివినపుడు ఇందు రంగాజీ ప్రస్థావన ఎక్కడా ? ఎందుకు? అనుకోవచ్చు నెహ్రూ ప్రభుత్వంలో ఆహార వ్యవసాయ మంత్రిగా ఆహ్వానించగా రంగాజీ ఎందుకు తిరస్కరించారో ఒక కథ చూద్దామే. రెండవప్రపంచ మహాయుద్ధానంతరం యుద్ధకాలంలో ప్రతిపాదించబడిన కంట్రోలులు, రేషనింగు, పర్మిట్లు సాధారణ మధ్య తరగతి రైతు, కూలి శ్రామిక ప్రజలందరికీ ఉరిత్రాళ్ళుగా, గుదిబండలుగా, సంకెళ్ళుగా తయారయ్యాయి. బ్రిటీష్ ప్రభుత్వ పాలనా కాలంలోనే రంగాజీ కంట్రోళ్లు, రేషనింగులు, పర్మిట్ల కారణంగా ఎదురైన కష్టనష్టాలపై ప్రజలలో ప్రచారం గావించి వాటి రద్దుకు యుద్ధప్రాతిపదికపై పోరాటాన్ని ప్రారంభించారు. ఇంతలో స్వతంత్ర భారతం ఏర్పడటం, నెహ్రూ ప్రధానిగా కేంద్రప్రభుత్వం అధికారం చేపట్టడం జరిగింది. అయినా రంగాజీ పోరాటం విరమించ లేదు. అందోళనల నుండివైదొలగలేదు.

ప్రధాని పండిట్ నెహ్రూ కమ్యూనిష్టుల ప్రచార ప్రాబల్యాలకు లొంగి పోయారు. మార్క్సిస్టు అర్థశాస్త్రవేత్తలు ముఖ్యంగా మహాలనీబీస్ ప్రలోభాలకు, వాదనా పటిమకు లొంగిపోయి ప్రణాళికా బద్ధమైన ప్రభుత్వాలకు కంట్రోళ్ళు, రేషనింగులు, పర్మిట్లు తప్పవు ఇవి అనివార్యములు. పరిపాలనకు పట్టుకొమ్మలు. ఏ పరిస్థితులలోనూ తొలగించటానికి వీలులేదని ఖండితంగా చెప్పేశారు నెహ్రూకు. మహాత్మాగాంధీ, రాజాజి, సర్దార్ వల్లభాయి పటేల్ మున్నగు జాతీయ నాయకులెంత మంది చెప్పినా పండిట్ నెహ్రూ చెవికెక్కించుకోలేదు. మరోవైపున రంగాజీ కంట్రోళ్ళు, రేషనింగు పర్మిట్ల రాజ్యం అంతం కావాలని వాటిని రద్దుచేయనిదే విశ్రమించనని పట్టుదలతో ఉద్యమాన్ని దేశవ్యాప్తంగా సాగించారు (ఈ కథంతా వేరొక అధ్యాయంలో చూడవచ్చు) ఇరువర్గాలు ఎవరికి వారు పట్టుదలతో నుండగా ఈ నేపథ్యంలో రంగాజీకి ఒక అధికార పదవిని కట్టిబెట్టి కేంద్రంలో మంత్రిగానైనా సరే శాంతింప చేయాలన్న ఆలోచనలోనికి వచ్చారు కేంద్రంలోని కాంగ్రెస్ పెద్దలు, నెహ్రూకి అంతరంగికుడు, రంగాజీకి

అభిమానపాత్రుడు అయిన గోవింద వల్లభ పంత్‌ను రంగాజీ వద్దకు పంపారు. కేంద్రంలో ఆహార, వ్యవసాయశాఖ మంత్రిగా పదవి స్వీకరించవలసిందిగా కోరారాయన రంగాజీ మంత్రిపదవి స్వీకరించవలసిందిగా ఆహ్వానాన్ని పంపిన నెహ్రూకు కృతజ్ఞతలు చెప్పారు అయితే నాకు మంత్రిపదవి కాదు కావలసింది మంత్రిపదవికంటే మరో మహోన్నతమైన ఆశయం వున్నది నాకు. భారత దేశంలోని అశేష గ్రామీణ శ్రామిక జనాలకు కంట్రోళ్ళు, రేషనింగు, పర్మిట్లు అనే గుది బండలు తొలగించాలి ఉరిత్రాళ్ళను విప్పాలి సంకెళ్ళు తొలగించాలి మంత్రిపదవి కంటే ఇదే నాకు గొప్ప అని సున్నితంగా సమాధానం చెప్పారు చివరకు గాంధీజీ సైతం పండిట్ నెహ్రూ స్వయంగా తమ మంత్రివర్గంలోనికి ఆహ్వానిస్తున్నారు గదా వెళ్ళకూడదా ? అని సలహాగా చెప్పారు. సమాధానంగా రంగాజీ బాపూ ! మంత్రివర్గంలో నాకు స్వేచ్ఛ వుంటుందా? కంట్రోళ్ళు, రేషనింగు, పర్మిట్లు రద్దుకావాలనే నా ఆశయం నెరవేరుతుందా? మీరే చెప్పండి. నాకు మంత్రి పదవి అక్కరలేదు నా ఆశయాలను నెరవేర్చమనండి. నేనాయనను హృదయపూర్వకంగా బలపరుస్తాను.

ఇక ఇప్పడాలోచించండి ఆశయాలముందు ఎంతటి మహోన్నతమైన పదవినైనా త్యాగం చేయటానికి సిద్ధపడిన రంగాజీ స్థితప్రజ్ఞుడవునా కాదా ? అందుకే రంగాజీ "స్థితప్రజ్ఞులలో స్థితప్రజ్ఞుడ"ను కున్నాను. అవునో కాదో మీరే విశ్లేషించండిం

భగవద్గీతలో అర్జునుడు స్థితప్రజ్ఞుని లక్షణములను గూర్చి నాలుగు ప్రశ్నలు వేశాడు అవి ౧.కాభాషా అతని అక్షణములేవి ?, ౨.కింప్రభాషేతా = ఏం పలుకును?, ౩ కీనూసీత= ఏరీతిగ నుండును ?, 4.ప్రజేతకి = ఎట్లు సంచరించును ? ఈ నాలుగు ప్రశ్నలకు సమాధానాలుగా ముప్పైశ్లోకములలో విశ్లేషించారు ఒక్కొక్కదాని విషయంపై విపులంగా చర్చించడం ఇచ్చటవల్లపడదు. అయితే స్థూలంగా, కోరికలను త్యజించడం. అలా త్యజించిన కోరికల పట్ల ఎంతమాత్రమూ అభిలాషలేకుండుట. అహంకారమును పారద్రోలుట, మమకారములను విసర్జించుటలుగా చెప్పారు. మానసిక ప్రశాంతతను, సమతాభావమును, సహనమునూ పొందుటకు మార్గములను నాలుగు మార్గములను భగవద్గీతలో చెప్పబడినవి. ఉదా: ౧) కోరికలను విషయములను అన్నింటిని విడనాడుట ౨) దృశ్యపదార్థముల

వేనియందునూ అభిలాష లేనివాడు గాను 3) అహంకారమును పారద్రోలిన వాడుగాను 4) మమకారమును వదిలిన వాడునూ, ఇట్టి మనుజుడు శాంతిని పొందగలుగును అన్నారు. సర్వోత్కృష్టుడగు మానవునకు వుండవలసిన సుగుణములను 26గా వర్గీకరించారు. ఉదా· 1 భయరాహిత్యము, 2 చిత్తశుద్ధి, 3. జ్ఞానయోగ స్థితి, 4 దానము, 5. ఇంద్రియ నిగ్రహము, 6 (జ్ఞాన) యజ్ఞము, 7. శాస్త్రాధ్యయనము, 8 జ్ఞాన(తపస్సు), 9 ఋతుత్వము, 10. అహింస, 11. సత్యము, 12 క్రోధారాహిత్యము, 13 త్యాగము, 14. శాంతి, 15 కొండెములు చెప్పకుండుట, 16 భూతదయ, 17 విషయంలోలత్వము లేకుండుట, 18 మృదుత్వము, 19 సిగ్గు, 20. చపలత్వము లేకుండుట, 21 ప్రతిభ బ్రహ్మతేజస్సు 22 ఓర్పు, 23. ధైర్యం, 24. సుచిత్వము, 25. ద్రోహబుద్ధి లేకుండుట, 26 అభిమానరాహిత్యము ఈ సద్గుణములే దైవీ సంపదలన్నారు

సంపదలు ప్రధానంగా వేదాంతపరంగా దైవీ సంపద(దైవికగుణ సముదాయము) ‹ సుర సంపద (అసురగుణ సముదాయము) దైవ సంపదల గురించి పై ఇరవై ఆరు గుణములునూ చెప్పకున్నాము అసురసంపదలు కూడా భగవద్గీతయందు చెప్పబడియే యున్నవి. సూక్ష్మంగా చెప్పకుందాము. 1. డంబము, 2. గర్వము, 3. అభిమానము (దుర అహంకారము) 4. కోపము, 5. కాఠిన్యము, 6. అవివేకము. ఇవన్నీ అసుర సంపత్తిగా పేర్కొనబడినవి.

రంగాజీ ఎంతటి అపారమైన దైవసంపత్తిని కలిగి ఉన్నాడో దానిని వయస్సు పైబడే కొలదీ ఎంతగా పెంచుకున్నాడో, అభివృద్ధి పరచుకున్నాడో ఎనిమిది శతాబ్దాల సుదీర్ఘ రాజకీయ జీవితములో ఎంతటి విశిష్టతను సంతరించుకున్నాడో నేటి తరం వారికి సుగ్రాహ్యమే. దైవ సంపదగా చెప్పబడిన ఈపై26 సుగుణములలో ఏ ఒక్క దానిని ఆయన అనుసరించకుండా విడువలేదు.

భయరాహిత్యమనేది ఒక మహోన్నత శక్తి. సంపన్నుడు ఏ కార్యక్రమము తల పెట్టినా మధ్యలో విరమించడు. మహాత్మాగాంధి ఒక సందర్భంలో బీహారులో నీలిమందు రైతుల సమస్యలపై ప్రజలను పోరాటమునకు సంసిద్ధపరచుతూ ఇలా అన్నారు. మీరు ఎంతటి త్యాగానికైనా సిద్ధపడాలి అన్నారు. రైతులు ఒక్కమాటగా మేము మా ప్రాణాలనైనా త్యజిస్తాము అన్నారు.

అప్పుడు మహాత్మా గాంధి ప్రాణాలు త్యాగం చేయడం కొన్ని సందర్భాలలో అంత గొప్పేమి కాదు. ప్రభుత్వంతో పోరాడు సందర్భంలో మీరు భూమి శిస్తు కట్టకుండా నిరాకరిస్తే ప్రభుత్వం మీ గొడ్డూగోదా చెంబూ, కంచం, తపేళా అలానే మీ స్థిరచరాస్తులను జప్తుచేసి బళ్ళకెత్తుకుని పోతున్నప్పుడు మీ బలహీనత బయటపడుతుంది ఎలాగంటారా ? ప్రభుత్వ నిరంకుశ విధానాల నెదిరించి తుపాకీ గుండ్లకు బలికావటానికైనా జంకరుగాని మీ స్థిరచరాస్థులను జప్తుచేసి బళ్ళకెత్తడం భరించలేరు ఆ సందర్భంలోనే ధైర్యం కావాలి అందుకు మొట్టమొదట మీలో తొలగ వలసింది భయం. రంగాగారు సాగించిన అనేక ఉద్యమాలలో ఆయన ప్రదర్శించిన ధైర్యసాహసాలు ఎంతగా భయరహితంగా ఉన్నాయో జమిందారీ వ్యతిరేక పోరాటంలో జమిందారీ గూండాల పాశవిక చర్యలను ఎదురొడ్డి, ఎంతటి ధైర్యసాహసాలను ప్రదర్శించారో చూస్తే ఆయన ఎంతటి భయరహితుడో అర్థమవుతుంది. ఈ సందర్భంలో స్వామి వివేకానంద ఒక సూక్తిని చూద్దాము

## మహాపురుషుడెవరు ?

"నీవతని శీలమును నిజముగా నిర్ణమింప దలచినచో
అతడొనర్చిన ఘనకార్యములను
పరికింపకుము ఎప్పుడో ఒకప్పుడు ప్రతి
మూర్ఖుడునూ మహావీరుడు కావచ్చును
చాలా మామూలైన పనులను చేయునప్పుడు
అతనిని దీక్షతో కనిపెట్టుము
ఒక మహాపురుషుని నిజమగు స్వభావమును వెల్లడించునని

అట్టి సామాన్య కృత్యములే ఉత్కృష్ట
సమయము లత్యల్పములను సైతము ఎటైనా
ఒక విధమైన ఘనత కెక్కించును
కాని ఎవ్వని శీలమెల్లప్పుడునూ ఉదాత్తమై
యుండునో తానెట్టి పరిస్థితులలో ఉన్ననూ
ఒక విధముగానే నుండునో అతడే
నిజమైన మహాపురుషుడు."

విశ్వవిఖ్యాత వేదాంత దార్శనికుడు మానవ మనస్తత్వ శాస్త్ర ప్రావీణ్యుడు మహామనీషి తన చిరకాల జీవిత, పరిశోధన సారాన్ని ఎంత విపులంగా చెప్పారో, ఎంత విశిష్టంగా వున్నదో చూడండి. ఒక్కొక్కప్పుడు ఎందుకూ కొరగాని వాడుకూడా ఏదో ఆవేశంతో ఆలోచన రహితంగా చేసిన కార్యం ప్రజల నాకర్షించవచ్చు అదొక ఘనకార్యంగా తోచనూవచ్చు. అలాంటి క్షణికో ద్రేకంతో చేసిన సాహసకృత్యాలుగాని, ప్రజాహిత కార్యక్రమాలుగాని, సేవాభావంగాని, స్థిరస్థాయిగా అతడిని మహాపురుషునిగా రూపొందించలేవు తన జీవితకాలమంతా ఎప్పడూ ఒకే విధంగా ఎవరు ఘన కార్యములు సాగిస్తుంటారో, సేవా కార్యక్రమములు చేపడుతుంటారో అట్టివారు మాత్రమే మహాపురుషులనదగుదురు

ఈ సూక్తి ననుసరించి రంగాజీని పరిశీలించినపుడు తన ౯౫సం.. జీవిత కాలంలో, ౭౦ ఏండ్ల సుదీర్ఘకాలం నిరంతరం, నిర్విరామంగా, అవిశ్రాంతంగా, ప్ర: లను అందునా రైతుకూలీ చేతివృత్తులకు చెందిన అశేష గ్రామీణ, శ్రామిక జ. .ాలకు సేవలు చేయటంలో తరించిన మహాపురుషుడుగా ప్రసిద్ధిచెందారు. వారిసేవలో ఎదురైన అనేక సమస్యలపై బలవత్తర శత్రువులైన జమిందారులతో పోరాడారు. జాగీర్దారులతో పోరాడారు ఇనాందారులతో పోరాడారు. ఈ పోరాటంలో విజయమూ చేకూరింది అపజయాలు ఎదురయ్యాయి. కష్టాలు-సుఖాలు కలగాపులగంగా అనుభవించారు. అవమానాలనూ పొందారు. సన్మానాలను గ్రహించారు ఆయన స్థితప్రజ్ఞత ఇచ్చటనే వెల్లడికాలేదా ? సుఖాలు ప్రాప్తించినపుడు పొంగిపోవటం, కష్టాలు కడగండ్లు ఎదురైనపుడు కృంగిపోవటం ఏనాడూ జరగలేదు ఇదే స్థితప్రజ్ఞుని లక్షణం. అందుకే ఈ శీర్షికను "స్థితప్రజ్ఞులలో స్థితప్రజ్ఞుడ "ని పేర్కొనటం జరిగింది.

## రంగాజీ వ్యక్తిత్వ వికాసానికి- ప్రాపంచిక జ్ఞానానికి దోహదపడిన - తొలి మలి గురు పరంపర

రంగాజీయే తరచుగా, సందర్భము కలిగినప్పుడల్లా తన చిన్ననాటి గురువులు చదువులు, సంధ్యలులేని వారని కేవలం ప్రాపంచిక జ్ఞానము జీవితానుభవం గల గురువులు నాకు జ్ఞానోపదేశం చేశారంటూ చెపుతూ వుంటారు ఎవరా గురువులు ? ఏమా కధా కమామీషు ! చూద్దామా!

**నా తొలి గురువు :** కన్నతల్లి కనుమరుగైనా కన్నతల్లికంటె మిన్నగా మమ్మాదరించి పెంచి పోషించిన మా పెద్దమ్మ మంగమ్మ అంటూ వుంటారు. అంటూ వుండటమే కాదు ఆమెను గూర్చి ఆమె జీవిత చరిత్ర రచించారు. ఇతర అనేక రచనలలో ప్రస్తావించారు కూడా. ఆమె తన మొదటి గురువెలా అయిందో ఆయన మాటల్లోనే చూడండి.

ఆమె, మా పెద్దమ్మ మసక చీకట్లోనే నిద్రలేపి, ముఖం కడిగించి, స్నానం చేయించి తన వెంట పంటపొలాలకు తీసుకు వెళ్లేది ఇక అచట ప్రారంభించేది జీవితపాఠాలు. కంటికి కన్పించిన చెట్టూ-చేమా-పంటా-పైరు- పశువులు-పక్షులు, ఆకులు-అలములు, పూలు-పండ్లు ఒక్కొక్కటీ చూపిస్తూ వాటిపై కథలల్లేది. ఆ కధలు చాలా ఆసక్తికరంగా వినబుద్ధి అయ్యేవి. మా ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుల పాఠాలకంటె ఆసక్తికరంగా వుండేవి. జీవితమంటే మానవులే కాదు బాబు, పశువులు, పక్షులు, మృగములు, సూక్ష్మజీవులైన క్రిమి కీటకములతో సహా జీవకోటి అంతా కలిసే వుంటుందనేది, ఆమె కధల సారాంశము.

ఒకరోజు తలవని తలంపుగా ఆకాశం మేఘావృతమై తట్టా- బుట్టా సర్దుకుని ఇంటికి పయనమయ్యే అవకాశం కూడా లేకుండా కుండపోతగా జడివాన కురిసింది. చెట్లకింద చేరాము. అచ్చట గుంపులు గుంపులుగా వానపాములు పొరాడుతున్నాయి. వాటిని చూచి నేను అసహ్యించుకుని కాళ్లతో చిమ్ముతుంటే నన్ను వారించింది. ఒరేయి రంగడూ ! అవి మనకెంత మేలు చేస్తాయో తెలుసా నీకు ? మన బంధుగణం కటే అనే మన దగ్గరి చుట్టాలు. ఎండకు వానకు తడచి బండబారిన పొలాలను వానపాములే వ్యవసాయ యోగ్యం చేస్తాయి అలానే ముక్కతూన్న వేలో పిట్టల్ని తోలడానికి

వేసిన మంచె చెదలుపట్టి కుప్పకూలిపోయింది మన ఆస్థుల్ని ధ్వంసం చేసే ఈ చెదలే పొలంలోని చెత్తాచెదారాన్ని ఎరువుగా మారుస్తుంది అలా మార్చడం మానవులకు సాధ్యంకాదు అందువలన అవి కూడా మన ఆప్తగణంలో చేరతాయి

అదుగో చూడు ఆపిచ్చుకల గుంపు. ఆ ఎగిరే కొంగలు మరెన్నో పక్షులు. అప్పడప్పడు మన పంటల్ని పాడుచేస్తున్నా మరో రకంగా అవిచేసే మేలు మరువరానిది ఏమిటామేలు ? మన పంటల్ని పైరుల్ని సర్వనాశనం చేసే వందలాది రకాల కీటకాలన్నిటినీ వెంటపడి ఏరుకుని తింటాయి వాటిని మనం తొలగించాలంటే సాధ్యపడే విషయంకాదు. ఇక పాములు సంగతికొస్తే అవి మనకేదో హానిచేస్తాయన్న భయంతో వణికిపోతుంటాము. వందలాది రకాల పాముల్లో కేవలం కొన్ని రకాలు మాత్రమే హానికరం. అవి అయినా మనం వాటి జోలికిపోతేనే అవి చేసేమేలు ఇంతింత కాదు. పొలాలలో బొరియలు చేసుకుని జీవనం సాగిస్తూ, కాన్పుకు ఐదు, ఆరు పిల్లలతో ఏడాదికి ఐదు, ఆరు కాన్పులుకనే ఎలుకలు పంటల్ని ధ్వంసంచేసే సంగతి మనకు తెలుసు. ఈ పాములే ఆ ఎలుకలను నిర్మూలిస్తాయి. అలానే మొక్కల్ని గురించి కూడా. ఏ మొక్క ఎందుకు ఉపయోగపడుతుందో వివరించేది. ఇలా సాగుతాయి ఆమె పాఠాలు. మరెన్నో పురాణకథలు, గాధలు, సామెతలు, పిట్టకథలు చెపుతుండేది.

మరి రెండో గురువుగారి సంగతి అతడొక రైల్వే పోర్టరు. పేరు **రామస్వామి.** అతనికి వ్రాయటం చదవటం మాత్రమే తెలుసు. పైగా రాత్రి, పగలు డ్యూటీలు. ఒక రోజు హైస్కూలు నుండి రైలుగేటు వద్దకు వచ్చేసరికి రైలు రావటం గేటు వేయడం జరిగింది. ఆగిపోయాము. మమ్మల్ని హుషారు పరచడానికి ఒక జానపద గేయం గొంతెత్తి పాడుతూవున్నారు. అది వింటూ రైలు వెళ్ళి గేటు తెరిచినా మేము వెళ్ళక మరొక పాట పాడమని కోరాము. అతడొక విలక్షణమైన వ్యక్తి "వినేవాడువుంటే ఎన్నిపాటలైనా పాడి వినిపిస్తా." మీకు ఓపిక వుండాలేగాని మంచి మంచి కథలు వినసొంపుగా చెప్తానురండి పదిమందిమీ కూర్చున్నాము." చెపుతూనే వున్నారు గంట అయినది మాలో కొందరు వెళ్ళిపోయారు. నలుగుర్ధం మిగిలాము. అబ్బాయిలూ రోజు ఇలానే రండి. ఎన్ని కథలైనా చెపుతానన్నారు. నేను రోజు వస్తానని చెప్పా. భుజం తట్టి

పైకెత్తుకుని ముద్దాడి దించారు ఇంటికెళ్ళి అమ్మకు చెప్పా ఈ పిచ్చి కథలు విని అసలు చదువు చెడగొట్టుకుంటావేమో వెళ్ళవద్దు అని చెప్పింది. అమ్మా మరి ఇన్నాళ్ళు నీవు చెప్పినవి కూడా పిచ్చికథలు కావా ? అయినా నేనెంతో నేర్చుకున్నాను ఆ కథల నుండి చదువుకు భంగం రానీను. రోజూ ఒక గంట "రామస్వామి" కథలు వినాల్సిందే సరే నీ యిష్టం అన్నది. అది మొదలు ఎస్సెసెల్సి పాసయిందాకా ఐదేళ్ళు ఒక్కరోజు బీరుపోకుండా ఆయన చెపుతూనే ఉన్నారు నేను వింటూనే వున్నాను ఆయన చెప్పింది జానపద కథలైనా, పౌరాణిక కథలైనా, పేరంటాండ్ల కథలైనా సాహసవీరుల కథలైనా శివాజీ, ఝాన్సీ పల్నాటి వీరుల కథలు ఇలామరెన్నో వున్నాయి అతను చెప్పే ప్రతి కథలోనూ ఒక సామాజిక స్పృహ, ఒక సామాజిక నీతి, ధర్మం వుండేవి. యథార్థం చెప్పాలంటే బడిలో ఉపాధ్యాయులవద్ద చదివిన పాఠాలకంటే నేర్చుకున్న దానికంటే ఆయన వద్దనే హెచ్చు ఉపయోగకరమైన విద్యవుంది.

ఇక మూడవ గురువుగారి సంగతి. ఆయనపేరు జంపని ఆంజనేయులు గారు. ఆయన మాకు దగ్గరి బంధువు కూడా. ఆయనకు ఆంగ్ల విద్యరాదు. తెలుగులో మాత్రం మంచి ప్రావీణ్యత వుంది అప్పడే గ్రాంథికము నుండి వ్యవహారిక భాషకు మారుతున్న కాలము ఈయన వ్యవహారిక భాషలోనికి మారారు. ఈయన ఒకగొప్ప సంఘసంస్కర్త హేతువాది. మూఢనమ్మకాలను, మూఢ విశ్వాసాలను, తన వాదనా పటిమతో ఎంతటి పండితునినైనా ఓడించి విజయం పొందేవారు ఆయన వద్దకు తీసుకు వెళ్ళింది మా అమ్మ ఆయన స్కూళ్ళ ఇనెస్పెక్టరు బడి పిల్లలకు పరీక్ష పెట్టినట్లుగా నన్ను అనేక ప్రశ్నలతో పరీక్షించారు. నేను ఆ ప్రశ్నలకు చకచకా, చురుకుగా సమయస్ఫూర్తితో సమాధానాలు చెప్పాను. శెహభాష్ అని మెచ్చుకున్నారు. మా అమ్మతో వీడికి ఇంగ్లీషు చదువు చెప్పించాలి ఇంగ్లండుకు కూడా పంపించాలి. ఎంత ఖర్చు అయినా వెనుకాడకూడదు అని అన్నారు. మా అమ్మ సంతోషంతో నన్ను చేయిపుచ్చుకుని గబగబా ఇంటిదారి పట్టింది ఇల్లు చేరాము. ఆంజనేయులుగారు చెప్పిన విషయాలన్నీ మా నాన్నకు చెప్పింది. మా నాన్న ఎగిరిగంతేశారు మరునా నన్ను తీసుకుని మా మేనమామ రామానీడును తీసుకుని ఆంజనేయులుగారి దగ్గరకు వెళ్ళారు ఆయనతో ఎంత ఖర్చు అయినా ఇల్లూ పొలమూ అమ్మి అయినా మా వాడిని కలెక్టరు

చేయవలసిందే అని చెప్పారు ఇందుకొక కారణమున్నది తన భూమిగట్టు తగాదాలో రెవిన్యూ ఇన్స్పెక్టరు లంచం పుచ్చుకుని మాకు అన్యాయం చేశాడు. అది చెప్పకుందామని తహసీల్దారు దగ్గరకు వెళితే, అతడు కనీసం కూర్చోమని అయినా అనకుండా వెళ్ళండి బయటకు, ఆ రెవిన్యూ ఇనెస్పెక్టరు కాళ్ళేపట్టుకోండి అని బెదిరించి బయటకు గెంటించారు ఆ బాధ మనస్సులో వుండే ఇంత భూస్థితి వుండీ, ఇంత సంపద ఉండీ, గ్రామంలో పెద్దనైవుండీ కూడా నెలకు నూరు రూపాయలు జీతం కూడా నిండా లేని తహసీల్దారు నుండి అవమానం పొందానే, అందువలన మా రంగడు కలెక్టరు కావలసిందే డబ్బు ఎంత ఖర్చు అయినా లండన్ పంపుతానని శపథం చేశారు. ఇదీ కారణం. ఇంగ్లీషు చదువులు చెప్పించమని అన్న ఆంజనేయులుగారి సలహా నచ్చడానికి ఒక గురువు ఆంజనేయులుగారి శుస్రూష వల్ల కందుకూరి వీరేశలింగం, త్రిపరనేని రామస్వామి చౌదరి, రాజరామమోహన్‌రాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, వివేకానంద, రామతీర్థ మున్నగు సంస్కర్తల బోధనలు వినిపించి చదివించి వివరణలు చెప్పి నన్నొక మనిషిగా తీర్చిదిద్దిన మహానుభావుడు. అంతేకాదు. రాజకీయాలలో కూడ శిక్షణ ఇచ్చాడాయన. "విజ్ఞానచంద్రిక " గ్రంథమండలివారు ప్రచురించిన గ్రంథాలన్నీ ఎప్పుడూ ఎడతగకుండా చదువుతుండే వాడాయన ఒక రోజు పోస్టులో ఒక పుస్తకాల పార్సెల్ వచ్చింది. విప్పారు మా ముందే తళతళా మెరుస్తున్నవి ఆ పుస్తకాలు నాకొక పుస్తకం ఇమ్మని అడిగాను. నీకింకా ఆపుస్తకాలు చదివే శక్తి రాలేదు. కొన్నాళ్ళు పాఠాలు చదువుకోమన్నారు ఒక్క ఉదుటున పరుగుపెట్టి రొప్పకుంటూ, రోసుకుంటూ పొలంలో వున్న మా అమ్మదగ్గరకు వెళ్ళాను. జరిగిన కథనంతా చెప్పాను. రేపుదయం పోదాము లెమ్మన్నది. కాదు ఇప్పుడే వెళ్ళాలన్నాను వచ్చింది. ఆంజనేయులుగారిని ప్రాధేయపడి ఒక్క పుస్తకమ్మైనా ఇవ్వకపోతే రాత్రికి పస్తుంటాడు, నిద్రపోడు, నా ప్రాణం తీస్తాడు. ఒక్క పుస్తకమ్మైన ఇవ్వండి. ఆపుస్తకాల కట్ట నా ముందు పడవేసి నీ యిష్టం వచ్చింది తీసుకోమన్నారు. అట్టపై గుర్రంమీద డాలు, కత్తి ఉన్న రాణీ సంయుక్త బొమ్మ వున్న పుస్తకం తీసుకున్నాను. ఇంటికి వెళ్ళా. ఆ రాత్రంతా ఎప్పుడు తెల్లవారుతుందా ? ఆ పుస్తకం ఎప్పుడు చదువుతానా అని ఆందోళన పడ్డాను. పొద్దున్నే మా అమ్మతో పొలం వెళ్ళా. ఆమెపొలం పనులలో నిమగ్నమైపోయింది.

నేను మా మొక్కజొన్నచేలోని పెద్ద వేపచెట్టు చిటారు కొమ్మకు వెళ్ళాను. పుస్తకం తెరిచా చదవటం ప్రారంభించా పొద్దు నడినెత్తికొచ్చింది ఏటవాలింది గంటలయితే లెక్కలేదు. నాల్గుగంటల రైలు వచ్చింది. చదువుతూనే ఉన్నా ఇక అక్కడ పొలంలో మా అమ్మ అవస్థచెప్పనలవి కాదు పిల్లాడు అన్నం తినలేదు కనపడటం లేదు నలుగురిని కూడ గలుపుకుని రంగా- రంగడూ- నాయనా అంటూ పొలాలన్నీ తిరుగుతుంది. వింటూనే వున్నా ఏమైనా పుస్తకం పూర్తి కాకుండా అమ్మకు కనపడదలచుకోలేదు. పుస్తకం పూర్తయింది. ఆనందోత్సాహాలతో కేకలు పెట్టుకుంటూ అమ్మా వస్తున్నా అంటూ గట్టుకు చేరా మా అమ్మకు ప్రాణం లేచి వచ్చింది. ఇది నా చదువుల పట్ల ఆనాటి పట్టుదల. ఇంతటి పట్టుదలకి కారణం అమ్మ, పోర్టరు రామస్వామి, ఆంజనేయులుగారే ఇలా రంగాజీ చెప్పకుంటారు.

## వెలగపూడి రామకృష్ణ

ఇక నాలుగో గురువా ? ఆయన గుంటూరు మండలములో ఒక సంపన్నరైతు కుటుంబం నుండి వచ్చినవారు విద్యాధికులు. ఆయన ఆంధ్ర నుండి ఐ.సి యస్ చదువుటకు లండన్ వెళ్ళిన మొదటి బేచ్‌లోని వారు. ఆజానుబాహుడు. స్ఫురద్రూపి లండన్ పోకముందే గొప్ప రాజనీతిజ్ఞునిగా పేరుపొందారు ఆయన లండన్ చేరక పూర్వము గుంటూరు మండలంలో నేనెన్నడూ కలవలేదు, చూడలేదు. ఆయనే దక్షిణ భారతదేశములో ప్రముఖ పారిశ్రామికవేత్తగా ప్రసిద్ధిగాంచిన శ్రీ వెలగపూడి రామకృష్ణగారు. మా బంధువులు, నా హితులూ నన్ను సాగనంపడానికి వచ్చి లండన్ చేరుతూనే శ్రీ వెలగపూడి రామకృష్ణగారిని కలుసుకో. ఆయన నీకు అవసరమైన సహాయాన్నందిస్తారని చెప్పారు. లండన్ చేరాను. అడ్రస్ పట్టుకుని రామకృష్ణ గారిని కలిసాను. ఎంత ఆప్యాయత, ఎంత ఆదరణ, మరెంత వాత్సల్యం చూపారో చెప్పలేను తల నిమిరాడు, బుగ్గలు గిల్లాడు, మందహాసంతో సామాను తెచ్చుకో నా దగ్గరే మకాం పెట్టు. అలానే చేశా. ఇక చూడండీ ఆయన నాకు చెప్పిన పాఠాలు ఏ గురుకులాశ్రమంలోనూ సాగవు ఏ యూనివర్శిటీల లోనూ సాగవు. భౌగోళికంగా విశ్వాన్నే నా ముందుంచారు ప్రపంచ చరిత్రనే త్రవ్విపోశారు. మన పుణ్యభూమి భారత దేశములో గల సాంఘిక

అసమానతలపై, అంటరానితనంపై అవినీతిపై కథలు కథలుగా చెప్పారు. జీవితములో విజయాన్ని సాధించాలంటే ఎవరితో ఎలా ఎప్పుడు మెలగాలో నేర్పారు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి తీసికొని వెళ్ళి ప్రొఫెసర్లకు పరిచయం చేశారు. మా పిల్లవాడు ఎకనమిక్స్‌లో డీలిట్ చేయాలన్న కోరికతో ఉన్నాడు నేను ఐ సి యస్ చేయమంటున్నా మా వాడిలో ఇప్పడే గాంధీ ప్రవేశించాడు ఏం చదువుతాడో జాగ్రత్తగా చూడండి. అంటూ అప్పగించారు ముందుగా ఏదో ఒక యూరోపియన్ లాంగ్వేజి సెకండ్ లాంగ్వేజిగా పరీక్ష వ్రాయాలన్నారు. ఇదేం పెడకొలిమి నాకు, ఇప్పుడు రెండవ భాష ఎక్కడ నేర్చుకోను ఇంటికెళ్ళి వ్యవసాయం చేసికొంటేపోలా అనుకుని మరలా రామకృష్ణగారిని వెళ్ళి కలిసాను నా అసంతృప్తిని ఆయనతో చెప్పాను నేను చదవనన్నాను. ఓరిపిచ్చి పోరగా ! అదేం పెద్ద విశేషం కాదు జర్మన్ భాష తీసుకో. అక్కడికి వెళ్ళి ఒక నెలవుండు. అక్షరాలు నేర్చుకో. జర్మన్ భాష నేర్చుకొని తిరిగిరా అని ఏదోలా ఒప్పించారు. ఆయనమాట కాదనలేక ఒప్పుకున్నాను. అలానే జర్మన్ వెళ్ళి స్కూల్‌లో చేరా ప్రాథమిక పాఠాలు నేర్చుకుంటూ జర్మనీ అంతా కలయదిరిగా. మా ఉపాధ్యాయుడిని అడిగా. నాకొక సర్టిఫికెట్ కావాలని, ఆయన నవ్వి జర్మన్ భాషలో మంచి పరిచయం కలిగింది. మంచి నడవడి, చురుకైన కుర్రవాడు అభివృద్ధిలోకి వస్తాడు అని సర్టిఫికెట్ వ్రాసి ఇచ్చాడు. అక్కడ నేను నేర్చుకుంది అక్షరాలు మాత్రమే. మన దేశంలోకన్నా ఇక్కడి పంతుళ్ళే నయం ఎంత మంచి సర్టిఫికెట్ ఇచ్చారు నాకు అని ఆశ్చర్యపడుతూ లండన్ చేరి, రామకృష్ణగారిని కలసి ఆక్స్‌ఫర్డ్‌లో ఎకనమిక్స్ డిపార్టుమెంటులో చేరా. ఆ తరువాత నాకు తోడుగా ఎల్.వి.బి. చౌదరి (లింగం వీరభద్రయ్య చౌదరి) వి యస్. క్రిష్ణా (వాసిరెడ్డి శ్రీకృష్ణ) మురహరి, భాస్కరరావు అనే యువకులు కూడా ఒక నెల రోజుల లోపల వరుసగా చేరారు. అందరికీ రామకృష్ణగారే అండ ఆయన లండన్‌లో ఉన్న రెండేళ్ళూ మా అందరికీ సచివుడు, సారథి, గురువు, రక్షకుడు. తరువాతి కాలంలో రామకృష్ణగారంటూ వుండేవారు "లండన్‌లో ఉన్నన్నాళ్ళు రంగాకు నేను గురువును" ఇండియాకు తిరిగి వచ్చాక రంగా నాకే గురువు అని.

# మాధవుడుగా రూపుదాల్చిన మానవోత్తముడు రంగాజీ

"కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబన్ధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్య నామయమే"

భగవద్గీతలోని ఈ శ్లోకార్థం పరిశీలనార్థం, సమత్వబుద్ధి, వివేకము, జననమరణ విముక్తి, సాధించిన సాధకుడే మనీషి. మనీషి అనగా ప్రజ్ఞావంతుడు ఆ ప్రజ్ఞకు బుద్ధిని జోడించాలి. అట్టి మనీషి కర్మఫలాపేక్షలేని వాడుగా ఉండాలి. అట్టి ప్రజ్ఞాశీలుడే కర్మయోగ రహస్యం తెలిసికోగలడు వివేకము, విజ్ఞత కారణంగానే మానవుడు విహిత కర్మలను నిష్కామంగా, అనాసక్తంగా ఆచరించగల్గుతాడు.

ఒకనికి ప్రజ్ఞకలదో లేదో తెలిసికోవడానికి వాని పాండితీ ప్రకర్షను పరీక్షించనక్కరలేదు ఆచరణలోని నిష్కామభావము అనాసక్తి, ఉన్నాయా, లేదా అని చూస్తేచాలు. కర్మయోగ రహస్య మెఱింగి లోకంలో అనాసక్తంగా వ్యవహరించే వాడే నిజమైన ప్రజ్ఞావంతుడు. వివరణ కంటె తార్కాణం, విషయాన్ని తేటతెల్లం చేస్తుంది కాబట్టి మనీషి అను పదానికి రంగాజీ లక్ష్యభూతుడు అంటే సరిపోతుంది

"పదం గచ్ఛన్త్యనామయమ్" అంటూ ఒక ఉపమానం చెప్పాడు గీతాచార్యుడు ఈ విషయంలో అనేకమైన పెద్ద పదవులున్నాయి. రాజు, చక్రవర్తి, ఇట్లా అవి ఎంత గొప్పవైనా సంసార చక్రాంతర్గతాలే జననం, మరణం ఆపదలనుండి ఆపదవులు మనిషిని మరలించలేవు ప్రపంచంలో అన్ని పదవులకంటె గొప్పది లేశమైనా దుఃఖం లేనిదీ, బంధరహితమైనదీ, ఒకానొక పదవి ఉంది అది ఆత్మసామ్రాజ్యాధిపత్యం ! దానిని సాధించడమే ప్రతి మానవుని పరమావధి

ఆ ఆత్మసామ్రాజ్యాధిపత్యాన్ని సాధించే మార్గమేది ? చిత్త శుద్ధితో ఫలాపేక్షరహితంగా, విహిత కర్మల నాచరిస్తూ, తద్వారా ఆత్మజ్ఞానాన్ని పొందడమే ఆ మార్గం. ప్రజ్ఞాశీలుర లక్షణం, నిష్కామ కర్మాచరణం. అట్టి నిష్కామ కర్మాచరణవల్ల వారు బంధ విముక్తులై నిరామయ స్థితిని పొందగలరు. ఈ పరీక్షకు నిలువ గల్గిన నాడే మహా మనీషిగా, రూపొంద గలడు. ఈ కోవకు చెందినవాడే పూజ్యరంగాజీ

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవి భారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ".

తా.. ఎప్పడెప్పడు క్షీణించి అధర్మము వృద్ధియగుచుండునో అప్పడప్పడు నన్ను నేనే సృష్టించుకొను చుందును "ధర్మోరక్షితి రక్షిత:" అని ప్రాజ్ఞులంటూ వుంటారు ధర్మాన్ని ఎవరు రక్షిస్తారో వారిని ధర్మము రక్షిస్తుంది అనే అర్థంలో చెప్పారు. ఇప్పడు ఒక అవగాహన కలిగివుండవచ్చు కారణజన్ముడంటే, అప్పడప్పడు ఆయాదేశాలలో సంభవించే ఎదురయ్యే పాశవిక, రాక్షస ప్రవృత్తులతో మానవులు పొందే కష్టాల నుండి రక్షించుటకు ఒక మహోవ్యక్తి యొక్క జన్మ అవసరమని దీని అర్థములో చెప్పబడింది ఎలాంటి విపరీత విపరిణామాలు సంభవిస్తే, భగవదాంశతో కారణజన్ములైనవారు ఉద్భవిస్తూ వుంటారో ఈ రెండవ శ్లోకం ద్వారా గీతలో మన కళ్ల ఎదుట వుంచారు.

౽. " పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ".

తా.. అంటే కారణజన్ములైనవారు ఎప్పడు ఎందుకు ఎలా జన్మిస్తారో ఈ శ్లోకము యొక్క తాత్పర్యములో ఇలా చెప్పబడింది. "సాధు సజ్జనులైన వారిని సంరక్షించుకొనుట కొరకునూ, దుష్టులు దుర్మార్గులు పాశవికులునైన రాక్షస సమానులైన వారిని వినాశన మొనర్చి ధర్మమును సంస్థాపించుట కొరకు ఇలా అవతరిస్తుంటాను" కారణ జన్ముడు రంగాజీ అనే శీర్షిక పెట్టడములో ఎంత ఔచిత్యమున్నదో ముందు ముందు ఆయన సాధించబోయే విజయ పరంపరలు ఒకమారు సమీక్షించుకుందాము.

రష్యాలో 18 వ శతాబ్దాంతమున ఒక మహత్తరమైన "బోల్షివిక్" విప్లవ పోరాటం జరిగింది. ఈ పోరాటం ప్రజలనుండే బయల్వెడలింది. రష్యా గొప్ప విశాల భూభాగము. అక్కడ జారు చక్రవర్తుల నిరంకుశ పాలన సాగుతున్నది ఆ పాలనలో రైతులు, కూలీలు, చేతివృత్తులవారు ఒక్కమాటలో అశేష శ్రామిక జనాలు జీవించే హక్కు కూడా నోచుకొనలేని ఒక రాక్షసపాలన సాగించారు అంతకు ముందు ఫ్రెంచి దేశములో నిరంకుశ రాక్షస పాలకులపై విప్లవ పోరాటం సాగించి రాజులను, రాజరికాలను రద్దుచేయించి ప్రజలు ప్రజాస్వామిక పరిపాలన నిర్మించుకున్నారు. ఆ స్ఫూర్తితోనే రష్యా ప్రజలు కూడ

ధైర్యసాహసాలతో ముందుకొచ్చారు. అప్పుడు వారికి ఒక మహోన్నత వ్యక్తి అతడే వి. ఐ లెనిన్ మహాశయుడు కారణజన్ముడుగా అవతరించాడు విప్లవజ్వాలలు ఆకాశాన కెగసాయి. జారు చక్రవర్తులు "పాహిమాం, పాహిమాం" అంటూ గద్దెదిగి పారిపోయారు లెనిన్ మహాశయుడు అధ్యక్షుడుగా, ప్రధానిగా సోవియట్ రిపబ్లిక్ అవతరించింది ప్రపంచం యావత్తూ ఆనాడాయనను కారణ జన్ముడుగా శ్లాఘించి నీరాజనాలు పలికింది. పారిశ్రామిక పెత్తం దారులు, జమీందారులు, జాగీర్దారుల పెత్తనం పోయి రైతుకూలీ శ్రామిక జనాల స్వతంత్ర ప్రజాస్వామ్య పరిపాలన లభించిందని ప్రపంచం ఘనంగా కీర్తించింది. ప్రపంచ దేశాలన్నింటా ముఖ్యంగా రాచరిక పరిపాలన సాగుతున్న దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు కుప్పలుతెప్పలుగా వెలిశాయి. విద్యాధికులైన యువకులెందరో పార్టీకి పూర్తికాలం సేవకులుగా నమోదు చేసుకోబడ్డారు భారతదేశంలో కూడ కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడింది. ఎందరో విద్యాధికులైన యువకులు పార్టీ నాయకత్వాన్ని చేపట్టారు. ఇందు ప్రధానంగా హిరేన్ ముఖర్జి, ఎ.కె. గోపాలన్, అజయ్ ఘోష్, పి.సి. జోషి, ఆంధ్ర నుండి పుచ్చలపల్లి సుందరయ్య మరెందరో పార్టీ నాయకత్వాన్ని చేపట్టారు. అప్పట్లో లండన్ ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో డీలిట్ చేస్తున్న ఆచార్య రంగా యూరోపియన్ గిల్డు సోషలిస్టుల సాహచర్యంతో సోషలిజం కమ్యూనిజం మున్నగు మార్క్సిస్టు సిద్ధాంత ప్రభావానికి లోనయ్యారు. భారత దేశంలో సంపాదించబోయే స్వాతంత్రం సోషలిజం కమ్యూనిజం సిద్ధాంత ప్రాతిపదికగా, రైతుకూలి చేతివృత్తులకు సంబంధించిన అశేష గ్రామీణ శ్రామిక జనాల రాజ్యం సంపాదించడానికి. కమ్యూనిస్టు పార్టీ దోహదం [illegible]గలదని నమ్మకం పెట్టుకున్నారు. రంగాజీ అఖిల భారత స్థాయిలో రైతు సంఘాలను స్థాపించాడు. యావత్ భారతములో గ్రామీణ ప్రజలను సంఘటిత పరచి స్వాతంత్రోద్యమాన్ని బలోపేతం చేయసాగారు. ఈ గాధలు వివరంగా చెప్పకోవాలంటే ఇదే ఒక ఉద్గ్రంధం కాగలదు. అందువలన దీనిని సంక్షిప్త పరచుకుందాము.

రష్యాలోనూ, దాని ఉపగ్రహ దేశాలలోనూ గల కమ్యూనిస్టు పార్టీలు ప్రజాస్వామ్య పంథాను విడనాడి ఏకపక్ష పారిశ్రామిక కార్మిక నియంతృత్వ పాలనకు బీజాలు వేయసాగారు అంతటితో ఆగినా ఎలా వుండేదో. రైతులను

విప్లవ ప్రతిఘాతకులన్నారు అభివృద్ధి నిరోధకులన్నారు చైతన్య రహితు లన్నారు. ఎందుకు కొరగాని పనిముట్టుగా అభివర్ణించారు అందుకని పరిపాలనలో రైతులకు భాగస్వామ్యాన్ని కల్పించేందుకు అవసరమైన ఓటు హక్కును రద్దు చేశారు రైతులను భూముల నుండి పారద్రోలారు సమిష్టి, సహకార వ్యవసాయం ప్రాతిపదికగా పరిపాలన ప్రారంభించారు.

రంగాజీకి అర్థం అయిపోయింది కమ్యూనిస్టులు రైతులకు వ్యతిరేకమని కమ్యూనిష్టుపార్టీ కబంధ హస్తాల నుండి రైతులను రక్షించాలను కున్నాడు. కమ్యూనిష్టులు భాగస్వాములుగా వున్న రైతు సంఘాన్ని స్వతంత్ర ప్రజాస్వామిక రైతు సంఘంగా నిర్మాణం చేయుటకు పూనుకున్నాడు. ఇంకే ముంది ? రంగాపై కమ్యూనిష్టులు యుద్ధం ప్రకటించారు. రంగా భూస్వాముల ఏజెంటు అన్నారు. ఒక గొప్ప ప్రచార యుద్ధాన్ని ప్రారంభించారు. అయినా రంగా భయపడలేదు. నిరుత్సాహ పడలేదు నిస్తేజం ఆయనను ఆవరించలేదు. ముందుకు సాగాడు. కమ్యూనిజం ప్రజాస్వామ్యానికి పరమశత్రువని ప్రకటించారు. దానికొక యుద్ధ ప్రాతికగా ప్రచారోద్యమాన్ని సాగించాడు. ఇరువర్గాల మధ్యా పోరు ప్రారంభమయినది ఈ పోరులో ఎవరు గెలిచారు ? ఎవరు ఓడారు ? అన్న ప్రశ్నకన్నా ఎవరికి వారుగా విడిపోవడమే మంచిదని నిర్ణయించుకున్నారు. 1 ౨4 1 వచ్చేనాటికి ఇరువర్గాల మధ్య యుద్ధం విస్తృతమై మహాత్మాగాంధీని, కాంగ్రెస్ మహా సంస్థను సైతం అభివృద్ధి నిరోధకులుగా, కార్మిక వర్గ శత్రువులుగా, శ్రామిక వర్గ పీడకులుగా జమకట్టినారు. ఆనాటి ఈ యుద్ధం రంగా కమ్యూనిష్టుల మధ్యనే కాక.కాంగ్రెస్, కమ్యూనిస్టుల మధ్యనే జరిగిందనవచ్చును.

ఈ నేపధ్యంలో సాగిన, కమ్యూనిష్టు కాంగ్రెస్‌ల మధ్య జరిగిన ప్రచార ఉద్యమం దేశ వ్యాప్తంగా ప్రజలను రెండు బలవత్తరమైన ముఠాలుగా విభజించ బడ్డాయి. కమ్యూనిష్టు వ్యతిరేక పోరాటంలో రంగాజీదే అగ్రస్థానం. ఇందుకు రంగాజీ మార్క్సిజానికి ప్రత్యామ్నాయంగా ఒక నూతన సిద్ధాంతాన్ని సృష్టించాడు. అదే "కిసాన్ మజ్‌దూర్ ప్రజారాజ్" దీనికి ప్రధానమైనది "ప్రజాస్వామ్యం" ఇందుకు రంగా గారు కొన్ని సూత్రాలను రూపొందించారు.

1. **స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు అవరోధం కలిగించే సమానత్వం వ్యక్తి వికాసానికి గొడ్డలిపెట్టు.**

2 స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేని సమానత్వం ఆత్మవంచనే కాగలదు

3 స్వేచ్ఛా స్వాతంత్ర్యములకు విఘాతం కలిగించే సమానత్వం నేతిబీర కాయలలోని నెయ్యితో సమానం. అనే నినాదాలు రూప కల్పన చేశారు. శతాబ్దాల పాలనానుభవం ద్వారా ప్రజాస్వామ్యమే ఉత్తమ పాలనగా సర్వజనీనమైన పాలనగా అభివర్ణిస్తూ అందుకు కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్ సిద్ధాంతాన్ని ప్రతిపాదించానచన్నారు.

ఆయన యూరప్‌లో ఉండగానే ప్రపంచంలోని దాదాపు 80 దేశాల పరిపాలనా విధానాలను పర్యవేక్షించి, పరిశోధించి ప్రజాస్వామ్యమే సర్వోత్తమమైన విధానంగా ప్రజలముందుంచారు దేశ వ్యాప్తంగా కమ్యూనిష్టులు ప్రతిపాదించిన ఏకపక్షకార్మిక నియంతృత్వ పరిపాలన ఒక వైపునా, రంగాజీ ప్రతిపాదించిన ప్రజాస్వామిక కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్ సిద్ధాంతము ఒకవైపునా బహుళ ప్రచారం సాగింది

1941లో వ్యక్తి సత్యాగ్రహం, 1942లో క్విట్ ఇండియా మహోద్యమం, బ్రిటీష్ ప్రభుత్వాన్ని కదిలించి వేశాయి. ఫ్రెంచి విప్లవంలో వలె భారతీయులలో అత్యధిక సంఖ్యాకులు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. కమ్యూనిష్టులు ఈ ఉద్యమాన్ని ఫాసిస్టు ఉద్యమం అన్నారు. కాంగ్రెస్ వారిని మహాత్మాగాంధీతో సహా దేశద్రోహులుగా, క్విజ్లింగులుగా నామకరణంచేసి దుయ్యపట్టారు ఈ అన్ని రకాల ప్రచారాల ఉధృతిని రంగాజీ ఒక యోధునివలే, మహావీరునివలే ఎదిరించి నిలిచారు.

1944 ఆఖరులో అనేక పరిణామాల కారణంగా జైళ్ళనుండి కాంగ్రెస్ నాయకులను విడుదల చేయటం ప్రారంభించారు. జైలు నుండి బయట పడిన రంగాజీ కమ్యూనిష్టు వర్గ సంఘాలకు ప్రత్యామ్నాయంగా యువజన కాంగ్రెస్, విద్యార్థి కాంగ్రెస్, మహిళా కాంగ్రెస్, రైతు కాంగ్రెస్ ఇలా ప్రతి వర్గానికి ఒక కాంగ్రెస్‌ను స్థాపించి, ప్రజలను చైతన్యవంతులుగా, కమ్యూనిష్టు సిద్ధాంత వ్యతిరేకులుగా రూపొందించారు. ఇది ఇలా వుండగా కమ్యూనిష్టులు సిద్ధాంత వ్యతిరేకులుగా రంగాపై పోరాటం సాగిస్తుండగా కాంగ్రెస్‌లోని కొందరు అసమర్థ, అవివేక, అజ్ఞాన ముఠా పెత్తందారులు ఈ పోరాటంలో రంగా విజయం సాధిస్తే తమ పెత్తనానికి అవరోధం కలుగుతుందని మరోవైపు నుండి దాడి ప్రారంభించారు. ఈ దాడిలో ఆంధ్ర కాంగ్రెస్‌లోని

అగ్రనాయకులే ముందువరుసలో నిలచారు కాంగ్రెస్‌కు పోటీగా వర్గ సంఘాలంటూ స్థాపించి కాంగ్రెస్‌ను తన ఆధీనంలోనికి తెచ్చుకోటానికి, సాగించే కుట్రగా అధిష్టాన వర్గానికి ఫిర్యాదులు చేశారు ఈ ఫిర్యాదుల అనుపానులను వాటి వెనుక గల స్వార్ధ సంకుచిత ధోరణులను మహాత్మాగాంధీకి వివరించి, వారి అనుమతి పొందాలనే ఉద్దేశ్యముతో 1945లో గాంధీజీని కలిశారు రెండురోజుల పర్యంతంగా, దఫాలవారీగా, పన్నెండు గంటల చర్చ జరిగింది మహాత్మాగాంధీ రంగాజీల మధ్య ( ఆ చర్చల సారాంశాన్ని, అందలి వైవిధ్యాలను కలకత్తాలోని "అమృతబజార్" అనే ఆంగ్ల దినపత్రికకు మహాత్మాగాంధీజీ కార్యదర్శి ప్యారీలాల్ విడుదల చేశారు. అటు తరువాత కాలములో గాంధీజీ రచనలను వాల్యూములుగా ప్రచురించిన గుజరాతులోని నవజీవన ట్రస్టువారు ఆ వాల్యూములలో ప్రచురించారు కూడా. దాన్ని వేరొక చోట సంక్షిప్తంగా నైనా ప్రచురిస్తాము) సుదీర్ఘమైన చర్చలు జరిగి "కిసాన్ మజ్‌దూర్ ప్రజారాజ్"సిద్ధాంతంపై గాంధీజీ వెలిబుచ్చిన సందేహాలన్నింటికి శాస్త్రీయమైన, సిద్ధాంతపరమైన, విపులమైన సమాధానం అందించారు. రంగాజి. అందుకు గాంధీజీ సంతృప్తులై రంగాజీని అభినందించి, ఆశీర్వదించి ఇరువురు మధ్య జరిగిన సంభాషణల సారాంశముతో ఒక పత్రాన్ని గాంధీజీ సంతకముతో అందించారు. రంగాజీకి ఇది ఒక అమూల్యమైన సన్నదుగా భావించారు

ఇక దేశ వ్యాప్తంగా కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్ సిద్ధాంత ప్రచారానికి ప్రారంభోత్సవం చేశారు. ప్రచార సాధనాలుగా రైతాంగ విద్యాలయాలు స్థాపించారు. ఒకటి, రెండు కాదు. ఆంధ్రదేశములో ఎక్కడికక్కడే ఒక విద్యాలయం స్థాపించారు. సిద్ధాంత కరపత్రాలు ప్రచురించి, పంచిపెట్టారు "కమ్యూనిస్టులు, రైతులు" అనే సిద్ధాంత గ్రంథాన్ని ప్రచురించారు. గేయాలు, పాటలు, పద్యాలు మున్నగు వివిధ ప్రక్రియలలో సాహిత్య ప్రచురణలు విడుదల చేశారు. కమ్యూనిష్టులతో సాగించే ప్రచార పోరాటంలో రంగాజీయే ముందు వరుసలో నిలచారు. ఈ విషయంలో కమ్యూనిష్టులు వెనుకంజవేశారు దాదాపు ఇదే సమయములో యుగోస్లావియాలోని కమ్యూనిష్టులు వెనుకంజ వేశారు. దాదాపు ఇదే సమయములో యుగోస్లావియాలోని ఆ కమ్యూనిష్టు పార్టీ ప్రభుత్వ అధినేత మార్షల్ టిటోకి సమకాలికుడు, యుగోస్లావిలో కమ్యూనిష్టు పార్టీ నిర్మాతల్లో ప్రథముడు అయిన మిహా ఆలోవ్ జిలాస్ అనే

ఆయన కమ్యూనిష్టు పార్టీ ఏకపక్ష కార్మిక నియంతృత్వాన్ని ఎదిరించారు పెట్టుబడిదారులూ, పారిశ్రామిక పెత్తందార్ల దోపిడీ స్థానంలో అంతకంటే దారుణమైన అమానుషమైన, రాక్షస పాలన కమ్యూనిష్టుల నాయకత్వంలో సాగుతుందని ప్రకటించారు కమ్యూనిష్టు దేశాల్లో ఒక "న్యూక్లాస్" ఆవిర్భవించింది అన్నారు. ఈ కొత్త వర్గము "నియోరిచ్"గా తయారైంది ఇది ఒక నడమంత్రపు సిరిగా అభివర్ణించారాయన పెట్టుబడిదారీ విధానంకన్నా ఇదే ప్రమాదమైనదన్నారాయన

1917 లో సోవియట్ యూనియన్ ఏర్పడిన మొదటి దశకములోనే దాని అధ్యక్షుడు లెనిన్ పాలనలో ప్రజాస్వామ్యానికి తిలోదకాలిచ్చాడు. నియంతృత్వ పోకడలు ప్రారంభమయ్యాయి ఏకపక్ష కార్మిక నియంతృత్వమే ప్రభుత్వ విధానంగా ప్రకటించారు. రైతుల భూములన్నింటినీ ఊడబెరికారు. ఆ స్థానములో "సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు" స్థాపించారు. అందులో కొత్తగా తలెత్తిన "న్యూక్లాస్ " ఆధిపత్యం స్వీకరించింది. రైతుల చేత బలవంతంగా బానిసలుగా మార్చి, వెట్టి చాకిరీ చేయించడం ప్రారంభించారు. రైతులు తిరుగుబాటు చేశారు. ఆ తిరుగుబాటు చేసిన రైతులను లక్షల సంఖ్యలోనే సహారా ఎడారి లోయల్లో సజీవంగా పూడ్చిపెట్టారు

ఇచట ఒక విశేషమైన సంగతి చెప్పకోవాలి లెనిన్ సమకాలీకురాలు బోల్షివిక్ పార్టీ అధినేతలలో ఒకరు, మానవతావాది అయిన "లగ్జెంబర్గు"లెనిన్ విధానాన్ని వ్యతిరేకించింది ప్రజాస్వామ్యం శ్రమజీవుల రాజ్యానికి పట్టుకొమ్మ అనుకున్నాం. దాని నొక మహోన్నత ఆశయంగా కమ్యూనిష్టు పార్టీ సిద్ధాంతంగా ప్రతిపాదించుకొన్నాం ఇప్పడు దానికి మీరు వ్యతిరేకంగా నియంతృత్వానికి, నిరంకుశత్వానికి పాల్పడుతున్నారు ప్రపంచం క్షమించదు. మానవాళి సహించదు ఆ మార్గము నుండి బయట పడండి మానవాళికి ప్రాణప్రదమైన ప్రజాస్వామ్యాన్ని విడనాడి నట్లైతే కమ్యూనిజానికి ముప్పతప్పదు. అంటూ ఒక సిద్ధాంత పత్రాన్ని లెనిన్‌కు అందజేసింది. లెనిన్‌కు లగ్జెంబరుపట్ల అపారమైన గౌరవం వుండేది అయినా స్వార్థం ముందు అదేమీ పనిచేయ లేదు లగ్జెంబర్గును దేశ బహిష్కరణ ఉత్తర్వులు జారీచేశారు. జర్మనీకి వెళ్ళిందామె. అచట కూడా అక్కడి కమ్యూనిష్టు పార్టీ వేధింపులు సాగించింది. ఆమె తాను కన్న కలలు కరిగిపోయాయని, ఆశలు అడియాశలైనాయని బాధతో కృంగి కృశించి మరణించింది ఇలా ఇటువంటి కథలెన్నో సోవియట్

యూనియన్ లోనూ, ఇతర కమ్యూనిష్టు పార్టీ దేశాల్లోనూ జరిగాయి ఇలాంటి దారుణ కృత్యాలన్నింటినీ మొట్టమొదట కృశ్చేవ్ బయట పెట్టారు ఆయన సోవియట్ ప్రధానిగా ఎన్నిక కావటంతోనే బయటపెట్టిన మొదటి అంశము "స్టాలిన్ " పాలనా కాలంలో పదిమిలియన్లకు పైగానే రైతులను నిర్బంధించి, సజీవంగానే ఒకటి రెండు పెద్ద లోయల్లోనే ఖననం చేయటం జరిగిందన్నది ఇటీవలి కాలంలో ఆనాటి కమ్యూనిష్టు ప్రభుత్వాలు సజీవంగా ఖననం చేసిన కోట్లమంది పుర్రెలు వెలికితీసి లెక్కించడం జరిగింది ఇక అది యదార్థమా? కాదా ! అనే అంశానికి తావులేదు.

ఈ మొత్తం అక్రమాలు, అన్యాయాలు, దౌష్ట్యాలు, సజీవదహనాలు ఏప్పుడో ఆ 1945లలోనే రంగాజీ వెలుగులోనికి తెచ్చారు. ఆనాడు దానినెవరూ నమ్మలేకపోయారు. కానీ కమ్యూనిష్టు పార్టీ నియంతృత్వ, నిరంకుశ పోకడలను మాత్రం పసికట్టారు 1952లో జరిగిన ఎన్నికలలో కమ్యూనిష్టులు ప్రధానంగా తెలుగుదేశంలో అఖండ విజయం సాధించి కాంగ్రెస్‌కు నామరూపాల్లేకుండా చేశారు మదరాసు రాష్ట్రంలో కాంగ్రెసుకు పుట్టగతులు లేనట్లు తేలిపోయింది. అప్పట్లో రంగాజీ కూడా కాంగ్రెస్ నుండి బయటకు వచ్చి "కృషికార్ లోక్ పార్టీ" అనే ఒక రాజకీయ పక్షాన్ని నెలకొల్పారు ఆ పార్టీకి కేవలం 13 సీట్లు మాత్రమే దక్కాయి. చేసిన తప్పును గ్రహించిన పండిట్ నెహ్రూ ఏ సభలోనూ సభ్యుడుగాని రాజాజీని ప్రభుత్వాన్ని ఏర్పరచమని ఆహ్వానించారు. ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు కమ్యూనిష్టుల విషవలయంలో చిక్కుకుపోయారు ఆయనే ఆ పార్టీ ప్రతిపాదించిన ప్రధాన మంత్రి అభ్యర్థి. ఆయన రంగాజీకి గొప్ప అభిమాన పాత్రుడు, ప్రేమాస్పదుడు ఆయన పట్ల రంగాజీకి ఎనలేని గౌరవాదరాలు వున్నాయి అయినా కమ్యూనిష్టుల ఏకపక్ష నిరంకుశ, నియంతృత్వ పాలనను అరికట్టాలి. ప్రజాస్వామ్యాన్ని రక్షించాలి. అందుకే ఆయన కాంగ్రెస్ పై ఎంతటి కోపతాపాలున్నా వ్యతిరేకత ఉన్నా, ప్రజాస్వామ్యం పట్ల ఆయనకు గల అకుంఠిత విశ్వాసం కారణంగా రాజాజీ నాయకత్వాన్ని భేషరతుగా బలపరచి విజయం సాధింప చేశారు. రాజాజి ప్రధానిగా ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ప్రభుత్వ సారధ్యం వహించడం ద్వారా కమ్యూనిష్టుల నియంతృత్వ విధానాన్ని అడ్డుకోగలిగారు ప్రపంచ ప్రజాస్వామ్యవాదులంతా హర్షించారు. ఆ తరువాత వెనువెంటనే కేవలం ఒక సంవత్సరం కాలంలో పొట్టి శ్రీరాములు ఆత్మ బలిదానంతో

ఆంధ్రరాష్ట్రం ఏర్పడటం, దానికి కాంగ్రెస్ అభ్యర్థిగా అప్పటి ప్రజాపార్టీ నాయకుడిగా వున్న ప్రకాశంపంతులుగారిని ముఖ్యమంత్రిగా ఎన్నుకోవడం జరిగింది. దాని బ్రతుకూ ఏడాదికంటే ఎక్కువ సాగలేదు పతనమైనది. గవర్నర్ పాలన వచ్చింది. ఆంధ్రరాష్ట్రంలో ఎన్నికలు జరుప నిర్ణయించారు. ప్రజాస్వామ్యం పట్ల ప్రేమాభిమానం గలవారంతా ఏకమై కమ్యూనిష్టు నియంతృత్వ పాలనను నిరోధించాలని నిర్ణయించారు ప్రధాని పండిట్ నెహ్రూ, కాంగ్రెస్, కృషికార్‌లోక్ పార్టీ, ప్రజాపార్టీ ఈ మూడు పార్టీలు ఏకమై ఐక్య కాంగ్రెస్‌గా ఏర్పడి ఎన్నికలలో కమ్యూనిష్టు పార్టీతో తలపడ్డాయి. ఇది మరో బ్రహ్మాండమైన విజయం ఆచార్య రంగాకి, ఆయన ప్రతిపాదించిన ప్రజాస్వామిక "కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్యానికి" ఘన విజయం లభించింది.

ఇందుకే రంగాజీని కారణజన్ముడనుకున్నాము కారణ జన్ముడంటే ఏమిటి ? ఎలా వుంటారు ? అనే గీతాకారుల దృష్టినుండి చూస్తే రంగాజీ ఒక నిజమైన కారణజన్ముడనేది స్పష్టమవుతుంది. ఇదే జ్ఞానయోగంలోని ఏడవ శ్లోకం యొక్క అంతార్ధం. అలాగనే ఎనిమిదవ శ్లోకం యొక్క అంతర్యం కూడా. ఆ ఎనిమిదవ శ్లోకాన్ని మరోమారు పునశ్చరణ చేసుకుందాము. ఆ పుణ్యఫలం మనకు దక్కుతుంది

**"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం**
**ధర్మ సంస్థాప నార్ధాయ సంభవామి యుగే యుగే".**

తా. అన్యాయాలను అరికట్టడం, దుష్కృత్యాలను నిరోధించడం, తద్వారా న్యాయాన్ని ధర్మాన్ని సంస్థాపించడం రంగాజీ కృషి వలన జరిగిందా లేదా అన్నది బోధపడగలదు. అందుకే ఈ పై కధంతా వివరంగా చెప్ప బడింది రంగాజీ ఏ నలభైయేళ్ళుగా నిరంతరం, నిర్విరామంగా, అవిశ్రాంతంగా సాగించిన ఈ అగణితములైన మహోద్యమములన్ని, అన్యాయాలను అరికట్టి న్యాయాన్ని ధర్మాన్ని సంస్థాపించేందుకు మాత్రమే జరిగాయి అనేది ముందు ముందు రాబోయే అనేక సంఘటనలతో వివరాలు మీ ముందువుంచే ప్రయత్నం చేస్తాము.

ఆచార్య రంగా జిందాబాద్, కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్ జిందాబాద్, నిరంకుశత్వం, నియంతృత్వం నశించాలి. ప్రజాస్వామ్యం ప్రవర్ధమానంగా కోటి సూర్యుల ప్రకాశంతో వెలుగొందాలని, ఆయనను ఒకసారి సంస్మరించు కుందాం.

# స్వయంభువుడు-సర్వజ్ఞుడు-సత్యాన్వేషి, విరామము, విశ్రాంతి పాలుమాలిక ఎరుగని కృషీవలుడు

"సమయ మమూల్య, మొక్కనిముసంబు వృథాచన గ్రమ్మలింపనే
రము ; మ  యాయువా తృటి పరంపర యౌట నెఱింగి నిద్రమాం
ద్యమును తొలగించి మీ పనులు ఆరయుడో జనులార అంచు డం
బముగ మెడన్నిగిడ్చి కృకవాకము కూసెడి ఇంటికొప్పనన్ "

కవికోకిల దువ్వూరి రామిరెడ్డి

**సో**మరితనమనేది మానవునకొక పీడ  మానవులకే అననేమి ? జీవరాసులన్నింటికీ, పవిత్రగ్రంథము బైబిల్‌లో అనేక సందర్భములలో చెప్పియున్నారు. ఇక భగవద్గీత సోమరిని మూఢునిగా, కర్తవ్యహీనునిగా, చివరకు పాపిగా కూడా విశదపరచింది

బౌద్ధ-జైన మతాలు మానవ జీవితమే బుద్బుద ప్రాయమని, క్షణికములని పేర్కొంటూ, ముందు తరాల భవిష్యత్తుకు ఆరాటపడటం, పోరాటం సాగించడం అదేపనిగా తపన చెందటం అనేది దోషంగా, పరిగణించారు. దాంతో మానవులలో క్రియాశీల శక్తి నశించింది. "కృషితో నాస్తి దుర్భిక్షం" అనే సూక్తిని హేళనగా చూశారు. ఆకారణంగా ఉత్పత్తులు పడిపోయాయి. జీవితాలు దుర్భరమయ్యాయి. అదిగమనించిన కనిష్క మహారాజు మానవులలో కృషికి ప్రాధాన్యం ఇవ్వాలనే తలంపుతో శ్రమైక జీవితం వైపు ప్రజలను మళ్ళించేందుకు ఒక మహా యజ్ఞాన్నే ప్రారంభించాడు. యజ్ఞం అంటేనే కృషి  ఒక పనిని సాధించుటకు దీక్ష, పట్టుదలతో కృషి చేయడమే యజ్ఞం అన్నారు. కనిష్కుడు ప్రారంభించిన యజ్ఞం పేరు "నాగలి యజ్ఞం" కోటి నాగళ్ళు చేయించాడు. రైతులకు పంచిపెట్టాడు, కనిష్కుని లక్ష్యం ఈ నాగళ్ళతో నిరంతరం, నిర్విరామంగా భూమిని దున్ని పాటుచేసి పంటలు పండించటం, కనిష్కుని ఈ మహాయజ్ఞం ద్వారా తిరిగి ప్రజలలో శారీరక శ్రమపట్ల ఉత్సుకత పెరిగింది  పంటలు పండాయి దేశం సుభిక్షమైంది

యూరప్‌లో క్రైస్తవ మతాధిపతులు భగవంతుని ప్రార్థించడం ఆరాధించడం స్తోత్రాలు వల్లించడమే  పవిత్ర కర్తవ్యంగా ప్రబోధం చేశారు. దాంతో ఎక్కడి కక్కడ క్రైస్తవుల భజన మఠాలు వెలిశాయి. ఇలా వెలిసిన

మతాలు వేల సంఖ్యలోనే చేరాయి. దీంతో పనిపాటలు చేసి శ్రమించే, పంటలు పండించే తాము తిని సమాజానికి ఆహారమును సమకూర్చడమనేది వెనుకబడి పోయింది. సమాజంలో ఆకలిమంటలతో "హాహాకారాలు" సాగాయి. దుర్భిక్షం ప్రబలింది అప్పడు ఒక మహాత్ముడు, గొప్ప సంస్కర్త "లూథర్" అనే మహానుభావుడు వెలిశాడు పనిపాటలు లేకుండా ప్రొద్దస్తమానం బాజా భజంత్రీలతో తాళాలు, తప్పెట్లతో భజనలు సాగించే సోమరితనం పై ఒక యుద్ధాన్నే ప్రారంభించాడు. భగవంతుని ప్రార్ధించు కోవటం అవసరమే స్తోత్రం కూడా అవసరమే. దానికొక నియమిత సమయం మాత్రమే వుండాలి. అని ప్రభోదించి, ప్రజలను కార్యోన్ముఖుల్ని చేశాడు. ఇలా ప్రపంచ వ్యాప్తంగా సోమరితనంపై ఏవగింపును కలిగించే అనేకమైన కథలు, గాథలు, వెలుగులో కొచ్చాయి సూక్తులు వెలువడ్డాయి సోమరితనం అనేది మానవుడు సిగ్గుతో తలవంచుకొనవలసినంతటి హేయమైనదని ప్రభోదాలు సాగాయి. ఒళ్ళు వంచి శ్రమించి పనిచేసేవాడికే సంఘంలో గౌరవం, మర్యాదలు కలుగుతాయి సోమరి అయినవాడు భిక్షాటన చేయటానికి కూడా అనర్హుడని నిర్ణయించ బడింది

రంగాజీ ప్రముఖ రైతుకవి. కవికోకిల దువ్వూరి రామిరెడ్డి గారు పై అమూల్యమైన సందేశాన్ని ఆకళింపు చేసుకుని విద్యాలయాలలో కృషి ప్రధానమైన జీవితానికి యువకులను మరలించి ప్రోత్సహించే ప్రబోధాలు చేస్తుంటారెప్పడూ రామిరెడ్డి గారు తెల్లవారు ఝూమున బ్రహ్మముహుర్తమున, కోడి ఇంటిపై కప్పపైకెక్కి కొక్కొరొక్కోయని కూయడం మానవుల్ని నిద్రనుండి మేల్కొలిపి, శ్రమైకజీవితాన్ని ప్రారంభోత్సవం చేయటమేనన్న అర్థంలోనేపద్యం వ్రాశారు.

రంగాజీ తెల్లవారుఝూమున బ్రహ్మముహుర్తంలోనే నిద్ర మేల్కొనట మనే అలవాటు పిన్నవయస్సులోనే తమ పెంపుడు తల్లి మంగమ్మ గారి వద్ద నేర్చుకున్నాడు. ఆమె నిద్రమంచమునుండి లేస్తూనే ఓరేయ్! రంగడూ, కోడి కూసింది ఇకలేనాన్నా. మొహం కడుక్కొని తయారుగా. అన్నంతిని ఇంత చలిముద్ద కట్టుకుని పొలం వెళదాము. అక్కడ నీకు మంచి కథలు చెపుతా అంటూ నిద్ర లేపేదట. కథలంటే చెవికోసుకొనే ఆసక్తిని నాలో పెంపొందించింది మా అమ్మ మంగమ్మ. రైల్వేపోర్టరు రామస్వామి. పెద్దపెద్ద చదువులు చదివి లాయరో, డాక్టరో మరింత కష్టపడి చదివితే కలెక్టరో

అవుతావురా బాబూ అని చెప్పింది, జంపని ఆంజనేయులు గారు. (ఈ ముగ్గురు తొలిగురువుల గురించి కధనాన్ని ఈ గ్రంథములోలేనే ఒక ప్రత్యేక ఆధ్యాయంలో వివరించబడింది)

ఆనాడు, ఆ ౧౯౦౫, ౧౯౧౦ సం మధ్యనే నాకు బ్రహ్మముహూర్తంతో నిద్రలేవడం కార్యక్రమాలకు శ్రీకారం చుట్టడం ప్రారంభమయినది అదే నా జీవితంలో కష్టించి పనిచేయాలనే స్ఫూర్తిని కలిగించింది శ్రమచేయడంలోనే ఆనందానుభవం కలదని నా జీవితానుభవం చెపుతూందని రంగాజీ సహచరులకు, శిష్యులకు, అభిమానులకు, రైతాంగ విద్యాలయంలోని విద్యార్థులకు పాఠాలలో నేటికీ ప్రభోదిస్తూనే వుంటారు.

రంగాజీ ఆ చిన్ననాటి అనుభవంతోనే, అలవాటువలననే చదువులలోనే ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైనారు. ప్రజాసేవా రంగంలో పెద్దల ప్రశంసల నందుకున్నారు. త్యాగమయ జీవితాన్ని అలవరచుకొనుటలో కూడా ఆనాటి కృషే ప్రధానకారణం పర్యటనలు సాగించినా, రైతాంగ విద్యాలయాల ప్రభోదాలు చేసినా, యాత్రలు నడిపినా, గ్రంధాలు రచించినా, గ్రంధపఠనం సాగించినా బ్రహ్మముహూర్తాన నిద్రలేవడం అనే ఆనాటి మా అమ్మ మంగమ్మ శిక్షణే నాకు ఏడుగడ అని సందర్భం వచ్చినపుడల్లా జ్ఞాపకం చేస్తుంటారాయాన

రంగాజీ నేడు ప్రపంచంలోనే ఒక అద్వితీయ ప్రతిభాసంపన్నుడుగా మేధా సంపన్నుడుగా ప్రశంసింప బడుతున్నాడంటే ఆనాటి శిక్షణే కారణం అంటారాయన. అనన్యసామాన్యములైన సేవాత్యాగములు అలవడినాయంటే ఆనాటి శిక్షణే కారణమంటారాయన అనుపమానమైన ప్రజోద్యమాలు, పోరాటాలు, సాగించి జయకేతనము ఎగురవేశానంటే ఆనాటి శిక్షణే కారణమంటారాయన. అనితర సాధ్యములైన హరిజన, గిరిజన పతితజన శ్రామిక జన సేవలూ, సంఘ సంస్కరణలు సాగించి, సత్ఫలితాలను సాధించానంటే కందుకూరి వీరేశలింగం పంతులు, రాజారామమోహన్ రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, త్రిపురనేని రామస్వామి చౌదరి వంటి సంఘ సంస్కర్తల, మేధావుల, మానవతావాదుల రచనల పఠనాలపట్ల ఆసక్తిని కలిగించిన జంపని ఆంజనేయులుగారు ఆనాడు నాలో కలిగించిన చైతన్యమే కారణం అంటారాయన ఇలా అనుక్షణం తనకు ఆచిన్ననాట అలవరచిన క్రమశిక్షణ, పట్టుదల, దీక్షలే కారణం అంటారాయన.

రంగాజీకి పెద్దలను గౌరవించడంలో, అభివాదించడంలో, సంస్మరించుకోవడంలో ఎంతో మహదానందం కలుగుతుంది. అందుకనే మన పెద్దలు వీరులను సంస్మరించుకునేందుకు "వీరపూజ "అనే కార్యక్రమం పెట్టారు ఉగాది, సంక్రాంతి, పండుగల పుణ్యదినాలలో గతించిన తల్లితండ్రులను, తాత ముత్తాతలను, మరింత పూర్వీకులను సంస్మరించుకుని వారి వీరోచిత కార్యక్రమాలను చెప్పకుని, గర్వపడుతుంటారు అందుకే ప్రతి యింటా వీర పూజలు జరుపుకుంటారు

## స్వయంభువుడు- రంగాజీ

రంగాజీ పూర్వీకులలో విద్యావిజ్ఞాన సంపన్నులైన వారులేరు. కేవలం వ్యవసాయమే జీవన విధానంగా, లక్ష్యంగా, శ్రమైక జీవితాన్ని సాగించిన కృషీవలురు వారు. సంపన్న రైతు కుటుంబం కావడంతో గ్రామంలో పెత్తందార్లుగా, ప్రజలకు తలలోనాలుకగా మెలగుతూ ఉండేవారు. అప్పట్లో ఎంతటి విశాల భూఖండము కలిగియున్నా, మరెంతటి పశుసంపదచేకూరి ఉన్నా చదువుకోవాలనే ఆసక్తి కలిగి ఉండేవారు కాదు. చదువు కోవడమంటే ప్రభుత్వోద్యోగాల కొరకు మాత్రమేనని ఒక అభిప్రాయం రైతు కుటుంబాలలో ఉండేది. ఆకారణంగా రంగాజీ తల్లి దండ్రులుగాని ఇతర బంధు వర్గంగాని ఆయనకు ఉన్నతవిద్యలో ప్రవేశం కల్పించాలనే పట్టుదల రాలేదు.

ప్రాథమిక విద్యాభ్యాసములకై వీధి బడిలో ప్రవేశించినపుడే పెద్ద చదువులు చదవాలనే ఆసక్తిని పెంచుకొన్నారు అది రైల్వే పోర్టర్ రామస్వామి సంఘసంస్కర్త తెలుగులో పాండితీ ప్రకర్షగల ఆంజనేయులుగార్ల ప్రోత్సాహం దానికి తోడయ్యింది అన్నిటి కంటే ప్రధానమైన విషయం ఆయనలో పెంపొందిన చొరవ, స్ఫూర్తి, పట్టుదల మరింత దోహదం చేశాయి. "ఈ కథ ఇందులోనే ఒకటి రెండు శీర్షికలలో వస్తుంది. గమనించండి". ఇచ్చట మనం ప్రధానంగా చర్చించు కోదలచినది ఆయన స్వయంభువుడు అనేది విద్యాభ్యాసంలోగాని, ఉద్యోగ సంపాదనా ప్రయత్నాలలోగాని అటుతరువాత అరవైయేళ్ళ పార్లమెంటరీ జీవితంలోగాని, ఎనభైయేళ్ళ ప్రజాసేవా జీవన రంగంలో గాని ఆయనను జుట్టు పట్టుకొని పైకి లాగినవారు లేరు. ఒక రకంగా చెప్పాలంటే ఆయనను కాళ్ళుపట్టుకొని క్రిందికి లాగినవారే హెచ్చుమంది.

రంగాజీ నిరంతరం నిర్విరామంగా సాగించిన కృషే ఆయన ఉన్నతికి దోహదం చేసింది అంతకంటే మిన్నగా ఆయన చేపట్టిన కార్యక్రమాలు ప్రజోపయోగకరములైనవి ఉన్నత ప్రమాణాలతో కూడినవి కావడం ఆయన వ్యక్తిత్వానికి వన్నెతెచ్చాయి ఆయన లక్ష్యశుద్ధికి అధిక ప్రాధాన్యత ఇచ్చేవారు 1915లో ప్రప్రధమంగా అనిబిసెంట్ అరెస్ట్‌కు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శన సాగించిన ఆనాటి ఆయన ఉన్నత వ్యక్తిత్వం, త్యాగమయ జీవితం దేశభక్తి ప్రపూరితమైన లక్ష్యశుద్ధి ఆయన జీవితంలో అశువులు బాసే వరకూ తృటి పాటి సమయమైనా లక్ష్యాన్ని మరవకుండా ఉద్యమాలు సాగించారు అదే ఆయనలోని దీశక్తికి, సంకల్ప బలానికి తార్కాణములు

**నీతి, నిజాయితి, నియమబద్ధత, వినయం, విధేయత, విశుద్ధవర్తన, ఆలంబనంగా ఎనభైయేళ్లు నిరాడంబరంగా, అవిశ్రాంత కృషిసాగించిన ఆదర్శ గాంధేయ అర్థశాస్త్ర దార్శనికుడు ఆచార్యరంగా**

"ప్రజ్ఞలను ప్రేమించలేనివాడు దేశభక్తుడు కాలేడు. అది ప్రజలపట్ల ప్రేమ, మీరక్తనాళాలలో ప్రవహిస్తున్నదా ? అది మీ హృదయస్పందనతో శృతి కలుపుతుందా ? ప్రజల దైన్య స్థితి, వారి దుర్భరావస్థ ! వీటి గురించిన చింతన తప్ప అన్యథా మీ హృదయస్పందనలో స్థానం లేకుండా పోయిందా? మీ పేరును. గురించి కాని, మీ ప్రతిష్టను గురించికాని, మీ భార్య, బిడ్డలను గురించి కాని, మీ ఆస్థిపాస్థులను గురించికాని, చివరకు మీ తనువును గురించి కాని, మీరు పూర్తిగా మరచిపోయారా ? దీనిని మీరు సాధించారా ? ఇదే దేశభక్తుడు కావటానికి ప్రథమచర్య, ప్రపథమ చర్యకూడా."

- స్వామి వివేకానంద.

ఇందుకు సంబంధించిన మరోసూక్తి. దానినిలోగడొక సందర్భంగా ఉటంకించియున్నాను. అయినా మరోమారు ఇచట కూడా చెప్పకుందాం దాని పూర్తి పాఠమునకు బదులు సంక్షిప్తంగా ఒక మాటలో చెప్పకుందాం

ప్రతిమానవుడు ఎప్పుడో ఒకప్పుడు, ఏదో ఒక సమయంలో ఒక అద్భుతాన్ని చేయవచ్చు మరేదైనా ఘనకార్యమును సాధించవచ్చు అంతమాత్రమున అతడేదో గొప్పయోధుడుగా, ప్రజ్ఞావంతుడుగా, యోగ్యుడుగా ఎంచరాదు. ఎవరయితే తను జీవించివున్నంతకాలం మొక్క వోని ధైర్యముతో అకుంఠిత దీక్షతో అంకిత భావములతో ప్రజలను సేవించుటలో నిరంతరం నిర్విరామంగా కృషిచేసి ఘనకార్యములను సాధిస్తుంటారో వారినే ధీరోదాత్తులుగా, మనీషిగా, మహామనీషిగా తపస్సంపన్నుడుగా దైవాంశ సంభూతుడుగా ధృవీకరించదగును.

మహామేధావి, మహాజ్ఞాని సర్వజ్ఞుడు, స్థితప్రజ్ఞుడు, దార్శనికుడు, మానవ మనస్తత్వవేత్త స్వామి వివేకానందుల వారు సూక్తీకరించిన పై రెండు ధర్మాలను మదిలో పెట్టుకొని రంగాజీ వ్యక్తిత్వాన్ని, మానవతావిలువలను, నీతి, నిజాయితి, నిర్ధిష్టవర్తనను, నియమిత జీవన విధానమును అంచనా వేయుటలో గీటురాళ్లుగా, కొలమానాలుగా ఉపయోగించుకొనండి !!

రంగాజీ ధర్మపన్నాలను ప్రభోధించలేదు. ధర్మపథంలో పయనించారు.
**నీతి తప్పకుండా నియమ పాలనచేశారు**

ఈ శీర్షిక రచన విశేషమైనది విలక్షణమైనది కూడా. అందునా రంగాజీ లాంటి మహోన్నత వ్యక్తుల జీవిత చరిత్ర రచన కష్ట సాధ్యమైనది. ఆయన తన ఎనభైయేళ్ల సుదీర్ఘరాజకీయ చరిత్రలో అనేక ఉద్యమాల, పోరాటాల చరిత్రను సమన్వయ పరచవలసి వున్నది. అను సంధానం చేయవలసి వున్నది. అనేక మంది ప్రముఖ భారతీయ జాతీయ నాయకులందరు ఏదో ఒక ఉద్యమం చేపట్టి దానికంకితమైన వారే రంగాజీ అలాకాదు. స్వాతంత్రోద్యమంలో చేరిపోరాటాన్ని సాగించి కారాగారవాసము అనుభవించడంలో ఆయన సరిపెట్టుకోలేదు రైతులను సంఘటిత పరచి వారి హక్కుల రక్షణకై పోరాటం సాగించారు. జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో సంఘాలను స్థాపించారు. వ్యవసాయకూలీలను సంఘటిత పరిచారు. వారి కొక సంస్థను స్థాపించారు. జమిందారీ వ్యతిరేక పోరాటాన్ని సాగించారు. వారికో సంఘాన్ని స్థాపించారు. ఇక కాంగ్రెస్‌కు అనుబంధంగా యువజన, విద్యార్థి, మహిళా సంఘాలను స్థాపించారు. భారతదేశములోని

అనేకానేకమైన వృత్తులకు చెందిన శ్రామికులకు సంఘాలను స్థాపించారు అందు ప్రధానమైనది చేనేత చేనేతకు భారతదేశములో అతిపురాతన చరిత్ర వున్నది. ప్రపంచంలోనే మానవులు శరీరరక్షణ కొరకు వస్త్రధారణ ప్రారంభించబడినది మొదట భారత దేశములోనే కాలక్రమములో వందలాది దేశాలకు మనం నేత వస్త్రములను ఎగుమతి చేశాము కూడా అంతటి ప్రధానమైన పరిశ్రమ బ్రిటీషువారి పరిపాలనా కాలంలో విజృంభించిన జౌళి పరిశ్రమ ధాటికి తట్టుకొనలేక మూతబడే ప్రమాదం సంభవించింది తిరిగి దానిని పునరుద్ధరించాలి.

అందుకనే రంగాజి ఆక్స్‌ఫర్డులో డీలిట్ డిగ్రీ చేయటానికి చేనేత పరిశ్రమను ప్రధాన అంశముగా స్వీకరించారు (ఇందుకు సంబంధించిన విశేషమైన చర్చ ఇదే గ్రంథంలో మరో అధ్యాయంలో చూడవచ్చు) మహాత్మాగాంధీ ప్రారంభించిన ఖాదీ ఉద్యమంలో చేనేతకు గౌరవమైన భాగస్వామ్యం కల్పించేందుకు కూడా రంగాజీ కృషిచేశారు ఈ విషయంలో 1927 మద్రాస్ కాంగ్రెస్‌లో మహాత్మాగాంధీతో రంగాజీ సాగించిన చర్చలు సంక్షిప్తంగానైనా కొంత చర్చించుకుందాము.

మద్రాసు కాంగ్రెస్‌కు డా అన్సారీ అధ్యక్షుడు. కాంగ్రెస్ మహాసభ ప్రాంగణంలోనే ఖాదీ ప్రదర్శనమును ఒక దానిని ప్రారంభించారు ఆనాటి ప్రారంభోత్సవంలో మహాత్ముడు తన ప్రసంగంలో చేతితో దూదినుండి ఏకులను, ఏకుల నుండి దారమును, దారమునుండి మగ్గముపై బట్టను తయారు చేయటమనే విషయాన్ని అద్భుతంగా వర్ణించారు. మానవుని యొక్క విశిష్టమైన, మహోన్నతమైన, విలక్షణమైన శక్తియే బట్టల తయారీకి ఎలా ఉపయోగపడుతుందో వివరించారు. ఆసందర్భములో రంగాజీలేచి ఒక ప్రశ్నవేశారు. బాపూజీ ! మీప్రసంగం విన్నాను. దానినొక దివ్య సందేశంగా స్వీకరిస్తానే. అయితే అందునాకొక బాధవున్నది. అదేమంటే మీరు ఖాదీకిచ్చినంత ప్రాధాన్యాన్ని చేనేతకు కూడా ఇచ్చివుండవలసింది అన్నారు రంగాజీ.

గాంధీజీ : రంగా ! నీప్రశ్నలో న్యాయంలేకపోలేదు. నేను చేతినూలుతో వడికిన బట్టలపై ప్రజలదృష్టిని కేంద్రీకరింప చేయుటకై ఖాదీమినహా ఇతర

చేనేత పరిశ్రమల ఉత్పత్తిపై తయారైన వస్తువులను మినహాయించాను అంతేకాదు చేనేత వస్త్రాలకై చాలా ప్రదర్శనశాలలున్నాయికదా ?

రంగాజీ లేదు బాపూ! ఆ ప్రదర్శనలను ఖాదీ, చేనేత పరిశ్రమల ఉత్పత్తులందు ఆసక్తి లేనివారే నడుపుతున్నారు

గాంధీజీ వాటిని స్వదేశి అంటారు కదా !

రంగాజీ : యదార్థమే కావచ్చు ఆ స్వదేశీ ప్రోత్సాహమంతా పరిశ్రమాధిపతులకే కళాకారులను ఎవరు చూస్తారు ? వాళ్ల ఉత్పత్తులను ఎవరు ప్రచారం చేస్తారు ? ముఖ్యంగా నేతపని వారిని ఎవరు పట్టించుకుంటారు ? మధ్యలో ఒకాయన కల్పించుకుని "నేత పని వారు ఎందుకు ఖాదీ నేయరు ?" అని ప్రశ్నించారు

రంగాజీ : వడికిన నూలుతో నేతనేయడానికి చేనేత వారిలో ఒక శాతానికి కూడా పని చాలదు. కేవలం ఒక్క చేనేత పరిశ్రమ కేంద్రానికి సరిపోయే టంత ఖాదీ దారాన్ని అందించలేరు. అదుగో మీ ముందే ఉన్నారు రాజాజి ఆయన ప్రారంభించిన గోపిచెట్టి పాళయం కేంద్రములో ఎంతనూలు ఉత్పత్తి చేస్తున్నారో అడగండి

గాంధీజీ నవ్వుతూ రంగాజీని మెచ్చుకొని భేష్ ! రంగా! నీవు పచ్చయ్యప్పా కళాశాలలో ఆర్థిక శాస్త్రాచార్యులుగా ఉన్నావు కదా అందువలన మీ వాదనను బాగా వివరించారు నేను సంతృప్తి చెందాను. ఇక మీదట వడికిన నూలుతో తయారు చేసిన ఖాదీతో పాటు మిల్లునూలుతో వడికిన చేనేత బట్టలకు కూడా ప్రాధాన్యత ఇస్తాను అని హామీ ఇచ్చారు ప్రక్కనే ఉన్న భారతీదేవి వైపు తిరిగి మీ భర్త వాదనాపటిమ ఎంత అద్భుతంగా వున్నదో చూస్తున్నావుగా భారతి ! అంటూ ప్రశంసించారు

ఇక విషయానికొద్దాము. పై ఉద్యమాలు, పోరాటాలు, సంస్థల నిర్మాణంతో ఆగలేదాయన సేవా కార్యక్రమాలు, వయోజనులకు విద్యాబోధన గరపాలని నిర్ణయించి అందుకొక సంస్థను స్థాపించారు. రంగాజీ సేవా **కార్యక్రమాలు** విభిన్న రీతుల్లో సాగాయి. సంఘాలు **స్థాపించినా**, సంస్థలు **నిర్మించినా** ఉద్యమాలు చేపట్టినా, పోరాటాలు **సాగించినా** అవి అషామాషీగా

సాగలేదు ప్రతివిషయంలో ఆయన అకుంఠిత దీక్షతో, ఆత్మ విశ్వాసంతో అంకితభావంతో పోరాటం సాగించారు ఆకారణంగానే ఆ ఉద్యమాల ప్రభావం ప్రజలలో చైతన్యాన్ని ప్రదీప్తం చేశాయి కార్యకర్తలలో సేవాభావాన్ని పురికొల్పాయి ప్రజాఉద్యమాలుగా రూపుదాల్చాయి

రంగాజీని సుదీర్ఘకాలం అతి దగ్గరగా పరిశీలించిన మహామేధావి ప్రపంచ రాజనీతిజ్ఞులలోనే విశిష్ట వ్యక్తిగా భావించబడిన శ్రీ రాజగోపాలచారి రంగాజీ గురించి అన్న మాటలు చూద్దాము

"స్వీయప్రయోజనాల కోసంకాక, ప్రజల సంతోషంకోసమే కృషిచేసే విశిష్టవ్యక్తులలో ఎన్.జి.రంగా ఎన్నదగినవారు" అంటూ ప్రశంసించారు

రంగాజీ ఇంతటి సుదీర్ఘకాలం నిరంతరం నిర్విరామంగా అవిశ్రాంతమైన పోరాటాలు సాగించినా, ఉద్యమాలు నడిపినా ఎందుకు పరిపాలనలో భాగస్వాములు కాలేకపోయారని, ఎటువంటి అధికార పార్టీ పదవులను పొందలేకపోయారని చాల మంది విజ్ఞులైనవారే అనుకుంటూ వుంటారు , దానిపై మహాత్మాగాంధి చెప్పిన ఈ క్రింది సూక్తిని గమనిద్దాం

**"మంచిగా ఉండాలనీ, మంచినే చేయాలని కోరేమనిషి ఎట్టి పరిస్థితుల లోను అధికారాన్ని చేపట్టకూడదు".**

– గాంధీజి.

రంగాజి, గాంధీజి ప్రవచించిన పై సూక్తి ఆధారం చేసికొని, మననం ఛేసుకుని, అధికార పదవులను చేపట్టలేదని అనలేము కానీ అయనెప్పడూ పార్లమెంటులో సభ్యత్వం తప్ప ఏ అధికార పదవికొరకూ ఆరాట పడలేనందుకు లోగడ మరో పేరాలో విస్పష్టంగా చెప్పకుందాము మహాత్మాగాంధీతో రంగాజీ చర్చల సందర్భములో చోటుచేసుకున్న కొన్ని అభిప్రాయాలను ఈ సందర్బంగా చూద్దాము పర్మిట్లు, లైసెన్సులు కంట్రోలుల బారినుండి ప్రజలను రక్షించేందుకు ఆ 1945లోనే దేశవ్యాప్తంగా అనన్య సామాన్యమైన, అనితర సాధ్యములైన ఒక మహోద్యమాన్ని సాగించారు అందు పండిట్ నెహ్రూతోనే ఆయన పోరాటం సాగించారు ఆ సందర్భములో కంట్రోళ్ల వ్యతిరేకోద్యమానికి బాపూజీ ఆశీస్సులు సంపాదించేందుకు వెళ్లిన రంగాజ [illegible]ంచిన సంభాషణ ఒకసారి చూద్దాము

కంట్రోళ్లు, రేషనింగు, పర్మిట్లు అనే ప్రజావ్యతిరేక కార్యక్రమాలను రద్దు చేయించేందుకు తనెందుకు ఇంతటి మహోద్యమాన్ని సాగిస్తున్నానో, అందునా ఈ మహోద్యమం భారత ప్రధాని పండిట్ నెహ్రూపైనే సాగించవలసి వచ్చినా వెనుదీయకుండా, భయపడకుండా సాగిస్తున్నాను అంటూ వివరించారు గాంధీజీకి సంతృప్తి కలిగింది రంగాజీతో ఇలా అన్నారు. రంగా! బాబూ రాజేంద్ర ప్రసాద్ ఆహార మంత్రిగా రాజీనామా ఇచ్చారు. ఆసంగతి నీకు తెలుసు కదా! ఆస్థానంలో నిన్ను ఆహార మంత్రిగా ఆహ్వానిస్తాను. అందుకు అంగీకరిస్తారో లేదో రంగాతో సంప్రదించి తెలుసుకోవలసిందిగా సర్దార్ వల్లబాయ్ పటేల్‌ను నెహ్రూ కోరారట కదా ? మరి అంగీకరించకూడదా దానికి రంగాజీ ఇలా అన్నారు. బాపూ! మంత్రివర్గంలో ఎప్పుడు చేరతానో అప్పుడు నా స్వాతంత్ర్యం హరించబడుతుంది పండిట్ నెహ్రూకు చుట్టూవున్న సలహాదారులంతా ఈ కంట్రోళ్ళ రేషనింగు పర్మిట్లకు అనుకూలురు. వారివాదం వారిది. ఆయన వారి వాదననే బలపరుస్తారు. అప్పుడు నేను మంత్రివర్గంలో వుంటూ అనుక్షణం నెహ్రూగారితో పోరాటాన్ని సాగించాలి ఆసందర్భంలో రంగాజీ సాగించే కంట్రోళ్ళ వ్యతిరేక పోరాటాన్ని గురించి చర్చించేందుకు బాపూజి వద్దకు వెళ్ళిన నెహ్రూ మంత్రిగా రమ్మంటే అంగీకరించడు బయట మా విధానాలను దేశమంతటా ప్రతిఘటిస్తున్నారు. మీరే చెప్పండి నేనేం చేయాలో బాపూ సమాధానంగా నెహ్రూతో ఇలా అన్నారు. పండిట్‌జీ! కంట్రోళ్ళు వినాశకరమైనవి సాధారణ గ్రామీణ ప్రజలలో చెలగాటమాడుతున్నాయి వారి హక్కులను హరింపచేస్తున్నాయి బానిసలుగా మారుస్తున్నాయి. కాబట్టి కంట్రోళ్ళ నెత్తి వేయండి అలా జరగ నట్లయితే నేను ప్రాయోపవేశం చేయవలసి వుంటుంది. చాలా చర్చ జరిగిందనుకోండి వివాదాలు రేకెత్తాయి బాధాపరితప్త హృదయంతోనే అయినా జవహర్ లాల్ నెహ్రూ చివరకు కంట్రోళ్ళ నెత్తివేయడానికి అంగీకరించారు. ఇది రంగాజీకి నైతిక విజయం ఇప్పుడాలోచించండి నెహ్రూ ఆహ్వానాన్ని అంగీకరించి మంత్రిపదవి చేపట్టి ఉండినట్లయితే ప్రజలను ఎలా రక్షించగలరు ? ప్రజల హక్కుల రక్షణే ప్రధానంగా పెట్టుకున్న రంగాజీ అంతటి అధికారపదవిని ఒక గడ్డిపోచలాగా ఎలా విసిరి పారేశారో అర్థం కాగలదు.

(రెండవ ప్రపంచ మహాయుద్ధ కాలంలో బ్రిటీష్ పాలకులు వారి స్వార్థ

ప్రయోజనాలకొరకు ప్రవేశపెట్టిన కంట్రోళ్ల, రేషనింగు, పర్మిట్లపై 1945 నుండి రంగాజీ సాగించిన మహోద్యమాన్ని ఒక ప్రత్యేక అధ్యాయంగా చర్చించుకుందాము

## అఖిలభారత కిసాన్ సభ – రంగాజీ అధ్యక్షునిగా ఎన్నిక

అది 1936 జనవరి మాసం. ఎముకలు కొరికే చలి. "ఫైయిజ్‌పూర్‌లో" కాంగ్రెస్ మహాసభ జవహర్‌లాల్‌నెహ్రూ మూడవ సారి కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నిక అదే మహాసభల ప్రాంగణంలో అఖిలభారత కిసాన్ సభ కూడా జరిగింది రంగాజీ అత్యధిక సంఖ్యాకుల బలంతో అధ్యక్షులైనారు సభను కాంగ్రెస్ అధ్యక్షులు పండిట్ జవహర్ లాల్ నెహ్రు ప్రారంభించారు ఆనాడు ఒక బ్రహ్మాండమైన ఊరేగింపుగా దేశంలోని వివిధ ప్రాంతాలనుండి వచ్చిన రైతులు సభాస్థలికి చేరుకున్నారు. సభకన్నుల పండువుగా జరిగింది అదిచూచిన నెహ్రూకు ఇదొక రాజకీయ శక్తిగా రూపొందగలదేమో అన్న అనుమానం కలిగింది ఆ అనుమానంతోనే ఆ తరువాత కొద్ది సమయానికే అఖిలభారత కాంగ్రెస్‌లో రంగాజీ రైతులను గురించి, రైతు సమస్యలను గురించి, రైతాంగ వర్గపు చారిత్రక ప్రాధాన్యతను గురించి, చేసిన ప్రసంగాన్ని ఆలకించిన నెహ్రు కుపితుడై పోయినాడు. రంగాజీకే సందేహం కలిగిందట ఎందుకు అకారణంగా, అర్ధరహితంగా నాపై విమర్శలు చేశాడు. నేను రైతులను గురించి మాట్లాడటమే తప్పయిందా ? మరింతకన్నా నేను చేసి నేర మేమున్నది? నేను లేచాను ప్రసంగం ప్రారంభించాను నేనా మహానాయకుని నిలదీశాను ఆయన నియంతృత్వ ధోరణికి వ్యతిరేకంగా నా అసమ్మతిని తెలియ జేశాను.

ఫైయిజ్‌పూర్ కాంగ్రెస్‌లో వేదికపైనే జరిగిన మా వివాదము ప్రత్యక్షంగా గమనించారు బాపూజి ఆ తరువాత కొంతసేపటికి మహాత్ముని కలుసుకున్నారు రంగాజీ వారిద్దరి మధ్య జరిగిన సంభాషణ చూద్దాము

బాపూ రంగా! చిన్న అధ్యక్షుడు అంతకంటే చిన్న అధ్యక్షునితో కొట్లాడుతున్నాడే అని చమత్కరించారు. (చిన్న అధ్యక్షుడంటే ఆనాటికి జవహర్‌లాలా నెహ్రూ 45 ఏండ్లవాడే. అంతకంటే రంగా 36 ఏండ్లవాడే.)

రంగా . నవ్వుతూ మా అన్నయ్య హెచ్చుగా చూడబడే అన్నయ్య ఎంతగా

ప్రేమను చూరగొంటున్నాడో దాని శక్తి ఎంతటిదో చిన్న తమ్ముడు పరీక్షిస్తున్నాడంతే.

బాపూ ఓహో! అంతేనా! కాదే! నేను వింటున్నది నిజంకాదా? కాంగ్రెస్ అభ్యర్థులు అయినవారు రైతులకు ప్రత్యేకమయిన హామీ ఇవ్వాలని నీవు కోరనున్నావా? అలా రెండు హామీలను ఇవ్వడానికి ఎలా వీలవుతుంది?

రంగా. బాపూ! నేను కోరిందల్లా ఒకటే రైతుల ప్రయోజనాలకు భంగ కరంగా వున్న ఏ ప్రధాన సమస్య మీదనైనా ఒక తీర్మానాన్ని గావించక ముందు కాంగ్రెస్‌చే నియమితులైన రైతు అభ్యర్థులు కాంగ్రెస్ పార్టీముందు రైతుల దృక్పథాన్ని వివరించాలన్నదే నేను కోరిన హామీ దానినే "రైతాంగప్లెడ్జి" (ప్రమాణం) అన్నాము

బాపూ : రైతు తత్త్వంగలిగిన శాసన సభ్యులు చేయవలసింది అదనేకదా! ఇందులో తప్పేమున్నది

రంగా · నేను చెప్పతున్నట్లు ఏదో ఒక ప్రమాణానికి బద్ధులైతే తప్ప చాలా మంది అలా చెయ్యరు అందుకే రైతు ప్రతినిధులు వేరే ప్లెడ్జిపై సంతకం చేయాలన్నాను

బాపూ · ఎందువలన నీవలా అంటావు?

రంగా · స్వరాజ్య పార్టీకేంద్రశాసన సభ్యులు, రాష్ట్రాల శాసన సభ్యులు ఎలా చేస్తున్నారో ఆ విషయాన్నే నేను వారికి చెప్పాను.

బాపూ : రంగా! ఈ విషయాన్ని గూర్చి నీవు సర్దారుకు చెప్పావా?

రంగా. నేనేమీ చెప్పలేదు.

బాపూ. సర్దారుతో చెప్పమని నాసలహా. అలా చేయకపోతే నీవు అనవసరంగా కష్టాలను కొనితెచ్చుకుంటావు అని హెచ్చరించారు. చూడు రంగా! కిసాన్ కాంగ్రెస్ కార్యవర్గానికి చాలా మంది కమ్యూనిష్టులు, సోషలిస్టులు, ట్రేడ్ యూనియన్ నాయకులూ, ఎన్నికైనారట. అలాంటి కలయికకు వ్యతిరేకాభిప్రాయం వుంది కాంగ్రెస్ వారిలో జాగ్రత్త సుమా!

రంగాజీ అంటూ వుంటుంటారు అప్పుడప్పుడు ఆనాడు బాపూజీ సలహాను అంగీకరించి వుంటే ఎంత బాగుండేది? ఆనాటి నా కొత్త స్నేహితుల పాత చరిత్రను గూర్చి అప్పట్లో నాకంతగా తెలీదు సర్దార్ పటేల్ కూడా నా కృషికి తోడ్పడటానికి ఇష్టపడలేదు. అది జరిగిన కొద్ది కాలానికే సర్దార్ పటేల్, పండిట్ నెహ్రూ, ఇరువురూ కూడా కమ్యూనిష్టుల యెడల తమ తటస్థభావాన్ని విడిచిపెట్టి ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ మీదనే కాక కిసాన్ కాంగ్రెస్ పైనా నా పైనాకూడా వారు దాడి ప్రారంభించారు

## ఆనరోరియం నిరాకరించిన రంగాజీ

రంగాజీ కేంద్రశాసన సభలో సభ్యులుగా ఉన్న తరుణంలో కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. అప్పడు "బులాభాయ్‌దేశాయ్" అనే ఒక మహామేధావి బొంబాయి హైకోర్టులో ఒక ప్రముఖ న్యాయవాది కాంగ్రెస్ పార్టీనాయకుడిగా ఉన్నారు. అప్పట్లో రంగాజీ కేంద్రశాసన సభ చర్చల్లో ప్రముఖంగా పాల్గొంటూ ఏ సమస్య ప్రస్తావనకు వచ్చినా బ్రిటీష్ ప్రభుత్వ పెత్తనం దార్లను, (అంటే కేంద్రమంత్రి వర్గ సభ్యులను) ప్రభుత్వానికి అనుకూలంగా ఉండే పార్టీల నాయకులను తన వాదనా చాతుర్యంతో సభను రంజింప జేయుటయే కాక, ప్రత్యర్థులను ఉక్కిరిబిక్కిరి చేసేవారు అంత వరకూ బాగానే ఉంది. కాంగ్రెస్ పార్టీ నాయకుడు బులాభాయ్ దేశాయ్ అభిమానాన్ని అపారంగా చూరగొన్నాడు కాని కొన్ని సందార్భాలలో రంగాజి ప్రసంగాలు సభలో ఉద్వేగాన్ని రేకెత్తించేవి. ప్రత్యర్థులపై విమర్శనాస్త్రాలు సంధించేవారు. అందుకు బులాభాయ్ దేశాయ్‌కి కొంత కష్టంగాను, ఇబ్బందిగాను ఉండేది. రంగాజి శాసనసభ కాంగ్రెస్ పార్టీ వ్యవహారాలలోనే కాక, దేశంలో విస్తృతంగా ప్రచారంచేసి అనేక విషయాలను సేకరించి, పార్టీకి ప్రతిష్ట చేకూర్చడంలో ప్రధాన వ్యక్తిగా కూడా రూపొందారు. ఈ విషయంలో రంగా పట్ల అభిమానం, ఒక వంక ప్రసంగాల తీవ్రత కారణంగా కష్టంగాను వుండేది. బులాభాయ్ దేశాయ్‌కి అప్పుడప్పుడు సమయం వచ్చినపుడల్లా రంగాజీని గురించిన మంచి, చెడులను గాంధీజీకి చెపుతూ వుండేవారు కూడా

ఒకరోజు కేంద్ర శాసన సభలో రంగా బడ్జెట్‌పై కోత తీర్మానం

ప్రతిపాదించి, బ్రిటీష్‌వారు దిగుమతిచేసే జౌళి వస్త్రాలపై శుంకాన్ని తగ్గించడం ద్వారా జాతీయ జౌళి వస్త్రాల ఉత్పత్తిని దెబ్బదీయాలనే కుట్రను సాగిస్తున్నారని సశాస్త్రీయంగా గాంధేయ అర్థ శాస్త్ర ప్రావీణ్యతను ప్రదర్శించారు ఆనాటి ఆ ప్రసంగాన్ని స్వపక్షమైన కాంగ్రెసే కాక ప్రతిపక్షాలలో వున్న మహానాయకులూ ప్రభుత్వ పక్షం కూడా ప్రశంసించాయి అంతటి బహుళ ప్రశంశలు పొందిన ప్రేరకమైన గణాంక వివరాలు ఆక్స్‌ఫర్డ్‌లో చేనేతపై డీలిట్ డిగ్రీ సందర్భంలో గ్రామీణ ప్రాంతాలనుంచి సేకరించిన సమాచారమే కారణం పార్టీ నాయకుడు బులాభాయ్ దేశాయ్ రంగాజీని పిలచి రంగా నీవు కేంద్రశాసన సభలో ప్రసంసనీయమైన, శాస్త్రీయమైన చర్చలు సాగించడానికి కారణం నీ బహుముఖ ప్రజ్ఞ ప్రాభవాలే కాక, ఆనాటి నీ పరిశోధన ఉపయోగపడింది. నీ పరిశోధన ఆనాటితో ఆగలేదు. డీలిట్ డిగ్రీ పొందాననే సంతృప్తితో మిన్నకుండా నేటికీ విస్తృతంగా, దేశవ్యాప్తంగా పర్యటనచేసి పరిశోధన సాగిస్తూనే వున్నావు ఇందుకు నీకు చాలా ఖర్చు అవుతూవుంటుంది. కాబట్టి పార్టీ నిధుల నుండి కొంత మొత్తాన్ని ఆనరోరియం( గౌరవవేతనం) గా ఇవ్వాలని నిర్ణయించు కున్నాం బులాభాయ్ దేశాయ్ నోట ఆ మాట వెలువడుతూ వుండగానే, బులాభాయ్‌జీ! నాకు మీ ఆదరణ చాలు మీప్రేమ చాలు నాకు కావలసింది మీ అభిమానమే లభించింది చాలు నాకు ఎటువంటి ఆనరోరియం వద్దు. కేంద్రశాసన సభ సభ్యుడిగా నాకు లభించే అలవెన్సులు చాలు ప్రేమైక మూర్తి నా దైవం మహాత్మాగాంధీజి ఆశయాలకు అనుగుణంగా నిరాడంబరంగా జీవిస్తున్నాను అని సున్నితంగా ఆనరోరియంను తిరస్కరించారు.

రంగాజీ అంటుంటారు అదే సమయంలో నేనొక నాడు ఢిల్లీ భంగీ కాలనీలో నివాసముంటున్న ప్రాంతానికి వెళ్ళి బాపూజీని కలిశాను. ఆ భంగీ కాలనీ ఎక్కడో దూరంగా విసరివేయబడినట్లు ఒక మురికి కూపములో వుంది అచట ఆయనవున్న ప్రదేశానికి చేరినపుడు నాకు ఆశ్చర్యంతో పాటు బాధా, అసంతృప్తి కలిగాయి. ఢిల్లీ బిర్లా భవనంలో వుండటానికి బదులు బాపూజీ ఎందుకలాంటి అధ్వాన్నపు స్థలాన్ని ఎన్నుకున్నారో అని అక్కడ చేరిన చాలామంది సభ్యులు గొణగుకుంటున్నారు. నేను ఆ స్థలం చూశా. వారి గొనుగుడు విన్నా . ఒక్క నిముషం ఆలోచించా బాపూజీ చేస్తున్న పని ఒక ఉన్నతమైన ఆశయాన్ని మనసులో పెట్టుకొని చేస్తున్న పని అని తేల్చుకున్నా.

వెంటనే నా మనస్సుకు తట్టింది ఆయనే అలాచేయక పోతే దరిద్ర నారాయణులైన ఆపతితజనాలు, ఆ అవకాశరహితులైన హరిజనులతో తాదాత్మ్యం పొందినట్లు ఎలా నిరూపించుకోగలరు ?

మేమీ సంభాషణల్లో ఈ రకమైన మానసిక స్థితిలో ఉన్న మామధ్యకు బాపూజీ వచ్చారు వారు తన మృదువైన, అందరికీ పరిచయమైన చిరునవ్వుతో మమ్ముల్ని ఆహ్లాద పరిచారు నన్ను చూచి, నా వైపుకు చూపుడు వ్రేలుతో సౌజ్ఞచేసి రంగా నీ కృషిని చూచి మెచ్చుకుని మరింత పట్టుదలతో, శక్తివంతంగా, దేశవ్యాప్తంగా పర్యటనలు చేసి సమాచారాన్ని సేకరించి కేంద్రశాసన సభలో నీ ప్రతిభను, వాక్ చాతుర్యాన్ని ప్రదర్శించాలంటే కొంత ఖర్చు అవుతుంది. ఆ విషయం గ్రహించిన బులా భాయ్ దేశాయ్ ఆనరోరియం ఇస్తానంటే తిరస్కరించావట కదా ! నిజమే బాపూ నేనేమైనా క్రమశిక్షణా రహితంగా ప్రవర్తించానని ఆయన మీతో చెప్పారా ? చిర .నవ్వు నవ్వి గంభీరవదనంతో లేదు రంగా ! నీ శక్తి సామర్థ్యాలను తక్కువగా అంచనా వేయలేదా యన. గొప్ప క్తవన్నాడు అంతకంటే గొప్ప పరిశోధకుడవన్నారు అంతకంటే మించిన మ. ాచి పార్లమెంటేరియన్‌వని కూడా ప్రస్తుతించారు అయితే తొందరపాటు మనిషివని వారి అభిప్రాయం అంతే. చాల సంతోషం బాపూ ఈ మారు మీ వద్దకు ఆయన వచ్చినపుడు నా ప్రణామాలు చెప్పండి అభినందనలు చెప్పండి క్రమశిక్షణగల కార్యకర్తగా కేంద్రశాసనసభలోని నా నాయకునికి నిజాయితీ గల సేవకునిగా పనిచేస్తానని మనవి చేయండి బాపూ. సభ్యునిగా నాకు వచ్చే ఆనరోరియం చాలు. నేను మీ అనుచరుణ్ణి మీ ఆదర్శాలు వంట బట్టించుకున్నవాణ్ణి నిరాడంబర జీవితాన్ని అలవర్చు కున్నాను. నాకు ఇక ఆనరోరియం వద్దు చేతులు జోడించి, నమస్కరించి చెప్పాను నా ప్రక్కనే మందస్మిత వదనంతో గాంధీజీ యొక్క దివ్య సందేశాన్ని వింటూవున్న భారతీదేవి వైపు తిరిగి ఏమమ్మా! ఆనరోరియం వద్దంటున్నారు ఖర్చులెలా భరిస్తారు ? అని అడిగారు ఆమె తడుముకోకుండా వెంటనే బాపూ ! మాకు వ్యవసాయ మున్నది మేము సుఖంగా అనుభవించి, ఇతరుల కింత పెట్టడానికి చాలినంత ఆదాయమున్నది. అవసరం కలిగితే దానిలోనుండి కొంత కేటా యించుకుంటాము అంటూ ఆమె కూడా తలవంచి, చేతులు జోడించి నమస్కరించి చెప్పింది. గాంధీజీ మా దంపతులను మనసారా దీవించి ఆశీర్వదించారు.

సరే! వెళ్ళి వస్తాము సెలవు అంటూ నేను వెనుకకు మళ్ళీ రెండడుగులు వేస్తుండగా! రంగా ! రంగా ! నా బిడ్డ భారతి ఉత్తరాదిన ఈ ఎముకలు కొరికే చలిలో ఎలా తట్టుకుంటున్నదయ్యా ! జాగ్రత్తగా చూచుకో అన్నారు గాంధీజీ. అందుకు సమాధానంగా భారతీదేవి బాపూ ! నేను ఇంగ్లండులో రంగాజీతో పాటు ఐదేళ్ళపాటు కాపురం ఉన్న సంగతి తెలీదా అచట జీరో పాయింటులో చలి ఎలా వుంటుందో తెలుసుకదా ఆచలికి తట్టుకున్నదాన్ని ఈ చలి నాకొకసమస్య కాదు.

## నాపై - కిసాన్ సభపై - పగబూనిన కాంగ్రెస్ హైకమేండ్

బాపూ నాపై ఇంత ప్రేమను, అభిమానాన్ని, ఆదరణను, గౌరవాన్ని కలిగి వున్నా కొందరు కాంగ్రెస్ పెద్దలు ఎప్పుడూ విడవకుండా నేను కాంగ్రెస్ పోటీ సంస్థలను స్థాపించి నడుపుతున్నానని కాంగ్రెస్‌ను బలహీన పరుస్తున్నానని చేసే ఆరోపణలతో రంగాజీ ఎప్పుడూ బాధపడుతూవుండేవారు అలాంటి మరో ఉదాహరణ మీకీ సందర్భంలో గుర్తుచేయవలసి వున్నది. లక్నో కాంగ్రెస్ 1936లో సమావేశంకూడా జరిగింది రౌండ్ టేబుల్ కానఫరెన్సు తరువాత ఇండియా గవర్నమెంటు యాక్టులో చేసిన మార్పుల నేపద్యంలో రాష్ట్రాలలో మంత్రివర్గ నిర్మాణ బాధ్యతలను స్వీకరించవలసిందిగా బ్రిటీష్ ప్రభుత్వం కాంగ్రెసును కోరింది. ఆ విషయంపై లక్నో కాంగ్రెస్‌లో పండిట్ నెహ్రూ మంత్రి వర్గంలో చేరటానికి నిరాకరించారు ఆయనను సోషలిస్టులు బలపరిచారు బాబూరాజేంద్రప్రసాద్ మంత్రివర్గంలో చేరడానికి అంగీకరిస్తూ ప్రసంగించారు. దాదాపు పెద్దలంతా ఆయననే బలపరిచారు. ఈ నేపద్యంలో అచట సాగిన కిసాన్ సభ చర్చల సరళిని సర్దార్ పటేల్‌తో సహా కిసాన్ సభ నిర్మాణాన్నే తప్పగా భావించి వ్యతిరేకించారు ఆ విషయంలో నేను బాపూజీ ఆశీస్సులను పొందడానికి వారిని కలుసుకున్నాను. ఆయన రంగా సర్దార్ కిష్టం లేని పని నీకెందుకు ? రైతుల కోసం కాంగ్రెస్ పని చేయటం లేదా ? కరాచీ పత్రం చూశాను. అపుడు రంగా స్పష్టంగా కౌలుదారీ శాసనాలకు వ్యతిరేకంగా జమిందారులూ, జాగీర్దార్లూ, కాంగ్రెస్‌లోని తాబేదారులూ, సంఘటిత శక్తిని పెంపొందించుకోవడానికి, వ్యవస్థీకరించుకో బడాలి కదా. సంఘటిత శక్తిని పెంపొందించుకోవాలి కదా. అందుకే రైతు సంఘాల స్థాపన అని కాంగ్రెస్ చేయగలదని సర్దార్ అంటూవున్నారు.

అన్నారు బాపూజీ బార్డోలీలో రైతులను సంఘటిత పరచి ఘనవిజయాలను సాధించేందుకు సర్దారేకదా నాయకత్వాన్ని వహించాడు అది నీకెరుకలేదా? అని ప్రశ్నించాడు అందుకు సమాధానంగా రంగాజీ, నేటి ఆర్థిక మాంద్యము కారణంగా వడ్డీ వ్యాపారస్థులు వారిని ఎలా అణచివేస్తున్నారో, దోపిడీ చేస్తున్నారో వివరించారు గాంధీజీకి అర్థమైపోయింది రంగాజి సాగిస్తున్న కార్యక్రమాలు సమంజసమయినవని తోచింది. అందుకు రంగాజీని ఆశీర్వదించారు గాంధీజి

బాపూజీ నీవు కొందరు ఆక్షేపణీయకరమైన వ్యక్తులతో చేరుతున్నావని సర్దార్ ఫిర్యాదు చేస్తున్నాడు అందుకేమంటావు ?

రంగాజీ కాంగ్రెస్ నాయకులు నాకు సహాయం చేయునపుడు నేను వారిని చేర్చానని, వీరిని చేర్చానని అంటే ఎలా ? ( ఇచట లో ఒక అధ్యాయంలో చెప్పకున్నట్లుగా సబర్మతీ ఆశ్రమంలో ఉంటూ అక్రమంగా ప్రవర్తించాడనే అభియోగం రాగా ఆశ్రమంనుండీ వెలివేసిన "ఇందూలాల్ యాజ్ఞిక్" అనే ఉత్తరప్రదేశ్‌కు చెందిన విద్యాధికుడైన కార్యకర్తను ఉత్తరప్రదేశ్ కిసాన్‌సభ కార్యదర్శిగా నియమించాడనే అపవాదు రంగాపై మోపిన సంగతి ప్రస్తావించ బడింది) రంగాజీపై సర్దార్ కోపానికి అదికూడా ఒకకారణం కావచ్చు

బాపూజీ . రంగా! రైతుల యెడల నీవు చాలా పక్షపాతాన్ని చూపుతున్నావు అందులో ఆశ్చర్యమేమీ లేదు. సర్దార్‌కు నీవంటే కోపమూ వున్నది అభిమానమూ వున్నది నీసేవా కార్యక్రమము పట్ల సంతృప్తీ ఉన్నది

రంగాజీ · ఆయనకు నేనంటే అలాంటి మిశ్రమ భావాలెందుకుండాలి ?

బాపూజీ . నీవు మద్రాసులోనో ఎచ్చటనో ఆయనతో నేను మొదట రైతును ఆ తరువాతనే కాంగ్రెస్ వాడినన్నావట.

రంగాజీ : అంది నిజమే నేను కాదనను కానీ ఆయన మాటేమిటి? ఆయన మాత్రం రైతుకాదా ?

బాపూజీ . ఆయనా, మొదట కాంగ్రెస్‌వాడు, తరువాతనే ఆయన రైతు అర్థమైనదా అంటూ రంగానునయించారు.

అయితే రంగా రాష్ట్రాలలో ఏర్పడిన కాంగ్రెస్ మంత్రి వర్గాలనుండి మొట్టమొదటిగా నీవు కోరేదేమిటి ?

రంగాజీ వ్యవసాయ ఋణాలనుండి రైతులను విముక్తులను చేయాలి. వ్యవసాయ ఉత్పత్తుల ధరలు పడిపోవటానికి కారణాలనన్వేషించాలి. జమిందారీ, జాగీర్దారీ, ఇనాందారీ ప్రాంతాలలో శిస్తులు తగ్గించాలి భూమి శిస్తును రద్దు చెయ్యాలి హరిజనుల వంశ పారంపర్య రుణాలను రద్దుచేయాలి బ్రిటీషు ప్రభుత్వమే నియమించిన ఎగ్రికల్చరల్ రాయల్ కమీషన్ సిఫార్సులాధారంగా గ్రామాల మధ్య లింకు రోడ్లను నిర్మాణం చేయాలి మార్కెట్ యార్డులను నిర్మించాలి అంటూ వుండగా.

బాపూజీ రంగా! ఆగు! ఆగు! అప్పడే నీవంత పట్టికను తయారు చేశావా? అయితే నీవు అధికార స్వీకరణకోరుతున్నావా ?

రంగాజీ : కాంగ్రెస్ నాయకులెవరూ నాకు అనుకూలంగా లేరు అందు వలన నేనధికారం స్వీకరించే సమస్య ఎలా తలెత్తుతుంది ?

బాపూజీ : ఎవరైనా నిన్నెందుకు వ్యతిరేకించాలి ? నీవు చేసిన తప్పేమీ లేదే? ధైర్యంగా ఉండు రైతుల పక్షాన నిలబడి పోరాడు నా సహకారం నీకు వుంటుంది అని ఆశీర్వదించారు

చూచారుగా ఈ పాటికే అర్థం అయిపోయి వుంటుంది రంగాజీకి ఇంటాబయటా ఎంతగా, ఎన్ని అవరోధాలను మాన్పి అడ్డంకులను ఎదుర్కొంటూనే రైతుల రక్షణకు, రైతుల హక్కుల రక్షణకు ఎంతటి పోరాటాన్ని సాగించవలసి వచ్చిందో, ధైర్యంతో పట్టుదలతో, దీక్షతో ఒక అంకిత భావంతో, రైతుల కూలీ, చేనేత ఇతరచేతి వృత్తులకు చెందిన అశేష గ్రామీణ శ్రామిక జనాల సేవలు సాగించారో అర్థం కావడానికే ఇన్ని కథలు మీకు వివరించ వలసి వచ్చింది.

గాంధీజీ పట్ల రంగాజీకి ఎనలేని గౌరవం ఏర్పడింది. దానిని గౌరవం అని అనేదానికన్నా, భక్తి ప్రపత్తులు అనడం యుక్తంగా వుంటుంది. ఆయన గాంధీజీని కేవలం ఒక మహామనీషిగా, మానవోత్తముడుగా మాత్రమేకాక భగవంతుని రూపములోనే దర్శించాడనవచ్చును. ఈ సందర్భంలో ఒక

విషయాన్ని మనం గమనంలో ఉంచుకోవచ్చు గాంధీజీని ఒక దేవతామూర్తిగా, ఆరాధనీయుడిగా ఆయన హృదయ పీఠంపై అలంకరించుకోనకుండా ఉన్నట్టయితే రంగాజీ జీవనసరళి, ఆలోచనల ధోరణి భిన్నంగా వుండేది

రంగాజీ మహాత్మాగాంధీని ఎంతగా ఆరాధించాడో అంతగా నేతాజీని కూడా ఆరాధించేవారు గాంధీజీ, నేతాజీనే బలపరచారు ఆ తరువాత జరిగిన విధాన నిర్ణయాలలో నేతాజీని బలపరచలేకపోయారు ఆ విషయం స్వయంగా నేతాజీ తానే చెప్పారు ఏమని ? నేతాజీ ! బాపూ, మనకు నాయకుడే కాదు. ఆయనే జాతికే మార్గదర్శకుడు ఆయనొక భగవత్ స్వరూపుడు. ఆయన ఏ ఆలోచన చేసినా, ఏ నిర్ణయం తీసుకున్నా ఏ పంథావైపు పయనించినా, భారతజాతి సర్వతోముఖవికాసానికే ఆయన లక్ష్యం స్వతంత్ర భారతం. అంతకు తక్కువగా ఆయన ఎప్పుడూ కోరలేదు కాబట్టి మనం గాంధీజీని ఆయన విధానాలనూ, తూ.చా. తప్పకుండా భేషరతుగా ఆమోదించవలసిందే నా ఓటు గాంధీజీకే అంటూ చేతులు జోడించి నమస్కరించి బయటకు నడిచేశారు రంగాజి

ఇదీ గాంధీజీకి, రంగాజీల మధ్యగల సంబంధం 1925లో డీలిట్ డిగ్రీ పూర్తిచేసుకుని, భారతదేశములో కాలూనుతూనే గాంధీజీని ఢిల్లీలో కలిశారని చెప్పకున్నాం కదా ! అంతకుముందు గాంధీజీని ఆయన చూడలేదు అయితే గాంధీజీ విధానాల పట్ల, సిద్ధాంతాలపట్ల, ఆదర్శాలపట్ల పరిపూర్ణమైన అవగాహన కలిగివున్నారు అందువలననే గదా ? ఆక్స్‌ఫర్డ్‌లోని తన కత్యంత అభిమానులైన ప్రొఫెసర్లు ఎంత చెప్పినా వినకుండా చేనేతపై పరిశోధన స్వీకరించారు ఖాదీపై, అహింసపై, అస్పృశ్యతపై పీడితులైన నల్లజాతి బానిసత్వంపై అనేక వ్యాసాలు, మహమ్మదాలీ నిర్వహిస్తున్న "కామ్రేడ్ " అనే పత్రికకు వ్యాసాలు వ్రాయటం జరిగింది కామ్రేడ్ పత్రికే తరువాత కొంత కాలానికి భారతదేశములోనే ఒక ప్రతిష్టాత్మకమైన "హిందూస్తాన్ టైమ్స్" అనే ఆంగ్ల దిన పత్రికగా మారింది ఆ పత్రికకు వరుసగా వివిధ సమస్యలపై వ్యాసాలు వ్రాశారు కదా. ఆ పత్రిక మహాత్మాగాంధీ విధిగా ప్రతిసంచికా ఆసక్తితో చదివేవారు. అందువలన గాంధీజీ మనసులో రంగాజీ అనే విద్యాధికుడైన ఒక యువకుడు ఇంగ్లండు నుండి నా ఆలోచనలకు,

ఆశయాలకు, ఆదర్శాలకు అనుగుణంగా రచనలు చేస్తున్నారనే సంతృప్తితో వున్నారు. రంగాజీ అందించారు అందువలననేనేమో గాంధీజీ, రంగాగార్లు, పాత చుట్టాలులాగా, పాత కాపుల్లాగా, ఎంతో కాలం నుండి అతి సన్నిహితంగా మెలిగినవారులాగా, మొదటి చూపులోనే కలిసిపోయారు (ఈ మొదటి కలయికలో సాగిన చర్చ అంతా వయోజన ఓటింగు ప్రజాస్వామ్యం భారతదేశం అనే విషయం మీదనే కదా ? ఇదే గ్రంధంలో దీనిని లోగడ ఒక ఘట్టములో సంక్షిప్తంగా చెప్పకున్నాం మునుముందు ఒక ప్రత్యేక అధ్యాయంలో "వయోజన ఓటింగు ఆచార్య రంగా" అనే విషయంపై సమగ్రంగా సంపూర్ణంగా చర్చించు కుందాము.

1925లో మొట్టమొదటగా గాంధీజీని కలుసుకునే సమయంలో రాజకీయాలతో ఎలాంటి సంబంధం పెట్టుకోలేదు. అప్పటికాయన మనసులో ఉద్యోగంచేయాలనే ఉండేది. ఉద్యోగాన్వేషణ కూడా ప్రారంభించారు పచ్చయ్యప్పా కళాశాల అర్థశాస్త్ర ఆచార్యులుగా పదవీ స్వీకరణ చేశారు. ఉద్యోగం సాగిస్తున్నసమయాన 1927లో డా. అన్సారీ అధ్యక్షతన మద్రాసులో జరిగిన కాంగ్రెస్ సందర్భంగా రెండవమారు గాంధీజీని కలిసారు మొదటి కలయికతోనే ఒకరినొకరు ఆకర్షించుకున్న గాంధీజీ- రంగా గార్లు ఈ సమావేశంతో మరింత దగ్గరైనారు. ఇచటనే చేతిలో వడికి తయారైన నూలుతో నేసిన ఖాదీ- మిల్లు నూలుతో మగ్గములపై తయారైన చేనేత మధ్యగల అంతరాన్ని, సామ్యాన్ని, రంగాజి వివరించిన తీరు గాంధీజి మెప్పను పొందింది. ఈ ఇరువురి మధ్యన జరిగిన చర్చపై పేరాలలో చర్చించుకున్నాము

1929 గాంధీజీ గుంటూరు జిల్లా పర్యటనకు వస్తున్నారనే సమాచారం రంగాజీకి అందింది. ఆ పర్యటన కార్యక్రమములో నిడుబ్రోలుకు పదిమైళ్ళ దూరంలో ఉన్న వినాయాశ్రయం సందర్శించ నున్నారనే విషయం కూడా తెలుసుకున్నారు, వెంటనే గాంధీజీకి ఒక లేఖ వ్రాస్తూ ఈ మీ పర్యటన కార్యక్రమములో మధ్యలో ఉన్న మా గ్రామానికి వచ్చి మా స్వగృహానికి దయ చేయువలసిందిగా వ్రాశారట. వి. నాయాశ్రయం నిర్వహాకులు ప్రముఖ గాంధేయవాది స్వామీ సీతారాంగారికి (గొల్లపూడి సీతారాం శాస్త్రి) రంగాజీ పట్ల అనుపమానమైన ప్రేమాభిమానాలున్నాయి ఖాదీ గృహ పరిశ్రమలు,

చేనేత, అస్పృశ్యతా నివారణ మున్నగు గాంధేయ విధానాలపై రంగాజీ రచనల ద్వారా రంగాజీని అభిమానిస్తున్న సీతారాంగారు గాంధీజీ నిడుబ్రోలు సందర్శించడానికి అంగీకరించారు కూడా. గాంధీజీ పర్యటన కార్యక్రమములో నిడుబ్రోలు లోని రంగాజీ నివాసాన్ని చేరారు మద్రాసులో ప్రొఫెసరుగా వున్న రంగాజీ, ఆయన సతీమణి శ్రీమతి భారతీదేవి ఈ ఇరువురు మద్రాసు నుండి నిడుబ్రోలు చేరారు. బాపూజీ రాక సందర్భంలో జరగవలసిన ఏర్పాట్లన్ని నిరాడంబరంగా, దానినొక పవిత్ర కార్యక్రమంగా రూపొందించారు ఒక శుభముహూర్తంలో బాపూజీ రానే వచ్చారు. రంగాజీ నివాస భవనం సింహద్వారం దగ్గర రంగాజీ, భారతీదేవి పెంచి పెద్ద చేసిన తల్లి మంగమ్మ, సోదరులు లక్ష్మీనారాయణ, వెంకటప్పయ్య మిగతా బంధుగణం అశేషంగా ప్రజానీకం పూలమాలలు చేతబట్టి, ఆనందోత్సాహాలతో, సంతోషాతి శయంతో వేచియుండగా మహాత్ముడు ప్రయాణిస్తున్న కారు సింహద్వారం చేరింది ఆ కోలాహలం చెప్పతరమా ? ఆహ్వానించి, పూలమాలలను మెడలో వేసి, తల్లికి సైగచేయగా ఖాదిపండుకు ఆమె పోగుచేసి మూటకట్టిన ధనాన్ని గాంధీజీ చేతపెట్టింది. తల్లిని గాంధీజీకి పరిచయం చేశారు రంగాజీ ఆక్స్‌ఫర్డ్ యోధుడా! ఇదే నా మీ ఇల్లు నీ లేఖ చేరింది ఖాదీ మీద నీవు వ్రాసిన వ్యాసం కూడ చేరింది. తల్లి మంగమ్మ వైపు తిరిగి ఆమెతో గాంధీజీ "నీవు గర్వించాలమ్మా నీబిడ్డ నీ వాడైనందుకు నీవతడిని నాకిస్తావా ? నాతో చేర్చుకుంటాను నీ కొడుకును నా కిమ్మన్నందుకు నీవుకోప్పడవద్దు". అంటూ చమత్కరించారు. భారతీదేవి గాంధీజీకి నమస్కరించి మీ కొరకే మద్రాసు నుండి మా ఇంటికి వచ్చాము బాపూ! అన్నది. ఎందుకు భారతీ! నేనెప్పుడూ మీ ఇంట్లోనే వుంటాను కదా అన్నారు. తిరిగి ఏమమ్మా నీవు పెద్ద చిత్రకారిణి వటకదా ? నా కోసం చిత్రాలను ఏమైనా రచించావా ? ( లండన్‌లోని రస్కిన్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చదివిందని గాంధీజీకి తెలుసు) అందుకే ఆయన భారతీ దేవిని ఏదైనా చిత్రాన్ని రచించావా ? అని అడిగారు) ఈ సారి మా యింటికి వచ్చినపుడు మీ చిత్రం రచించిన పరుసు మీకు బహుకరిస్తాను మరలా ఒకసారి రావలన్న మాట మీయింటికి ? అలాగే దేవుని దయవుంటే తప్పనిసరిగా వస్తాను. ఇచ్చట గాంధీజీ, రంగాజీల మధ్య ఆసక్తికరమైన గొప్ప సంభాషణ సాగింది. అదంతా ఇక్కడ వివరించడం వీలుపడదు. అందువలన ఒకటి రెండు సంభాషణలను మాత్రం చెప్పకుందాం. రంగాతో బాపూజీ.

బాపూజీ రంగా నీవు ఒక పల్లెటూరికి చెందిన వాడవన్నమాట. బాగున్నది. నా అర్థ శాస్త్రవేత్త గ్రామస్థుడై వుండటం కూడా నాకు మరింత ఆనందదాయకం.

రంగాజీ బాపూ! నేను గ్రామస్థుడనే కాదు ఒక రైతును కూడా

బాపూజీ భలే బాగుంది! మంచి వార్త విన్నాను నా ఆక్స్‌ఫర్డ్ యోధుడు గ్రామస్తుడే కాక, ఒక రైతు కూడానా ?

౧౯౨౯ నాటి నిడుబ్రోలులో తమ సొంత ఇంట సతీమణి భారతిదేవి, తల్లిమంగమ్మ, సోదరులు తదితర బంధుగణం, అశేష ప్రజల మధ్య జరిగిన సంభాషణ పైన చెప్పుకున్నాం. ఆ తరువాత కాలంలో ౧౯౩౦-౩౧ సం..ల మధ్య వెంకటగిరి జమిందారీ పోరాటంలో పాల్గొనడం దానికి నాయకత్వం వహించడం, నెల్లూరి వెంకట్రామానాయుడు సంపాదకులుగా "జమీన్‌రైతు" అనే పత్రికను స్థాపించడం జరిగింది. జమీందారి రైతుల పోరాటంలో పాల్గొన్న రంగాజీకి ఇక ఉద్యోగం చేస్తూ ప్రజలను సేవించడం ఈరెండూ ఒకేసారి జరగడం సాధ్యంకాదు. ఉద్యోగమైనా చేయాలి, రాజకీయాలలోనైనా ప్రవేశించాలి. అని తీవ్రంగా ఆలోచించారు భారతిదేవితో సంప్రదించారు. ఆమె మీ ఇష్టం, మీరేది నిర్ణయించుకున్న నేను మీతోనే వుంటానన్నారు. ఆమెను వెంటనే పచ్చయప్ప కాలేజి యజమాన్యానికి ప్రొఫెసర్ ఉద్యోగమునకు రాజీనామా సమర్పించారు. ఆమోదించారు

ఒక మంచి శుభముహూర్తం చూచుకుని సామానులు సర్దుకుని నిడుబ్రోలు చేరుకున్నారు. ఇచట మీకొక ఆసక్తికరమైన విషయమేకాక, సంభ్రమాశ్చర్యాలు గొలిపే ఒక విశేషమైన త్యాగమయ జీవిత యాత్రలో ఒక ప్రముఖ ఘట్టాన్ని వివరించాలి అదేమంటారా ? అంతకు ముందు సంవత్సరమే రంగాజీ తన ఇరువురు సోదరులూ విభాగాలయ్యారు. ఆస్తుల పంపకంలో భూమి విషయం అలా వుంచి తమ పూర్వీకులు కట్టించిన పెద్ద రెండంతస్థుల భవనం సోదరులకిచ్చారు రంగాజి. తనవాటాగా ఊరికి దూరంగా పొలాలలోని తమ పశువుల కొష్టంను ఆయన తీసుకున్నారు. రైలు దిగుతూనే సామానులతో ఆ కొష్టానికే వెళ్లారు. అది పేరుకు పశువుల కొష్టం అయినా మేలురకం కలపతో నిర్మించిన పెంకుల ఇల్లు దానికి "గోభూమి" గా

నామకరణం చేశారు దానిని భారతీదేవిగారు ఇక నెలరోజులలో తాను లండన్‌లో రస్కిన్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చదివిన అనుభవాలు ప్రాతిపదికగా చిత్రవిచిత్రంగా ఒక సుందర చిత్రకళామందిరంగా రూపకల్పన చేశారు. అదే నాటికి, నేటికీ రంగాజీ నివాస భవనం. అదే పవిత్ర గోభూమి ఆ గృహాన్నే దర్శించి పావనం చేశారు జయప్రకాష్ నారాయణ, నేతాజీ సుభాష్ చంద్రబోస్, రాజాజీ, కమలాదేవి, చటోపాధ్యాయ మరెందరో జాతీయ నాయకులు. ౧౯౯౫ జూన్ ౮ వతేది తన ౯౫ వ సంవత్సరంలో స్వర్గారోహణ చేసేంత వరకూ రంగాజీ నివాసం ఆ పవిత్ర గోభూమియే. అదే ఆయన విశిష్టత. అరవైయేళ్ళ పార్లమెంటు మెంబరుగా వున్న ఢిల్లీలో నివాస ముండాలనుకోలేదు హైదరాబాదులో కాపురం పెట్టాలనుకోలేదు అదే గాంధీజీ సహచర్యం యొక్క ప్రభావం. ఆయన ౧౯౯౩ లో హైదరాబాదులో కాలుజారి తుంటి ఎముక విరిగి అస్వస్థులు కావడానికి ముందు "గ్రామీణ భారతం" దాని స్వరూప స్వభావాలు ఆర్థిక-సాంఘిక-సామాజిక స్థితిగతులెలా వుండాలో ఒక గ్రంథం రూపొందించాలనుకున్నారు ఆయన మనస్సులో గ్రామీణ భారతంపై రూపు దాల్చిన విషయాలు ప్రణాళిక బద్ధంగా రోజుల తరబడి నాకు పాఠాలుగా చెప్పారు అందుకే "గ్రామీణ భారతం" అనే ముకుటంతో ఒక గ్రంథం రచించాలని సంకల్పించి, అందుకొక ప్రణాళికను స్థిరపరచి దానిని ప్రచురించి ప్రజలముందుంచాను కూడా రంగాజీ కలలు కన్న "గ్రామీణ భారతం" రచన ఎంతవరకు సాధించగలనో కాలమే నిర్ణయిస్తుంది

## సంస్థానాల్లో ప్రజోద్యమాలు : రంగాజీ

ఇంతవరకూ రైతులు, వ్యవసాయ కార్మికుల చేనేత మున్నగు చేతి వృత్తుల మొత్తంగా అశేషంగా వున్న గ్రామీణ జనాల సమస్యలపై వారు సంఘాలు స్థాపించి, ప్రజోద్యమాలు స్థాపించి, ప్రజల్లో చైతన్యాన్ని రేకెత్తించి అలా ఉవ్వెత్తున లేచిన ప్రజా చైతన్యాన్ని జాతీయ స్వాతంత్రోద్యమ సమరంలో పోరాటాలు సాగించేందుకు దోహదం చేశారు రంగాజి అలానే జమిందారీ, జాగీర్దారీ, ఇనాందారి, మోఖాసదారి విధానాల నిరంకుశ, కర్కశ, పాశవిక దారుణమైన అణచివేత కార్యక్రమంపై ౧౯౩౦ వెంకటగిరిలో ప్రారంభించిన ఉద్యమాన్ని దేశవ్యాప్తంగా పరివ్యాపితం చేసి, వారిలో చైతన్యాన్ని కలిగించారు. వీరిని జాతీయ కాంగ్రెస్ స్వాతంత్ర్య పోరాట పథంలో భాగస్వాముల్ని చేశారు.

గుజరాతులోని బార్డోలి, బీహార్‌లోని చాంప్రాన్, ఆంధ్రలోని పెదనందిపాడు, దుద్దుకూరు, పలనాడులలో ఆ 1921 లోనే మహాత్మాగాంధీ నాయకత్వంలో సాగిన పన్నుల నిరాకరణోద్యమం, అడవి పుల్లరి వ్యతిరేకోద్యమం, సహాయ నిరాకరణోద్యమం మున్నగు సామూహిక మహోద్యమాలకు సాటిగా, అంత కంటే మేటిగా అనేక ప్రజోద్యమాలు నడిపారనే సంతృప్తి బాపూజీకి కలిగింది. ఇదంతా 1925లో మొదటి కలయిక, 1936, 1937 వరకూ గాంధీజీ తో సాగిన చర్చలు, సంభాషణలలో సంతృప్తిని వ్యక్తం చేశారు. ఎందరెన్ని రకాలుగా రంగా సాగించిన ఉద్యమాలకు, పోరాటాలకు, అడ్డంకులు, అవరోధాలు కల్పించినా, ఆయనను ఎన్ని రకాలుగా తెగనాడినా అన్నింటికంటే మించి పండిట్ నెహ్రూ, సర్దార్ వల్లభాయ్ పటేల్ లాంటి మహానాయకులే రంగాజీ కార్యసరళి పట్ల, చర్యలపట్ల అసంతృప్తులై ఉన్నా ఒక్క గాంధీగారి అభిమానం, ప్రేమ, గౌరవాలు ఆదరణా ఆయనకు అందుతూ వుండటం దానికాయన దైవకృపగా, వరప్రసాదంగా భావించుతూ సంతృప్తి పొందుతున్నారు. 1930లో కేంద్రశాసన సభకు జరిగిన బై ఎలక్షన్‌లో ఎన్నుకోబడటం, తిరిగి 1934లో ఎన్నుకోబడటం ఆనాటి కాంగ్రెస్ వాదులలో దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు గార్ల అభిమానంతో, అండదండలతో నాకు లభించిందనే తృప్తి నాకున్నది. వీరాభిమానం నాకు లభించడా బాపూజీ ఆశీర్వాదబలమే

1938లో ఒకమారు తలవని తలంపుగా బాపూజీని కలిసాను. నా రాకను ముందే ఊహించారా అన్నట్లుగా ఆయన నా పట్ల చూపిన శ్రద్ధ, అభిమానం, ఆయన చూపుల్లో నాకర్థమయ్యాయి. ఇప్పుడు నాకు నీ అవసరం కలిగింది రంగా. నా మనస్సులో ఉన్న నీ అవసరం విద్యుత్‌శ్శక్తివలే నీలో ప్రసరించిందా అన్నట్లు నీ ఆగమనం తోవస్తుంది. బాపూ రంగాను తదేక దీక్షతో చూస్తూ కొన్ని స్వదేశీ సంస్థానాలలో రైతుల బాధలు జమిందారీ, జాగీర్దారీ, ఇనాందారీ రైతుల బాధలకంటే అనేక రెట్లు హెచ్చుగా వున్నాయని, వాటి విషయంలో మనమేదయినా పరిష్కార మార్గం ఆలోచించకపోతే మరణమే గతి అని పలుమార్లు చెప్పావుగదా ? అందుకే ఇప్పుడు నీ అవసరం కావలసి వచ్చింది. హైదరాబాద్, బికనీర్, అల్వార్, రాజస్థాన్, తిరువాన్‌కూర్,

ఒరిస్సాలలోని సంస్థానాలలో ఒకమారు పర్యటించి వారి స్థితిగతులపై ఒక పత్రం తయారు చేయాలని చెప్పారు రంగాజీ అప్పడే బికనీరుకు సంబంధించిన ప్రముఖ న్యాయవాది గాంధేయవాది శ్రీ శరాఫ్ అనే ఆయన సహాయంతో రాజస్థాన్‌లోని అనేక సంస్థానాలలో రైతుల సాంఘిక, ఆర్థిక రాజకీయ పరిస్థితులను గూర్చి సర్వే చేస్తున్నాడని గాంధీజీకి తెలుసు. ఇప్పడు నన్ను సంస్థానాలలో ఒరిస్సా సంస్థానాలలో పరిస్థితులెలా వున్నాయో, ఉద్యమాలు ఎలా వున్నాయో కూడ పరిశీలించి నివేదిక నందజేయాల్సిందిగా కోరారు అప్పటికే బాపూజి సన్నిహితులలో ప్రముఖులు, గాంధేయవాది థక్కర్ బాబాను కూడా ఇదే పనిమీద పురమాయించారు. ఆయన వేరుగా, రంగావేరుగా నెలల పర్యంతం విస్తృతంగా పర్యటించి వేలాదిమంది గ్రామీణ ప్రజలను కలుసుకుని వారి ఆనాటి స్థితిగతులపై సమగ్రమైన నివేదికను తయారుచేసి గాంధీజీకి సమర్పించారు

ఈ రెండు నివేదికలను ఒక దానితో ఒకటి సమన్వయ పరచి, తావిళ్ళు వేసి, గాంధీజీ పరిశీలించారు ఆశ్చర్యంగా వుందే రంగా, థక్కర్ బాబాల రిపోర్టులు రెండూ రాజకీయాలతో నిమిత్తం లేకుండా యదార్థానికి దగ్గరగా ఉన్నాయని రంగాను ప్రశంసించారు రంగాజీ ఇలా అన్నారు. బాపూజీ! నా పర్యటనలో సోషలిస్టు నాయకుడు యస్.యన్. ద్వివేది మరొక పర్యటనలో సారంగధరదాసు, మూడవ పర్యటనలో ఒరిస్సా ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు పవిత్రమోహన్ ప్రధాన్‌లతో కూడా కలుపుకొని తిరిగాను. ఆ నేపధ్యంలో గాంధీజీ, రంగాజీల మధ్య జరిగిన సంభాషణలోని కొన్ని ఆసక్తికరమైన విషయాలను ఇక్కడ పొందుపరుద్దాము.

బాపూజీ : సంస్థాన ప్రజలలో నీవుగావించిన ఈ పని చాలా నిర్మాణాత్మకమైనది. నీ నివేదిక రాజకీయాలతో నిమిత్తము లేని థక్కర్ బాబా నివేదికలాగా చక్కగా, యదార్థంగా వుంది. ఈ సంస్థానాధీశులు క్రూరకృత్యాలను జరపడం విషాదకరమైన విషయం వారు శ్రీరామునిపై బాస చేస్తారు వారిలో చాలా మంది శ్రీరామచంద్రుని వంశానికి చెందిన వారమని చెప్పకుంటారు. అయినా ఇలాంటి భయంకర కృత్యాలు సాగిస్తారు.

రంగాజీ వారలా చేయకపోతే బ్రిటీషువారు వారిని పదవీచ్యుతులును గావించుతారని భావించుతున్నారు

బాపూజీ ఇదంతా రైతుల దౌర్బల్యం అందుకే మీ లాంటి రైతు నాయకుల సేవా భాగ్యాలు వారికవసరం

రంగాజీ తమ నియంతృత్వాధికారాలను వదులుకోవటానికి సంస్థానాధిపతులింకా సిద్ధంగాలేరు తమకెంతో విధేయులుగా వుంటారనుకున్న ప్రజలు తమకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయడం వలన ఆ సంస్థానాధీశుల్లో కక్ష పెరిగింది ఇలాగ సాగింది వారిద్దరి మధ్య సంభాషణ. ఇదంతా పెద్ద సుదీర్ఘమైన చర్చ, దానినింతటితో ఆపడం మంచిది. మొత్తం మీద ఈ చర్చల పర్యవసానం ఏమిటంటే రంగాజీని బాపూ ప్రశంసలతో ముంచెత్తారు.

(మహాత్మాగాంధి రచించిన "ఇండియన్ స్టేట్సు" అనే గ్రంథంలో థక్కర్ బాబా రంగాజీల నివేదిక ఆధారంగా, వాటిని ఉదహరించారు. "హరిజన్" అనే పత్రికలో కూడా అనేక వ్యాసాలు వ్రాశారు).

హైదరాబాదు సంస్థాన ప్రజల కడగండ్లపై అనేక కథలు విన్న రంగాజీ సంస్థానంలో పర్యటించడానికి ప్రయత్నించారు అది తెలుసుకున్న నిజాం ప్రభుత్వం రంగాజీని తమ సంస్థానంలోనికి రాకూడదనే ఆంక్ష విధించారు. ఆ నిషేదం కారణంగా నిజాం సరిహద్దులలోని ఆంధ్రప్రాంతపు తునికిపాడనే గ్రామంలో 1938 లో రైతాంగ విద్యాలయం నడిపా రు ఆ విద్యాలయమునకు వచ్చిన వారిలో తెలంగాణాలో ప్రజానాయకులుగా ప్రసిద్ధి చెందిన శ్రీ రావి నారాయణరెడ్డి గారొకరు. ఆయనతోపాటు తెలంగాణాకు సంబంధించిన అనేకమంది కార్యకర్తలు కూడా వచ్చారు.

అలానే మైసూరు సరిహద్దులలోని టి.చదుము అనే గ్రామంలో కూడా ఒక పెద్ద రైతాంగ విద్యాలయం అనేకమంది కార్యకర్తలతో నడిపారు. దానిలో రంగాజీ సంస్థానాల ప్రజల సామూహిక ఉద్యమాల యొక్క అవసరాన్ని గురించి వివరించారు హైదరాబాదుకు, మైసూరుకు ఒక విశేషమైన బేధమున్నది మైసూరు మహారాజు ప్రజల ప్రేమను చూరగొన్న ప్రజారంజకు

డైనవాడు. అయినా అచటకూడా "విధురస్వధం" అనే గ్రామీణ ప్రాంతంలో రైతులపై కాల్పులు జరిపారు నిజాం అలాకాదు గదా బ్రిటీషు వారిని తలదన్నిన నిరంకుశ పాలకుడు అందువలన అచట ఆనాటి సంస్థాన ప్రజా ఉద్యమాలపై దారుణమైన హింసాకాండ జరుగుతుంది. అందుకనే సరిహద్దుల్లో తునికిపాడులో రైతాంగ విద్యాలయం నడపవలసి వచ్చింది

రంగాజీ నడుపుతున్న ప్రజా ఉద్యమాలపట్ల, నిర్వహిస్తున్న ప్రజా కార్యక్రమాల పట్ల, చేస్తున్న ప్రభోదాల పట్ల, నిర్వహిస్తున్న ప్రజా ఉద్యమాల పట్ల గాంధీజీకి గొప్ప అభిమానం గాంధీజీ ప్రోత్సాహమే లేకపోతే ఆయనెప్పుడో ఆనాడే కాంగ్రెస్ నుంచి బహిష్కరించబడటంగాని, ఆయనే తనంతట తాను కాంగ్రెస్‌తో సంబంధాలు తెగతెంపులు చేసుకుని "రాంరాం" చెప్పవలసివచ్చేది

ఈ శీర్షిక లేదా ఈ అధ్యాయం ఇంతటితో ముగిద్దాం గాంధీజీ, రంగాల మధ్య మరో మహత్తరమైన ఆసక్తికరమైన సంప్రదింపులు సాగాయి. చర్చలు కొనసాగాయి అది ఒక మహోన్నత ఘట్టంగా వివరించవచ్చు. కమ్యూనిస్టుల ఏకపక్ష కార్మిక నియంతృత్వ పాలనా సిద్ధాంతానికి వ్యతిరేకంగా లేదు ప్రత్యామ్నాయంగా రంగాజీ ప్రతిపాదించిన ప్రజాస్వామిక "కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్ " సిద్ధాంతానికి బాపూజీ ఆశీస్సులు, అది వేరుగా ప్రత్యేకమైన అధ్యాయంగా మీ ముందుంచే ప్రయత్నం చేస్తాము

## రంగాజీ - గాంధీజీతో ప్రథమ సమావేశం

1929-1930-1931-1932-1933 దాకా ఈ ఐదు సంవత్సరాలూ భారతదేశ జాతీయోద్యమ చరిత్రనొక మలుపు తిప్పాయి అంత కంటే మహాత్మాగాంధీ దక్షిణాఫ్రికాలో సాహసోపేతమైన మహోద్యమాలు సాగించి అనన్య సామాన్యమైన విజయాలు సాధించి ఆ విజయోత్సాహంతో 1915 దశకంలో ఎప్పుడైతే బొంబాయి రేవులో ఓడదిగి, దేశంలో ప్రవేశించారో ఆనాడే, మన జాతీయోద్యమానికి దశ తిరిగిందనవచ్చు జాతిలో చైతన్యం ఉవ్వెత్తున సముద్ర కెరటాల్లాగా లేచింది. అదే 1921 లో దేశ వ్యాప్తంగా సాగిన పన్నుల నిరాకరణోద్యమం, సహాయ నిరాకణోద్యమం, శాసనోల్లంఘనం. ఈ మూడూ కలిపితే బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా

భారతప్రజలు సాగించిన "మహోద్యమం" అనవచ్చును అది భారత యుద్ధము కంటే గొప్పదన్నా ఆశ్చర్యము లేదు మరో వ్యాస మహర్షి గనుక జన్మించి వుంటే మరో కలియుగ, "ఆధునిక మహాభారతాన్ని" రచించేవారేనేమో. దానినే "రామ రావణ" యుద్ధంగా పోల్చితే మరో వాల్మీకి మహర్షి మరో భారత స్వాతంత్ర్య సమర చరిత్రను రామాయణంను రచించి వుండేవారు ఆ పోరాట విజయాలతో, నూతన స్ఫూర్తితో, నూతనోత్తేజంతో జాతికి కొత్త నాయకత్వం లభించింది అందులో సర్దార్ వల్లభాయ్ పటేల్, బాబూ రాజేంద్రప్రసాద్ ప్రధమ గణ్యులు ఆ కోవకే చెందినవాడు ఆచార్య రంగా 1929-1930 నాటికే ప్రజానాయకుడుగా ఎదుగుతూ వున్నారు. ఆచార్య రంగాజీది ఒక విశిష్టమైన వ్యక్తిత్వం విలక్షణమైన జీవన విధానం. కాంగ్రెస్ నాయకత్వానికంటే భిన్నమైన నాయకుడు రంగా. ఆయన స్వాతంత్ర్యద్యమంతో పాటు, రైతు ఉద్యమాన్ని, పారిశ్రామిక, వ్యవసాయ కార్మిక చేనేత కార్మిక సంఘాలు మరెన్నో వర్గ సంఘాలను సృష్టించి వారి సమస్యలపై పోరాటాన్ని సాగించటం ప్రారంభించారు అలా ఒక విలక్షణమైన ఒక నాయకుడుగా, రాజకీయ రంగంలో ప్రవేశించి జాతీయ నాయకుడుగా పెంపొందుచున్న సమయమిది.

ఇదే సమయంలో 1929-30ల మధ్య వెంకటగిరి జమిందారీలో రైతుల హక్కుల్ని హరించే, వారి వ్యక్తిత్వాలను కించపరచే, సామాన్య ప్రజలను బాధించే అనేక చర్యలు సాగించారు. జమిందారీ ప్రజలు, జమిందారుల అక్రమ పాలనపై నిరసనను ప్రారంభించారు. ఈ జమిందారులు వారిని వేధించటం కూడా ప్రారంభించారు. అప్పుడే ఒక వీరనారీమణి-రైతు బిడ్డ కనకమ్మ పోరాట పధంలో ముందుకు సాగింది. జమిందారీ దుష్టపాలకుల దౌర్జన్యానికి వ్యతిరేకంగా కత్తికట్టింది తన పశువులను బందెల దొడ్లకు తోలుకెళుతున్న జమిందారీ దుష్టయంత్రాంగాన్ని అడ్డుకుని పారద్రోలి ఇళ్ళకు మరల్చింది. అదొక ఉత్తర గోగ్రహణ సమరంలాగా ఆరోజుల్లో ప్రజలు చెప్పకుంటుండేవారు జమిందారుల దౌష్ట్యాలు మరింతగా పెచ్చుపెరిగాయి. కనకమ్మగారికి తోడుగా నెల్లూరు వెంకట్రామనాయుడు, బద్దెపూడి నారాయణ రెడ్డి, ప్రభృతులు అండగా రంగంలో దిగారు. ఉద్యమం ఊపందుకుంది. జమిందారీ పాలకుల మధ్య, రైతుల మధ్య రోజుకొక రణరంగం సాగుతుంది. కనకమ్మా, వెంకట్రామానాయుడు, నారాయణరెడ్డి ఒకచోట సమావేశమై

ఆలోచించారు ఆచార్య రంగా మద్రాసు ప్రభుత్వ లీసెటిల్‌మెంట్ సభ్యుడుగా, ప్రభుత్వ సలహాదారుగా ఆంధ్రా అంతా పర్యటిస్తున్నారు. ఆ రెండు నెలల క్రితమే నెల్లూరులో జరిగిన ఒక సభలో రైతుల కష్టాలు, నష్టాలు, బాధలను ఉద్రేకంగా వివరించి, సమస్యలకు పరిష్కార మార్గాన్ని కూడా సూచించి యున్నారు ఆయన నొకసారి కలసి మన కష్టగాధలు చెప్పకుంటే తప్పక మనకండగా నిలుస్తారు సహాయం చేస్తారు అని నిర్ణయించి మరునాడే మద్రాసు చేరుకుని ఆయనను సంప్రదించారు (ఆ సంప్రదింపులలో జరిగిన చర్చల సారాంశాం కృష్ణరాయబారంగా, సంజయ రాయ బారంగా అభివర్ణిస్తూ, అనేక రచనలు ఆ రోజుల్లోనే "ఆంధ్రపత్రిక" దిన పత్రిక, చిత్రగుప్త, ప్రజాబంధు వంటి పత్రికల్లో వెలువడ్డాయి. (ముందు ముందు వేరే శీర్షికల్లో వివరిస్తా) అంగీకరించారు రంగాజీ వెంకటగిరి రావటానికి, జమిందారు రైతులనాదుకోవటానికి అంగీకరించి పదండి. సభ నేర్పాటు చేసుకుందాము. వస్తా అంటూ ప్రక్కనే కూర్చుని మౌనంగా విషయాన్నంతా వింటున్న శ్రీమతి భారతీదేవిని చూచి ఏవమ్మా భారతీదేవిగారూ విన్నావు కదా కథంతా. మీరు కూడా రావాలి నావెంట ఏం నాయుడుగారూ సరేనా అంటుండగానే నాయుడుగారు ఒక్క ఉదుటున లేచి నిలబడి, నరకాసుర సంహారములో శ్రీకృష్ణ పరమాత్మకు సారథిగా వచ్చిన సత్యభామవలె మీరు రావటం చాలామంచిది అన్నారు అంగీకరించిందామె తేదీ నిర్ణయించారు కోట బురుజులకెదురుగానే సభావేదిక స్వాతంత్ర్య సమరయోధులూ, వెంకటగిరి జమిందారుల బంధువులు అయిన కటికనేనివారింట విడిది. సభ ప్రారంభం, భారతీదేవి ప్రసంగం, రాళ్ళ వర్షం కురవడం, రక్తం చిందించటం ఇచ్చట జరిగిన కథంతా వేరే శీర్షికలో చెప్పటం జరిగింది

ఇదే ఆచార్య రంగా రాజకీయ రంగ ప్రవేశానికి నాంది పలికిందన వచ్చు. వెంకటగిరి నుండి సభను జయప్రదంగా నిర్వహించి విజయకేతనాన్ని ఎగురవేసి జమిందారుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించి, దడపుట్టించి, హో,హో కారాలు రేకెత్తించి మద్రాసు చేరారు రంగా దంపతులు. పరిస్థితులను పూర్వాపరాలను గురించి చర్చించుకున్నారు భార్యాభర్తలు రాజకీయ రంగ ప్రవేశానికి తరుణం ఆసన్నమైంది ఒక్క తృటి సమయాన్నైనా ఆలశ్యం చెయ్యకూడదు ఏమంటారు మీరు మీ యిష్టం అన్నది భారతీదేవి మరునాడే

పచ్చయప్పా కాలేజి ఎకనామిక్స్ ప్రొఫెసరుగా ఉద్యోగానికి రాజీనామా చేశారు ఒక వారం దాటకుండానే తట్టా, బుట్టా - పెట్టాబేడా సర్దుకుని గ్రంథాలు బంగీలో కట్టి రైలులో నిడుబ్రోలు చేరారు

ఇక ఇక్కడ నిడుబ్రోలు విషయం ఇదొక అగమ్యగోచరంగా వుంది లోగడనే అన్నదమ్ముల మధ్య విభాగాలు జరిగాయి. పొలము, పుట్రా పంచుకున్నారు ఉమ్మడి కుటుంబములో ఉన్న పెద్ద మేడ తమ్ముళ్ళ భాగంలో పోయింది రంగాజీ భాగం ఊరి వెలుపల దూరంగా ఉన్న పశువుల కొష్టం (పెంకులది) వచ్చింది దానినే భారతీదేవిగారు కొందరు నౌకరుల సహాయంతో నివాసయోగ్యంగా తీర్చిదిద్దుకున్నారు ఆనాడే దానిని "గోభూమి" గా నామకరణం చేశారు ఆ గోభూమియే మహాత్మాగాంధీ, సుభాష్ చంద్రబోసు, జయప్రకాష్ నారాయణ్, బాబూ రాజేంద్రప్రసాద్ మున్నగు అతిరధ మహారథులందరికీ దర్శనీయ క్షేత్రంగా వెలుగొందింది. ప్రతియేటా వందలాది రైతు, కూలి, చేతివృత్తుల, గ్రామీణ శ్రామిక కార్యకర్తల శిక్షణ కేంద్రంగా పెంపొందుతూ వచ్చింది అటుతరువాత 'రామానీడు విద్యాలయం' రైతులకు శిక్షణ శిబిరంగా మారింది. అది అనేక ఉద్యమాలకు పుట్టినిల్లయింది ఈ గోభూమిలోనే రైతుల పత్రికకు 'వాహిని' గా నామకరణం జరిగింది పాటలు, గేయాలు, పద్యాల రచనతో గూడిన గ్రంధానికి (రైతు భజనావళిగా) నామకరణం జరిగింది ఇచ్ఛాపురము నుండి సాగిన రైతుశిక్షణ యాత్రకు ఇచటనే పునాదులు వేయబడ్డాయి మార్గదర్శక సూత్రాలను రూపొందించారు

వెంకటగిరి జమిందారీ పోరాటంతో జమిందారీ ఉద్యమం ఆగిపోలేదు చల్లపల్లి, మునగాల, మందసా, జమిందారీ ఉద్యమాలు కూడా సాగాయి. ఒక్కమాటలో చెప్పాలంటే, అఖిలభారతస్థాయిలో జమిందారీ రద్దు ప్రాతిపదికగా ఒక సంస్థను స్థాపించటం జరిగింది. ఈ ఉద్యమల ప్రభావంగానే 1937-39ల మధ్య కాలంలో ఏర్పడిన రాజగోపాలాచారి ప్రధానిగా మద్రాసు ప్రభుత్వం జమిందారీ రద్దుచట్టాన్ని ఆమోదించటానికి దోహదం చేసిందనవచ్చు వెంకటగిరి జమిందారీ పోరాటమే ఒక మహాభారత పోరాటంలా జరిగిందనుకుంటే ఉత్తరాంధ్రలో 'మందసా జమిందారీ' అనే

పాణికా కనకమ్మ, నెల్లూరి వెంకట్రామానాయుడుగారు పాత్రధారులయితే, పోరాట మహావీరులైతే, సేనానులైతే, మందసా జమిందారీ వ్యతిరేక పోరాటంలో పుల్లెల శ్యాంబాబు, సర్దార్ గౌతులచ్చన్నలు పోరాట వీరాగ్రేసులైనారు ఆ పోరాటంలో ఒక రైతు యువతి వీరవనితగా మారి జమిందారీ ఆకతాయి నౌకర్లతో పోరాటాలు చేసి పోలీసుల తుపాకీ గుండ్లకు బలయింది ఆమె నాటికీ, నేటికీ "వీరగున్నమ్మ" గా ప్రసిద్ధి చెందింది ఇచట ఒక ఆసక్తికరమైన పరిణామం జరిగింది మందసా పోరాటంలో వీరగున్నమ్మ మరణవార్త విని రంగాజీ మద్రాసుమెయిలులో మందసా బయలుదేరుతుండగా మద్రాసు ప్రభుత్వం రంగాజీకి ఇన్‌టర్న్‌మెంట్ ఆర్డరు జారీచేసింది ఇన్‌టర్న్‌మెంటు ఆర్డరు అంటే తెలుసు కదా. ఉన్నచోటు నుండి అడుగు ముందుకు వేయకూడదు అది ఒక జైలు శిక్ష కంటే ప్రమాదమైనది

నిడుబ్రోలులో నివాసముంటున్న శ్రీమతి భారతీదేవికి రంగాజీ ఇన్‌టర్న్‌మెంట్ విషయం తెలిసింది ఒక్క నిముషం కూడా ఆలోచించకుండా, రంగాజ్ మద్రాసులో బయలుదేరిన మెయిలులోనే మందసా పయనం కట్టింది శ్యాంబాబుకు టెలిగ్రామ్ కొట్టింది శ్రీకాకుళంలో భారతీదేవికి వీరోచిత స్వాగతం లభించింది ఈలోగా శ్యాంబాబు, లచ్చన్న, కిల్లప్పల నాయుడూ, మున్నగు రైతు నాయకులకు వారెంట్లు తయారయ్యాయని తెలసింది ఇంకేముంది ఆ వార్త కర్ణాకర్ణిగా విన్న ఈ ముగ్గురు నాయకులూ అండర్‌గ్రౌండ్‌కు వెళ్ళిపోయారు భారతీదేవి వస్తుంది. ఆమెకెవరు అండగా వుంటారు? వంటరిగా ఆమె ఎక్కడికి వెళుతుంది? ఆమె నిస్సహాయురాలుగా ఏదో ఒక యింట పడిగాపులు కాయవలసిందే అనుకుంది ప్రభుత్వం

జడివాన కురిసి వెలిస్తే పుట్టలు పగిలి లక్షల కొలది ఉనిళ్ళు పైకెగిసినట్లు ఎక్కడికక్కడే వేలాది మంది ప్రజలు భారతీదేవికి స్వాగతం పలికి వెన్నంటి నడిచారు ప్రభుత్వానికి దిక్కుతోచలేదు ఆమెకేదయినా పొరపాటుగా ప్రమాదం జరిగితే ప్రజలు తిరుగుబాటు చేస్తారు. అందుకని పోలీసు వలయం ఆమెకు రక్షణగా నిలిచింది ఈ వార్తలు మద్రాసు ఢిల్లీలు దాకా ప్రసారమయ్యాయి దేశ వ్యాప్తంగా జమిందారీ వ్యతిరేక పోరాటాలు వెల్లువలా సాగాయి.

ఇచట ఈ నేపథ్యములో ఒక విశేషమైన పరిణామం జాతీయ నాయకత్వంలో ప్రారంభమైనది కాంగ్రెస్ యొక్క అనుమతిగాని, ప్రోత్సాహంగాని ఏదీలేకుండా రంగాజీ ఒంటరిగా, ఒంటెత్తుపోకడగా సాగిస్తున్నారీ ఉద్యమాలు ఇది కాంగ్రెస్‌కి పెద్ద నష్టం దేశవ్యాప్తంగా వేల సంఖ్యగా వున్న జమిందారులలో హెచ్చుగా కనీసం నూటికి ఎనభై మందిదాకా, కాంగ్రెస్ అభిమానేలే కాంగ్రెస్‌ను బలపరుస్తున్నవారే జాతీయోద్యమానికి అండగా నిలబడినవారే మరి అయినప్పుడు రంగాజీ చేసే ఈ ఉద్యమం జాతీయోద్యమానికి నష్టం కలిగించదా ! ఇది మంచిపనేనా ? రంగాజీ జమిందారులపై సాగిస్తున్న దుందుడుకు చర్యలను జాతీయోద్యమం పేరిట సాగిస్తుంటే కాంగ్రెస్ బ్రతికి బట్టకడుతుందా ? అనే ప్రశ్నలు వేయసాగారు. ఇవి చాడీలుగా మోసుకెళ్ళి గాంధీజీకి అందించారు అంతటితో ఆగలేదు. కాంగ్రెస్ హైకమాండులో ఉన్న అందరికీ చేరవేశారు

మహాత్మాగాంధీ రంగాజీకి కబురుపంపి పిలిపించుకున్నారు ఏమిటీ ఉద్యమం. ఎవరి ప్రోత్సాహంతో, ఎవరి అండతో సాగిస్తున్నారు ? కాంగ్రెస్ నాయకత్వానికి మాట మాత్రంగానైనా ఎరుకపరచవలసిన పనిలేదా? అని ప్రశ్నల పరంపర కురిపించారు రంగాజీ వెంకటగిరి, మునగాల, మందస జమిందారీల దౌర్జన్యకాండలను, వీరగున్నమ్మ మరణవార్తను భారతీదేవిపై వెంకటగిరిలో జరిపిన దౌర్జన్యకాండలను గాంధీజీకి వివరించి చెప్పారు అన్నింటికంటే మించి అసలీ జమిందారు లెవరు ? ఎలా వచ్చారు ? జమిందారీ విధానం యొక్క ప్రాతిపదికలేమిటి ? వీరు కేవలం ప్రభుత్వానికి శిస్తులు వసూలు చేసిపెట్టే కమీషన్ ఏజంట్లు మాత్రమే కాదా ? జమిందారులకు భూమిపై జిరాయితీ హక్కులేదే ? అడవులలో పశువులను మేపుకునే రైతులను నిరోధించి, నిర్బంధించే హక్కు వీరికెవరిచ్చారు ? ఇలాగా సాగింది రంగాజీ, మహాత్మాగాంధీల మధ్య సంభాషణ రంగాజీవాదనే సబబుగా వుంది. జమిందారీలతో పోరాటం సబబే ఇందులో రంగాజీ తప్పేమీ లేదు. అయితే దీనిని శాంతిభద్రతల సమస్యగా మారనీయకుండా చూడాలి. ఉద్యమం అహింసాయుతంగా సాగాలి అని సలహా ఇచ్చారు

## "జమీన్ రైతు" పత్రిక స్థాపన

జమిందారీ ఉద్యమానికి పోరాట చరిత్రను సమగ్రంగా ప్రచురించి ప్రజలకు పంచి పెట్టటం ద్వారా వారిలో ఒక ఉత్సాహాన్ని రేకెత్తించాలి ప్రోత్సాహాన్ని కలిగించాలి అందుకొక ప్రచార సాధనం కావాలి అది వారం వారం ప్రచురించబడాలి. దానికి డిక్లరేషన్ వేయాలి ఆ పత్రికకు పేరు "జమీన్ రైతు" అని నిర్ణయించారు దాని సంపాదకుడుగా వెంకట్రామానాయుడు గారిని ఎన్నిక చేశారు అది నెల్లూరు నుండి ప్రచురించబడాలన్న నిర్ణయం కూడా చేశారు ఇదంతా చెకచెకా జరిగింది. 1930లో ప్రచురణ ప్రారంభించిన జమీన్‌రైతు పత్రిక నిరంతరం నిర్విరామంగా సాగి మొన్నటి 1990లో 60 సంవత్సరాల ఉత్సవాన్ని జరుపుకున్నది. అది జరిగి పద్దైదేళ్ళు కూడా అయింది. 1934లో జరిగిన కేంద్ర శాసనసభ ఎన్నికలలో వెంకట్రామానాయుడుగారు రచించిన ఎన్నికల గేయాలు బహుళ ప్రచారం నొందినాయి నాటికీ-నేటికీ వెంకట్రామానాయుడుగారు రచించిన ఆనాటి గేయాలు బహుళ సంఖ్యాకుల ప్రశంసల నందుకుంటూనే వున్నవి. రంగా-రామయ్యల మధ్య జరిగిన ఎన్నికల పోరుకు తెరవెనుక దొంగలుగా కాంగ్రెస్ వారు అనేకమంది కుట్రలు చేస్తుండగా వెంకట్రామానాయుడుగారు ఒక పాట వ్రాశారు. ఆపాటలో ఉప్పు సత్యాగ్రహపు రోజుల్లో సత్యాగ్రహులపై పోలీసులు జరిపిన లాఠీ చార్జిని బలపర్చిన రామయ్యకు ఓటేస్తారా ? అని యీసడించుతూ వ్రాసిన ఈ పాట చూడండి.

| | |
|---|---|
| లాఠీ చార్జీ రామయ్యా | కాస్త బోర్డు ఆశిస్తివి ॥లా॥ |
| లాభం లేదిక పోవయ్యా | రైతు బిడ్డనని వాకొంటావా? |
| రంగకు పోటీ ఢీకొంటావా ? | రైతు సేవకు రాకుంటావా ? ॥లా॥ |
| రంగులు మాటికి మాటికి మారుస్తావా? ॥లా॥ | ప్రజలకు చేసే సేవే లేదు |
| రాజభక్తుల సభన్ చేస్తివి | ప్రజలకు నీపై కన్నేరాదు ॥లా॥ |
| రావుబహద్దూర్‌బిరుదన్‌దీస్తివి ॥లా॥ | బొబ్బిలి మాటకు దాసుడవైతివి |
| కమ్మ సంఘపు పరువు దీస్తివి | బెబ్బులి లాగున ప్రజలను చూస్తివి. |

ఇలాగ సాగినవి వెంకట్రామానాయుడుగారి రచనలు అలా ఒకటా రెండా ? వందలు, వందలలో సాగాయి గేయ రచనలు.

జమిందారీ వ్యతిరేక పోరాటకాలంలో అనేకమంది జాతీయకవులు అనేకములైన రచనలు సాగించారు ఆ రచనల ద్వారా విప్లవ జ్వాలలను

రేకెత్తించారు అలా రచనలు చేసిన వారిలో గరిమెళ్ళ సత్యనారాయణ గారొకరు శెట్టిపల్లి, వెంకట్రామానాయుడుగారు ప్రముఖులు ఇలా జాతీయోద్యమానికి ప్రోత్సాహంగా, జమిందారు రైతు ఉద్యమాన్ని బలపరచే రచనలను అనేకంగా వచ్చాయనుకున్నాము గదా. వీటిల్లో కొన్నింటిని ఏర్చికూర్చి రైతు భజనావళిగా నామకరణం చేసి ప్రచురించిన గ్రంథం । ౭ ఎడిషన్స్ వచ్చాయంటే ఆశ్చర్యం కలుగుతుంది ఆంధ్రదేశంలో జమిందారీ ఉద్యమం రథసారధులుగా శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి, పల్లెల శ్యాంబాబు, నెల్లూరు వెంకట్రామానాయుడు, పొణకా కనకమ్మ, బద్దెంపూడి వెంకటనారాయణరెడ్డి, సర్దార్ గౌతు లచ్చన్న, గొట్టిపాటి బ్రహ్మయ్య, నాగినేని వెంకయ్య, గూడవల్లి రామబ్రహ్మం ఆయన నిర్మించిన "రైతుబిడ్డ" జమిందారీ వ్యతిరేకపోరాటం ఆధారంగా వచ్చిన సినిమా. అందర్ని గురించి ఆచార్య రంగాగారు తన అద్భుత శైలిలో వారి జీవిత చరిత్రలను రచించి ప్రచురించారు. అవి ఒక్కమారు చదవగలిగితే ఆనాటి జమిందారీ వ్యతిరేక పోరాట చరిత్ర, అందులో పాల్గొన్నవారి సాహసోపేతమైన వీరోచిత పోరాట చరిత్ర కళ్ళకు కట్టినట్లుగా కన్పిస్తుంది (ఈరచనలపట్ల ఆసక్తి ఉన్నవారు "నా స్మృతులలోని ప్రముఖులు " అన్న మకుటంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురించిన ఆచార్య రంగా బృహత్ గ్రంధాన్ని ఒకసారి చదవండి. మీకే అర్థం అవుతుంది)

**కమ్యూనిజాన్ని కాదు రంగా ఎదిరించింది వారి ఏకపక్ష కార్మిక నియంతృత్వాన్ని, రైతు, కూలి, చేతివృత్తుల శ్రామికజనాలపట్ల విచక్షణ.**

ఆచార్య రంగాజీ బహుముఖ ప్రజ్ఞాశాలి మహోన్నత వ్యక్తి. మానవతా వాది. స్థితప్రజ్ఞుడు త్యాగధనుడు, అన్నింటికీ మించి నూటికి నూరుపాళ్ళు ప్రజాస్వామ్యవాది. భిన్నాభిప్రాయం ఉన్నా ఎదుటి పక్షాన్ని గౌరవించే సహనశీలి. ఒక విషయంపై చర్చసాగుతుండగా తనవాదం తప్పని తేలినపుడు మీనమేషాలు లెక్క పెట్టకుండా ఎదురు పక్షవాదాన్ని ప్రశంసించే - బలపరిచే-

ఆమోదించే ఉత్తమ ప్రజాస్వామ్యవాది ఆయన ఒక విలక్షణమైన వ్యక్తి విశిష్టమైన వ్యక్తి కూడా ఈ సందర్భంగా ఆయన విశిష్ట వ్యక్తిత్వాన్ని చాటే ఒక సంఘటన మీ ముందుంచుతా

అది 1993 సెప్టెంబరు 23వ తేది ఆచార్య రంగాజీ ధర్మపత్ని, స్వాతంత్ర్య సమరయోధురాలు, ఆదర్శ మహిళ శ్రీమతి భారతీదేవి రంగా వర్ధంతి సభ సభాస్థలి నిడుబ్రోలు రంగాజీ నేతృత్వంలోనే సభ జరిగింది రంగాజీ అస్వస్థకు గురై మంచములోనే విశ్రాంతి తీసుకుంటున్నారు.

వర్ధంతి సభకు రంగా దంపతులకు అత్యంత ప్రేమపాత్రుడూ, గాంధేయవాది, ప్రముఖ రచయిత మాజీ పార్లమెంటు సభ్యుడు, స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ పి రాజగోపాలనాయుడు అధ్యక్షత వహించారు సభలో చేనేత కార్మికుల నాయకుడు, రంగాజీ ప్రియశిష్యుడు, పార్లమెంటు సభ్యుడు శ్రీ ప్రగడ కోటయ్య, రంగాజీ సిద్ధాంత, ప్రవచనాలను రచనలు చేస్తూ ఉన్న వారి శిష్యులు, న్యాయవాది శ్రీ పసుపులేటి కోటేశ్వరరావు, నేను, ప్రసంగించిన వారిలో ఉన్నాము. ప్రసంగాలు సోవియట్ యూనియన్‌లో ప్రభుత్వం అనుసరిస్తున్న ఏకపక్ష కార్మిక నియంతృత్వం అందుకు భిన్నంగా ప్రత్యామ్నాయంగా ఆచార్య రంగా యాభైయేళ్ళనాడు ప్రతిపాదించిన ప్రజాస్వామిక "కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్" సిద్ధాంతాల పరిశీలన ప్రక్రియ సాగా ఋ మార్క్స్ ప్రతిపాదించిన మార్క్సిజంలో సమానత్వం పట్ల రంగాజీ సమ్మోహితులయ్యారు దాంతో లండనులో చదువులు సాగించే రోజుల నుండి ప్రారంభించి భారతదేశంలో రాజకీయాలలోకి ప్రవేశించిన 1930 నుండి 1940 దాకా మార్క్సిజం పట్ల రంగాజీ మొగ్గుచూపుతూనే ఉన్నారు కమ్యూనిష్టులతో కలసి రైతు సంఘాలు స్థాపించారు. వ్యవసాయ కూలీ సంఘాలు స్థాపించారు. పారిశ్రామిక కార్మిక సంఘాలూ స్థాపించారు చేనేత పారిశ్రామిక కార్మికుల సంఘాలను స్థాపించారు. ఇంకెన్నో మరెన్నెన్నో సంఘాలు స్థాపించారు. ఇచ్చాపురం నుండి మద్రాసుదాకా వేల సంఖ్యలో కార్యకర్తలు వెంటరాగా చారిత్రాత్మకమైన రైతు రక్షణయాత్రను సాగించారు జమిందారీ, జాగీర్దారీ, మొకాసాదారి, ఈనాందారి విధానాల ఇనుప సంకెళ్ళ నుండి రక్షణ కల్పించేందుకు మరెన్నో ఉద్యమాలను నడిపి విజయపథంవైపు పయనిస్తూన్నారు. ఈ అన్ని ఉద్యమాలు, పోరాటాలు కమ్యూనిష్టులతో చేయి

చేయి కలిపి భాయి భాయి అనుకుంటూ సాగినవే ఈదశలో ౧౯౩౮, ౩౯, ౪౦ సంవత్సరములలో కమ్యూనిస్టుల రైతాంగ వ్యతిరేకధోరణిని రంగాజీ పసికట్టారు. సోవియట్ యూనియన్‌లో కొనసాగుతున్న ఏకపక్ష కార్మిక నియంతృత్వ విధానంతో రైతులను బానిసలుగా మారుస్తున్నారని, వారి ఇండ్లు వాకిళ్ళు, పొలం పుట్రా మొత్తంగా ప్రభుత్వమే స్వాధీనం చేసుకుని సహకార వ్యవసాయం, సమిష్టి వ్యవసాయం అనే ముసుగులో రైతులను కూలీలుగా, బానిసలుగా మార్చివేసారని అందుకు వ్యతిరేకించిన వారిని నిరంకుశంగా తలలను నరికివేసి సహారా ఎడారిలోని లోయలలో అనుదినం వేల సంఖ్యలో ఈ హత్యలు సాగాయని సోవియట్ యూనియన్ ఐరన్ కర్టెన్ నుండి ఈ వార్తలు వెలికివచ్చాయి

పై సంఘటనలన్నింటిని రంగాజీ అందుకున్నారు న్యూక్లాస్ అనే గ్రంథాన్ని మిహిలోవ్ జిలాస్ (యుగోస్లోవియా) రచించి ప్రచురించి ప్రపంచంలో మిహిలోవ్ జిలాస్ వదిలారు దానిని చదివారు రంగాజీ రైతుల పై సాగుతున్న ఈ ఘోర, పైశాచిక దాడులను విన్న రంగా స్పందించారు మార్క్సు ప్రతిపాదించిన ఏకపక్ష కార్మిక నియంతృత్వ విధానం ఇంతటి వెర్రితలలు వేస్తుందని ఏనాడూ రంగాజీ తలంచలేదు. ఏకపక్ష కార్మిక నియంతృత్వంలో పారిశ్రామిక కార్మికులు, వ్యవసాయ కార్మికులు అనే బేద భావాన్ని చూపుతారని కూడా తలంచలేదు. రంగాజీ దృష్టిలో భూమిని దున్ని పాటు చేసి పంటలు పండించి మానవ సమాజానికి, ఆ మాటకొస్తే మానవ సమాజానికే కాదు చరాచర జీవకోటికి ఆహారాన్ని అందించే శ్రమ జీవులందరూ మార్క్సు ప్రతిపాదించిన ఏకపక్ష కార్మిక నియంతృత్వంలో భాగస్వాములనుకున్నారు రంగాజీ రైతులను శ్రమజీవుల క్రింద కాక నీరూ ఒక రకమైన దోపిడీదారులేనని మార్క్సు సిద్ధాంతముగా తేలిపోయింది అంతకంటే ముఖ్యంగా రైతాంగం అనే వర్గం చైతన్యరహితమైందని, అభివృద్ధి నిరోధకమైనదని అంతటితో ఆగలేదు ఇదొక దోపిడీదారి వర్గమని మార్క్సు అభిప్రాయం

మార్క్సిస్టుల నిజరూపం తెలుసుకున్నారు రంగాజీ. దానిని ఒక గోముఖ వ్యాఘ్రంగా అభివర్ణించారు. గొర్రెతోలు కప్పుకున్న తోడేలని నిర్ణయించు[illegible]న్నారు. ఇక కమ్యూనిస్టులతో చెలిమి పనికిరాదని

నిర్ణయించుకున్నారు వారితో పోరు సాగించవలసిందేనని కూడా నిర్ణయించుకున్నారు స్వతంత్ర జీవులు, శ్రమజీవులు, అన్నదాతలు అయిన రైతాంగాన్ని కమ్యూనిష్టు కబంధహస్తాల నుండి రక్షించాలనే నిర్ణయం తీసుకున్నారు

కమ్యూనిష్టులతో ప్రత్యక్షంగా పోరుకు తన సేనలను సమాయత్త పరిచారు కమ్యూనిష్టుల నిజరూపాన్ని ప్రజలముందుంచాలంటే వారికి కొంత ప్రచార సాహిత్యాన్ని అందించాలి కదా ? అందుకొక సిద్ధాంత గ్రంధాన్ని "రైతులు - కమ్యూనిష్టులు" అనే మకుటంతో రచించారు ప్రచురించారు ప్రజలలోకి పోయారు కార్యకర్తలు. ఆనాడు ఇదొక సంకుల సమరంగా సాగింది అదే చివరకు శ్రీకాకుళం జిల్లా పలాసాలో జరిగిన అఖిల భారత కిసాన్ సభ ఇరుపక్షాలకూ కురుక్షేత్రమైంది వాదోపవాదాలు సాగాయి. సిద్ధాంత-రాద్ధాంతాలు ఘర్షణలుగా మారాయి. కమ్యూనిష్టులను రైతు సంఘం నుండి వెలివేశామన్నారు రంగాజీ రంగాను, రంగా వర్గాన్ని రైతు సంఘాల నుండి వెలివేశామన్నారు కమ్యూనిష్టులు ఇక యుద్ధ రంగం గ్రామాలకు మారింది

## "కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్"

అప్పుడే మొదలు పెట్టారు కమ్యూనిష్టుల ఏకపక్ష కార్మిక నియంతృత్వ విధానానికి ప్రత్యామ్నాయంగా ఒక వినూత్న శాస్త్రీయ సిద్ధాంత రచన దానికి "కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్" అనే నామకరణ చేశారు. దానినే రంగాయిజం అన్నారు పెద్దలు రంగాయిజంలో ప్రజాస్వామ్యం ప్రధానం వ్యక్తిస్వేచ్ఛ ప్రధానం సామాజిక అభ్యుదయం ప్రధానం. అదొక సంక్షేమ రాజ్యంగా రూపుదిద్దు కోవాలి సాంఘిక న్యాయం, సమాజ శ్రేయస్సు ఆటపట్టులుగా ఉండాలి అందుకే దానికి "ప్రజాస్వామ్య కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్" గా నామకరణ చేశారు. ఇదంతా పెద్ద గాధ విస్తృతమైన వివరణలతో ప్రజల ముందుంచాలంటే ఇదే ఒక మహాభారతమంత గ్రంధమవుతుంది

రంగాజీ సమక్షంలో శ్రీమతి భారతీదేవి వర్ధంతి సభా ప్రాంగణంలో మా ఉపన్యాసాలు ఇలా సాగాయి. ఇంకా చెప్పాలంటే తెలంగాణా పోరాటాలు. ఆంధ్రలో కమ్యూనిష్టుల స్వైరవిహారాలు ౧౯౫౨ ఎన్నికలు. కమ్యూనిష్టుల విజయాలు. మదరాసు రాష్ట్రంలో కమ్యూనిష్టుల ప్రభుత్వం ఏర్పడకుండా రంగాజీ చేసిన కృషి ఇలా ఇలకెన్నో విషయాలపై సాగాయి మా ఉపన్యాసాలు

చివరగా సోవియట్ యూనియన్ చైనాతో సహోదాని ఉపగ్రహ దేశాలన్నీ కమ్యూనిష్టుల ఏకపక్ష కార్మిక నియంతృత్వం నుండి ఎలా బయట పడ్డాయో అనే అంశాలపై ఉపన్యాసాలు సాగాయి. చివరగా మార్క్సిజం విఫలమైంది కమ్యూనిష్టుల ప్రభుత్వాలు కుప్పకూలి పోయాయి ఇది రంగాజీకి విజయం. ఘన విజయం అంటూ సాగిన మా ఉపన్యాసాలు రంగాజీ సమాధానం ఎలా ఉంటుందోనని మేమూ, మాతోపాటు సభయావత్తు ఎదురు చూసింది కానీ రంగాజీ ప్రసంగంలో కమ్యూనిజం ఊసే ఎత్తలేదు భారతీదేవి వ్యక్తిత్వం, ఆమె ప్రజాసేవా కార్యక్రమాలు వివరించి నీరాజనాలు అర్పించారు. కంట నీరు పెట్టారు ఆమె ఆత్మకు శాంతి కలగాలని భగవంతుని ప్రార్థించారు. ఆనాటి సభలోని మిగతావారికి ఎలా ఉందో తెలియదుగానీ నాకు మాత్రం నిస్పృహ, నిరాశలు చోటు చేసుకున్నాయి. సభ ముగిసింది. అందరూ భోజనాలు చేసి వెళ్ళి పోయారు. రంగాజీ కొంత తడవు విశ్రాంతి తీసుకుని సాయంత్రం 4 గంటలకు లేచి బయటకు వచ్చి డైనింగ్ టేబుల్ వద్ద చేరాము అచట సాగింది సంభాషణ

రంగాయిజం వర్సెస్ మార్క్సిజంపై ఈ రోజు మీ ఉపన్యాసాలు చాలా బాగున్నాయి. నన్ను ఆకర్షించాయి కూడా అందులో అక్షరంకూడా పొరపాటు లేదు అన్నీ అక్షర సత్యాలే అయితే ఆనాడు రష్యాలో మార్క్సిజం పేరుతో సాగిన దారుణ మారణకాండలో పదిమిలియన్‌ల దాకా రైతులు హత్య గావించ బడ్డారనే విషయం వారి ప్రత్యర్థులు చెప్పేమాటలు కావు ఇన్నాళ్ళుగా కమ్యూనిజాన్ని, కమ్యూనిష్టులను నిరసించే మా బోంట్ల సుమారు 10లక్షల మంది మాత్రమే హత్య చేయబడ్డారని అనుకుంటున్నాం. ఇంతటి దారుణ మారణకాండకు సాహసిస్తారనుకోలేదు. అలా ఎందుకు అనుకోలేదంటే వారూ మానవులే అనుకున్నాం. మానవత్వం ఇంతగా మరుగున పడి పోతుందనుకోలేదు. పదిమిలయన్‌లదాకా హత్యలకు గురి అయ్యారనే విషయాన్ని వారు అంచనాలు వేసే చెప్పారు. ఎలాగంటారేమో అలా చంపబడ్డవారి కళేబరాలు సహారా ఎడారిలోని పాతాళానికి అంటి ఉన్న అగాధాలలో నేటికీ ఉన్నాయట. వారిలో కొందరిని పూర్తిగా చావకుండానే పడవేసారట యదార్థానికి ఇది మానవులు చేసే పనికాదు. మన పురాణాల్లో వర్ణించబడిన రాక్షసులు కూడా ఇలా చెయ్యలేదు. సరే అయిందేదో అయింది.

వారి పాపం పండింది రష్యా, చైనాలతో సహా ౫౦ పైగా కమ్యూనిష్టు దేశాలు కుప్పకూలిపోయాయి పతనమైపోయాయి కమ్యూనిజాన్ని ఆ మానవ కంకాళాలను పూడ్చి పెట్టారు ఇది నాకు సంతోషమా ఎలా ఉంటుంది మానవుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరించే ఏకపక్ష కార్మిక నియంతృత్వాన్ని ఎదిరించాను నిరసించాను దానికి ప్రత్యామ్నాయంగా ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాను ఈ పరిణామాలను చూసి నాకంటే సంతోషించ గలిగినవారు ఎవరు ?

ఈనాడు రష్యా, చైనాతో సహా ప్రభుత్వాలు పతనం అయ్యాయంటే కలిగే సంతోషం కంటే ఆద్యతన భావిలో ప్రపంచ మానవాళికి ఇంకో వేరేమాటలో చెప్పాలంటే మరో విషాదకరమైన, ఘోరమైన ప్రమాదం ముంచుకొని రాబోతుంది రాబోతూ ఉండటమేమిటి? వచ్చేసింది. అమెరికా దాని సోదర పెట్టుబడిదేశాలు రాజకీయ స్వాతంత్ర్యాన్ని హరిస్తాయి. అంత మాత్రమే అయితే ఎలాగో ఓర్చుకోవచ్చు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని హరించేస్తాయి. అమెరికన్ పెట్టుబడిదారి పారిశ్రామిక అధినేతలు ప్రపంచాన్ని తమ గుప్పెట్లో పెట్టుకుంటాయి రష్యాలో ౧౦ మిలియన్‌ల రైతులను హత్యచేశారనుకున్నామే అంతకంటే మహాఘోరం ఈ అమెరికన్ పెట్టుబడి దారి వ్యవస్థ వలన జరగ బోతుంది రష్యా వాళ్ళ ప్రాణాలే తీశారు అదే కొంతలో కొంత మేలు. ప్రపంచంలోని శ్రామిక జనమంతా బానిసలుగా, జీవచ్ఛవాలుగా బ్రతికి ఉండి నరకయాతన అనుభవించేకన్నా మరణమే మేలు అనిపిస్తాయి. అందువలన ముందుగతి ఏమిటా ? అని ఆందోళనగా ఉంది నాకు ఇన్నాళ్ళు అమెరికాకు ధీటుగా ఎంతకైనా తలపడేందుకు, ఎదురించేందుకు రష్యా అనే బలవత్తరమైన దేశం ఉందనే ధైర్యం ఉండేది. ఇక వారికి అడ్డేలేదు బుల్‌డోజర్లు పెట్టి భూమి దున్నేసినట్లుగా శ్రామికజనాల్ని వారి స్వాతంత్ర్యాన్ని రూపుమాపివేస్తాయి. ఆ కారణంగానే నాకు రష్యాలో కమ్యూనిష్టు రాజ్యం పతనమైందనే సంతోషమే లేకుండాపోయింది.

# చేయని తప్పులను అంటగట్టి, అనుమానాలు పెంచుకొని సాధింపులు, వేధింపులతో మనస్సు కలతపెట్టిన జాతీయ నాయకుల - అపార్థాలను తొలగించడం సాధ్యమా ?

పై రకమైన అపోహలూ అపార్థాలు ముసురుకుని ఒక దశాబ్దం పాటు భారతీయ జాతీయ నాయకులలో ఇద్దరు మహోన్నత వ్యక్తుల యొక్క అకారణ కోపానికి ఎంతగా అపకీర్తి పాలయ్యానో తలచుకుంటేనే శరీరం గగుర్పొడుస్తుంది ఆ కథ సుఖాంతం కావటానికి ఒక దశాబ్దం పట్టింది అది ఒక విచిత్రమైన సన్నివేశం, విలక్షణమైన సంఘటన. ఇక వివరంగా చెపుతాను దాని పూర్వాపరాలు. మీరే తెల్చుకోండి. దాని దుష్ప్రభావం నాపై ఎంతగా పడిందో.

ఉత్తరప్రదేశ్‌కు చెందిన విద్యాధికుడైన, సాంఘిక సేవాకార్యక్రమం పట్ల అభిమానంతో ఉన్న కార్యకర్త ఇందూలాల్ యాగ్నిక్ అనే యువకుని కథ. గుజరాతులోని గాంధీజీ స్థాపించిన సబర్మతీ ఆశ్రమంలో సక్సేనా చేరాడు. చురుకైనవాడు. చెలాకిగా అందరితో కలిసి మెలసి, నవ్వుతూ, నవ్విస్తూ నిర్మాణ కార్యక్రమాలు సాగిస్తూ మొత్తము ఆశ్రమములోని అందరికీ తలలో నాలుకగా నాయకుడిగా ఎదుగుతున్నాడు మంచి వక్త, రచయిత కూడా ఇక మొదలైంది అతని పట్ల ఆదరాభిమానాలు చూపుతూ కొందరు ఒక ముఠాగా ఏర్పడితే, అతని ఎదుగుదలపై ఈర్ష్య చెందిన కొందరు ఒక ముఠాగా ఏర్పడ్డారు ఇతని పట్ల గాంధీజీ కూడా ఆదరాభిమానాలు చూపించేవారు ఒక సందర్భంలో సక్సేనాను అభినందిస్తూ ప్రసంగించారు కూడా గాంధీజీ ఏకార్యక్రమాన్ని తలపెట్టనున్నా యాగ్నిక్‌ని కూడా అందులో భాగస్వామిని చేసేవాడు ఆశ్రమంలో ఒక కీలకమైన వ్యక్తిగా ఎదుగుతున్నాడు.

ఈ నేపథ్యంలో యాగ్నిక్‌పై ఆరోపణలు చేయటానికి ఒక చిన్న కారణం దొరికింది అదేమంటే ఆశ్రమవాసులలో స్త్రీల మధ్య హాస్యోక్తులతో, చలోక్తులతో, వారిని కవ్వించి కొందరి ఆదరణ కూడా పొందుతున్నాడు. కొందరికి కంటకంగా, అహితంగా తోచి యాగ్నిక్ ప్రవర్తనపట్ల కోపం పెంచుకుని నేరుగా గాంధీజీ వద్దకు పోయి ఉన్నది కానిది కలిపి చాడీలు

చెప్పారు గాంధీజీ మొదట్లో నమ్మలేదు యువకుడు, అందులో చలాకీగా వుండేవాడు, ఎల్లవేళలా చిరుదరహాసంతో అందరి హృదయాలను ఆకట్టు కుంటుంటాడే అదే ఏమైనా వీరికి కంటగింపుగా వుందేమో అనుకున్నాడు ఇక సాగాయి బృందాలు బృందాలుగా అనుకూలంగా, వ్యతిరేకంగా, గాంధీజీకి కూడా అనుమానం రేకెత్తింది ఆశ్రమ నిర్వాహకులను పిలచి ఇది ఏదో విచారించండని పురమాయించారు వారు విచారించి సక్సేనా ప్రవర్తన ఆశ్రమ గౌరవానికి భంగం కలిగించేదిగా వుందని, అతనిని బయటకు పంపించేయటం మంచిదన్న సలహా ఇచ్చారు.

సరే మీ యిష్టం అన్నారు గాంధీజీ సస్పెండు చేశారు బయటకు వెళ్ళిపోయాడు యాగ్నిక్. యాగ్నిక్ యువకుడు, విద్యాధికుడు, రాజకీయ-సాంఘిక సేవా కార్యక్రమాల పట్ల ఆసక్తి కలవాడు కావటంతో ఆచార్య రంగా, స్వామి సహజానంద్, రాహుల్ సాంకృత్యాన్, జడ్యే అహమ్మద్ మున్నగు జాతీయ నాయకులు స్థాపించిన అఖిల భారత కిసాన్ సభ గుజరాత్ విభాగంలోనూ, బీహారు విభాగంలోనూ నిరంతరం నిర్విరామంగా సభలు సమావేశాలు, కిసాన్ యాత్రలు నిర్వహించి ఒక నాయకుడిగా ఎదుగుతున్నాడు. అదే సమయములో గుజరాతులో పర్యటిస్తున్న ఆచార్య రంగాకు పరిచయం చేశారు. సక్సేనా కార్యక్రమాల తీరుతెన్నులను చూచి గమనించిన రంగాజీ గుజరాత్ కిసాన్ సభ కార్యదర్శిగా నియమించారు కొద్దిరోజులలోనే అతడి ఉత్సాహాన్ని, కార్యక్రమాలపట్ల పట్టుదల దీక్షతను గమనించిన రంగాజీ అఖిల భారత కిసాన్ సభలో ప్రచారశాఖా కార్యదర్శిగా నియమించారు ఈ విషయం తెలుసుకున్న సర్దార్ వల్లభాయ్ పటేలు, బాబూ రాజేంద్రప్రసాద్ లిరువురూ రంగాపై కోపం పెంచుకున్నారు సందర్భం వచ్చినప్పుడల్లా రంగాజీని విమర్శిస్తూనే వున్నారు. అఖిల భారత కాంగ్రెస్ కమిటీలో ఎక్కడ ఏ ఖాళీ ఏర్పడినా స్వయంగా గాంధీజీయే ప్రతిపాదించినా ఆ యిరువురు నాయకులూ వ్యతిరేకిస్తూనే వున్నారు. ప్రపంచానికి తెలుసు ఆ ఇరువురు మహా నాయకులకూ మహాత్మాగాంధీ నాయకత్వంపట్ల, ఆయన ప్రవచించిన అహింసా సిద్ధాంతం పట్ల అచంచలమైన విశ్వాసం కలదు. అందువలన గాంధీజీకి ప్రాణప్రదమైన సబర్మతీ ఆశ్రమంలో అవినీతికరంగా ప్రవర్తించిన **యువకుడిని రంగాజీ** దగ్గరకు చేరదీస్తాడా అనేదే ఆ కోపం ఈ విషయం

రంగా గారికి తెలయదు రంగాజీని పిలిచి వారడగనూ లేదు ఈ కథ ఇలా పదేళ్ళు జరిగింది ఆనోటా ఈ నోట విని సంగతిని తెలుసుకుని, ఆ ఇద్దరు మహానాయకులను వేరువేరుగా కలుసుకుని సాకల్యంగా వివరించారు. అప్పటికే సక్సేనాలో కూడా గొప్ప మార్పువచ్చింది. ఆ అపార్థం అంతటితో తొలగిపోయింది ఆనాటి నుండి నన్నపరిమితంగా అభిమానించి, ఆదరించటం ప్రారంభించారు కథ సుఖాంతం అయింది. ఈ విషయం మనస్సుకొచ్చినప్పడల్లా రంగాజీ ఎంతగానో బాధా పరితప్త హృదయుడై చలించి పోతుండేవారు ఇప్పడర్థమై వుంటుంది. పై శీర్షిక "చేయని తప్పలను అంటగట్టి, అనుమానాలు పెంచుకుని, సాధింపులు, వేధింపులతో నా మనస్సును కలతబెట్టిన జాతీయ నాయకుల అపార్థాలు తొలగిపోయేదాకా నేనెంత మూల్యం చెల్లించానో ఎంతగా నష్టపడ్డానో" అంటుంటారు రంగాజీ.

## రంగాజీపై బులుసు సాంబమూర్తి కక్షగట్టి సాధించిన - కథ

ఇదొక విచిత్రమైన కథ. విషాదాన్ని వలకబోసి, నాకు కులతత్వాన్ని అంటగట్టి, నన్నొక సంకుచిత వ్యక్తిగా ప్రచారం సాగించిన సంఘటన ఇది. రాయవెల్లూరూ, తంజావూరు, జైళ్ళలో దక్షిణ భారతీయ నాయకులనందరినీ బంధించిన సంగతి చరిత్రలో ఉటంకించబడియే వుంది ఇచ్చట ఒక విచిత్ర సంఘటన జరిగిందన్నాను కదా! దానికి ప్రధాన పాత్రదారి శ్రీ దుగ్గిరాల రాఘవ చంద్ర సచ్చాస్త్రీ ఈయన సంస్కృత, ఆంధ్రములలో మహా పండితుడు, వేదాలు - ఉపనిషత్తులూ, ఇతిహాసాలు, పురాణాల ఔపాసన పట్టినవాడు. అయితే ఈయన ఈ ఔపాసన పట్టటం పుణ్యఫల ప్రాప్తికొరకూ కాదు. స్వర్గావరోహణ కొరకూ కాదు అందలి హేతువాదానికి నిలబడని అనేకములైన మూఢ విశ్వాసాలు, ఛాందసమత మౌఢ్యాలు వీటిపై ఒక యుద్ధాన్ని ప్రకటించారు. ఇది ఆయనలో బ్రహ్మణులపై విద్వేషాల్ని రేకెత్తించింది. యుద్ధాన్ని పురికొల్పింది అయితే శ్రీ రాఘవ చంద్రయ్య సశ్చాస్త్రిగారు మహాపండితులని చెప్పకున్నాము కదా అంతే కాదు ఆయన నూటికి నూరుపాళ్ళూ గాంధేయవాది అహింసావ్రతుడు. నిర్మాణకార్యకర్త. నిరాడంబర జీవన విధానం కలిగినవాడు. ఆదర్శ ప్రజాసేవకుడు. ఈ మూడు జైళ్ళలో ఏ జైళ్ళలో ఉన్నా పరిసరాలను పరిశుభ్రం చేయుటం చివరకు మరుగుదొడ్లలో

మలమూత్రములను ఎత్తివేసి పరిశుభ్రం చేయటం నిత్యకృత్యంగా పెట్టుకున్నాడు ఆ కారణంగా శ్రీశాస్త్రి రంగాజీకి అతి దగ్గరవాడైనాడు రంగాజీ ఆయనను అతిగా ప్రేమించేవాడు అభిమానించేవాడు. ఇద్దరూ అతి సన్నిహితులైనారు జైలు అంతా ఈ సంఘటనలతో బ్రాహ్మణ అనుకూల, వ్యతిరేక కూటాలుగా చీలిపోయారు. ఒకటి రెండుసార్లు కొందరు బ్రాహ్మణ కార్యకర్తలపై చేయిచేసుకున్నారు కూడా అంతవరకు ఏదో ఒక రకంగా సర్దుకున్నారు తలవని తలంపుగా ఒక రోజు ఆంధ్రజాతీయ మహానాయకుల్లో ఒకరైన బులుసు సాంబమూర్తిగారు వేదాలను, మనువు ధర్మ శాస్త్రాన్ని, మనువును విమర్శించే పాటివాడా ఈ శూద్రవెధవ! అన్నాడని రాఘవ చంద్రయ్య సచ్చాస్త్రి చెవినవేశారు. ఇంకేముంది అసలే ఇద్దరూ ఆవేశపరులు. ఒకరిపై నొకరు తలపడ్డారు రెండు మదించిన పోట్లగిత్తలు దునుమాడు తున్నట్లుగా పోరాటం సాగింది ఇద్దరూ సమవయస్కులే జైలులో ఏ ఒక్కరూ వారిని విడదీయటానికి ముందుకు రాలేదు అలుపువచ్చి పోరాటం వారే విరమించారు. మరుసటి రోజు ఉదయమే సచ్చాస్త్రి జరిగిన సంగతంతా రంగాజీకి వివరించారు నాతో చెప్పినందువలన ప్రయోజనం లేదు స్వామీ సీతారాంగారితో ఈ విషయమంతా వివరించమని సలహా ఇచ్చారు. రంగాజీ రాఘవచంద్రయ్య సచ్చాస్త్రిని మందలించలేదని అతడి చర్యలను తప్పపట్టలేదని రంగాజీపై కక్షకట్టాడు సాంబమూర్తి

1934లో కేంద్ర శాసనసభకు ఎన్నికలొచ్చాయి అంతవరకూ మెంబరుగా కొనసాగుతున్న రంగాజీయే కాంగ్రెస్ అభ్యర్థిగా కొనసాగాలని అధిక సంఖ్యాకులు నిర్ణయించారు. కాగా సాంబమూర్తిగారు ఒంటరిగానే అయినా చాలా గొప్ప ప్రతిఘటననిచ్చారు. రంగాజీ బ్రహ్మద్వేషి కాంగ్రెస్ మూలసూత్రాలకే విరుద్ధం ఆయనకు అభ్యర్థిత్వం ఇవ్వరాదంటూ ప్రచారం చేశారు. మరెన్నో ఆరోపణలు చేశారు. అయినా చివరకు రంగా అభ్యర్థిత్వమే ఖరారైంది. శ్రీసచ్చాస్త్రి పిలుపని పేరంటంగా ఎన్నికల ప్రచారంలో పాల్గొని రంగాజీకి అనుకూలంగా గేయాలు పద్యాలు వ్రాసి ప్రచురించారు. వీధుల వెంట పాడారు. ప్రబోధగం చేశారు దీంతో ఉడుకెత్తిపోయిన సాంబమూర్తి గారు గుంటూరు, నెల్లూరు, విజయవాడలలో బ్రాహ్మణ సంఘాలు స్థాపించి రంగాజీని ఓడించాలని, రంగాజీ విజయం బ్రాహ్మణ జాతికే అవమానం

అని తీర్మానాలు చేయించి ప్రచురించారు రంగాజీకి వ్యతిరేకంగా ఉన్నది జస్టిస్ పార్టీ అభ్యర్థి శ్రీ కొసరాజు రామయ్య చౌదరి ఆయన కమ్మవారు. జస్టిస్ పార్టీ ఆశయమే బ్రాహ్మణ వ్యతిరేకము. అయినా రంగాజీని ఓడించి రామయ్యను గెలిపించమన్నారంటే రంగాజీపై ఎంతటి ద్వేషం పెంచుకున్నారో తెలుస్తుంది ఈ కథలన్ని ఆనాటి జమీన్ రైతు, చిత్రగుప్త, పత్రికల్లో వివరంగా పేర్కొనబడి వున్నవి ఈ తరం వారు అవిచూస్తే ఆశ్చర్య చకితులవుతారు

ఇంత ద్వేషం పెంచుకుని విషం పుక్కిలించి కక్కిన శ్రీ బులుసు సాంబమూర్తిగారి జీవితంపై ఒక రచన రంగాజీ చేశారు ఆ రచనలో సాంబమూర్తిగారియొక్క మహోన్నత త్యాగాలను, స్వాతంత్ర్యోద్యమంలో సాగించిన సాహసోపేతమైన కార్యాలను చిత్రీకరించారు. అందులోనే ఒక పేరాలో ఇలా చెప్పారు.

శ్రీసాంబమూర్తిగారు జీవితాంతము వరకు నాపై నిప్పులు కురిపించారు. ద్వేషం నూరిపోశారు నన్నొక కులతత్వవాదిగా చిత్రించారు. నా దేశభక్తిని శంకించారు. 1934లో నా అభ్యర్థిత్వాన్ని వ్యతిరేకిస్తూ నీలాపనిందలు ప్రచారంచేశారు అయినా ఆయన మహోన్నతమయిన వ్యక్తి, త్యాగధనుడు. ఉప్పు సత్యాగ్రహంలో కాకినాడ పురవీధులలో కాళ్లు చేతులు కట్టి లాఠీలతో రక్తం చిమ్మేట్లుగా గొడ్లను బాదినట్లుగా బాదుతూవుంటే, దెబ్బ దెబ్బకు మహాత్మాగాంధీకి జై- విప్లవం వర్ధిల్లాలి- ఇంక్విలాబ్ జిందాబాద్ అన్నాడేగాని అమ్మా - ఆమ్మో అని కూడా అనలేదు. కాకినాడ కాంగ్రెసు రోజుల్లో పెండ్లీడుకొచ్చిన కొడుకు చనిపోతే ఏడుస్తూ ఇంట్లో కూర్చొన్నారా ? లేదే ? సభ జయప్రదంచేసే వరకు కన్నుమూయని త్యాగమూర్తి

( 1934 కేంద్ర శాసనసభ ఎన్నికల విషయమై తలెత్తిన వివాదాలపై రంగాజీ రచనలనుండే చూడండి )

గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రజలు నన్ను కేంద్ర శాసన సభకు ఎన్నుకొనిరి. కాంగ్రెస్ తరపున అభ్యర్థిగా నియమించుటే వివాదాలకు కారణమైనది. ఎందరో నేను రైతుల పెద్దనేగాని కాంగ్రెస్ కార్యకర్తగా నన్ను పరిగణించరాదనిరి. అలా నాపై వైరము పూనిన వారిలో అనేకమంది పెద్దలే

వుండిరి. నా అభ్యర్థిత్వమును బలపరుస్తూ నాకు ఓట్లేసి గెలిపించవలసిందిగా ఒక విజ్ఞాపన పత్రాన్ని అచ్చువేయించి పంచుటకు కూడా జిల్లా కాంగ్రెస్ కమిటీయే ముందుకు రాదాయెను నా రైతు సంఘములే, రైతు నాయకులే ఆ నాయకత్వమును వహించిరనే కంప్లైంటు కూడా చేసిరి. చివరకు నాకు రెండు జిల్లాలోని రైతు సేవాదళాలే ప్రధానంగా నా విజయం కొరకై గొప్ప కృషిచేసిరి నా ఎన్నిక రైతులు తమదిగా భావించుటలో ఆశ్చర్యములేదు పై ఉదహరించిన శ్రీ బులుసు సాంబమూర్తి, శ్రీరాఘవ చంద్రయ్య సశ్శాస్త్రి గార్ల మధ్య తలెత్తిన వివాదములో నన్నిరికించి నన్నప్రతిష్టపాలుచేసేందుకు ఎంతగా కృషి చేసారో ఇప్పుడు అర్థం అవుతుంది కదా ?

కాంగ్రెస్ అభ్యర్థినే అయిన రంగాజీ కాంగ్రెస్‌వారే ఎలా ఎదిరించారో రంగాజీ మాటల్లో చూడండి " 1934 లో కేంద్ర శాసన సభ ఎన్నికలలో నేను నిలబడతానన్నాను ప్రకాశంపంతులుగారు నన్ను వద్దన్నారు ఇంకెందరో కూడా నన్ను వ్యతిరేకించారు వీరంతా కూడా కాంగ్రెస్‌వారే అయినా నన్ను ఎదిరించుటకు నిర్ణయించుకున్నారు. ఈ కథలన్నీ గాంధీగారి వరకూ అందాయి రంగాకు పట్టుదలగా వుంటే నిలబెట్టండి" అన్నారు దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారే నన్ను సమర్థించారు ఎన్ని అడ్డంకులు వచ్చినా చివరకు నా అభ్యర్థిత్వమే ఖాయమయింది నిలబడితిని నెల్లూరులో, వెంకట్రామానాయుడుగారు, శ్రీమతి కనకమ్మ, బద్దెపూడి నారాయణరెడ్డి మాత్రమే నాకు చేదోడు వాదోడుగా వుండేవారు రైతులలో జస్టిస్ పార్టీ వాసన గల రైతులు తప్ప మొత్తం రెడ్లంతా నన్ను సమర్థించిరి కాంగ్రెస్ వారిలో శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు మాత్రమే నాకు తోడ్పైరి రైతాంగాన్ని నా నుండి ఎవరూ దూరం చేయలేకపోయారు అత్యధిక మెజారిటీతో విజయం సాధించారు. రాష్ట్ర కాంగ్రెస్ నాయకత్వం నామీద కక్షసాధింపు చర్యలు చేపట్టింది. నేను అందుకేమి జంకలేదు.

ఇదంతా 1930లో జైళ్లలో సశ్శాస్త్రి, సాంబమూర్తుల మధ్యజరిగిన సంఘటన కారణమే. ఇందులో రంగాగారు చేసిన తప్పుగాని, పొరపాటుగాని ఏమున్నది ? ఇలా ఎన్నో అపవాదులు, అపనిందలు రంగాగారిపై వేస్తూనే వున్నారు. అయితే రంగాగారి నిజాయితే ఆయన్ను కాపాడుతూ వచ్చింది

# త్రిపురనేనికి పోష్టల్ స్టాంపు వేయమనడం నేరమా ?

సంఘ సంస్కర్త, హేతువాది, పండితుడు, చరిత్ర పరిశోధకుడు, మహామనీషి, బార్-ఎట్-లా, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి సంస్మరణార్థం పోష్టల్ స్టాంపు విడుదల చేయవలసినదిగా కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతూ రంగాజీ ప్రధాని రాజీవ్ గాంధీకి లేఖ వ్రాశారు. శ్రీ రంగాజీ లేఖ ఆధారంగా రామస్వామి చౌదరిగారి చిత్రంతో పోష్టల్ స్టాంపు విడుదలయిన సంగతి తెలిసిందే

రంగాజీ అభ్యర్థనపై కేంద్రప్రభుత్వం రామస్వామి చౌదరిగారి చిత్రంతో పోష్టల్ స్టాంపు విడుదల చేశారనే వార్తా పత్రికలలో ప్రముఖంగా వెలువడింది ఈ వార్త చూచిన శ్రీ వంద్రంగి రాజేశ్వరరావు అనే జర్నలిస్టుకు శరీరం. కంపించిపోయింది. శ్రీ రాజేశ్వరరావు ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కు సబ్ ఎడిటర్‌గా వున్నారు. ఆయనకు ప్రముఖ ఆంగ్ల రచయితగా పేరు ప్రతిష్టలు కూడా ఉన్నాయి వ్యక్తిగతంగా రంగాజీపట్ల ఆయనకు అనుపమానమైన గౌరవాదరణలున్నాయి. ఆయన రంగా గారిని గొప్ప త్యాగధనుడుగా అభిమానించి ఆరాధించినవారే.

కవిరాజు రామస్వామి చౌదరిగారి చిత్రంతో పోష్టల్ స్టాంపు విడుదల కావడం ఆయనకు మింగుడు పడలేదు. దానిపై రంగాజీకి మూడు ఫుల్‌స్కేప్ టావులపై ఆంగ్లంలో టైపుచేసిన ఒక నిరసన పత్రాన్ని పంపించారు. అందులో ఆయన కటువైన, విషపూరితమైన పదజాలంతో రంగాజీని తిట్టిపోశారు. ఇంతకూ కారణమేమిటంటే ? చూడండి !

రామస్వామి చౌదరిగారు జస్టీస్ పార్టీ వాడట. స్వాతంత్రోద్యమానికి వ్యతిరేకట ఇంకా చెప్పాలంటే ఆయన బ్రాహ్మణ ద్వేషి అట. ఆయన పురాణ సాహిత్యంపై విద్వేషంతో అనేక రచనలు చేశారట. ఇవి ఆయన ఆరోపణలు ఇలాంటి వ్యక్తికి ఆచార్య రంగాలాంటి ఒక మహోన్నత జాతీయ నాయకుడు పోష్టల్ స్టాంపు వేయాలంటూ సిఫార్సు చేయడం ఆయనలోని కమ్మ కులాభిమానం ప్రస్ఫుటం అవుతుంది అంటూ రాసిన ఆలేఖను అందుకొన్న రంగాజీ ఒకవంక ఆశ్చర్యం మరోవంక ఆందోళన చెందారు. తిరిగి

మరొకమారు రామస్వామి చౌదరిగారి చిత్రపటంతో పోష్టల్ స్టాంపు వేయవలసిందిగా అభ్యర్థిస్తూ ప్రధాని రాజీవ్ గాంధీకి వ్రాసిన లేఖ ప్రతిని రాజేశ్వరరావుకు పంపించారు. దానితోపాటు ఒక కవరింగ్ లెటరు కూడా జతపరిచారు.

రాజీవ్‌గాంధీ వ్రాసిన లేఖ ప్రతిని దానితోపాటు రంగాజీ వ్రాసిన కవరింగ్ లెటరును అందుకున్న రాజేశ్వరరావు మరింత ఆగ్రహోదగ్రుడయ్యాడు ఇందుకు ఒక కథను ఉదహరించడం అవసరం అనుకుంటాను ఆ కథను చూద్దామా ! "అసలే కోతి అది కల్లు తాగింది. అంతటితో ఆగిందా నిప్పలు తొక్కింది " ఇక పాఠకులే ఊహించుకోవచ్చు దాని మనస్థితి ఎలా ఉంటుందో ఆ తీరులో ఆ నేపథ్యంలో మరో సుదీర్ఘమైన లేఖ వ్రాశారు రంగాజీకి అందులో రంగాజీని అనరాని మాటలతో ఆడిపోసుకున్నారు. దానిని చదువుకున్న రంగాజీ దానిలోని కటువైన, విషపూరితములైన పరుష వాక్యములను చూచి చదువుకుని నిశ్చేష్టులై బాధాపరితప్త హృదయంతో దానికి సమాధానం వ్రాయడానికి ప్రయత్నిస్తున్నారు

ఈ నేపథ్యంలో నేను ఢిల్లీ చేరుకున్నాను రా అయ్యా వీరయ్యా కూర్చో అని ఆ ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ నా ముందుంచారు నేను అన్నాను. మీరు పార్లమెంటుకు వెళ్లిరండి ఈలోగా వీటి నన్నింటినీ చదివి పరిశీలిస్తాను అని చెప్పాను ఆయన పార్లమెంటుకెళ్ళారు నేను నా కాలకృత్యాలు తీర్చుకొని తాపీగా కూర్చుని ఆ ఉత్తరప్రత్యుత్తరాలన్నీ చదివా. ఇవి చదువుతుండగా నా మెదడు కంప్యూటరులో ఒక మెరుపు మెరిసింది. అదేమంటారా "ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురించిన ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ" అనే ఒక పదకొండు వందల పేజీల గ్రంథం చదివిన జ్ఞాపకాలన్నీ నా మస్తిష్కంలో మెదిలాయి అందులో కొన్నింటిని వివరిస్తాను. సైమన్ కమీషను బహిష్కరణోద్యమం కాలంలో తెనాలి పురపాలక సంఘం అధ్యక్షులుగా బారిస్టర్ రామస్వామి చౌదరిగారు ఉన్నారు. ఆనాడు గుంటూరు పురపాలక సంఘ అధ్యక్షులుగా బారిస్టరు నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావుగారు ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న అన్ని పురపాలక సంఘాలలో మొట్టమొదటగా గుంటూరు, తెనాలి పురపాలక సంఘాలు మాత్రమే సైమను కమీషన్‌ను బహిష్కరిస్తూ తీర్మానాలు చేశారు పురపాలక

సంఘ కార్యాలయాలపై జాతీయ జండాలు ఎగురవేశారు ఈ సమాచారమంతా ఆంధ్రలో గాంధీజీ పర్యటన అనే గ్రంథంలో సుదీర్ఘ రచన వెలువడి ఉన్నది అలానే 1930లో గాంధీజీ ఆంధ్రదేశ పర్యటన సందర్భంగా గుంటూరు విచ్చేశారు. ఆయన పర్యటన కార్యక్రమంలో గుంటూరు, నిడుబ్రోలు, విమానాశ్రయం చేర్చబడ్డాయి. కార్యక్రమం నిర్ణయం అయిన తరువాత పొన్నూరుకు ఐదారుమైళ్ళలో గల తాళ్ళపాలెం అనే గ్రామాన్ని చేర్చవలసి వచ్చింది తాళ్ళపాలెంలో వైష్ణవ సాంప్రదాయంగల మాలదాసరులనే హరిజనులు ఆయుర్వేదవైద్యంలో ప్రవీణులని వారి వద్ద వైద్య సేవలందుకొనే వారిలో బ్రాహ్మణులతో సహా అన్ని అగ్రకులాలవారున్నారని, వారంతా హరిజనుల ఇంట తయారు చేసిన మందును దాహంతో సహా పుచ్చుకుంటారని, అచ్చట (అస్పృశ్యత) అంటు దోషాలను ఎవరూ పాటించరని రంగాజీ చెప్పడంతో అలా అయితే ఆ గ్రామాన్ని తప్పకుండా దర్శించ వలసిందేనన్నారు గాంధీజీ మధ్యలో ఈ తాళ్ళపాలెం కథ ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే రామస్వామి చౌదరిగారు గాంధీజీ పర్యటన కార్యక్రమ నిర్వాహకుల వద్దకు వచ్చి మా పురపాలక సంఘం గాంధీజీని సన్మానించ దలచినదని అందువలన కార్యక్రమంలో తెనాలి చేర్చవలసిందిగా కోరారు అందుకు నిర్వాహకులు గాంధీజీ కార్యక్రమం అసలే టైటుగా ఉందని దానికితోడు మధ్యలో గాంధీజీ కోరికపై తాళ్ళపాలెం అదనంగా చేర్చవలసి వచ్చిందని చెప్పి తెనాలి కార్యక్రమాన్ని అంగీకరించలేదు. అప్పుడు రామస్వామి చౌదరిగారు గాంధీజీ తెనాలి రాలేక పోయినా కనీసం దారిలో నారాకోడూరు వద్ద తెనాలి పురపాలక సంఘు సన్మానపత్రాన్ని సమర్పించు కుంటామని. అచటనే హరిజన వాడలో హరిజనుల ఉపయోగం కొరకు ఒక మంచినీటి బావికి శంకుస్థాపన చేయవలసిందిగా కోరారు. దానికంగీ రించారు. ఆ కార్యక్రమం జయప్రదంగా సాగింది. రామస్వామి చౌదరిగారిని గాంధీజీ ప్రశంసించారు.

1930లో ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించారు గాంధీజీ. ఆ సందర్భంలో రామస్వామి చౌదరిగారు రచించిన యీ క్రింది దేశభక్తి గేయాన్నొకమారు చూడండి.

వీరగంధము తెచ్చినారము
వీరులెవ్వరో తెల్పుడీ !
పూసిపోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో !!

తెలుగు బావుట కన్నుచెదరగ
కొండవీటను నెగిరినప్పుడు
తెలుగువారల కత్తి దెబ్బలు
గండికోటను కాచినప్పుడు

తెలుగువారల వేడినెత్తురు
తుంగభద్రను గలిసినప్పుడు
దూరమందున నన్ను సహ్యాజ
కత్తినెత్తురు కడిగినప్పుడు

ఇట్టి సందియు ...న్నడేనియ
బుట్టలేదు రవం...యున్
ఇట్టి ప్రశ్నలనడుగు వారలు
లేకపోయిరి నుంతయున్

నడుముగట్టిన తెలుగు బాలుడు
వెనుక తిరుగండెన్నడున్
బాస యిచ్చిన తెలుగుబాలుడు
పాఱిపోవండెన్నడున్

ఇదిగోయున్నది వీరగంధము
మైదలందుము మైనలందుము
శాంతి పర్వము జదువ వచ్చును
శాంతి సమరంబైన పిమ్మట

తెలుగు నాటిని వీరమాతను
జేసి మాత్రము తిరిగి రమ్మిక
పలు తుపాకులు పలు ఫిరంగులు
దారికడ్డమురాక తప్పవు

వీరగంధము తెచ్చినారము
వీరుడెవ్వడో తెల్పుడీ
పూసిపోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో !!

-కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి.

చౌదరిగారి పై దేశభక్తి ప్రభోదగేయం ప్రజలను ఆవేశపరిచింది. దేశభక్తిని రేకెత్తించింది యువకులలో, స్త్రీలలో ఉత్సాహాన్ని.రేకెత్తించింది ఆ కారణంగానే తెనాలి తాలూకాలోని అనంతవరం, అమృతలూరు, కూచిపూడి, గోవాడ ఆ పరిసరాల గ్రామాలు వందల సంఖ్యలో సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఒక్క చేబ్రోలు నుండే ౨౦ మంది స్త్రీలు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. కారాగార శిక్షలు అనుభవించారు. ఇచ్చట ఒక చిన్న కథ చెప్పకుందాము.

కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు, జాతీయ నాయకుడు డా పట్టాభి సీతారామయ్యగారి ని కాంగ్రెసు కార్యవర్గ సమావేశములో (ఢిల్లీలో) ఆంధ్రలో ఉప్పసత్యాగ్రహ ప్రస్తావన వచ్చింది. పట్టాభిగారూ మీ ప్రక్కనే ఉన్న గుంటూరు

జిల్లాలో వేల సంఖ్యలో ఉద్యమంలో పాల్గొన్నారు కదా ! మరి మీ జిల్లాలో ఇంత తక్కువ మంది పాల్గొనటానికి కారణమేమిటి ? అప్పుడు చెప్పారట పట్టాభి. అవును నిజమే గుంటూరు జిల్లాలో బారిష్టరు కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు రచించిన " వీరగంధము తెచ్చినారము వీరుడెవ్వడో తెల్పుడీ" అనే ప్రబోధగేయం సత్యాగ్రహ బృందాలు వీరావేశంతో వీధుల వెంట తిరుగుతూ పాడుతుంటే సత్యాగ్రహ సమరంలో వేలాదిమంది పాల్గొని కారాగారాలకు వెళ్ళారు ఆ పాట మీరెందుకు పాడించకూడదు అని అడిగారు: దానికాయన ఆపాట మా జిల్లాకు చేరే లోపల సత్యాగ్రహం విరమించ బడిందన్నారు.

ఇదీ కథ అప్పుడు చెప్పా రంగాజీతో, మీరు ఆయనకు సమాధానం వేరే వ్రాయవద్దు నేను గుంటూరు చేరిన తరువాత ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ పర్యటన అనే గ్రంధం చూచి దానిలో పై సమాచారం ఉన్న పేజీలను తిరగవేసి పేజీనంబర్లు వేసి పంపిస్తాను మీరాయనకు వ్రాసే సమాధానంలో "రామస్వామి చౌదరిగారు స్వతంత్రోద్యమానికి ఎంతటి ఊపునిచ్చారో, ఎంతటి బలాన్ని చేకూర్చారో మీకు అర్థం కావాలంటే ఆ గ్రంథంలోని ఈ పుటలు ఒక మారు చూడండి అని మాత్రమే వ్రాయండి. అంతే మీరు అదనంగా ఇంకోమాట రాయవద్దు. సంతకం పెట్టి పంపించండి అప్పుడు దానికాయన ఏమి సమాధానం చెబుతారో చూద్దాం రంగాజీ మహదానంద పడి పోయాడు ఈ కథ అంతా నాకు తెలుసు అయితే గ్రంధస్తం అయిందని తెలియదు అని అంటూ ఆ రోజే నన్ను తిరుగు ప్రయాణం కట్టించారు. నేను గుంటూరు చేరుతూనే పేజీ నంబర్లు వేసి పంపించాను. అలాగే ఆయన జాబూ వ్రాశారు. ఇక తిరిగి ఆప్రస్తావన తెస్తే ఒట్టు.

ఒక మనిషిని ఒక మనిషి వారి చర్యల విషయంలో అపోహపడితే, పొరపాటు పడితే అర్థం చేసుకోవచ్చు అలా కాకుండా ఏదో దురుద్దేశంతో అపవాదు వేస్తే సహించగలమా రాజేశ్వరరావు ఆంధ్రలో స్వాతంత్రోద్యమ చరిత్రనంతా ఔపోసన పట్టినవాడే. అయినప్పుడు ఈ కథంతా ఆయనకు తెలియదని అనుకోలేం. కేవలం రామస్వామి చౌదరిపై ఈర్ష్యా ద్వేషంతోనే ఇలాంటి అపవాదులు వేశారనేది అర్థం అయిపోయింది.

– "ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ" గ్రంథం ఆధారంగా

# ప్రజాసేవకు ప్రారంభోత్సవం
# వెంకటగిరి జమీందారి వ్యతిరేకోద్యమం

అదుగో ఆ-ఆ-ఆ- 1923లోనే లండన్‌లో విద్యాభ్యాసం చేస్తూ మధ్యలో చుట్టపుచూపుగా స్వదేశం తిరిగివచ్చిన ఆచార్య రంగా నిడుబ్రోలు లోని తన స్వంత భూములలో వేదిక తయారుచేసి "వ్యవసాయ కూలీల కాంగ్రెస్" సంస్థను స్థాపించారు

మరో పక్షం రోజులు తిరగకుండానే తన గ్రామానికి అనతి దూరములో 'అప్పికట్ల' లో 'ఆంధ్రరాష్ట్ర రైతు మహాసభ' జరిపారు ఒక మారు ఆంధ్రదేశ రాజకీయ రంగ ప్రారంభ కార్యకలాపాలను నెమరువేసుకొంటే అబ్బో! ఎంత సుదీర్ఘ చరిత్ర ? మన కళ్ళ ఎదుట కనిపిస్తుందో ఊహించుకొనవలసిందేకాని చెప్పనలవికాదు ఎవరికి వారు ఆలోచించుకోండి! పదేళ్ళా పాతికేళ్ళ - ఏభై ఏళ్ళూ కాదే డెభైఅయిదేళ్ళు పూర్తి కావస్తుంది

అసలానాడు ఉన్నత విద్యాభ్యాసమునకై అందునా ఏ బారిష్టరో, ఐ పి యస్సో చదివి కలెక్టరో, న్యాయమూర్తో కావాలని ఆశించిన తమ తల్లి దండ్రులు, బంధుగణము, ఒక మహోన్నత ఆశయంతో లండన్ పంపించారు గాని, ఈ విధంగా కూలీ సంఘం, రైతు సంఘం స్థాపించమని కాదుగదా ?

ఉన్నతోద్యోగ సంపాదనా ప్రయత్నాలు మాని రైతు, కూలీ సంఘాలు స్థాపించి, ప్రజాసేవా కార్యక్రమాలు తలపెట్టి కొనసాగించడం ధర్మమని, న్యాయమని భావించే రోజులా అవి ! కాదే తల్లితండ్రులు, బంధుగణాలు రంగాజీ ఈ చర్యలపట్ల మనో వైకల్యం చెందారు అసంతృప్తి జ్వాలలు పైకెగసాయి రంగాజీ ఎంచుకొన్న ఆ మార్గము నుండి తప్పించేందుకు ఎన్నో ప్రయత్నాలు సాగాయి. దాన, భేద, దండోపాయాలతో సహా చేపట్టారు ఉహు! ఆ ప్రయత్నాలేవి ఫలించలేదు

యుక్తవయస్సు వచ్చింది వివాహమైనా చేస్తే [illegible] మరల్చగలమేమోనని ఆశ చిగిర్చింది. ప్రారంభించారు ప్రయత్నం అందుకాయన ఎలాంటి అభ్యంతరం చెప్పలేదు తమ గ్రామానికి సమీపములో

గల మాచవరంలో ఒక సంపన్న రైతుకుటుంబంలో శ్రీవెలగా వారి యింట పెండ్లీడు కొచ్చిన అమ్మాయి ఉన్నదని తెలుసుకొని రాయబారము నడిపారు ఉభయ కుటుంబాలు ఇష్టపడ్డాయి. రంగాజీ 'సరే ' అన్నారు అయితే ఒక షరతు పెట్టారు నేను మరలా లండన్ వెళ్ళాలి ఈ లోగా గుంటూరులోని శారదా నికేతనములో స్త్రీ విద్యావ్యాప్తికి విశేష కృషి సాగిస్తున్న ఉన్నవ దంపతుల వద్ద విద్యాభ్యాసానికై అక్కడ చేర్చుదాము లండన్ నుండి తిరిగి వచ్చి వివాహము చేసుకుంటానన్నారు మొదట్లో రంగాజీ ఈ అభిప్రాయంతో అంగీకరించక పోయినా చివరకు ఉభయులూ అంగీకరించారు

ఇచ్చట గమనించవలసినదేమంటే రంగాజీని వివాహమునకైతే అంగీకరింపజేయగలిగారు గాని "ప్రజాసేవా కార్యక్రమ దీక్ష" నుండి ఒక్క వీసమైనా దూరం చేయలేకపోయారు ఆనాటి వరకు "బుచ్చమ్మ" అన్న నామముతో పిలువబడుతున్న అమ్మాయి పేరు "భారతి" గా అటు తరువాత పండిత పెనుమత్స సత్యనారాయణ రాజుగారి సలహాతో "భారతీదేవి"గా మార్చటం జరిగింది.

## చేనేత పరిశ్రమపై- పరిశోధన- డీలిట్ పట్టా

ఒకమారు వెనుదిరుగుదాం ఆనాటికే మహాత్మాగాంధీ నాయకత్వాన భారతదేశములోని బీహారు రాష్ట్రములో చాంప్రాన్‌లో, గుజరాత్‌లోని బార్డోలి, ఆంధ్రలో పెదనందిపాడు కేంద్రాలుగా సహాయనిరాకరణోద్యమం, పన్నుల నిరాకరణోద్యమం, ఫారెస్టు 'పుల్లరి' నిరాకరణోద్యమాల ద్వారా రైతాంగంలో ఒక మహోజ్వలమైన విప్లవ పోరాటాలు ప్రారంభమయినాయి. గ్రామీణ ప్రజలలో చైతన్యం పెల్లుబికింది. బ్రిటీష్ ప్రభుత్వాన్ని ఒక కుదుపు కుదిపాయి. ఈ ఉద్యమాలు రంగాజీ లండన్‌లో ఉండగానే ఆరంభించి జయప్రదంగా నిర్వహించి విజయ శంఖారావాన్ని పూరించాయి. అచటనే రంగాజీలో దేశభక్తి పూరిత భావోద్వేగము పెల్లుబికింది గాంధీజీ ఆశయాల కనుగుణంగా విదేశీవస్త్రాలు బహిష్కరించారు. ఖద్దరు ధారణ ప్రారంభించారు. మాంస భక్షణ విడనాడారు సిగరెట్, సిగార్, పైపులను విసర్జించారు. గాంధీజీయే తన నాయకుడుగా, ఆరాధ్యదైవంగా ఎంచుకొన్నారు. కాంగ్రెస్ కార్యక్రమాలలో పాల్గొని విద్యాభ్యాసం నుండి పైదొలగాలనుకున్నారు. కాని

తాను పెద్దగా, సంరక్షకుడిగా, సలహాదారుగా అన్నింటికీ మించి తన మొదటి గురువుగా ఎంచుకొని ఆరాధిస్తున్న శ్రీ వెలగపూడి రామక్రిష్ణ (ఐ.పి యస్) గారి సలహాతో విద్యాభ్యాసాన్నే పూర్తిచేయదలచారు.

సరిగ్గా యూరప్‌లో అదే సమయంలో "గిల్డు సోషలిస్టు " ఉద్యమం ప్రారంభమయింది ఆ ఉద్యమం పారిశ్రామిక కార్మికులలో చైతన్యాన్ని కలిగించింది సంఘటిత పరచింది సంఘాలు స్థాపించబడ్డాయి కార్మికుల సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయాలపై సంక్షిప్తంగా రచనలు చేయటం వాటిని ప్రచురించి పంచడం, సభలు, సమావేశాలు జరపటం చూస్తున్న రంగాజీ ఒక్క ఊపుతో "గిల్డు సోషలిస్టు " ఉద్యమంలో చేరాడు

ఆనాడే, అచటనే ఒక నిర్ణయానికి వచ్చారు పారిశ్రామిక సంఘాల స్థాపనకు బదులు భారతదేశములో రైతు, వ్యవసాయ కూలి, చేతివృత్తుల, శ్రామికుల సంఘాలను స్థాపించాలని నిర్ణయించుకున్నారు. నిడుబ్రోలులో వ్యవసాయ కూలీ సంఘం, అప్పికట్లలో రైతు సంఘం స్థాపనకు దోహదం చేసిన పరిస్థితులు ఆనాటి యూరోపియన్ "గిల్డు సోషలిస్టు " ఉద్యమ ప్రభావమేనని రంగాజీయే అనేక సందర్భాలలో ఉటంకించియున్నారు

మళ్ళీ విద్యాభ్యాసం కొనసాగించడానికి లండన్ చేరారనుకున్నాం కదా! ఎకనామిక్స్ పోస్టుగ్రాడ్యుయేషన్ పూర్తిచేసిన రంగాజీ డీలిట్ సబ్జక్టు ఎంచు కోనవలసి వచ్చింది. అచ్చటే మరో పోరాటం ప్రారంభమయింది ప్రొఫెసర్లతో రంగాజీ "ఎకనామిక్స్ స్టడీ ఆఫ్ హోండ్లూమ్స్ అండు హోండీ క్రాఫ్ట్"అనే అంశం తీసుకుంటానన్నారు. ప్రొఫెసర్లు విరగబడి పెకిలిగా నవ్వారు ఎందుకలా నవ్వుతారు ? ప్రశ్నించాడు రంగాజీ ప్రపంచం పారిశ్రామికంగా, వాయువేగ మనోవేగాలతో పరుగులిడుతుంటే నీకిదేమి పిచ్చయ్యా? బాబు రైళ్ళకు బదులు ఒంటెద్దు బండిలో ప్రయాణిస్తావా? వందమంది రోజంతా పనిచేసినా పదిగజాలబట్ట తయారుచేయలేని ముసలవ్వల రాట్నం, చేతిమగ్గం ఆధారంగా నడిచే పరిశ్రమ నీకు డీలిట్‌కు ఎలా ఉపయోగపడుతుందని నిర్ణయించావు ? అన్నారు. యూరప్ పరిస్థితి వేరు. మాది గ్రామీణ భారతం. ఏడు లక్షల గ్రామాలలో కోట్లాది ప్రజలు చేతివృత్తులపై ఆధారపడి జీవిస్తున్నారు. అందుకే మా నాయకుడు మహాత్మాగాంధీజీ జాతీయ పతాకంపై

రాట్నాన్ని చిహ్నంగా రూపొందించారు మిల్లు వస్త్రధారణకు బదులు ఖద్దరు ధారణ నియమంగా ప్రకటించారు అందుకే నేను ఈ విషయాన్ని డీలిట్ పరిశోధనకు తీసుకున్నాను కాదంటే ఈ చదువు ఇక మానేసి మడిదున్నక బ్రతుకుతూ జాతీయోద్యమంలో చేరతాను పొమ్మన్నారు రంగాజీ వాదన విన్న ప్రొఫెసర్లు మనసు మార్చుకొని ఆయన కోరికను మన్నించారు

హాండ్లూమ్స్‌పై పరిశోధనా కార్యక్రమం ప్రారంభించిన రంగాజీకి 1924లో భారతీదేవితో వివాహం జరిగింది. పరిశోధనలో భాగంగా, ఆంధ్రాలో చిత్తూరు నుంచి శ్రీకాకుళం దాకా, మర్మగోవా నుండి మచిలీపట్నం దాకా గల వందలాది చేనేత పారిశ్రామిక కేంద్రాలలో విస్తృతమైన పరిశోధన ప్రారంభించారు ప్రత్తినుండి విత్తనాలను వేరుచేయటం మొదలు ఏకులు చేయటం, నూలు వడకటం, కండెలు పోయటం వరకూ గల చేనేత పరిశ్రమకు చెందిన ప్రాధమిక కార్యక్రమాలలో పనిచేసే వందలాది మంది శ్రామికులను ఒక్కొక్కరితో వివరంగా ప్రశ్నించి సమాధానాలు రాబట్టి నోట్సు తయారు చేశారు. అటు తరువాత రెండవ దశలో రాట్నం పై వడికి నూలును పింజలుపోసి మగ్గాలకు అమర్చి వివిధ రకాలైన రంగు రంగుల పట్టు, జరీ మిశ్రమ నేత చీరలు, ధోవతులూ, తువ్వాళ్ళూ, లుంగీలు ఇంకెన్నో రకాలైన బట్టల తయారీలో పాల్గొనే లక్షలాది కార్మికుల సమస్యలపై, వేలాదిమంది శ్రామికుల అనుభవాలను, వారి కష్టసుఖాలను, ఆర్థిక పరిస్థితులను సవివరంగా నోట్సుతీసుకుని తిరిగి భారతీదేవిని కలుపుకుని లండన్ చేరారు లండన్‌లో భారతీదేవిని ఒక ఆంగ్లస్కూల్ ఆఫ్ ఆర్ట్స్ కాలేజీలో చేర్పించారు.

లండన్‌లో హాండ్లూమ్ పై చేసిన పరిశోధనను ప్రొఫెసర్ గిల్‌బర్టు స్లేటరు యం ఎ సెయింట్స్ జోన్స్ కాలేజి కేంబ్రిడ్జి, యూనివర్శిటీ ఆఫ్ లండన్ పర్యవేక్షణలో ఇతర లీడర్సు సహకారంతో 1924 నుండి 1925 ఆఖరుకి రెండు థీసిస్‌లు తయారు చేశారు 1 ఎకనామిక్స్ ఆఫ్ ది కాటన్ ఇండస్ట్రీ ఆఫ్ మద్రాస్ ప్రెసిడెన్సీ, ఫర్ ది డిగ్రీ ఆఫ్ డీలిట్. 2) ఆన్ ది ఎకనమిక్ లైఫ్ అండ్ సోషల్ కండిషన్స్ ఆఫ్ సర్టెన్ విలేజెస్ ఇన్ ది గుంటూరు డిస్ట్రిక్ ఫర్ ది డిప్లొమా ఇన్ సోషల్ సైన్సెస్ ఈ రెండు థీసిస్‌లను సబ్‌మిట్ చేసి డీలిట్ పట్టాను పొందారు. అంతకు ముందు 1923లో "డిప్లొమా ఇన్ ఎకనమిక్స్

అండ్ పొలిటికల్ సైన్స్" విత్ డిస్టింగ్‌షన్ లో ఉత్తీర్ణులైనారు. అటు తరువాత స్పెషల్ సబ్జక్టులుగా "పబ్లిక్ ఫైనాన్స్ అండ్ హీ హాజ్ ఫర్‌దర్ స్టడీస్ ఇన్ జర్మనీ అండ్ ఇటలీ" ఈ అన్ని డిగ్రీలలో ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులై పట్టాలు పొంది ప్రొఫెసర్ల 'ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ' పాలక వర్గ అపార ప్రశంసలు పొంది భారతీదేవితో కలసి 1926 చివర్లో ఇండియా తిరిగివచ్చారు

## ప్రథమ పరిచయం గాంధీజీతో : వయోజన ఓటింగ్

లండన్ నుండి స్వదేశానికి తిరిగివస్తూ 'కామ్రేడ్' అనే ఆంగ్ల వారపత్రిక సంపాదకుని పరిచయ లేఖతో ఢిల్లీలో మహాత్మాగాంధీని కలుసుకున్నారు కామ్రేడ్ పేపరులో అనేక రచనలు రైతు కూలీ శ్రామిక జనాల సమస్యలపై చేశారు వాటినన్నింటిని మహాత్మాగాంధీజీ అప్పటికే చదివి వుండడంచేత రంగాజీని సాదరంగా ఆహ్వానించారు అనేక సమస్యలపై సుదీర్ఘ చర్చలు చేశారు ఆ చర్చలలో రంగాజీ సాగించిన వాదనలను విన్న బాపూజీ రంగాజీకి ప్రశంసల జల్లులు కురిపించారు అదే కాలంలో ఢిల్లీలో "వయోజన ఓటింగ్" పై ముమ్మరంగా చర్చలు సాగుతున్నాయి ప్రముఖ రాజనీతిజ్ఞురాలు, స్వాతంత్ర్య సమరయోధురాలైన 'అనిబిసెంట్' వయోజన ఓటింగ్‌కు సుతారమూ అంగీకరించుటలేదు మోతీలాల్ నెహ్రూ, ఖాయిదే ఆజామ్ జిన్నా, యం యస్ ఆనే, సప్రూ, జైకర్, విఠల్‌బాయ్ పటేల్ ప్రభృత్వ జాతీయ నాయకులతో వయోజన ఓటింగ్‌పై చర్చలు సాగిస్తున్నారు రంగాజీతో బాపూ చెప్పారు "నీవు పోయి వీరందరికీ వయోజన ఓటింగ్‌పై నీ వాదన వినిపించు వారిని అంగీకరింపచేయి వయోజన ఓటింగ్ నాకూ ఇష్టమేనని చెప్పు" అన్నారు రంగాజీ వారం దినాల పర్యంతంపై జాతీయ నాయకులతో చర్చలు సాగించి, వయోజన ఓటింగ్ భారతదేశములో ప్రవేశపెట్టడం న్యాయం, ధర్మం, సబబు, సహేతుకం. అని తన అపూర్వ, అనితర సాధ్యమైన వాదనో పటిమతో అంగీకరింపచేశారు. రంగాజీ జీవితంలో ఇది ఒక గొప్ప విజయంగా భావించవచ్చును. శాసనసభా పార్లమెంటు మరెన్నో రకాలైన స్థానిక సంస్థల, సహకార సంస్థల ఎన్నికలలో వయోజన ఓటింగ్ ప్రవేశపెట్టట మంటే రైతుకూలీ, చేతివృత్తులకు చెందిన అశేషగ్రామీణ శ్రామిక జనాలకు పాలనాధికారము చేరువైనట్టేనని రంగాజీ అభిప్రాయము అందుకే రంగాజీ వయోజన ఓటింగ్‌పై ఇంతటి పట్టుదలతో కృషిచేశారు.

## పచ్చయప్పా కళాశాల - ఆచార్య పదవి

ఢిల్లీలో మహాత్మాగాంధీని ప్రథమ పర్యాయం కలవటం అది తనకొక వరప్రసాదంగా భావించారు గాంధీజీ పట్ల లోగడ తనకున్న గౌరవం వేయింతలైంది దానికితోడు తనతోటి గ్రామీణ శ్రామిక జనాలకు ఓటింగ్ హక్కు కలగటం, అదీ ఆ చర్చలలో తాను పాల్గొనటం, అందరి నాయకుల ఆమోదాన్ని పొందటం తన ప్రియతమ నాయకుడు, ఆరాధ్య దైవంగా భావించే మహాత్ముని ఆశీస్సులు పొందటం దానికొక మహాద్భాగ్యంగా ఎంచుకున్నారు రంగాజీ అసంతోషంతో, ఆ ఉత్సాహంతో ఆ ప్రేరణతో మద్రాసు చేరిన రంగాజీ మద్రాసు ప్రధాని శ్రీ బొల్లిన మునిస్వామినాయుడుగారిని కలిశారు తాను సాధించిన డిగ్రీ పట్టాలను చూపించారు. అవి చూస్తూనే "శెహభాస్ రైతుబిడ్డా " అని ప్రసంసించారు ఆ వెనువెంటనే 'పచ్చయప్పా కళాశాల' ప్రిన్సిపాల్‌ను పిలిపించి చెప్పారు. 1927 లో పచ్చయప్ప కళాశాల ఎకనమిక్స్ ప్రొఫెసర్‌గా చేరారు. 1927 నుండి 1930 దాకా ప్రొఫెసరుగా కొనసాగారు. ప్రొఫెసరుగా పనిచేస్తూనే మద్రాసు గవర్నమెంటు "ఎకనమిక్ ఎడ్వైజర్ " మరియు స్పెషల్ ఆఫీసరుగా మరనేక ఎడ్వైజరీ కమిటీలకు మెంబరు ఛైర్మన్‌గా, సెక్రటరీగా పనిచేసి బహుముఖ ప్రశంసలనందకున్నారు. అన్నింటి కంటే ముఖ్యమైనది భూమిశిస్తు పెంపుదలపై రంగాజీని అధ్యక్షులుగా నియమించారు ఈ కమిటీ అధ్యక్షులగా ఆరు మాసముల పర్యంతం అనేక గ్రామాలు పర్యటించారు. వేలాదిగా రైతును కలుసుకున్నారు. వారి సలహాలను తీసుకున్నారు. రిపోర్టు తయారుచేసి రు ప్రభుత్వానికి నివేదించారు రైతులలో తమ మొర ఆలకించేవారు ఒకరు వున్నారనే నమ్మకం కలిగించారు ప్రభుత్వం పెంచిన శిస్తును నిలిపివేసింది రైతులు రంగాజీకి జేజేలే పలికారు.

## వెంకటగిరి జమీందారీ రైతుల పోరాటము - రంగాజీ

మద్రాసు ప్రభుత్వం తనకు కల్పించిన అవకాశముతో రైతులకు తన సేవలను అందించుటలో సాఫల్యతను పొందానన్న సంతోషము ఒక ప్రక్కన, ఈ అవకాశాన్ని తోడుచేసుకుని రైతాంగము చైతన్యవంతమైనదన్న సంతోషము మరొక ప్రక్కన. ఇది రైతాంగ ఉద్యమాల పటిష్టతకు దోహదం చేయగలదన్న

సంతోషం మరోక ప్రక్కన రంగాజీకి విజయోత్సాహాన్ని కలిగించాయి ఈ నేపథ్యంలో భారతీదేవి సమేతంగా విశ్రాంతికై ఉదకమండలం చేరారు అచట విశ్రాంతి తీసుకుంటూ కాలినడకన పచార్లు చేస్తున్న సందర్భములో అచటి నీలగిరి ఆదిమ వాసుల దుర్భర, దైన్య స్థితిగతులనుచూసి ఆశ్చర్యచకితు లైనారు ఆందోళన చెందారు ఎందుకు? నేలబారు గుడిసెలు, ఒంటినిండా బట్టలయినా లేని మొండి ఘటాలు, ఇహ తినడానికా వేటాడి తెచ్చుకున్న అడవిమృగాలు, పక్షులేగతి నూకలగంజి, దానిలో అనుపానమేది లేదు ఆ దారిద్ర్యాన్ని చూచి చలించిన రంగాజీ "ట్రైబ్స్ ఆఫ్ నీలగిరీస్" అనే పరిశోధక సమాచార గ్రంథాన్ని రచించి, ముద్రించి మద్రాసు ప్రభుత్వానికందించారు. వారికి చేయదగు తక్షణ సహాయక చర్యలు చేపట్టి ఆదుకొనటం విశేషం. అలా జరగటం ఆనాటి పాలకులలో రంగాజీ పట్ల వారికున్న గౌరవభావమే కారణం

ఇలా వుండగా ఒకరోజు ప్రాతఃకాల సమయమున రంగాజీని కలవడానికి నెల్లూరు వెంకట్రామానాయుడు కొందరు సహాయకులతో వచ్చారు వెంకటగిరి జమిందారీలో రైతులకు జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను, దౌర్జన్యాలను పాటలతో, పద్యాలతో, సామెతలతో వివరించారు ప్రథమ సందర్శనములోనే వెంకట్రామానాయుడుపట్ల విశేషమైన అభిమానం, గౌరవాదరణలు పెరిగాయి. ఆయన ఆకృతిని వర్ణిస్తూ రంగాజీ శ్రీరామ చంద్రుని, వాల్మీకి వర్ణించిన విధం మనస్సులో మెదులుతున్నదన్నారు శ్రీ వెంకట్రామానాయుడు ఆజానుబాహుడు మేను మేలిమి బంగారు వర్ణం అందమైన పలువరుస, విశాలమైన ఫాలభాగము ఆహా ! ఏమి ఈ రైతు నాయకుని మందహాసము, వాక్చాతుర్యము. ఆశుకవిత్వములో రైతు సమస్యలపై చిలుకా అనే మకుటంతో పాడిన పాటలతో, గేయాలతో, పద్యాలతో అలరించారు ఇంతకీ ఏమైనా ఆహారం తీసుకున్నారా ? అని అడిగారు ఆహా! తినే వచ్చామన్నారు లేదని రంగాజీ గమనించారు నాకు తెలుసు రైతులలో ఆత్మాభిమానం వుంటుందని ఒకరింట పీటవాల్చరని అయ్యా! నాయుడుగారు, మీరు నాకు సోదర సమానులు అని హోటలు నుండి ఇడ్లీ, దోశె, ఉప్మాలకు ఆర్డరు ఇచ్చి నౌకరుని పురమాయించారు మీ కష్టాలు విన్నాను మీ సమస్యలు అవగాహన చేసికొన్నాను నేను మీకు ఏమి చేయగలనో, ఎలా చేయగలనో చెప్పండి అన్నారు మీరు మాకు

చేయవలసినది ఒకే ఒక పని అది మీరు మా వెంకటగిరి రావటం మేము ఏర్పాటు చేసిన బహిరంగసభలో మాట్లాడటం అదే మా విన్నపం. వేడికోలు, మా ప్రార్ధన కూడా అంటూ లేచి నిలబడి నమస్కరించారు ఏవమ్మా భారతీదేవిగారు విన్నారు కదా మన రైతుల కష్టాలు, వెతలు, బాధలు మరి పోదామా అయ్యో తప్పక వెళ్లండి అని అంటూ వుండగానే మరి మీరో అన్నారు రంగాజీ రమ్మంటే వస్తా అంటూ వుండగానే వెంకట్రామానాయుడుగారు అందుకుని మీరూ రండమ్మా, కనకమ్మక్కగారు సంతోషిస్తారు అన్నారు శ్రీమతి పొణకా కనకమ్మగారు అద్వితీయ శక్తి సంపన్నురాలు ధైర్యసాహసాలు ఆమె సొత్తు. ఆమె జమిందారీ రైతులకు అండ ఈమెదొక అపూర్వ చరిత్ర. అది వేరుగా వ్రాయవలసిందేగాని ఇందులో జోడించుటకు వీలులేదు

## కోట బురుజుల కెదురుగా బహిరంగ సభ

రంగాజీ వెంకటగిరి జమిందారీ రైతుల పోరాటంలో పాల్గొనేందుకు వస్తున్నారనే వార్త ఊరూరా, వాడవాడలా దావానలంవలె వ్యాపించింది గ్రామాలకు గ్రామాలే ఆడ, మగ, పిల్లా, జెల్లా బాజా భజంత్రీలతో, బృందగానాలతో, డప్పులతో రంగాజీకి అపూర్వస్వాగతం పలికారు కోట బురుజుల కెదురుగా వేదికనమర్చారు. ప్రధమంగా భారతీదేవి ప్రసంగాన్ని ప్రారంభించారు నాలుగువైపుల నుండి రాళ్ళు విసరబడ్డాయి ఒకరాయి భారతీదేవి నొసటిపై పడి రక్తాన్ని చిందించింది. ఆమె తన పైటచెంగుతో గాయాన్ని ఒత్తిపట్టి మరింత ఉచ్చస్వరంతో ప్రసంగం సాగించారు జనం జమిందారుల కోటబురుజులపై దూకారు రంగాజీ లేచి మీరు ఘర్షణ్యాలకు దిగవద్దు మనం అహింసావాదులం. రండి వచ్చి కూర్చోండి. అని అంటుండగానే అందరూ శాంతపడి సభను జయప్రదం చేశారు. అదే భారతదేశంలో జమిందారీ ఉద్యమానికి నాంది పలికింది. జమిందారీ రద్దుకు శ్రీకారం చుట్టింది 1930లో "జమీన్ రైతు " అనే వార పత్రిక నెల్లూరు వెంకట్రామానాయుడుగారు సంపాదకులుగా 70 యేండ్లుగా నడుస్తున్నది. ఇదొక ప్రత్యేక సమగ్ర రచనగా సాగించవలసిన చరిత్ర. ఇదే రంగాజీ రాజకీయ ప్రవేశానికి కారణభూతమైనది కూడా.

# రంగా రాజకీయ ప్రవేశం - కేంద్ర శాసనసభకు ఎన్నిక

1930 సంవత్సరానికి జాతీయోద్యమ చరిత్రలో ఒక విశిష్టస్థానం వుంది అదే ! ప్రపంచాన్నే ఆలోచింపజేసిన ఉప్పు సత్యాగ్రహం. మహాత్ముడే దానికి అధినాయకుడు దానికి 'దండి ' సత్యాగ్రహమని కూడా పేరు మహాత్ముడే ముందు వరుసలో నిలబడి కదంత్రొక్కుతుంటే వందలాది మంది యోధులైన సత్యాగ్రహులు వెంటనడువగా ఆ మార్చి జరిగింది. అదే సంవత్సరము సైమన్ కమీషన్ బహిష్కరణ - కేంద్ర శాసన సభలో "సైమన్ కమీషన్" పై చర్చ లండన్‌లో ప్రధమ రౌండ్ టేబుల్ సమావేశం ఇలాంటివే మరెన్నో చారిత్రక సంఘటనలు చోటుచేసుకున్నాయి

1929 డిసెంబరులో లాహోర్ కాంగ్రెస్ సంపూర్ణ స్వాతంత్ర్యమే తన ధ్యేయంగా తీర్మానించింది ఈ తీర్మానం అమలు జరిపేటందుకు అనుసరించతగు కార్యక్రమం రూపొందించే బాధ్యత సర్వంసహాధికారంతో మహాత్మాగాంధీకి అధికారం అప్పగించటం జరిగింది

ఆచార్యరంగా ఈ చారిత్రక సంఘటన లన్నింటిని సునిశితంగా పరిశీలించారు పూర్తికాలం కాంగ్రెస్ కార్యకర్తగా పనిచేయటానికి నిర్ణయించుకున్నారు. ప్రొఫెసర్ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు. కాంగ్రెస్‌లో చేరారు. స్వాతంత్ర్యోద్యమ రణరంగంలో దూకారు. గాంధీజీ ప్రతిపాదించిన నిర్మాణ కార్యక్రమాలు చేపట్టారు హరిజనోద్యమంలో చేరి పనిచేయటానికి నిర్ణయించుకుని చిత్తూరు నుండి శ్రీకాకుళం దాకా అస్పృశ్యతా నివారణకు దోహదం చేసే హరిజన, గిరిజన, సవర్ణ, అవర్ణ కులాల సహపంక్తి భోజనాలు ఏర్పాటుచేశారు. హరిజనులను దేవాలయ ప్రవేశం చేయించారు విధి విరామము లేకుండా నిరంతరం ప్రజల్ని జాతీయోద్యమ రణరంగానికి సమాయత్తం చేశారు ఆనాడే "హరిజననాయకుడ"నే ఒక సాంఘిక నవలకు శ్రీకారం చుట్టారు

జాతీయ స్థాయిలో నాయకత్వంలో శాసనసభలలో చేరాలా, లేదా! శాసనసభలనే బహిష్కరించాలా ? అనే అంశంపై కాంగ్రెస్‌లో రెండు బలమైన వర్గాలు ఏర్పడ్డాయి. అందులో ఒక మురాకు మోతీలాల్ నెహ్రూ నాయకత్వం వహించారు. ఆయన "స్వరాజ్య పార్టీ" అనే పేరుతో పార్టీ పెట్టారు

ఆపార్టీ శాసనసభ బహిష్కరించాలని తీర్మానించింది దాంతో కేంద్ర శాసన సభలో అప్పటికే సభ్యులుగా వున్న ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశం పంతులు రాజీనామా చేశారు అలా కేంద్రశాసన సభలో ఖాళీ అయిన సీటుకు ఆచార్య రంగాను అభ్యర్థిగా ఆంధ్ర కాంగ్రెస్ ఎన్నిక చేసింది. పై సభ్యత్వానికి రంగాజీ ఏకగ్రీవంగా ఎన్నికయినారు ఆనాటికా సభలో వున్న జాతీయ మహా నాయకులలోశ్రీ బులాభాయ్ దేశాయ్, గోవిందవల్లపంత్, యస్ సత్యమూర్తి, నీలకంఠదాస్, యస్ వి.గాడ్గిల్, వి వి గిరి, యస్ యమ్ జోషి, మోహన్‌లాల్ సక్సేనాలు కాంగ్రెస్ బెంచీలలో ఉన్నారు. ఏ పార్టీతో సంబంధంలేని సప్రూ, జైకర్, జిన్నా ఇంకెందరో ప్రముఖులు వుండేవారు ఈ మహా యోధుల మధ్య రాజనీతిజ్ఞుల మధ్య కొత్తగా రాజకీయాలలో ప్రవేశించిన శ్రీ రంగా ఎలా రాణించగలరని అందరూ అనుమానించారు అలాంటి వారి అనుమానాలు తొలగించారు. పార్లమెంటరీ రంగంలో రాణించారు

రంగాజీ హాజరైన తొలి కేంద్ర శాసన సభలోనే పైన పేర్కొన్న విధంగా "సైమన్ కమీషన్" విచారణపై చర్చ, మొదట రౌండ్ టేబుల్ సమావేశంపై చర్చ ప్రారంభమైనది. కాంగ్రెస్ పార్టీ నాయకుడు శ్రీ బులాభాయ్ దేశాయ్ వద్దకు వెళ్ళి ఈ రెండు సమస్యలపై చర్చల్లో పాల్గొనే అవకాశం నాకూ ఇవ్వండి అంటూ అభ్యర్థించారు. బాబూ ! నీవు శాసన సభకు కొత్తవాడివి ట్రెజరీ బెంచెస్ (ప్రభుత్వ పక్ష ప్రతినిధులు) లో ఉన్నవారంతా విద్యాధికులు. పార్లమెంటరీ వ్యవహారాలలో బాగా ఆరితేరిన వారు. ప్రతిపక్షం నుండి మాట్లాడేవారు. సమర్థులైతే తప్ప మనకు మరియాద దక్కదు. అందువలన కనీసం వచ్చే సమావేశాల దాకా ఆగాలన్నారు కాదు! అలా వీలు లేదు. నేనిప్పడే మాట్లాడాలి నేను ఐదేండ్లుగా లండన్‌లో ఉన్న సమయంలో వారానికి రెండురోజులు, కనీసం ఒక్కరోజైనా బ్రిటీష్ పార్లమెంటరీ చర్చలను ఆసక్తిగా పరిశీలించాను. మా యూనివర్శిటీ "మాక్ పార్లమెంటులో" మాట్లాడాను. అనేక డిబేటుల్లో పాల్గొని అవార్డు అందుకున్నాను. నేను ఈ సమావేశంలో రానున్న బిల్లులపై, మరి ఇతర సమస్యలపై ప్రభుత్వ పక్షాన్ని ఎదిరించి మాట్లాడేందుకు అవసరమైన సమాచారాన్నంతా సేకరించుకున్నాను. అందువలన మన పార్టీకి ప్రతిష్ట తెస్తానే తప్ప అప్రతిష్ట కలిగించను. నాకు ఒక్క చిన్న అవకాశాన్ని ఇవ్వండి సరే - చూద్దాము తయారుకా అంటూ చర్చల్లో కాంగ్రెస్ పార్టీ తరుపున రంగాజీపేరును స్పీకర్‌కు పంపించారు.

రానే వచ్చింది అవకాశం అది 1930 జులై 10-12 తేదీలలో కేంద్ర శాసన సభ రౌండ్ టేబుల్ సమావేశాలకయ్యే అదనపు ఖర్చుల నిమిత్తం బడ్జెట్ కేటాయింపులను కోరుతూ బిల్లు ప్రతిపాదించారు. దానిపై ఆర్థిక వ్యవహారాల సభ్యుడు ప్రవేశపెట్టిన తీర్మానానికి జనాబ్ ఖియా మహమ్మద్ షానవాజ్ నూరు రూపాయల లాంఛనపు కోత విధిస్తూ సవరణ ప్రతి పాదించాడు దీనిపై మూడు రోజుల రసవత్తర చర్చ కొనసాగింది. ఈ చర్చల్లో కోత తీర్మానాన్ని బలపరుస్తూ, జాతీయ కాంగ్రెస్ ప్రతినిధిగా రంగాజీ ప్రసంగం ప్రారంభమైనది మహాత్మాగాంధీ వంటి ప్రజానాయకుడు ప్రతినిధిగా లేని రౌండ్-టేబుల్ సమావేశం భారతదేశానికి ప్రాతినిధ్యం వహిస్తుందా ? వహించదు. అని ఘంటాపదంగా చెప్పగలను. ఇందుకు ప్రపంచ ప్రజలు హర్షించరు కూడా. మహాత్మాగాంధీ భారత ప్రజల ఆరాధ్యదైవం మకుటంలేని మహారాజు ఆయన కేవలం కనుసైగతో ఇందుకు మేము వ్యతిరేకులమని చాటితే బ్రిటీష్ ప్రభుత్వం కూకటి వేళ్ళతోసహా కూలిపోతుంది అంటూ ఆవేశంగా ప్రసంగాన్ని కొనసాగిస్తున్నారు రంగాజీ ప్రసంగం ప్రారంభమై పది నిముషాలు దాటింది కేంద్రశాసన సభ ఆవిర్భావమైన ఈ పన్నెండేళ్ళలో సభానాయకుడు కూడా పదినిముషాలకు మించి ప్రసంగించిన సందర్భాలు లేవని సభలో కలకలం సభ యావత్తూ ప్రభుత్వ పక్షంతో సహా రంగాజీ ప్రసంగాన్ని ఆసక్తితో వింటున్నారు ఇదే సమయంలో మహమ్మద్ ఆలీ జిన్నా, సర్ సి.పి.రామస్వామి అయ్యర్ ప్రబృతులు మరికొందరు కూడా రంగాజీ ప్రసంగాన్ని అడ్డుకున్నారు అయినా రంగాజీ చలించలేదు ప్రసంగం ఆపలేదు. మరింత పట్టుదలతో అనర్గళంగా ప్రభుత్వ విధానాన్ని చీల్చిచెండాడారు. ఇరవై నిముషాలపై కాలం మాట్లాడి ఆయనే తన ప్రసంగాన్ని ముగించి కూర్చున్నారు ప్రభుత్వ పక్షంతో సహా హర్షధ్వానాలు ప్రకటించాయి కాంగ్రెస్ పక్షనాయకుడు శ్రీ బులాభాయ్ దేశాయ్ రంగాజీ సీటు వద్దకు పోయి ఆలింగనము చేసికొని ప్రత్యేక అభినందనలు తెలిపారు ఆ వారం అంతా దేశ విదేశాల నుండి రంగాజీ ప్రసంగాన్ని కొనియాడుతూ, అభినందిస్తూ జాబులు, టెలిగ్రాములు వందల సంఖ్యలోనే అందాయంట కేంద్ర శాసన సభలో రంగాజీ కీర్తి పతాకాన్ని ఎగురవేశారు.

ఒక్కవారం తిరక్కుండానే "సైమన్ కమీషన్ నివేదిక" పై చర్చ కొనసాగుతుండగా మహమ్మద్ ఆలీ జిన్నా నివేదికను సమర్ధిస్తూ ప్రసంగం చేశారు రంగాజీ చేయి పైకెత్తి స్పీకర్ దృష్టి నాకర్షించారు మాట్లాడమని స్పీకర్ ఆదేశించారు రంగాజీ సైమన్ కమీషన్ నివేదికను తీవ్ర పదజాలంతో విమర్శించారు. మహమ్మద్ ఆలీ జిన్నా నుద్దేశించి అయ్యా ! మీరు సైమన్ కమీషన్ నివేదికపై ఒక స్థిరమైన అభిప్రాయంతో ఉన్న బ్రిటీష్ ప్రభుత్వానికి నచ్చజెప్పగలరా ? అని నిలదీశారు గాంధీజీ వంటి ప్రజా నాయకులు ప్రధాన ప్రతినిధిగా లేని రౌండ్‌టేబుల్ సమావేశం విఫలం కాబోతుంది. కొద్ది రోజుల లోనే ఈ విషయాన్ని మీరే గమనిస్తారు

అలాగే మరోరోజు మూడవ తరగతి రైలు ప్రయాణీకుల ఇబ్బందుల గురించి, ఆహార పదార్థాల విక్రయం గురించి ప్రసంగించి మూడవతరగతి ప్రయాణీకులు మానవులే అనే విషయం మరిచిపోకండి. జాగ్రత్త. వారి కవసరమైన సదుపాయాలను సమకూర్చండి. అన్నారు. ఈ రైళ్ళు కేవలం ధనికులకు, ప్రభుత్వోద్యోగుల కొరకు మాత్రమేనా ? పేదప్రజలకు కూడానా? అంటూ ప్రశ్నించారు. ఆనాటి మూడవ తరగతి ప్రయాణీకులకు కూడా కొన్ని సౌకర్యాలు కల్పిస్తూ శాసనసభలో ప్రభుత్వం ప్రకటించింది. ఇది రంగాజీ సాధించిన విజయమేనంటూ సభ ప్రశంశించినది.

మరో రోజు భారతీయ గనుల సవరణ బిల్లుపై ప్రసంగిస్తూ అంతర్జాతీయ కార్మిక సంస్థ సిఫార్సుల మేరకు ఆనాటి వరకూ అమలులో ఉన్న రోజుకు తొమ్మిది గంటల పనికాలాన్ని ఏడుగంటల పనికాలంగా మార్చాలని శ్రీ రంగా ప్రతి పాదించారు. చర్చ ఆసక్తిగా, రసవత్తరంగానే కాక ఉద్రిక్తంగా కూడా జరిగింది నోటిమాట ఓటుతో కాక తలలు లెక్కించి నిర్ణయించాలని ప్రతిపాదించారు రంగాజీ ప్రతిపాదన ఒక ఓటుతో విజయం సాధించింది ప్రభుత్వం పరాజయం పాలయింది. ఆనాటి నుండి ఏడుగంటల పనికాలం ప్రారంభమైనది.

అటు తరువాత మరో సందర్భములో అప్పుడప్పుడే అభివృద్ధి పధంలో పయనిస్తున్న భారతీయ జౌళి వస్త్ర పరిశ్రమ నడుము విరిచే దిగుమతి చేసుకుంటున్న బ్రిటీష్ వస్త్రంపై దిగుమతి సుంకాన్ని తగ్గించే బిల్లును వాణిజ్య

సభ్యుడు సర్ మహమ్మద్, జఫరుల్లాఖాన్ ప్రవేశపెట్టగా రంగాజీ ఒక వాయిదా తీర్మానాన్ని ప్రవేశపెట్టారు ఆ తీర్మానంపై రంగాజీ మాట్లాడుతూ. ఈ బిల్లు భారతీయ జౌళివస్త్ర పరిశ్రమను విచ్ఛిన్నం చేసేదిగా వర్ణించారు. దిగుమతి సుంకాన్ని ఇంకా పెంచాలన్నారు ప్రభుత్వ విధానం భారతీయ ప్రజల అభివృద్ధిని, పరిశ్రమ అభివృద్ధిని కృంగదీయగలదన్నారు. అందువలన ఈ బిల్లునుపసంహరించుకోవలసినదిగా గట్టిగా పట్టుపట్టారు. దానిపై వాణిజ్య సభ్యుడు జఫరుల్లాఖాన్ మధ్యలో జోక్యం కల్పించుకుని బొంబాయి, అహమ్మదాబాదులలోని దేశీయ జౌళి వస్త్రపరిశ్రమల యజమానులు ప్రభుత్వ విధానంపై తమ అసమ్మతిని తెలియజేయనేలేదని అంటూ మధ్యలో మీకెందుకు అని వ్యంగ్యంగా పరిహసించారు. రంగాజీ మీ కుట్రలు వారికి తెలియదు. మీ దయా దాక్షిణ్యాలపై బ్రతకాలనుకుంటూవున్న భారతీయ జౌళి వస్త్ర పరిశ్రమల యజమానులు నోరు మెదపలేదంటే ఆశ్చర్యం ఏమీ లేదు. ఇందువలన జరిగే నష్టం ప్రజలకు కలుగుతుంది. బిల్లు ఉపసంహరించు కుంటారో ఓటింగ్‌కు తయారుగా వుంటారో మీరే నిర్ణయించుకోండి. అని ఒక సవాల్ విసిరారు. రంగాజీ ప్రతిపాదనను శ్రీయుతులు యస్. యస్, జోషి, అవినాశలింగ చెట్టియారు గోవిందవల్లభపంత్ బలపరిచారు. ఈ బిల్లుపై చర్చల సందర్భములో ప్రభుత్వ పక్షం, కాంగ్రెస్ పక్షం ఒకరిపై నొకరు తీవ్ర విమర్శనాస్త్రాలు సంధించుకున్నారు బిల్లు ఉపసంహరించు కొనబడినది.

ఇదే ఐదవ శాసనసభా సమావేశంలో వరుసగా నాలుగు ఘన విజయాలను రంగాజీ సాధించారు మొదటి సమావేశంలోనే సైన్యంలో భారతీయులను ఉన్నత అధికార పదవుల్లో నియమించాలని, జైళ్ళలో వున్న జాతీయ నాయకులను విడుదల చేయాలని, కార్మిక సంఘాలు స్థాపించుకొనే స్వేచ్ఛను కల్పించాలని, ఇలాంటివే మరెన్నో చర్చల్లో రంగాజీ పాల్గొని జయప్రదం గావించారు 1930లో ప్రకాశం రాజీనామాతో ఖాళీ అయిన స్థానములో ఎన్నికైన రంగాజీ ఈ మూడేళ్ళలోనే గొప్ప పార్లమెంటేరియన్‌గా రాజ నీతిజ్ఞుడుగా ప్రఖ్యాతి వహించారు 1934లో జరిగిన కేంద్ర శాసనసభ ఎన్నికలలో గుంటూరు, నెల్లూరు స్థానాలకు కాంగ్రెస్ అభ్యర్థిగా నిర్ణయించడం జరిగి అఖండ విజయం సాధించారు

# ముందు సహకార వ్యవసాయం అనే మాయ
# తరువాత సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు

"**1957** ఎల్వాల్" లో వినోబా భావే, జయప్రకాష్, పండిట్ నెహ్రూ రైతుల భూమిపై హక్కును తొలగించి, కట్టుబానిసలుగా మార్చేందుకు సాగించిన పెద్ద కుట్ర. (**1957** అక్టోబరు - ఎల్వాల్ కర్నాటక రాష్ట్రం)

ఈ కుట్ర రంగాజీకి అర్థమైంది. పోరాటం సాగించారు. అదే బందరులో కృష్ణాజిల్లా కిసాన్ సమ్మేళన్ మహాసభలో రంగాజీ ప్రసంగం. ఆనాడా ప్రసంగం రైతుల కళ్ళు తెరిపించింది. పోరాటమునకు సమాయత్తమయ్యారు. ఆ పోరాటం యావత్ భారతదేశానికి వ్యాపించింది. ఆ కుట్రను భగ్నం చేశారు. రంగాజీకి జయం కలిగింది. రైతుల రక్షించబడ్డారు. ఇక రంగాజీ ఆనాటి ప్రసంగం చదవండి.

భూమిపై యజమాన్యం ఎవరిది ? ఈ ప్రశ్న భారత జాతీయోద్యమ అగ్రనాయకుడు పండిట్ నెహ్రూకు మనస్సులో మెదలింది. అప్పటికే సోవియట్ యూనియన్‌లో స్థాపించబడిన కమ్యూనిష్టు ప్రభుత్వము రైతులకు వ్యతిరేకంగా అనేక కార్యక్రమాలు చేపట్టింది. భూమిపై యాజమాన్యపు హక్కును రైతుల నుండి తొలగించాలని నిర్ణయించారు భూమి యావత్తు ప్రభుత్వ యజమాన్యం క్రింద సాగుచేయవలసిందేనని నిర్ణయించారు అలా సాగుచేసే వ్యవసాయ విధానానికి "సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగా" నామ కరణం చేశారు. వ్యవసాయ క్షేత్రాలలో భూమిపై హక్కు ఏ ఒక్కరికీ ఉండదనీ. అలా ఉండకూడదనీ చట్టం చేశారు అంతేకాదు. రైతులకు ఓటు హక్కును కూడా రద్దుచేశారు. రైతులకు ఓటుహక్కు లేకుండా చేసిన తరువాత ఏర్పడే ప్రభుత్వానికి ఏకపక్ష కార్మిక నియంతృత్వ ప్రభుత్వమని నామకరణం చేశారు. అలా ఏర్పడిన సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో ఆనాటి వరకూ భూమిపై సర్వతంత్ర స్వతంత్ర హక్కులుగల రైతులను రోజువారీ కూలీలుగా మార్చివేశారు అంతటితో ఆగినా రైతులకు కొంతమేలు చేసినవారు అయ్యేవారు కానీ ఆ చిన్న వెసులుబాటు కూడా వారికి కల్పించలేదు. వారిని కట్టుబానిసలుగా మార్చారు జలుబో, జ్వరమో, దగ్గో. పడిశమో పట్టి పనికి పాలుమాలిన రైతులను తిరుగుబాటు దారులుగా నిర్ణయించి మూకుమ్మడిగా వేలకొలది మంది రైతులను లారీలలో కుక్కి సైబీరియా ఎడారులకు తోలుకొనిపోయి చిత్రవధలు చేసి గోతులలో తోశారు.

ఇదీ ఆనాడు రష్యాలో జరుగుతున్న ఘోరమైన రాక్షస చర్య. ఇలాంటి పాశవిక పాలనా విధానాన్ని పండిట్ నెహ్రూ అభివృద్ధి దాయకమైనదిగా, విప్లవాత్మకమైనదిగా ఎంచి రష్యాలో మాదిరి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను స్థాపించ నిర్ణయించారు అందుకు అవసరమైన ఆమోదాన్ని కాంగ్రెసు నుండి పొందాలి "ఆవడి" కాంగ్రెసులో సహకార వ్యవసాయ విధానాన్ని ముందుగా ప్రవేశపెట్టారు ఒక్కొక్క కుంటుబానికి ఉండవలసిన భూమి పరిమితిని నిర్ణయించాలని తీర్మానం ఆమోదింపచేశాడు

## పండిట్ నెహ్రూను రంగాజీ విభేదించింది ఎందుకు అధికారం కొరకా ?

కాదే ! అప్పటికే ఆచార్య రంగా పండిట్ నెహ్రూ నాయకత్వంలోని కాంగ్రెసూ, కేంద్ర ప్రభుత్వమూ చేపట్టే రైతాంగ వ్యతిరేక విధానాలను ఎదిరించడం ప్రారంభించారు ।౨౫। నాటికే రంగాజీ కాంగ్రెసు నుండి విడిపోయి "కృషికార్ లోక్ పార్టీ" అనే రాజకీయ పక్షాన్ని స్థాపించారు దానికి రంగాజీ అధ్యక్షుడు కాంగ్రెసులో ఉన్నంత కాలం ఆచార్య రంగాజీ, పండిట్ నెహ్రూ సాగిస్తున్న రైతాంగ వ్యతిరేక విధానాలను అడుగడుగునా ఎదుర్కొంటునే ఉన్నారు కానీ అప్పట్లో రంగాజీ బలం చాలలేదు. స్వాతంత్రోద్యమ రధసారధిగా, కేంద్ర ప్రభుత్వ ప్రధానిగా పండిట్ నెహ్రూ దేశ ప్రజలలో అపారమైన, అనుపమానమైన, అసాధారణమైన ప్రజాదరణ పొందియున్నారు పండిట్ నెహ్రూ రైతాంగ వ్యతిరేక విధానాల పట్ల కష్టంగా ఉన్నా, బాధపడుతున్నా ఆయనను ఎదిరించి నిలబడే సత్తా ఆనాటి కాంగ్రెసు నాయకులలో ఎవరికీ లేదు. లోలోపల గొణుక్కున్నారే గానీ నోరు తెరచి నీవు తప్పచేస్తున్నావని ధైర్యంతో చెప్పే సాహసమే లేదు ఆనాటి కాంగ్రెసు నాయకులకు

ఈ నేపధ్యంలో రంగాజీ ఒక్కరే వంటరిగా భారతములోని అభిమన్యుని వలే పండిట్‌నెహ్రూను ఎదిరించ సాహసించారు పోరాటం ప్రారంభించారు దేశవ్యాప్తంగా మహోద్యమాన్ని చేపట్టారు ప్రజలలో చైతన్యాన్ని కలిగించారు పోరాటం సాగుతుంది ఈ మధ్య కాలంలో దేశరాజకీయ చరిత్రలో అనేకము లైన అనూహ్య పరిణామములు సంభవించాయి.

## ఈ నేపథ్యంలో 1952లో జరిగిన తొలి ఎన్నికలు- ఒక విశ్లేషణ

అందులో ఒకటి స్వతంత్ర భారతములో జరిగిన తొలి ఎన్నికలలో కాంగ్రెసు తుడిచిపెట్టుకు పోయింది. లోక్‌సభలో నాలుగైదు నియోజక వర్గాలలో తప్ప మొత్తంగా కమ్యూనిష్టులే ఎన్నికయ్యారు రాష్ట్ర శాసనసభ లోనూ వారిదే పైచేయి. లోక్‌సభలోనూ వారిదే పై చేయి అయినది ఆచార్య రంగా ఆంధ్రకేసరి ప్రకాశంపంతులూ వేరువేరు కారణాలతో కాంగ్రెసుకు దూరం అయ్యారు ఈ ఇరువురు కాంగ్రెసు మహానాయకులైనా కలసి ఉన్నారా? లేదే! చెరొక సొంత కుంపటి పెట్టుకున్నారు. గుంటూరు పార్లమెంటు నియోజక వర్గంలో రంగాజీ, ఒంగోలు శాసన సభనియోజక వర్గంలో ప్రకాశం పంతులు ఓడిపోయారు. రంగాజీ రాజ్యసభకు ఎన్నికయ్యారు. ఇది ఆనాటి కథ

## ముఖ్యమంత్రి గా మదరాసులో రాజాజీ ప్రభుత్వం

మదరాసు రాష్ట్రంలో కాంగ్రెసుకు వ్యతిరేక ప్రభుత్వాన్ని నెలకొల్పాలని కమ్యూనిష్టు పన్నాగం. అయితే వారికి సొంతంగా మెజార్టీలేదు. అందుకని ప్రకాశాన్ని అసెంబ్లీ నాయకునిగా ఎన్నుకొని ముఖ్యమంత్రిని చేయాలను కున్నారు. ముఖ్యమంత్రి పదవి ఆశతో కమ్యూనిష్టుల వలలో చిక్కాడు ప్రకాశం. ఆంధ్రా, తమిళ, కర్నాటక, మళయాళ భాషా ప్రాంతాలతో ఒక విశాల రాష్ట్రంలో కమ్యూనిష్టుల పెత్తనం కింద ప్రభుత్వం ఏర్పడటం పండిట్ నెహ్రూకు ఇష్టం లేదు. ఏమిటి కర్తవ్యం ? ఆలోచించాడు నెహ్రూ ఏ సభలోనూ సభ్యుడు కానీ రాజాజీని శాసనసభా నాయకుడిగా నిర్ణయించాలనుకున్నారు. అడిగారు ఆయనను రంగాజీ నాకు సహకరిస్తే ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి ప్రయత్నిస్తాను అన్నారు రాజాజీ. రంగాజీని ఒప్పించే ప్రయత్నమేదో మీరే చేయండని రాజాజీని అభ్యర్థించారు నెహ్రూ సరే నన్నారు రాజాజీ రంగాజీకి కబురు పెట్టారు. రాజాజీ ఆహ్వానంపై రంగాజీ మద్రాసు చేరుకున్నారు. విషయమంతా సమగ్రంగా రంగాజీకి నివేదించారు రాజాజీ! అంతా విని మదరాసు రాష్ట్రంలో కమ్యూనిష్టుల పెత్తనాన్ని సాగకుండా చేయడమే నాకు కావలసింది మీ ఇష్టం వచ్చినట్లుగా మీకు కావాలనుకున్న

వారితో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోండి. నేను మీకు పూర్తిగా సహకరిస్తాను. అందుకు రాజాజీ రంగా! నీవు నా మంత్రివర్గంలో ఉప ముఖ్యమంత్రిగా చేరకూడదూ! నాకూ గౌరవంగా ఉంటుంది. నీవు ప్రజల సేవలో అధికారాన్ని ఉపయోగించుకోవచ్చు. క్షమించండి. నాకే పదవీ వద్దు. బేషరతుగా మీతో సహకరిస్తా నాకు కావలసినదల్లా కమ్యూనిష్టుల ఏకపక్ష కార్మిక నియంతృత్వాన్ని అడ్డుకోవడమే ఇదీ ఆనాటికథ ఆ తరువాత ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోసం ఉద్యమాలు సాగడం, పొట్టి శ్రీరాములు ఆత్మార్పణతో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడటం జరిగింది. అనేక వివాదాలు, అందోళనలు, రాజకీయ కుట్రలు కుతంత్రాలు సాగి ఎట్టకేలకు కర్నూలు రాజధానిగా ఏర్పడింది. కాంగ్రెసుకు మెజార్టీ లేదు కదా ! ప్రకాశంగారిని కలుపుకున్నారు. ప్రకాశం ముఖ్యమంత్రిగా ఎన్నికయ్యారు. ఒక్క ఏడాది అంటే ఒక్క ఏడాది తిరక్కుండానే ఆ ప్రభుత్వం కుప్ప కూలిపోయింది. గవర్నర్ చందూలాల్ త్రివేది నాయకత్వంలో రాష్ట్రపతి పాలన ఏర్పడింది. ఆరు నెలల అనంతరం ఎన్నికలు జరిగాయి. ప్రకాశం పంతులుగారి ప్రజాపార్టీ, ఆచార్య రంగాగారి కృషికార్‌లోక్ పార్టీ, కాంగ్రెసు ఈ మూడు పార్టీలు ఏకమై ఐక్య కాంగ్రెసుగా ఏర్పడి కమ్యూనిష్టులతో తలపడి పోటీ చేశాయి. 1952లో ఎలాగైతే మూకుమ్మడిగా కమ్యూనిష్టులు విజయం సాధించారో 55లో అలానే మూకుమ్మడిగా పరాజయం పొందారు. ఇది రంగా గారికి ఒక గొప్ప విజయం అనుటలో సందేహం లేదు

అసలు విషయానికి వద్దాం. మనముందున్న సమస్య సహకార వ్యవసాయం. అదే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు. దీనిని ఎదిరించాలి రైతులను రక్షించుకోవాలి. ఇదే రంగాగారి ప్రధాన ఆశయం ,అందుకే నెహ్రూతో పోరాటం సాగించారు. 1952లో కమ్యూనిష్టు చేతిలో ఘోరపరాజయం పొందిన కాంగ్రెసుకు పునర్జీవనం కలిగించాలనే తలంపుతో పండిట్ నెహ్రూ ఆపద్ ధర్మముగా రంగాజీకి లొంగిపోయారు కానీ సహకార వ్యవసాయ విధానాన్ని స్థాపించాలనే నిర్ణయంలో మార్పురాలేదు.

ఇది ఇలా ఉంటే వినోభాభావే మరోవైపునుండి సర్వోదయం పేరుతో రైతులనుండి ఇచ్ఛికంగా భూదానం చేయమని ఒక ఉద్యమాన్ని స్థాపించారు ఆ ఉద్యమానికి జయప్రకాష్ నారాయణ తోడ్పాటు లభించింది. దేశవ్యాప్తంగా

ప్రచారం ప్రారంభించారు పండిట్ నెహ్రూ తాను స్థాపించదలంచిన సహకార వ్యవసాయ విధానాన్ని వినోబా భావేసాగిస్తున్న భూదానోద్యమం ద్వారా సఫలీకృతం చేయాలని కుట్ర ప్రారంభించారు వినోబాభావే, జయప్రకాష్ నారాయణ వందలాది సర్వోదయ కార్యకర్తలతో పాదయాత్రపై కర్నాటక చేరుకున్నారు.

## అదే ఎల్వాల్ కుట్ర

కర్నాటకలోని ఎల్వాల్ అనే గ్రామం వద్ద వినోబాభావే బృందంతో ప్రధాని పండిట్ నెహ్రూ వచ్చి చేరారు ఇచ్చటనే భూమిపై రైతుల యజమాన్య హక్కును సహకార వ్యవసాయ విధానం పేరుతో సాగించాలని. ఒక పెద్ద కుట్ర ప్రారంభమైనది. వినోభాభావే ఆనాడు అచ్చట చేసిన ఒక ప్రసంగాన్ని గమనిస్తే ఇది ఎంతటి దుర్మార్గమైనదుష్టతలంపో సులభంగా అర్థమవుతుంది. ఆకాశం, నీరు, నిప్పు, వాయువు, భూమి ఈ ఐదు పంచభూతాలు. భూమిని మినహాయించితే మిగతా, నీరు, నిప్పు, ఆకాశం, వాయువు ఎలా ఒకరి నియంత్రణలో లేకుండా మానవులతో సహా యావత్ జీవకోటి స్వేచ్ఛగా ఎలా అనుభవిస్తున్నారో భూమి కూడా అందులో ఒకటే. అందువలన భూమిపై ఏ ఒక్కరికీ అధికారం ఉండటానికి వీలులేదు. యాజమాన్యపు హక్కు ఉండరాదు. భూమియావత్తూ సంఘానికే చెందుతుంది. అంటే భూమి అంతా ప్రభుత్వానిదే అన్నమాట. ఇదీ ఆనాడు ఎల్వాల్‌లో వినోబాభావే, జయప్రకాష్ నారాయణ, పండిట్ నెహ్రూ ఈ ముగ్గురు మహానాయకులు చేసిన ప్రసంగాలతీరు. ఇది కేవలం ఉపన్యాసాలతో సరిపెట్టుకునేదికాదనీ, దీనిని ఆచరణలో పెట్టడానికి ప్రధాని పండింట్ నెహ్రూ తయారుగా ఉన్నాడని రంగాజీకి తెలుసు. ఈ కుట్ర పూర్వాపరాలన్నీ రంగాజీ అవగాహన చేసుకున్నారు ఇంకెంత మాత్రం నెహ్రూ ప్రభుత్వం పట్ల ఉదాసీనభావంతో ఉండరాదు. ప్రభుత్వంపై పోరాటానికి రైతాంగాన్ని సమాయత్త పరచాలని నిర్ణయించుకున్నారు. ప్రజలకు పిలుపు నిచ్చారు రంగాజీ.

బందరులో 1957 అక్టోబరు 2వ తేదీన క్రిష్ణా జిల్లా కిసాన్ సభలు ఏర్పాటు చేశారు. లక్షల సంఖ్యలో రైతులు హాజరయ్యారు. ఆనాడు ఆ సభలో రంగాజీ ప్రసంగం నిప్పులు కురిపించింది. ప్రధాని పండిట్ నెహ్రూ తలపెట్టిన కుట్రను వివరిస్తూ చేసిన ప్రసంగాన్ని యీ క్రింద చూడండి.

# సహకార వ్యవసాయ విధానం
# రైతాంగ ఆర్థిక వ్యవస్థను విచ్ఛిన్నం చేస్తుంది

(అక్టోబరు 9వతేదీన బందరులో జరిగిన కృష్ణాజిల్లా కిసాన్ సమ్మేళన్ మహాసభ ప్రారంభించుచూ ఆచార్య రంగాగారు చేసిన ప్రసంగమును, వ్యాస రూపంలో ఇక్కడ ప్రచురించుచున్నాము. యువకర్షక సంపాదకుడు)

ప్రపంచంలో కుటుంబ ఆర్థిక వ్యవస్థకు మాతృక మన భరతభూమి ఈ భూమిలో స్వయం పోషకత్వం స్వయం నిర్ణయాధికారం గలిగియున్న అత్యధిక ప్రజలు రైతులు. మనం రైతులం. మన సృజనాత్మకమైన కాయకష్టం, ఉత్పత్తి శక్తులతో దాని సత్ఫలితాలను పొందుతూ అదే విధంగా ఇక ముందు గూడా మనం మనగలగాలనీ వాంఛిస్తున్నాం. మనం స్వతంత్రంగా మనగలగడానికి ఏ ఒక్క వర్గానికి చెందిన శ్రమజీవులనూ దోపిడీ చేయలేదు. చేయనుంకించటం లేదు. మన మనుగడ, మన జీవనోపాధి దోపిడీ రహితమైనది. అధునాతన సమాజం నాగరికత ప్రపంచంలో శాశ్వతంగా మనుటకు ప్రాధమికావసర వస్తువులను ఉత్పత్తి జేసేందుకు మనం భూమిని దున్నుతున్నాం. సేద్యం చేస్తున్నాం. ఏ ఒక్కరి క్రిందా పనిచేయటం లేదు. ఎవరి దోపిడీకి గురికారాదు ఒకరు మన క్రింద దోపిడీ చేయబడరాదు మనదేశంలో స్వయం పరిపాలనా ఆర్థిక ప్రజాస్వామిక వ్యవస్థ నిర్మాణానికి మనమే పునాదులం అదే మన ఆర్థిక వ్యవస్థలోని ప్రత్యేకత ఈ దేశంలో నాలుగు కోట్లకు పైబడివున్న చేతివృత్తుల శ్రామికులు గూడా అదే కోవకు చెందినవారే వారిదీ దోపిడీ రహితమైన ఉత్పత్తి దారుల వర్గం వారూ కుటుంబ ఆర్థిక వ్యవస్థ పునాదులమీదనే ఉత్పత్తి కార్యక్రమాన్ని సాగిస్తున్నారు వారు ఆర్థిక స్వయం పోషకత్వం గలవారు అదే అంతస్థులో బలపడాలని వారి ఆకాంక్ష అదే దృష్టితో తరాల తరబడిగా కొనసాగుతూ వస్తున్న ఆర్థిక స్వాతంత్ర్యం, వికేంద్రీకృత సోషలిస్టు జీవిత విధానంపై ఆధారపడిన కుటుంబ ఆర్థిక వ్యవస్థ సంరక్షణలో వారిని మన సహచరులుగా గుర్తిస్తున్నాము అందుకే భారత రైతాంగం కుటీర పరిశ్రమలను, చేతివృత్తులను, నాలుగుకోట్ల చేతివృత్తుల వారిని కళాకారులను సోదర పూర్వకంగా గౌరవించుకుంటున్నాము.

మనం అనుకూలమైన సామాజిక వాతావరణాన్ని సృష్టించినప్పుడు అత్యవసర పరిస్థితుల్లో అవసరాలకు కావలసిన ముడి పదార్థాలను ఉత్పత్తి చేయుటలో, తద్వారా దేశభక్తిని ప్రదర్శించుటలో మనమెప్పుడు వెనుకంజ వేశామో, రుజువుచేయమని సవాలు చేస్తున్నాం. దేశ విభజనా నంతరము, పాకిస్తాన్ బెదిరింపుల నెదుర్కొనుటకు, దేశాన్ని సేవించుటకు, నార అధికోత్పత్తి చేయుటకు పిలుపు వచ్చినప్పుడు వెంటనే ఆ పిలుపు నందుకొన్నాము దేశంలో ఆహారకొరత యేర్పడినప్పుడు కనీస ఆర్థిక సహకారంతోనే మనం ప్రథమ పంచవర్ష ప్రణాళిక అంచెనాలను మించి అధికోత్పత్తి సాధించాము మన పంటకు గిట్టుబాటైన ధరలుంటాయని హామీ లేనప్పుడు, మన నూనె గింజలకు నూనె ఎగుమతి సౌకర్యాలు కలిగించుటలో ప్రభుత్వ విధానము దిగజారి పోతున్నప్పుడు గూడా మన కుటుంబ ఆర్థిక వ్యవస్థను చెక్కు చెదరకుండా నిలుపుకోగలిగాము. స్వల్పమైన ప్రభుత్వ సహాయంతోనే గత పది సంవత్సరాలలోను ఎంతో పోరంబోకు భూమిని సాగుచేసి, పండించగలిగాము. అదే పనిని ప్రభుత్వం సర్వావకాశాలను వినియోగించినప్పటికీ రైతులు పొందిన ఫలితాలను పొందలేక పోయింది.

దేశం యొక్క ఆర్థిక పునాదులను బలపరిచేందుకు జాతీయ ఆర్థిక వ్యవస్థను పునర్వ్యవస్థీకరించేందుకు యావత్తు రైతాంగమూ చారిత్రక పరీక్షలకు నిలబడి తమ సర్వశక్తులూ వొడ్డి సమాజంలోని ఇతర వర్గాల కంటే ముందడగు వేసినప్పటికీ, రైతాంగపు కుటుంబ ఆర్థిక వ్యవస్థ విఫలమైందనీ తాము ఆశిస్తున్న సోషలిష్టు సమాజ నిర్మాణానికి రైతు స్వామ్య స్వయంపోషకత్వ విధానం నిరుపయోగమని దేశంలోని రాజకీయ పార్టీలు భావించటం శోచనీయం కాదా ? జాతి సర్వతో ముఖాభివృద్ధికి అవరోధం కాదా ? ప్రజాస్వామిక సూత్రాలకు విరుద్ధం కాదా ?

మన సాంఘిక వ్యవస్థలో మనం నిర్వహిస్తున్న నిర్మాణాత్మకమైన, అభివృద్ధికరమైన పాత్రను, నిజమైన మానవ ప్రమాణాలతో కూడుకొన్న ప్రజాస్వామిక, వికేంద్రీకృతమైన గాంధేయ సోషలిస్టు తరహా సమాజ నిర్మాణానికి మనం సలుపుతున్న కృషిని కేంద్రంలోని కాంగ్రెసు ప్రభుత్వం ఎందుకు విస్మరిస్తున్నదో అడగవలసిన హక్కు మనకు లేదా ? స్వయం పోషకత్వంతో కూడుకొన్న దోపిడీ రహితమైన రైతాంగ ఆర్థిక వ్యవస్థ స్వేచ్ఛా

సమాజ నిర్మాణానికి, సాంఘిక పురోభివృద్ధికి ఎందుకు తోడ్పడదో వివరించ వలసిందిగా సోషలిస్టు సిద్ధాంతాలపై నడుస్తున్న పార్టీలకు ముఖ్యంగా కాంగ్రెసు పార్టీని మనం ప్రశ్నిస్తున్నాము.

పెట్టుబడీదారీ, కమ్యూనిష్టు విధానాల దుష్ఫలితాలను అధిగమించి కొన్ని కమ్యూనిస్టు దేశాలలో తిరిగి స్వతంత్ర జీవనోపాధిని సాధించుకొన్న రైతాంగ కళాకారుల ఆర్థిక వ్యవస్థ చలనం లేనిదని, అభివృద్ధిదాయకమైందని - వికేంద్రీకృత ఆర్థిక వ్యవస్థను, స్వయంపోషకత్వ సహకార సోషలిష్టు విధానాన్ని గాంధేయ దోరణి ప్రేమిస్తున్న ప్రతి ఒక్కరూ అంగీకరించాలి గదా !

ఈ వ్యవస్థను రూపువూపడం తమ ఉద్దేశ్యం కాదని కేవలం ప్రత్యామ్నాయ సూచనలుగా మాత్రమే రైతులు-చేతివృత్తులవారి ముందు పెడుతున్నామని రాజకీయ పార్టీల నాయకులు చెప్పవచ్చు. అయితే వారు విశ్వసిస్తున్న సహకార వ్యవసాయం, పంచాయితీ అజమాయిషీ ఏ దేశంలోనైనా, ఎప్పుడైనా అధికోత్పత్తిని, స్వాతంత్ర్యాన్ని రైతులకు విశ్రాంతిని, సుఖాన్ని ఇచ్చినవని చెప్పగలరా ? జాతీయ సంపదను దుబరా కాకుండా చేయగలిగారా ? కాగా రైతాంగ ఆర్థిక వ్యవస్థలో భూసార రక్షణ, అధికోత్పత్తి, సాంఘిక భద్రత, ఆర్థిక స్వేచ్ఛ సాదించబడినవని అంగీకరించరా ?

వ్యవసాయపు పరికరాలు, సాంకేతిక వస్తువులు, ఎరువులు, గిడ్డంగులు మొదలుగా గల సౌకర్యాలను పొందుటకు రైతులకు సహకార సంస్థలు అత్యవసరమనే సత్యాన్ని అందరు గుర్తిస్తారు ఈ సౌకర్యాలను సమకూర్చు కొనేందుకు ఈనాడు రైతాంగం తమ ఉత్పత్తిలోని అధిక భాగాన్ని వెచ్చించవలసి వస్తున్నది కూడా రైతులు, ప్రభుత్వం, రాజకీయపార్టీలు సహకరించుకొని సహకార సంస్థల ద్వారా పై అవసరాలను తీర్చుకోవడమూ ఎంతైనా అవసరం అంత మాత్రంచేత పూర్తిగా రైతాంగ వ్యవస్థనే హతమార్చి, రైతుల యావత్తు జీవితాన్ని సహకార వ్యవసాయంలో ఇరికించి సహకార వ్యవస్థ క్రింద బానిసలను చేయడం సామాజికంగా తమకు గల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, ఆర్థిక హక్కులనే హరించడం తగని పని

వాస్తవానికి రైతాంగ వ్యవస్థలో వ్యవసాయాన్ని దేశోపయోగకరంగా కట్టుదిట్టంగా అభివృద్ధి చేయువచ్చు వ్యవసాయాభివృద్ధికి అవసరమయిన

భూమి కోత, తెగుళ్ల, పశువ్యాధుల నివారణ చర్యలు తీసుకొనుటకు రాష్ట్ర ప్రభుత్వాల సహాయం ఎంతైనా అవసరం ఈ కార్యకలాపాలలోను, ప్రణాళికా బద్ధంగా పంటలను పండించుటలోనూ, స్థానిక జాతీయ ప్రణాళికా నిధులు, రైతులు పరస్పరం సహకరించుకొని కార్యక్రమాన్ని కొనసాగించవచ్చు ఈ విధమైన నిర్మాణాత్మక కృషి రైతాంగ కుటుంబ ఆర్థిక వ్యవస్థకు దెబ్బ తగల కుండా ఇంగ్లండులో విజయవంతంగా నిర్వహించబడుతున్నా, మన ప్రణాళికా నిర్వాహకులు ఈ విధానాన్ని దృష్టిలో పెట్టుకొని గ్రామీణ ఆర్థిక వ్యవస్థను రూపొందించుటకు బదులు, అభివృద్ధి దాయకమైన ఆ వ్యవస్థనే రూపుమాపే ప్రతిపాదనలు చేస్తున్నారు. ఈ విధంగా గ్రామంలోని భూములన్నీ, వ్యవసాయాన్నీ గ్రామ పంచాయతీ స్వాధీనం క్రిందకు అజమాయిషీ క్రిందకు తీసుకురావలసిన అవసరమేమిటో కమ్యూనిస్టేతర పార్టీలు సమాధాన మివ్వవలసి ఉన్నది. ఈ విధానం మంచి పంట నిస్తుందనీ, ఉత్పత్తి కార్యక్రమాన్ని మరింత చురుకుగా సాగిస్తుందనీ భావిస్తున్నారా ? భూములు, పశువులు, వ్యవసాయ సాధనాలు, సంపద గ్రామ సమిష్టి అజమాయిషీ క్రింద ఉన్నచో చురుకుదనం సామర్థ్యం పెరుగుతుందనా ? వ్యయం తగ్గుతుందనా ? నిర్మాణాత్మకంగా పని జరుగుతుందనా ? ఏ దేశంలోనైనా అది ప్రజాస్వామిక వ్యవస్థగానీ, నియంతృత్వ వ్యవస్థగానీ గత పది సంవత్సరాల కాలంలో పై విధంగా ఫలితాలు సాధించబడిన సాదృశ్యాలేమైనా వున్నాయని చెప్పగలరా? దాదాపు పదికోట్లకు పైగావున్న వ్యవసాయదారుల, వారి నిర్మాణాత్మక శక్తికి వ్యతిరేకంగా వారి ఆర్థిక వ్యవస్థను రూపుమాపే ఉద్యమాన్ని లేవదీయటం వారి స్వత్వాలను హరించటం, వారి స్వేచ్ఛను మంటగలపటం వివేకంతో కూడుకొన్న పనేనా ?

సహకార సంఘాల గ్రామ పంచాయితీల పరిపాలన ఎంతటి అధ్వాన్నపు స్థితిలో ఉన్నదో రాజకీయ పార్టీల నాయకులు, జాతీయ ప్రణాళికా నిర్ణేతలు గుర్తించలేకపోవటం శోచనీయం కాదా ? ఉత్తరాది రాష్ట్రాలవారి కంటే హెచ్చుగా ఈ సంస్థలను స్థాపించుకొని పనిచేసిన కోట్లాది దాక్షిణాత్యులకు ఇందులోని సాధక బాధకాలు బాగా తెలుసు ఈ సంస్థలలో నిజాయితీ, నిష్పాక్షిక ధోరణి, చిత్తశుద్ధి మచ్చునకైనా లేవని దక్షిణాదిరాష్ట్ర ప్రజలకు తెలుసు. అలాంటి లోప భూయిష్టమైన సంస్థలకు మానవుని

జీవితానికి ప్రాధమికావసరమైన భూమిని, తదితర ఉత్పత్తి సాధనాలనే ఇచ్చి వేస్తే సంఘజీవితం ఎంత భయంకరంగా వుండగలదో ఊహకందని విషయం కాదు. సహకార సంస్థల రిజిస్ట్రేషన్‌కు పాటుపడింది మనం పంచాయతీల నిర్మాణానికి కృషిచేసింది మనం. అందులోని సాధక, బాదకాలు అందరికంటె హెచ్చుగా మనకి తెలుసు. అందుచేత మనమే చెపుతున్నాము మానవుని దైనందిన జీవితానికి ప్రాధమిక అవసరాలయిన ఉత్పత్తిని, ఉత్పత్తి సాధనాలను, గ్రామీణుల స్వేచ్ఛను, స్వయంశక్తిని ఆ సంస్థలకు దారాదత్తం చేయవద్దనీ, అది అపాయకరమని అందులో అనుభవం గల మన మాటకు విలువ నివ్వవలసిన అవసరం లేదా ? పంచాయితీల, సహకార సంస్థల ఎన్నికలలో జరుగుతున్న గూడుపుఠానీలు, పరిపాలనలో కానవస్తున్న తతంగాలు తద్వారా ప్రజలనుభవిస్తున్న బాధలు, నష్టాలు, ఆసంస్థల దైనందిన కార్యకలాపాలలో బయలుదేరుతున్న లిటిగేషన్లు, ఆరోపణలు, ప్రత్యారోపణలు మొదలగు వాటితో గత పది సంవత్సరాలలో ఎంత బురదచిమ్మిందో, గ్రామ జీవితం ఎంత వరకు కలుషితమైందో ఈనాటి ప్రజాస్వామ్య ప్రియులైన రాజకీయ పార్టీల నాయకులు పరిశీలించుటకైనా ప్రయత్నిస్తున్నారా ? వారు చిత్తశుద్ధితో ఆ ప్రయత్నం చేయగలిగితే ఈ నాటి ఆర్థిక వ్యవస్థకు ప్రత్యామ్నాయంగా భూమినంతా పంచాయతీల స్వాధీనం చేయాలనే ఆలోచనను అంత తేలికగా బలపరచగలిగే వారు కాదు.

భూమి గ్రామానికంతకూ సమిష్టి ఆస్థి అనీ, సహకార కమతాల ద్వారా ఉత్పత్తి సాగాలనీ, ఈనాడు గ్రామదానోద్యమం యిస్తున్న సవాలును ఎదుర్కొనేందుకు గూడా మనం తయారుగా ఉన్నాం గ్రామదానోద్యమం ప్రబోధిస్తున్న వ్యవసాయ విధానం, చైనాలో అభివృద్ధికరంగా సాగుతున్నదని చెప్పబడే సహకార వ్యవసాయ విదానం కన్నా, రష్యాలో అమలునందున్న "కోల్‌ఖోజ్ " లేక "సోల్ ఖోజ్ "ల (సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు) కన్నా భారతీయ, రైతాంగ ఆర్థిక వ్యవస్థలో హెచ్చు ఉత్పత్తి ఔతుందనీ, చిన్న చిన్న కుటుంబ కమతాలు మరింత గిట్టుబాటుగా వుంటాయనీ, ఎకరానికి సగటు ఉత్పత్తి హెచ్చుగా వుంటుందనీ, వ్యవసాయుదారునకు ఆర్థిక స్వయం పోషకత్వం, సాంఘిక భద్రత అధికంగా సమకూరగలవని మనం దృఢంగా విశ్వసిస్తున్నాం [illegible]

సంబంధించినవనీ, అచ్చటి భూమి విలువ అతి తక్కువనీ, వ్యవసాయ యోగ్యంకాని భూములనీ, నీటివనరులు లేని పొలాలనీ మనకు తెలియని విషయం కాదు. సేద్యం ఏమాత్రమూ గిట్టుబాటుగాని, వ్యవసాయం వలన భృతి గడవని ఆ ప్రాంతీయులు, తమ ఊసర క్షేత్రాలపై సొమ్ము హక్కులను వదులుకోవటం సులువైన పని ఆ ప్రాంతాలకూ, వ్యవసాయం బాగా అభివృద్ధి చెందిన ప్రాంతాలకూ స్వామ్యపు హక్కులను విడనాడటంలో ఎంతో వ్యత్యాసమున్నది. ఈ గ్రామదాన వ్యవసాయవిధానం, సామర్థ్యముతో కూడిన రైతాంగ ఆర్థిక వ్యవస్థకంటె ఉత్తమమైనదని చెప్పటం, డెహ్రాడూన్ ప్రాంతీయ ట్రైబల్ కుటుంబ వ్యవస్థను మన ఏకపత్నీవ్రత సమాజానికి పోల్చడమే కాగలదు

కమ్యూనిస్టులు రైతాంగ ఆర్థిక వ్యవస్థకు బద్ధ శత్రువులు కాబట్టే ఇటీవల బెంగుళూరులో జరిగిన శిఖరాగ్ర సమావేశములో వారి ప్రతినిధులు పాల్గొన్నారు అయితే కోట్లాది ప్రజల స్వేచ్ఛాయుతమైన ఆర్థిక జీవనాన్ని విచ్ఛిన్నం చేయగల ఈ గ్రామదాన విధానం పట్ల కాంగ్రెసువారు ఎందుకు అమితోత్సాహం ప్రదర్శిస్తున్నారో దురూహ్యం. వికేంద్రీకృత ఆర్థిక వ్యవస్థను కోరుతూ – అజమాయిషీ పెత్తనాన్ని వ్యతిరేకిస్తున్న సోషలిస్టులు గూడా రైతాంగ ఆర్థిక వ్యవస్థకు ఎందుకు అయిష్టులుగా ఉన్నారో గూడా అర్థం కాకుండా వున్నది.

ఈ శిఖరాగ్ర సమావేశంలో జరిగిన ఊహాజనిత నిర్ణయాలవలన ప్రభుత్వాధిపతులకు, అజమాయిషీ దారులకు అధికారాలివ్వటం జరిగింది. నియంతృత్వ పద్ధతులకు అమ్ముడుపోవటం జరిగింది. రైతాంగ ఆర్థిక వ్యవస్థకు ప్రతికూలంగా – ప్రభుత్వ యంత్రాంగాన్ని – తదితరమైన శక్తియుక్తులన్నింటినీ వినియోగించి రైతులకు, కళాకారులకు తమ వ్యవస్థ పట్ల విశ్వాసాన్ని సడలింప జేయుటకు ప్రయత్నం జరిగింది కోట్లాది స్వేచ్ఛా జీవుల ప్రతిపత్తిని హరించి – వారిని కొలదిమంది వ్యక్తులకు బానిసలను చేయుటకు ప్రయత్నాలు జరిగాయి. దేశంలో అధికారంలో వున్న కాంగ్రెసు ప్రభుత్వాల క్రింద ఇంతకంటే మేము పొందగలిగిన న్యాయం లేదా? అని కాంగ్రెసు సంస్థను నిలదీసి అడగవలసి వున్నది స్వాతంత్ర్య జీవనోపాధిని పొందుతున్న **మనం ఇలాంటి** నరక కూపంలోనికి ఎందుకు **త్రోయబడాలి**? ఒకరి మోచేతి **క్రింద** బ్రతుకును ఆశించని మనలనా కొలది **మంది** ఉద్యోగుల దయా

దాక్షిణ్యాలకు ఎందుకు వదిలివేయబడాలి ? సృజనాత్మక శక్తితో, చొరవతో, సామర్థ్యంతో ఒకరి తాఖీదులతోగానీ అజమాయిషీతో గానీ, తిట్లు, బెదరింపులు, నిర్బంధాలతో గానీ, ప్రమేయము లేకుండా మనకొరకు, దేశం కొరకు సర్వశక్తుల్ని వినియోగిస్తున్న మనం బానిసలు కావలసిందేనా ? కాంగ్రెసు మనల్ని ఓట్లు అర్థించినప్పుడు గ్రామదాన వ్యవస్థ ఇంత భయంకరంగా వుంటుందని గానీ, మేము ఇలాంటి పంథానం త్రొక్కబోతున్నామనిగానీ సూచన ప్రాయంగానైనా మనకు చెప్పిందా? కాంగ్రెసు నాయకులు- కమ్యూనిస్టు, సోషలిస్టు నాయకులతో కలసి శిఖరాగ్ర సమావేశాన్ని జరిపే ముందు తమ అభిప్రాయాలను మన ముందుంచారా? మన నాయకులతో మన సంస్థలతో సంప్రదించారా? మీలో చాలామంది కమ్యూనిస్టు, సోషలిస్టులకు వ్యతిరేకంగా కాంగ్రెసు ఓట్లు యిచ్చారు. ఎందుకిచ్చారు ? కమ్యూనిస్టులు ప్రతిపాదిస్తున్న ఆర్థిక వ్యవస్థ మనకు తగదని. అదే విషయాన్ని కాంగ్రెసు నాయకులు మనకు చెప్పారు. ఇప్పుడు అందరూ ఏకమై మన ఆర్థిక వ్యవస్థను విచ్ఛిన్నం చేయుటకు కుమ్మక్కై అయినారు. ఇది సబబా ? మన వ్యవస్థను విచ్ఛిన్నం చేయటానికి, మన స్వేచ్ఛను హరించడానికి, మన స్వాతంత్ర్య జీవనోపాధిని వమ్ము చేయడానికి రాజకీయ పార్టీలు పన్నిన 'కుట్ర' అంటే తప్పేముంది ! చిన్న కమతాల మీద మనమెంత పెట్టుబడి పెట్టామో - సాగు చేయుటకు ఎంత శ్రమజేశామో ఆ పెట్టుబడిని శ్రమను దోచుకోవడానికి చేస్తున్న 'కుట్ర' అని అన్నా తప్పు లేదేమో! కమ్యూనిస్టు నాయకులు లెనిన్, స్టాలిన్, కృశ్చేవ్, మావో హింసాయుత ధోరణిలో సాధించలేని విజయాన్ని ఇచ్చట అహింస పేరుతో సాధించాలని కాంగ్రెసు కమ్యూనిస్టు పార్టీలతో చేతులు కలుపుతున్నదనటంలో అతిశయోక్తి ఏమున్నది?

మనం ఈనాడు కమ్యూనిస్టేతర పార్టీలు, ముఖ్యంగా కాంగ్రెసు పార్టీ నుండి ఒక హామీని కోరుతున్నాం అభివృద్ధికరమైన మన వ్యవస్థను విచ్ఛిన్నం జేసే చర్యలను తీసుకోవద్దని రైతుస్వామ్యాన్ని నిర్మూలించే విధానాల నవలంభించవద్దని మనపై యజమానులు నియంతృత్వ అజమాయిషీని రుద్దవలదని, అందుకు ఉపకరించే సహకార వ్యవసాయం, గ్రామదాన వ్యవస్థను అమలుపరచవద్దని కోరుతున్నాం మన వ్యవస్థను నిలుపుకొనేందుకు మనమెన్ని త్యాగాలకైనా సిద్ధపడి మనల నెవ్వరూ శాసించలేరు మన హక్కుల్ని హరించలేరు [illegible] వ్యవస్థ కూలుగులేరు, ఎదుగులేరు

ఇంతవరకూ కాలయాపన జరుగుతూ దేశాన్ని విసిగిస్తున్న కమతాల గరిష్ఠ ప్రమాణ నిర్ణయ సమస్య ఒక దారికి వచ్చింది. ఇది జరిగితే రైతులు దోపిడీచేస్తున్నారనే కొందరి వాదన పరిసమాప్తం కావచ్చు. మన కమతాలను సాగుచేసికోవడమే మనకు కావలసింది. అది స్వంతంగా గానీ, కౌలుభూమి గానీ, స్వశక్తితోనూ, సమాజంలోని ఇతరవర్గాల తోడ్పాటుతోనూ, పని ఒత్తిడి సమయాలలో కొందరు వ్యవసాయ కూలీల సాయంతోనూ, దీన్నొక జాతీయ కార్యక్రమంగా ఎంచుకొని కృషిచేస్తాము. వ్యవసాయ కూలీలకు సమాజం నిర్ణయించిన గిట్టుబాటైన కూలీ మట్టచెప్పకొనేందుకు మనం తయారు మనది దోపిడీ రహిత వర్గం మనం సమస్త శ్రామికులకు సర్వహక్కుల్ని సమకూర్చే సమాజవాదాన్ని (గిల్డు సోషలిజం) విశ్వశిస్తున్నాము ఈ పంథా మన స్వాతంత్ర్య జీవనోపాధి సాధనకు హామీ యిస్తుంది మనం పంచాయతీ బోర్డులను కాదనటం లేదు. ఆ సంస్థ మనకు సహాయకారిగా వుండాలి. మనపై యజమానిగా వుండరాదు. అదే విధంగా సహకార సంఘాలను కోరు కుంటున్నాము. అవి మన కుటంబ ఆర్థిక వ్యవస్థను హరించేవిగా వుండరాదు.

జపాన్, డెన్మార్క్ దేశాలలో కుటంబ ఆర్థిక వ్యవస్థను పటిష్టంగా నిర్మించుకొన్నారు అధికోత్పత్తిని సాధిస్తున్నారు తమ అవసరాలను తీర్చుకొనేందుకు సర్వీస్ కో-ఆపరేటివ్ సొసైటీలను నిర్మించుకొన్నారు కాబట్టి మన ప్రణాళికా నిర్ణేతలను మనం కోరేదొక్కటే. "మా కుటుంబ ఆర్థిక వ్యవస్థ జోలికి రావద్దు - దాన్ని విచ్ఛిన్నం చేయవద్దు. ఉత్పత్తి కార్యక్రమాలలో మమ్మల్ని ఆదుకోండి మీరు అడిగిన దానికంటె హెచ్చు ఉత్పత్తిని చూపెడతాము జాతీయ అవసరాలను తక్కువ వ్యయంతో తీర్చగలము" అని మాత్రమే.

అధిక ఆదాయం వచ్చే మార్గాలుంటే వాటిని వదిలి పెట్టి కేవలం చిన్న కమతాలనే పట్టుకొని ఊగిసలాడేటంత మూర్ఖులం మనం కాదని ప్రభుత్వానికి, ప్రధాన మంత్రికి మనం హామీయిస్తున్నాము. ఇప్పటికే భూమిపై వత్తిడి పెరిగిపోయింది భూమిపై భృతిగడవని ప్రజలెందరో బస్తీల కెగబ్రాకు తున్నారు. దీన్ని నివారించడానికి, భూదాహాన్ని తీర్చడానికి సహకార వ్యవసాయం సాధనము కాదు, కాజాలదు.

అందుకు మన ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందాలి. అందరికీ చేతినిండా

పని దొరికే విధంగా పథకాలు అమలులోనికి రావాలి పరిపాలన, ప్రణాళికా నిర్వహణలో సామర్థ్యం, నీతి పెరగాలి ఆనాడు రైతుల్ని అడగవచ్చు. "మీరు ఏ విధానాన్ని ఎన్నుకుంటారు" అని అంతవరకూ మన ప్రణాళికా నిర్ణేతలు, ప్రధానమంత్రి వేచిచూడటం అవసరం దేశ ఆర్థిక వ్యవస్థ శైశవాస్థలో నున్న యిప్పుడు పై విధానాలను అవలంభించ ప్రయత్నించడం, సాంఘిక విచ్ఛిన్నాన్ని కోరి తెచ్చుకోవడమే ఔతుంది.

ప్రభుత్వ బంజర్లలో భూమిలేని రైతులు, వ్యవసాయ కూలీల ద్వారా సహకార సేద్యాన్ని ప్రవేశపెట్టినట్లయితే మనకేమీ అభ్యంతరముండదు అది వాంఛనీయం గూడా తద్వారా కొత్త కొత్త అనుభవాలను గూడా పొందవచ్చు. అలాంటి దానితో నిర్మాణాత్మకమైన పోటీకి కూడా మనం సంసిద్ధమే

మా కృషికి ప్రభుత్వం సర్వవిధాల సహకరించాలని అడిగేహక్కు మనకున్నది స్వశక్తిపై ఆధారపడి ఉత్పత్తి కార్యక్రమాన్ని సాగిస్తున్న మనకృషిని హర్షించటం ప్రభుత్వం యొక్క కనీస ధర్మం రైతులు, కళాకారులు కృషి సాధనలో సమాజాన్ని గానీ, ప్రభుత్వాన్ని గానీ ఎలాంటి ఆందోళనకూ గురి చేయడంలేదు.

## 1953 నాటికంటే నేటి ధరలు హెచ్చుకాదు

కాని స్వతంత్ర భారతావనిలో రైతాంగంపట్ల ప్రభుత్వం సవతితల్లి ప్రేమను ప్రదర్శిస్తున్నది. కేంద్ర ఆర్థిక శాఖామాత్యులు శ్రీ కృష్ణమాచారిగారే బస్తీల వారి పక్షపాతంతో దాన్య ధరలు పెరిగిపోయాయనే ఆందోళనకు నాయకత్వం వహించి నడిపించడం శోచనీయం 1953 నాటికంటే ఈనాటి ధరలు హెచ్చుగాదని ఒకవైపున ఆహార వ్యవసాయ శాఖామాత్యులు ప్రకటిస్తున్నా ఆర్థికమంత్రిగారు అలాంటి ఉద్యమానికి నాయకత్వం వహించటంలో అంతరార్థ మేమిటో ? ఎంత ఆందోళన జేసినా ఎన్నాళ్ళకూ ప్రభుత్వం ఆహార ధాన్యాలకు గిట్టుబాటైన ధరలు నిర్ణయించకపోవటంలో అర్థమేమి ? పోతే ఆంధ్ర ప్రభుత్వం విషయాని కొద్దాము బియ్యం మిల్లుల వారి విషయంలో పరస్పర విరుద్ధమైన ప్రకటనలు జేస్తూ అయోమయస్థితి కల్పించడాన్నిఎలా సమర్థించుకోగలర [illegible] నాటి కంటే సెప్టెంబరు నాటికి ధాన్యాల ధరలు తగ్గాయని ఒ[illegible] వైపున [illegible]ంగీకరిస్తూనే - బియ్యానికి మరింతగా,

గిట్టుబాటుకాని విధంగా ధరలు తగ్గించేందుకు ప్రయత్నిస్తూ - కొనుగోలును గూడా కుదింపు జేసికొనుటకు కారణమేమి ? తమ ప్రాంతంలో ధాన్యానికి ధరలు హెచ్చుగా వున్నాయని ఫిర్యాదులు చేస్తున్న బెంగాలు సౌరాష్ట్ర, మద్రాసు, మలబార్ ప్రాంతాలకు మన బియ్యాన్ని ఎగుమతి చేయుటకు రైల్వే సౌకర్యాలను నిరాకరించుటకు కారణమేమి ? ఆంధ్రప్రదేశ్ ఆహారమంత్రి రైతుల శ్రేయస్సు దృష్ట్యాసాహసోపేతమైన కృషి సలిపినా మనరాష్ట్రపుధాన్యోత్పత్తి దారులను, మిల్లర్లను నాశనం చేయుటకు పూనుకొన్న కేంద్ర ప్రభుత్వ విధానం అయోమయంగా వున్నది.

## నష్టాలకు భీమా, శ్రమకు విలువ

అప్పలను వసూలు చేయమని ఒక వైపున బ్యాంకులను వత్తిడి చేస్తుండటము వలన మనవడ్లకు గిట్టుబాటైన ధరలు వచ్చేంతవరకు ధాన్యాన్ని నిలువచేయలేకపోతున్నారు. ఆ విధముగా ఆదిలోనే మనల్ని తక్కువ ధరలకు ధాన్యాన్ని మనచే అమ్మించుటకు ప్రభుత్వం బస్తీలవారి పక్షపాతంతో నాటక మాడింది. ఈ పక్షపాతవైఖరి అసంగతమని నేను ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నాను. మన రైతులు మరొక వర్గానికి నష్టదాయకముగా అధిక లాభాలు పొందే దురాశతోలేరని నేను లోక్‌సభలో స్పష్టంచేశాను మనం వీలైనంత హెచ్చుగా పండించేందుకే ప్రయత్నిస్తున్నాము శక్తి వంచన లేకుండా సమాజాన్ని సేవించుటకు తాపత్రయ పడుతున్నాము మన విద్యుక్తధర్మాన్ని నిర్వహించుటలో మనం ఒకరిచేత పదే పదే చెప్పించుకోము. ఒకరి పర్యవేక్షణగానీ, ప్రచారముగానీ మనకు అవసరము లేదు. మనం సమాజాన్ని, ప్రభుత్వాన్ని కోరేదల్లా మన నష్టాలకు భీమా, మన శ్రమకు విలువ, వృత్తికి గౌరవము, లాభనష్టాలురాని ప్రజా కార్యక్రమంగా వ్యవసాయాన్ని రూపొందించటం - మనకు బస్తీ వారికి మధ్య జీవన ప్రమాణంలో అధిక వ్యత్యాసాలను లేకుండా చేయడము - నాగరిక ప్రపంచంలో మనగలిగే జీవిత స్థాయిని మాత్రమే.

వాస్తవానికి ఇది ఏమంత ఎక్కువైన కోర్కేమీ కాదు. ఈ కనీస కోర్కెలు చెవియొగ్గుటకు బదులు కేంద్ర ప్రభుత్వం పక్షపాతంతో గూడుకొన్న ఆహార ధాన్యాల ధరల పరిశీలన సంఘాన్ని ఎందుకు [illegible]

రైతాంగ ఆర్థిక వ్యవస్థపట్ల జాతికి రోతపుట్టించేందుకు - సహకార వ్యవసాయ విధానాన్ని ప్రచారం చేయుటకు ధనపురాసులను ఎందుకు కరిగించాలి ? రైతులకు సవాలుగా మేథావుల మేధస్సులు విరామం లేకుండా కృషిచేయటం దేన్ని సాధించడానికి ? అధికారం కలిగిన, పలుకుబడి కలిగిన ప్రభుత్వ నాయకులంతా - రైతులు తమ భూములన్నింటినీ లోపభూయిష్టమైన పంచాయితీ బోర్డుల స్వాధీనం చేయమని కేకలు వేయుటకు "ఏల్ వాల్" కు యెందుకు పరుగెత్తాలి ? వికేంద్రీకృత ఆర్థిక వ్యవస్థ గలిగి, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నరైతులపై 'టైంబాంబు' వేయడానికేగదా ?

అన్నివర్గాల ప్రజలవలెనే - తమకు అవసరమైన రక్షణలు, సౌకర్యాలు, చెయ్యమని అడిగే హక్కు రైతులమైన మనకూవున్నది విశేషమేమంటే కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం సహితం సహకార వ్యవసాయ విధానాన్ని అమలు జరుపబోమనీ, రైతాంగ ఆర్థిక వ్యవస్థతో అనవసరజోక్యం చేసికోమని కేరళరైతులకు హామీఇస్తున్నది అయినా కాంగ్రెసు - కాంగ్రెసు ప్రభుత్వాలు రైతులకు అలాంటి హామీల నివ్వకపోవటం విచారకరం ఇదంతా రాజకీయ భాగవతము కాదనగలమా !

ప్రభుత్వం ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలని నేను కోరుతున్నాను మేము జనాభాలో నూరింట ౭౦ మంది మున్నాము మాతో వున్న చేతివృత్తుల వారు, కళాకారులు మరొక ౧౦% వున్నారు మేమంతా రాజకీయ చైతన్యంతో ముందుకు వస్తున్నాము ఈ దశాబ్దంలోనే జమిందారుల, భూస్వాముల ఇనుప కౌగిళ్ళ నుండి విముక్తిజెంది, ఆర్థిక స్వాతంత్రాన్ని సాధించుకొన్న ఉత్తరప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, పశ్చిమ బెంగాలు, ఆంధ్రప్రదేశ్ అశేష రైతాంగం - జమిందారీ విధానం కంటే భయంకరమైన సహకార వ్యవసాయం, గ్రామపంచాయతీ విధానాలను ఎదిరించటంలో వెన్ను చూపరని హెచ్చరిస్తున్నాను

## 3.11.1963 విజయవాడలో జరిగిన 17 వ రాజ్యాంగ సవరణ నిరసన మహాసభలో శ్రీ దరువూరి వీరయ్య సమర్పించిన ప్రసంగవ్యాసం

యావత్ భారతదేశము, ముఖ్యంగా రైతాంగము 17 వ రాజ్యాంగ సవరణ చట్టము ద్వారా తాము పరమ పవిత్రమని యెంచుకొనే వాక్, సభా స్వాతంత్ర్యములను భూమిపై తమకు యుగయుగాలుగా, పారంపర్యంగా వస్తూన్న హక్కు భుక్తములను వదలుకొనవలసిన దౌర్భాగ్య పరిస్థితులు ఏర్పడబోతున్నాయి. 17 వ రాజ్యాంగ సవరణ చట్టము ద్వారా రైతాంగమునకు కలుగగల కష్ట నష్టములను, దౌర్భాగ్య పరిస్థితులను తెలుసుకొన్న మన పూజ్య నాయకులు రంగాజీ సభల ద్వారా, పత్రికల ద్వారా, పార్లమెంటులోనూ వెలుపలా అనేకమారులు హెచ్చరించి యున్నారు. దేశమెల్లడలా వివిధ వర్గాల, రాజకీయ పక్షాల, వాణిజ్య సంస్థల సభలు సమావేశాల ద్వారా 17 వ రాజ్యాంగ సవరణ చట్టమును వ్యతిరేకించుచూ తీర్మానాలు చేశారు భారత్ కిసాన్ సమ్మేళనం యొక్క అన్ని శాఖలు తమ అసమ్మతిని తెలియజేశాయి. కార్డు ఉద్యమం ప్రారంభించాము కోట్లాది కార్డులు పోస్టు చేయవలసివుంది. కాని ఇప్పటికి షుమారు లక్ష కార్డులు మాత్రమే పార్లమెంటు సెక్రటరీకి చేరాయి. దీనిని బట్టి మన ప్రజలలో 17 వ రాజ్యాంగ సవరణ చట్టము యొక్క దుష్పరిణామాలు ఇంకా అర్థమైనట్లుగా లేదు

### కార్డు ఉద్యమంలో విరివిగా పాల్గొనండి

ఈ సవరణ రెండు మూడు వాక్యాలలో ఎటుబడితే అటు, అధికారంలో వున్నవారు తమకేది ఎప్పడు అవసరమైతే అలా అన్వయించుకొనుటకు వీలుగా రూపొందించబడి, పార్లమెంటులో ప్రవేశపెట్టబడింది. చట్టం సవరించబడిన నాడు రైతాంగమునకు కలుగబోయే ఘోరవిపత్తు, తమ మనుగడకే భయంకరంగా పరిణమించబోయే దుర్భరదైన్యస్థితి మన సోదర రైతాంగమునకు అవగాహన ఐనట్లు కనబడుటం లేదు. మన నాయకులు, రాజాజీ, రంగాజీ, ప్రభృతులు అహరహము రైతాంగ హక్కుల రక్షణకు, ప్రజాస్వామ్య పరిరక్షణకు స్వతంత్రపార్టీ ద్వారా, కిసాన్ సమ్మేళనం ద్వారా మహోధృతమైన ఆందోళనను కొనసాగిస్తూ, మనకు అన్ని విధాలా

అండదండలుగా వుంటూ మనలను కాపాడుతున్నారు అట్టి మన మహానాయకులను, మన మహా సంస్థలను మనం అన్ని విధాలా బలపర్చుకొనవలసి యున్నది ఈనాడు విజయవాడలో సమావేశమైన యీ చారిత్రాత్మకమైన, మహాసభ । 7 వ రాజ్యాంగ సవరణ చట్టము ద్వారా భారత రైతాంగమునకు కలుగనున్న మహావిపత్తును ప్రజల దృష్టికి తేవడం ద్వారా, ప్రభుత్వానికి తమ తీవ్ర వ్యతిరేకతను వ్యక్తపరచవలసి యున్నది అయితే అంత మాత్రమున తెలుసుకొనేటంత వివేకమును ప్రభుత్వము ప్రదర్శించగలదనుటకు అవకాశము లేదు మన ప్రభుత్వము కేవలము గుడ్డిదో, చెవిటిదో, మూగదో అయితే మన ఆందోళన ఫలించేదే. యీ మూడు అవగుణాలూ మూర్తీభవించిన మూర్తి మన భారత ప్రభుత్వం. అంతంతమాత్రపు ఆందోళనలు మన ప్రభుత్వాన్ని మేలు కొలుపలేవు. మన ప్రయత్నాలు చెవిటివాని ముందు శంఖూదినట్లు కాగలదు మనమిక నెంతమాత్రము ఏమర పాటు వహించకూడదు అనుక్షణము అప్రమత్తులమై మెలగాలి.

అందుకనే మన నాయకుడు రంగాజీ ఇటీవల ఢిల్లీలో ఒక పత్రికా గోష్టి ద్వారా అవసరమైతే సహాయనిరాకరణ, శాసనోల్లంఘనం మొదలయిన ప్రతిఘటనోద్యమాన్ని పెద్ద యెత్తున ప్రారంభించవలసి రావచ్చునని అటు ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ ఇటు ప్రజీనీకానికి పిలుపు నిచ్చారు. నేటి మన పాలకులకు ఆందోళనలపైన, ప్రజాస్వామిక సిద్ధాంతాలపైన విశ్వాసం లేదు శాంతియుతమూ, చట్టబద్ధమూనైన ప్రతిఘటనోద్యమాన్ని సాగించినా ప్రభుత్వము సహించగల ఔదార్యం వహించకపోవచ్చును. అందువలన మనము యెన్ని కష్టములనైన, మరెంతటి దమన నీతినైనా యెదుర్కొనగల ధైర్యసాహసములనూ, పట్టుదలనూ అలవర్చుకొని పోరాటమునకు సన్నద్ధము కావలసియున్నదని మనవి చేయుచున్నాను

ఇక విషయానికొద్దాము మన మహానాయకులు, రాజాజీ, రంగాజీ, హెగ్డే, నంబియార్, రామచంద్రారెడ్డి సర్దార్ లచ్చన్న ప్రభృతులు మన మధ్య వున్నారు. వారీ నాడు మనకు కర్తవ్యాన్ని బోధించగలరు. మనకు రాగల ఆపదలను, ఉపద్రవాలను ముందే పసిగట్టిన మన నాయకులు మన కండగా వుండి, ఆపదల నుండి మనలను రక్షించగలరనే సంపూర్ణ విశ్వాసం నాకూ,

మీకూ నిండుగా కలవు వారందరూ శ్రమ యనుకోకుండా మనమధ్య కొచ్చినందులకు వారికి నా హృదయపూర్వకమైన అభినందనలు అంద జేయుచున్నాను.

రైత్వారీభూమి అంటే, అష్టకష్టములు పడి రాత్రనక, పగలనక ఇరిగేముల్లు, కరచేపామును సరుకుచేయక, చమటోడ్చి సాగుకు లాయకీగా రూపొందించిన భూమి. సాధారణంగా భూమి అంటే రైతుకు పంచ ప్రాణములు. తమ భార్యాబిడ్డలంటే ఎంతటి ఆదరణాభిమానాలు, మమకారం ప్రతి ఒక్కరికి ఎలా సహజగుణమో అలానే భూమిపట్ల కూడా వుంటుంది. భూమిపైరైతుకుగల అలాంటి పవిత్రమైన హక్కు భుక్తములను ఎప్పుడవసరమైతే అప్పుడు తమ ఆధీనంలోకి తీసుకొనేదే 17వ రాజ్యాంగ సవరణ చట్టము

## పాలకుల దయాధర్మమే రైతు ఆస్థా !

ప్రభుత్వము తమ అవసరమునకు భూస్వామికి న్యాయమైన పరిహారమును చెల్లించి భూమిని స్వాధీనము చేసుకొనే హక్కు ప్రభుత్వాని కిప్పుడున్నది. అయితే పరిహారము విషయమై కోర్టుకు వెళ్ళే హక్కు వుంటుంది. 17వ రాజ్యాంగ చట్టము సవరించబడితే అలాంటి హక్కు రద్దు కాగలదు ప్రభుత్వము యొక్క దయాదాక్షిణ్యాలకు దాసులు కావలసిన దుర్గతి రైతాంగమునకు కలుగగలదు

కుల, మత, ప్రాంతీయ ముఠా దురభిమానాలకు ఆలవాలమైన నేటి రాష్ట్ర ప్రభుత్వాల దయాదాక్షిణ్యాలకు అభిమాన, దురభిమానాలకు రైతాంగమును బలిచేయడం జరుగుతుంది ఇంతకంటే ఘోరమైన, దుర్భరమైన, విపత్తు మరొకటుంటుందని నేటి మన రాష్ట్ర ప్రభుత్వాల తీరుతెన్నులు చూస్తున్న ప్రజలకు వివరించ పనిలేదనుకుంటా. ఈ చట్టము అమలులోకి వచ్చిన మరునాడు నేటి మన రాష్ట్ర ప్రభుత్వాలు తమ ముఠా, కుల, మత, ప్రాంతీయ సంకుచిత తత్వాలకు దుర్వినియోగము చేయరనే నమ్మకంగాని, విశ్వాసం గాని, నాకు లేదు. మన కనేక అనుభవాలున్నాయి పంచాయితీ సమితులు, సహకార సంఘాలు, నిర్వహించ బడుతున్న తీరు మనము చూస్తున్నదే. చూస్తూ చూస్తూ నిప్పుల్లో నుండి పెనముమీదికి దూకలేము కదా ?

# నిర్బంధసేద్యానికి మారురూపమే ఇది !

సహకార సేద్యమంటే ప్రజలకయిష్టమని, ప్రభుత్వం గ్రహించి "తాను పట్టిన కుందేలుకి మూడేకాళ్ళ"న్న పిడివాదానికి మార్చుకుంటుందా ! లేదే ! ఎలాగైనా కుట్రలు, కుతంత్రాలు, మోసాలు చేసి రైతాంగమును కన్నుగప్పి సహకార వ్యవసాయాన్ని ఏదో రూపంలో తేవడమే మన నెహ్రూ ప్రభుత్వం యొుక్క ప్రధానాశయం సహకార సేద్యాన్ని ప్రజలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారని ప్రభుత్వం పసిగట్టింది. ప్రజలను వంచించైనా. మోసము చేసైనా సహకార సేద్యాన్ని ప్రవేశపెట్టాలనే తమ చిరవాంఛితము నెరవేర్చు కోవాలి అందుకు వేయవలసిన పాచికలు, పన్నవలసిన మాయోపాయములు అనుసరించవలసిన పన్నాగములు ఆలోచించి రూపొందించినదే 17 వ రాజ్యాంగ సవరణ చట్టము అని మరువరాదు. మనం గుడ్డివారమనీ, చెవిటవారమనీ, తలంచి యిలాంటి వారిని మోసం చేయడం సులభమని భ్రమపడిన నెహ్రూ ప్రభుత్వమునకు మనమొుకమారు తగు గుణపాఠము నేర్పాలి అట్టి కర్తవ్యనిర్వహణకే యీనాటి చరిత్రాత్మకమైన యీ సమావేశము జరుగుతుందని గ్రహించాలి

రాష్ట్ర ప్రభుత్వాలు ఇప్పడున్న చట్టంద్వారా సహకార సేద్యాన్ని అమలు జరుపజాలమని కేంద్రప్రభుత్వమునకు తెలయజేశారు. ఆ కారణంగానే ఎచట, ఎప్పడు అవసరమైతే అచట ఆ భూములను తమ ఇచ్చవచ్చిన ధరలకు స్వాధీనం చేసుకొనగల 17వ రాజ్యాంగ సవరణ చట్టవుునను రూపొందిస్తున్నారు. దీనిని బట్టి సహకార సేద్యం స్వచ్ఛందమేనని మన నెహ్రూ పండితుడు పలుమారులు చేసిర వాగ్దానం కేవలం బూటకమని తేలిపోయింది.

సహకార వ్యవసాయక్షేత్రములకు నామమాత్రపు వెలనిచ్చి భూములను సేకరించుటకు నిర్దేశించబడిన చట్టమే యీ 17 వ రాజ్యాంగ సవరణ చట్టము యొుక్క నిజస్వరూపమని తేలిపోయింది. కాని నెహ్రూ ప్రభుత్వము యొుక్క బూటకపు ప్రకటనలు చూచి మోసపోయే అమాయకస్థితిలో లేమని ఒకసారి రుజువుచేయాలి. అందుకే యీ సభలు, సమావేశాలు ఆందోళనలూనూ

ఇంతవరకు జమీందారులు, ఈనాందారుల ఆధీనంలో గల

భూములను మాత్రమే యెస్టేటు అనేవారు ఇప్పుడు యీ చట్టము క్రింద అన్ని రకాల భూములను యేస్టేటుగా పరిగణించబోతున్నారు పూర్వము యెస్టేటు భూములంటే, ఆ యెస్టేటు యజమానికి రైతాంగమునుండి శిస్తు వసూలు చేయు అధికారము మాత్రమే వుండేది భూమి మీద మాత్రం యే మాత్రం అధికారం వుండేది కాదు. రైత్వారి భూమిమీద రైతునకు దానదవున విక్రయాది సమస్త హక్కు భుక్తములు కలిగివుండేవి ప్రభుత్వానికి శిస్తు వసూలు చేయు హక్కు మాత్రమే కలిగియుండేది

ఎప్పుడైనా ప్రభుత్వానికి భూమి కావలసివచ్చినప్పుడు మార్కెట్ ధరకాన్నా 15% హెచ్చు మొత్తమును పరిహారము క్రింద చెల్లించి రైతునుండి భూమిని కొనుక్కొనేవారు. ప్రభుత్వము నిర్ణయించిన రేటు న్యాయంగా లేదను కొన్నప్పడు కోర్టుకువెళ్లే స్వతంత్రం, హక్కు భూస్వామికి వుండేది యీ చట్టము ద్వారా రైతుకు తరతరాలుగా వుంటూవస్తున్న న్యాయసమ్మతమైనపై హక్కులన్నీ హరించబడ్డాయి. రైతుకు ప్రభుత్వానికి మధ్య దళారులనేవారుండకుండా రైతుకు లాభము చేయాలనే సత్సంకల్పముతోనే జమీందారి యీనాందారీ విధానాన్ని రద్దుచేశారు. ఏ రైతు యొక్క హక్కులను రక్షించేందుకు, జమిందారీ, యినాందారీ విధానాన్ని రద్దుచేశారో, ఆ రైతుకే పారంపర్యంగా అనుభవిస్తున్న హక్కులను, అధికారాలను రద్దుచేయడం ద్వారా రైతాంగ వ్యవస్థనే సంపూర్ణంగా తుదముట్టించి, రైతును బానిసను చేయు కుట్రపన్నుతోంది నెహ్రూ ప్రభుత్వం. ఈకుట్ర నిన్న నేడు పన్నుతున్నదికాదు బహుకాలంగా నెహ్రూ పండితుడూ, ఆయన సోషలిస్టు మిత్రులూ, రైతాంగ వ్యతిరేకులూ సాగిస్తూనే వున్నారు

## ఈకుట్ర ఈనాటిదికాదు – ఎల్వాల్‌లో ప్రారంభమైంది

అప్పట్లో ఒక మారు ఎల్వాల్‌లో యీ కుట్రకు నాంది జరిగింది. దానిని పసికట్టిన మన రైతు బాంధవుడు రంగాజీ వెంటనే ఎల్వాల్ కుట్రను బహిర్గతం చేశారు. రైతాంగమును జాగరితమొనరించారు. ఈ కుట్ర కార్యరూపం దాల్చితే దానినెదిరించేందుకు రైతాంగం తయారుగావుందని ప్రభుత్వాన్ని సవాల్ చేశారు. నెహ్రూ పండితుడానాడు సహకార వ్యవసాయములో బలవంతమేమీ లేదనీ, రైతులయొక్క స్వచ్ఛంద సహకారముంటేనే అమలు

జరుగుతుందని పార్లమెంటులోనూ, బయటా ప్రకటించారు కొన్నాళ్ళు యీ మధ్య దాని వూసెత్తకుండా ప్రజలను మభ్యపెట్టి, యీనాడీ రూపంలో తమ కుట్రను కొనసాగించబోతున్నారు ఈ మారుకూడా మన నాయకులు ప్రభుత్వ కుట్రను గ్రహించారు. దానిని సర్వశక్తులా యెదిరించేందుకు ప్రతిజ్ఞ పూనేందుకే మొన్న బెంగుళూరు సభ, నేటి మన యీ సభ అని మనవి చేయుచున్నాను

౧౯౫౦లో రాజ్యాంగము తయారు చేసినప్పడు, రాజ్యాంగ సభలో అన్నిపార్టీల ప్రతినిధులున్నారు సామ్యవాద సిద్ధాంతాభిమానులు కొందరానాడే ప్రభుత్వం స్వాధీనమొనర్చుకొనే భూమికి నామమాత్రమైన పరిహారము మాత్రమే చెల్లించిన చాలునని సూచించారు. భారతజాతి యేకైక నాయకుడు పూజ్య సర్దార్ పటేలు సోషలిజము అభిమానుల రైతాంగ వ్యతిరేక విధానాలను గట్టిగా వ్యతిరేకించి, న్యాయమైన పూర్తి పరిహారము రైతుకు ముట్టచెప్పి మాత్రమే భూమిని స్వాధీనం చేసుకోవాలని చట్టం చేయించారు. వారు పైపెచ్చు దానిని "బందిపోటు దొంగతనంతో పోల్చారు" కూడా. ఒకవేళ దీనిని బలవంతంగా అమలు పరచబూనితే కాంగ్రెసు నుండి బయటకు పోవడానికైనా వెనుదీయనన్నారు సర్దార్ పటేల్.

సర్దార్ పటేల్ వ్యవసాయకుటుంబమునకు చెందినవారు రైతు బాధలు తెలిసిన వారు రైతాంగము యొక్క స్వేదముతో, శ్రమతోనే భూమి నేడీ స్థితికి వచ్చిందని తెలిసినవారు. జాతికి జీవగర్ర, వెన్నెముక రైతేనని భావించేవారు. అట్టి రైతాంగ వ్యవస్థను బలహీన పరచిన లేక నాశనం చేసిన దేశానికి జాతికి భవిష్యత్ లేదని అర్థం చేసికొన్నవారు "శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం" అనగా ఏ ధర్మ నిర్వహణకైనా ముఖ్యమైన సాధనాలలో శరీరం ఒకటి అని పురాణేతిహాసం. అట్టి శరీరాన్ని పోషించేది రైతాంగమేనన్న ఆర్యోక్తిపట్ల విశ్వాసమున్నవాడు మన సర్దార్ పటేలు. అందువలననే నాడా మహానుభావుడు రైతాంగ హక్కుల పరిరక్షణకు తన సర్వసము నొడ్డి రైతాంగ వ్యవస్థ విచ్ఛిన్న మొనరించ సమకట్టిన సోషలిస్టు వ్యక్తుల నెదిర్చి విజయం సాధించి, రైతాంగము నాదుకొన్నాడు

నేటి కాంగ్రెసు అధిష్టానవర్గంలో గాని, కేంద్రప్రభుత్వములో గాని రైతు

శ్రేయస్సు, ప్రజాస్వామ్యం పట్ల నిండైన నమ్మకం, విశ్వాసము గల వారొక్కరూ లేరు కావుననే నేడీ 17వ రాజ్యాంగ సవరణ చట్టమనే మహామారి మనముందు వికటాట్టహాసం చేస్తున్నది ఇప్పుడు మనకిక సత్యం, న్యాయం, ధర్మం భగవంతుడు మాత్రమే అండదండలు. ఇది ప్రజల ప్రతిఘటనా శక్తి, పట్టుదల, కార్యదీక్షలపై ఆధారపడియున్నది అందుకు ప్రజలను ఆయత్తమొన రించుటకే యీ మహాసభలు.

భూమి అంటే, వ్యవసాయమంటే ఎలా వుంటుందో తెలియనివారు కేంద్ర ప్రభుత్వములోనూ, ప్రణాళికా సంఘములోనూ, కాంగ్రెసు అధిష్టాన వర్గములోనూ వుండి భూమిమీద, వ్యవసాయం మీద చట్టాలుచేసే దౌర్భాగ్యస్థితిలో మనమున్నాము ఉదాహరణకు యీ మధ్య ప్లానింగ్ కమీషను సభ్యులైన శ్రీ శ్రీమన్నారాయణ అగర్వాల్ అనే ఒక ప్రబుద్ధుడు అధికోత్పత్తికి మార్గమన్వేషించానంటూ మాగాణికి గట్లు తీసివేస్తే భూమి కలిసివస్తుందని తన పరిశోధనను బయటపెట్టారు.

ప్రపంచమంతా నవ్విపోయింది శ్రీ శ్రీమన్నారయణకు మాత్రం సిగ్గు కలుగలేదు. ఇదీ నేటి మన దౌర్భాగ్యం అట్టి ప్రబుద్ధుల చేతుల్లో మనమొక ఆటబొమ్మలంగా రూపొందించబడబోతున్నా మీ సవరణ చట్టం ద్వారా.

రాజ్యాంగ చట్టము అత్యంత పవిత్రమైనదిగా యెంచుకొంటుంది ప్రతి దేశము న్యాయశాస్త్రకోవిదులు, అర్ధశాస్త్రవేత్తలు, ప్రజానాయకులు, వివిధ వర్గాలకు, ప్రాంతాలకు, విధానాలకు చెందిన వైజ్ఞానికులు చర్చించి, నిగ్గు తేల్చిన రాజ్యాంగ చట్టమును చిత్తు కాగితముతో సమానంగా చూస్తుందీ నెహ్రూ పండితుని ప్రభుత్వం.

అత్యవసరమైతే తప్ప రాజ్యాంగమునకు సవరణలు చేయరాదు. ప్రజాస్వామిక దేశాలలో ఉత్తమోత్తమమైన దేశంగా పరిగణనపొందిన అమెరికా దేశమును తీసుకుందాము. దాని రాజ్యాంగ చట్టము 1720లో తయారు కాబడినది. అంటే యీ 273 సంవత్సరాలలో 23 సవరణలు మాత్రమే చేయబడ్డాయి న్యాయస్థానం తీర్పుల ననుసరించి తేబడిన సవరణలు రెండే రెండు చేయబడ్డాయి.

ఇక మన పవిత్రభారతమో । 6 ఏండ్లు నిండకముందే । 6 సవరణలు చేసి, । 7 వ సవరణ ప్రవేశబెట్టబోతున్నది న్యాయస్థానాల తీర్పుల దృష్ట్యా 5 సవరణలు చేయడం జరిగింది రాజ్యాంగ చట్టమంటే మన పాలకులకెంత చులకనో దీనిని బట్టి మీరు అర్థం చేసుకోగలరను కొంటాను

ఎప్పుడు తమకు అవసరమనుకుంటే అప్పుడల్లా తమ యిచ్ఛవచ్చినట్లు రాజ్యాంగమునకు సవరణలు ప్రతిపాదించే ప్రభుత్వానికి, కాంగ్రెసు అధిష్టాన వర్గమునకు సంకెళ్ళు వెయ్యాలి.

రైతు స్వావ్య రక్షణకు, ప్రజాస్వామిక భద్రతకు మనమంతా ఏకోన్ముఖంగా, ముక్తకంఠంతో సంఘటితశక్తితో । 7 వరాజ్యాంగసవరణచట్టమును యెదిరించాలి.

దీనిని రైతాంగము జీవన్మరణ సమస్యగా యెంచుకొని ఎంతటి త్యాగాలకయినా మరెంతటి కష్టనష్టములకైనా సిద్ధపడి రణరంగమునకు సమాయుత్తం కావాలని యీనాడిచట సమావేశమైన సోదర కార్యకర్తలు పల్లెపల్లె తిరిగి మహోధృతమైన ప్రచారమొనరించి రైతాంగమును జాగరికత మొనరించవలసి యున్నది.

## భూమి సాగుచేయకుండా సహాయ నిరాకరణోద్యమం

మన నాయకులు పూజ్య రాజాజీ, రంగాజీ ప్రభృతుల యెదుట నేనీ సందర్భములో సాహసించి ఒకసూచనచేయదలచాను. నా యీ సూచన ఆచరణ యోగ్యము, నిర్మాణాత్మకము అవసరమూ ననుకొంటే చర్చించ కోరుచున్నాను

రైతాంగము తమకు జరిగిన, జరుగబోవు అన్యాయాలను, అక్రమాలను యెదిరించేందుకు జరిపే ఆందోళనలలో పోరాటములలో నూతన పంథా అవలంబించడం అవసరమనుకొంటున్నాను

ప్రతిరైతు తనకూ, తన కుటుంబానికి, తనతో కలసిమెలసి పనిచేసే చేతివృత్తులవారికి కావలసిన కమతం మాత్రమే సాగుచేసుకొని మిగతా భూమిని బీడు పెట్టడం ద్వారా “సహాయ నిరాకరణోద్యమం” కొనసాగించడం ఇదొకవిధంగా “కార్మికులు సమ్మె చేసినట్లు” గా వుంటుంది

ఏదో ఒక విధమైన విప్లవాత్మకమైన ప్రభుత్వాన్ని కదిలించగల గట్టి చర్యకు గడంగ వలయుననే నా ఆందోళననే యీ సూచన రూపములో వెలిబుచ్చు చున్నాను.

ఎప్పడు మన నాయకులు పిలుపువస్తే అప్పడు పోరాటవములో పాల్గొనుటకు సంసిద్ధులం కావాలని హెచ్చరించుచున్నాను భావి తరాల సౌభాగ్యమునకు రైతాంగ వ్యవస్థమనుగడకు ఎంతటి త్యాగాలకైనా సంసిద్ధులంగా వున్నామని మీ తరుపున, నా తరుపున శపథం చేయుచున్నాను.

ప్రపంచ ప్రజాస్వామిక వ్యవస్థకు తలమానికము, ప్రపంచశాంతి ప్రియులకు అగ్రగామి, మేధావి మహానాయకులునైన పూజ్య రాజాజీ, వృద్ధాప్యంలో శ్రమ అనుకోకుండా మనలను కార్యోన్ముఖులుగా చేయుటకు మన మధ్యకు వచ్చినందులకెంతయు సంతసము, వారికివే నా నమో వాకములు.

రైతు బాంధవులు శ్రీ రంగాజీ, శ్రీహెగ్డే, శ్రీ నంబియార్, శ్రీ రామచంద్రా రెడ్డి, సర్దార్ లచ్చన్న గార్లకు నా నమస్కారములు.

నేలనాలుగు చెరగుల నుండి వేలాదిగా ప్రతినిధులు యీ సమావేశము నకు విచ్చేసి, చర్చలలో పాల్గొని, సభలను జయప్రదమొనరించి నందుకు హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను

# గ్రామీణ శ్రామిక జనాల హక్కుల రక్షణకు ఉన్నతోన్నతపదవులను త్యాగం చేసినమహామనీషి

# ఆచార్య రంగాజీ

ఆచార్య రంగాజీ సుదీర్ఘ రాజకీయ, సాంఘీక, సామాజిక సేవా కార్యక్రమాలను సునిశిత దృష్టితో పరిశీలనాత్మకంగా పరిశోధన సాగించే వారి కెవరికైనా ఆయన పాటించిన నైతికవిలువలు గానీ, ఒక నియమబద్ధమైన క్రమశిక్షణతో కూడిన జీవన సరళినిగానీ, దీక్షా పట్టుదల లనుగానీ, స్థిరచిత్తం, స్థిర సంకల్పాలను గాని అవగాహన చేసుకొనటం కష్టమేమీ కాదు.

ఆచార్య రంగాజీ జీవితమొక తెరచి ఉంచిన మహాగ్రంథం. అందులో శ్లేషలుండవు. అరమరికలుండవు క్లిష్టత అంతకంటే ఉండదు అందుకనే ఒక సందర్భంలో రాజాజీయే ఆయన జీవితం తెరచిన ఒక మహాగ్రంధమన్నారు. ఆయన ఎప్పుడు ఎక్కడ ఏది చెప్పదలచుకున్నా తాను ధర్మమనీ, న్యాయమనీ సమంజసమనీ ఒక నిర్ణయానికి వచ్చిన తరువాతనే స్పష్టంగా ప్రకటించడం తన విద్యుక్త ధర్మంగా ఎంచుకుంటారు ఒకమారు తన నిర్ణయా ప్రకటించారా ? వెను తిరగడమంటూ ఆయన జీవితంలోనే లేదు.

రంగాజీ పరులకు నీతి బోధలు చేయరు ధర్మ పన్నాలు పలుకరు సుభాషితాలువల్లించరు మరేమి చేస్తారు ? జీవితంలో ధర్మాన్ని పాటిస్తారు. ధర్మపథంలో పయనిస్తారు నీతి మార్గంలో విధి నిర్వహణను సాగిస్తారు అదే ఆయన ఈ ఎనభైయ్యేళ్ళ సుదీర్ఘ జీవన విధానంలో సాగించిన ఉత్తమ మార్గం అదే మహోన్నతమైన పథం. ఒక్కమాటలో చెప్పాలంటే

"లక్షముళ్ళుగుచ్చుకున్నా ఒక్క పువ్వు పూయించాలి లక్ష నక్షత్రాలు నేలకూలినా ! ఒక్క సూర్యుడ్ని వెలిగించాలి" ఇదీ ఆయన జీవన విధానం. ఆయన జీవన సరళి, ఆయనెంచుకున్న మార్గం ఈ కారణంగానే ఆయన తన సమకాలీనులైన మహానాయకుల అపోహలకు గురి అయ్యారు. అపార్థాలకు కూడా గురి అయ్యారు అపనిందల పాలయ్యారు ఎన్నెన్నో ఆరోప ...లకు గురి కావలసి వచ్చింది. అలా అని ఆయన జీవితంలో ఎక్కడ

తలవంచలేదు పలాయనం చిత్తగించలేదు ఆయన ధర్మనిరతి, నిష్కల్మషత్వం, నిరాడంబరత్వం, క్రమశిక్షణతో కూడిన చిత్తశుద్ధి, స్థిర సంకల్పములే ఆయనను కవచంగా, రక్షణగా కాపాడాయి ఆయనపై అపోహలు పెట్టుకున్న వారే అవి కేవలం అపోహలని తెలుసుకున్నారు అపార్థాలు తొలగించుకున్నారు అపనిందలు, ఆరోపణలు మాని ప్రశంసించారు. ప్రస్తుతించారు

ఈ 'నా' ఆచార్య రంగా జీవిత చరిత్ర రచనలో ఎన్నో ఘటనలు, ఘట్టాలు, ఘర్షణలు, సంఘర్షణలు అనేక ఉదాహరణలతో కథలు కథలుగా వర్ణించి చెప్పడం జరిగింది. వాటినన్నింటినీ తామ సునిశితంగా పరిశీలించండి. పరిశీలనాత్మకంగా విశ్లేషించండి.

## చిన్నారి చిరుత ప్రాయంలోనే- దేశభక్తి- త్యాగం- పోరాటం

ఇక ఆయన జీవన విధానం పైన ఉదహరించబడిన ఆయన ధర్మ నిరతిని, నీతి బద్ధతను, నైతిక విలువలను ఆధారంచేసుకుని పరిశీలిద్దాం రంగాజీ రాజకీయాలవైపు జీవితాన్ని మళ్ళించిన సంఘటన దివ్య జ్ఞాన సమాజ వ్యవస్థాపకురాలు శ్రీమతి అనిబిసెంటు । ౨ । ౫ లో తలపెట్టిన "హోమ్‌రూల్" ఉద్యమం సందర్భంలో ఆమెను అరెస్టు చేయగా రంగాజీ ఆ చిన్నారి చిరుత వయస్సులోనే ఒక బ్రహ్మాండమైన నిరసన ప్రదర్శన సాగించడంతో ప్రారంభమైనది.

అటు తరువాత నిడుబ్రోలు ఉన్నత పాఠశాలలోనే ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడు అయ్యాడు ఆ వెంటనే గుంటూరులోని ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో యఫ్ ఎలో చేరారు నిండా మూడు నెలలు కూడా గడవకుండానే ఉన్నత విద్యలకై ఇంగ్లాండు వెళ్ళి ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో చదవాలని నిర్ణయం జరిగింది ఆక్స్‌ఫర్డ్ వెళ్ళారు అర్థశాస్త్రంలో బీలిట్ పట్టాను పొందారు. మాతృదేశం తిరిగివచ్చి మద్రాసులోని పచ్చయప్పా కళాశాలలో అర్థశాస్త్ర ఆచార్యులుగా ఉద్యోగంలో చేరారు. నిండా మూడు సంవత్సరములు గడవకుండానే ఉద్యోగానికి రాజీనామాచేసి వెంకటగిరి జమీందారీ రైతుల పోరాటంలో చేరి నాయకత్వం వహించారు వెంకటగిరి జమీందారీ ఉద్యమమే అఖిల భారత స్థాయిలో జమీందారీ వ్యతిరేక పోరాటానికి నాంది వాచకమైంది. పూర్తికాలం రాజకీయాలలోకి ప్రవేశించడం జరిగింది

౧౯౩౦లో కాంగ్రెసు అభ్యర్ధిగా కేంద్రశాసనసభకు ఎన్నికయ్యారు. అటు తరువాత కాలంలో అతడనేక యుద్ధములలో ఆరితేరి జయకేతనాన్ని ఎగురవేసి ఒక పరిణితి చెందిన నాయకుడిగా రూపుదాల్చడం జరిగింది ఈ కధలన్నీ అనేక ఘట్టాలుగా సాగాయి అందుకొన్ని సంఘటనలను ఇచ్చట సంక్షిప్తంగానే అయినా ఒక అవగాహనకు రావడానికి వీలుగా రచన చేయడం జరిగింది మన ప్రస్తుత రచనాంశము రంగాజీ ఏ కార్యక్రమాన్ని తలపెట్టినా పట్టుదలగా, దీక్షగా, ధైర్యంగా కృషి చేస్తారనేదే ఇదుగో ఒక మారు పరిశీలించండి మహాకవి బర్తృహరి సుభాషితాల్లో

ఉ:- "ఆపదలందు ధైర్యగుణ మంచిత సంపదలందు దాల్మియున్
భూపసంభాంత రాళమున బుష్కల వాక్చతురత్వ మాజి బా
హా పటుశక్తియున్ యశమునందనురక్తియు విద్యయందు వాం
ఛాపరి వృద్ధియున్ బ్రకృతి సిద్ధగుణంబులు సజ్జనాళి[illegible]న్."

తా : ఆపత్ కా[illegible]మునందు మనోధైర్యం కలిగి ఉండుట సంపద కలిగినప్పుడు ఓర్పు కలిగి ఉండుట సజ్జనులైన వారికి మణిరత్న, సువర్ణాలతో కూడిన భూ[illegible]షణములు కావు. వారికి భూషణములేవంటారా ? ఆపదలు [illegible]ప్పుడు ధైర్యంగా ఉండటమే.

ఇదే రంగా[illegible]లో అత్యున్నత ప్రమాణములు గల ధర్మ మార్గము. ఈ గీటురాయితోనే ఆయన ఏ కార్యక్రమాన్ని తలపెట్టినా ధైర్యమూ, సాహసమూ, స్థిరచిత్తము, స్థిర సంకల్పమూ, దీక్షా పట్టుదలతో సాగిస్తారు ఇదే ఆయన విజయాలన్నిటికీ ప్రధాన కారణం. ఇదే ఆయన ఉత్తమోత్తమమైన జీవన విధానానికి ఆలంబనం

రంగాజీ పూర్తికాలం రాజకీయాలలో పనిచేయటం ప్రారంభించింది ౧౯౨౯లోనే అదే వెంకటగిరి జమీందారీ రైతుల పోరాటం రైతుల సమస్యల పరిష్కారానికి ఆందోళనలు సాగించారు. చేనేత పారిశ్రామికుల సమస్యలపై ఉద్యమాలను ప్రారంభించారు. వయోజన విద్యా ప్రచారం ప్రారంభించారు గ్రంథాలయోద్యమములో తలమునకలైనారు. హరిజనోద్ధరణ, అస్పృశ్యతా నివారణ, హరిజనుల దేవాలయ ప్రవేశాలు. ఇలా మరెన్నో ఉద్యమాలు తలపెట్టారు ఈ ఉద్యమాలలో పనిచేయాడానికి చిత్తశుద్ధితో, క్రమశిక్షణతో,

రాజకీయ అవగాహనతో కృషి చేయుట కొరకు కార్యకర్తలెందరో కావాలి కార్యకర్తల శిక్షణ శిబిరాలను నెలకొల్పాలని నిర్ణయించారు. అందుకు ఉ...మైన కేంద్రాలను నిర్ణయించాలి

## దివ్యజ్ఞాన సమాజం- మదనపల్లి- ప్రథమరైతాంగ విద్యాలయం

మదనపల్లిని నిర్ణయించుటలో ఒక ప్రత్యేక విశిష్టత ఉన్నది మదనపల్లిలో దివ్యజ్ఞాన సమాజం వారిచే నిర్వహించబడుతున్న ఆదర్శ విద్యాలయం ఉన్నది అది దివ్యజ్ఞాన సమాజానికి సంబంధించిన అనిబిసెంటు అనుయాయులు డా. "కాజిన్స" దంపతుల నేతృత్వంలో నడుస్తున్నది ఇదే రాజకీయ విద్యాలయానికి తగిన స్థలం అని నిర్ణయించారు. 1935లో అచ్చట నెలకొల్పిన విద్యాలయానికి రైతాంగ రాజకీయ వేసంగి పాఠశాలగా పేరు నిర్ణయించినారు. ఈ విద్యాలయాలను నెలకొల్పడంలో రంగాజీకి ప్రేరణ అరిస్టాటిల్, సోక్రటీస్, పైథాగరస్ మున్నగు తత్వవేత్తలు తమ సిద్ధాంతాల ప్రచారం కొరకు ఏర్పాటు చేసిన శిక్షణాలయాలే. మన ప్రాచీన మహర్షుల గురుకులాలు కూడా. ఇంగ్లాండులో ఉండగా యూరప్‌లోని గిల్డ్ సోషలిస్టు ప్రచార సరళి కూడా రంగాజీకి ప్రేరణ కలిగించాయి. మదనపల్లిలో నెలకొల్పిన మొదటి రైతాంగ వేసంగి రాజకీయ పాఠశాలలో మొదటి బ్యాచ్ శ్రీయుతులు కందుల ఓబులరెడ్డి, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, సర్దార్ గౌతు లచ్చన్న, జె వల్లభరావు, రాటకొండ నరసింహారెడ్డి ముఖ్యులు. తరువాత కాలంలో వరుసగా ప్రతియేటా ఏదో ఒక ప్రాంతంలో విద్యాలయాలు నడిపారు. (ఆ వివరాలు రైతాంగ విద్యాలయాలు- ఆచార్యరంగా అనే శీర్షిక క్రింద ఆచార్య రంగా జీవిత చరిత్ర- ఉద్యమాలు, పోరాటాలు అనే విభాగంలో వివరంగా వస్తాయి)

## రంగాజీ జీవిత విధానంపై స్వామిరామతీర్థ, స్వామి వివేకానంద, స్వామి దయానంద సరస్వతి ప్రబోధాల ప్రభావం

రంగాజీకి చిన్నారి చిరుత ప్రాయంలోనే నిడుబ్రోలు హైస్కూలులో లభించిన స్వామీ రామానంద తీర్థ "ప్రబోధ రత్నావళి "అనే గ్రంథం లభించింది. దానిని క్షుణ్ణంగా చదివారు. అధ్యయనం చేశారు. అందులో ప్రవచించ బడిన ధర్మాలను తన తొలినాటి గురువు జంపని ఆంజనేయులు గారితో చర్చించారు. తల్లికి వివరించారు మరో గురువు రైల్వేగేటు పోర్టరుకు

చదివి వినిపించారు అందరూ రంగాజీ పఠనాశక్తిని మెచ్చుకున్నారు అలానే స్వామీ వివేకానందుల వారి జీవితం, ప్రబోధాలు చదివారు. మరో ప్రముఖ వేదాంతి స్వామీ దయానందుల వారి "సత్యార్థ ప్రకాశం" గ్రంధాన్ని చదివారు. పై ప్రబోధాలు పఠించడంతో రంగాజీలో ఒక వినూత్న తేజస్సు ఆవిర్భవమైనది మానవ జీవితంలో **అనుసరించవలసిన,** ఆచరించదగిన నీతి, ధర్మం, న్యాయం, సత్ ప్రవ**ర్తనలపై ఒక అవగాహ**న కలిగింది పై మహానీయుల ప్రబోధాల ప్రభా**వం నా పై పడిం**దని రంగాజీ తరచు చెబుతూ ఉంటారు.

ఇదే ఆయనలో ప్రత్యేక విశిష్ట స్థానం అలంకరించిన చిత్తశుద్ధి, స్థిర సంకల్పం, స్వత్ సంకల్పం, దీక్షా, పట్టుదల అలవడటానికి దోహదం చేసిందని కూడా తరచుగా చెబుతూ ఉంటారు ఆయన రచనలన్నింటా పలుమారులు ప్రస్తావించడం కూడా **జరిగింది**

ఈ నేపధ్యంలో **ఒక విచిత్ర**మైన సన్నివేశం గురించి చెప్పకొనవలసి యున్నది. ఆయన ప్రతిరోజూ స్కూలు విరామ సమయంలోనూ, స్కూలు సెలవు దినాల్లోనూ ఒంటరిగా రహస్య ప్రదేశంలో కూర్చుని "రామతీర్థ ప్రబోధ రత్నావళి" ని తదేక దీక్షతో తెలుగులోకి అనువదించడం ప్రారంభించారు ఇలా నిత్యం అనువాదం కొనసాగిస్తూన్నారు అన్న పానాదులు కూడా మానివేశారంటే ఆశ్చర్యం లేదు స్నానం చేయడు. నిద్రపోడు. కఠోర తపస్సు వలె అదొక మహాయజ్ఞం వలే ఇతరుల కంటబడకుండా అది గోప్యంగా కొనసాగిస్తున్న ఈ రహస్య కార్యమేమిటా ? అని తల్లికి అనుమానం వచ్చింది ఒక రోజు వెదికి పట్టుకుంది ఏమిట్రా రంగడూ ? ఏమి నీవు చేసే నిర్వాకం? ఒక ఆకలి అనవూ, దప్పిక అనవూ, నిద్రలేదు ఎందుకీ శ్రమ ? అని ప్రశ్నించింది. అందుకు సమాధానంగా రంగాజీ నీకు అప్పడప్పడూ చెప్పానే రామతీర్థ కధలు అవి అందరికీ అందుబాటులో ఉండేందుకు తెలుగులోకి మారుస్తున్నాను రంగాజీ పట్టుదలకు, దీక్షా, దక్షతలకు అబ్బురపడి అక్కున చేర్చుకుని తలనిమిరి, బుగ్గపై చిటుకవేసి ముద్దులు కురిపించి ఆనంద బాష్పాలు రాల్చింది. అయినా ఏదో అనుమానం ఇంత శ్రమకు ఫలితమేమిటి? ఇదేమైనా కూడా ? గుడ్డా ? చదువా? సంధ్యా ? ఎందుకొచ్చిన శ్రమరా నాయనా శ్రద్ధగా చదువకో అన్నది. అయినా రంగాజీ పట్టు వీడలేదు మరింత శ్రద్ధగా, పట్టుదలగా, దీక్షగా తన అనువాద కృషిని మరింతగా సాగించారు

ఈ నేపథ్యంలో పెదతల్లి మంగమ్మ జరిగిన విషయాన్ని అంతా జంపని ఆంజనేయులుగారికి పూసగుచ్చినట్లు చెప్పింది మీరైనా జోక్యం కల్పించుకుని రంగడిని మనస్సు మార్చి చదువు సాగించేట్లుగా చేయమని వేడింది ఆంజనేయులుగారికి ఆసక్తికలిగింది ఏమి చేస్తున్నాడీ బుడతడు ? ఇంత పట్టుదలగా ? దీక్షగా ? అనుకుని ఒకరోజు వెళ్ళి చేయిపట్టి పైకి లేవదీసి ఏదీ- ఇటు చూపించు నీవు చేస్తున్న నిర్వాకమేదో ? అంటూ రంగాజీ అనువాద రచనలన్నింటినీ చేతికి తీసుకున్నారు పరిశీలించారు చదవటం ప్రారంభించారు సంభ్రమాశ్చర్యాలతో ఆహా ! ఓహో అంటూ అనువాదం ఇంత సరళంగా ఉంది ! ఇద్దరు వ్యక్తులు సంభాషించుకొంటున్నట్లుగా చిన్న చిన్న పదాలతో వ్యవహారిక రీతిలో కొనసాగింది రచన అంటూ ఎంతగా మెచ్చుకున్నారో ఊహించలేనంటారు రంగాజీ. ( ఈఅనువాదాన్ని ఇంతకాలం భద్రపరచుకుంటూ వచ్చారు. అప్పుడప్పుడూ చదువుకుంటూ ఉంటారు రంగాజీ)

## రాజకీయాల్లో ప్రవేశించినా- ఆనాటి రచనల ప్రభావమే రాజకీయాల్లో, తలమునకలైనా - ఆనాటి ధర్మప్రభోదాలే

రంగాజీ ఇంగ్లాండులో ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో చదువుతున్నా, ప్రపంచ పర్యటనలు చేస్తున్నా, మద్రాసు పచ్చయప్ప కళాశాలలో అర్థశాస్త్ర ప్రధానాచార్యుడుగా పనిచేస్తున్నా, రైతు ఉద్యమాలను నడుపుతున్నా, పార్లమెంటులో ప్రసంగిస్తున్నా, మరే కార్యక్రమంలో నిమగ్నమై ఉన్నా ఆయనకు అనుక్షణం స్వామితీర్థ, స్వామివివేకానంద, స్వామి దయానంద ప్రభృతుల ప్రబోధములే ఆదర్శంగా కృషి చేస్తుంటారు. రంగాజీ ఒక వ్యక్తి జీవిత చిత్రణను రచించినా, రైతుల, వ్యవసాయ కూలీల, చేతివృత్తుల, శ్రామిక జనాల కష్టాలు, కడగండ్లు వర్ణించి నా ధర్మ బద్ధంగా, నీతి బద్ధంగా సంయమనం పాటిస్తూ ఉండటానికి ప్రధాన కారణం ఆ బోధలే. ఇందుకు తోడు మహాత్మాగాంధీజీ ప్రభావం మరింతగా దోహద పడింది.

చిత్తశుద్ధి, సిధర సంకల్పం, దీక్షా పట్టుదల మానవుల ఉన్నతికి తోడ్పడతాయి ముందు మనం సాగించ తలపెట్టిన కార్యక్రమం ఉత్తమమైనదిగా ఉండాలి. ధర్మబద్ధమైనదిగా ఉండాలి. బహుజనులకు హితం చేకూర్చేదిగా ఉండాలి అప్పడే దానికి చిత్తశుద్ధి తోడ్పడుతుంది. కేవలం చిత్తశుద్ధి ఒకటి

మాత్రమే చాలదు దానికి తోడు స్థిరమైన సంకల్పం కావాలి చిత్తశుద్ధి, స్థిర సంకల్పం మాత్రమే తలపెట్టిన కార్య సాఫల్యతకు దోహదం చేయదు. దానికి పట్టుదల కావాలి ఆ పట్టుదలను దీక్షతో సాగించాలి ఇన్ని ఉత్తమ లక్షణాలుంటేగాని తలంచిన పని తలంచినట్లుగా సఫలం కాదు ఇదీ రంగా గారి ఆలోచన ఇదీ రంగాగారు తలపెట్టిన ఎన్నెన్నో ఘన కార్యాల సాధనకు దోహదపడ్డాయని ఆయన భావన రంగాగారు ఏ సంఘం స్థాపించినా ఉద్యమం సాగించినా, పోరాటం సాగించినా, చిత్తశుద్ధితో, స్థిర సంకల్పంతో, పట్టుదలతో, దీక్షతో దానిని ఒక మహాయజ్ఞంగా స్వీకరిస్తారు.

## రేషనింగ్, కంట్రోళ్లు, పర్మిట్, లైసన్స్ పై గాంధీజీ, రాజాజీ అండదండలతో రంగాజీ పోరాటం

అలాసాగించిన మహోద్యమాలలో ఘన విజయాలు సాధించి విజయకేతనం ఎగురవేసిన కార్యాలలో జమీందారీ వ్యతిరేక పోరాటం ముఖ్యమైనది. (ఇది వేరే మరొక ఛాప్టరులో వివరంగా ఉంది) 1945లో ఒక మహోద్యమాన్ని తలపెట్టారాయన. అదేమంటే కంట్రోళ్ళు, రేషనింగు, పర్మిట్‌లు, లైసెన్సులు రద్దు చేయాలనేదే ఆ ఉద్యమం. 1939లో వచ్చిన రెండవ ప్రపంచ యుద్ధ కారణంగా పై విధానాలు అమలు పరచబడ్డాయి. యుద్ధ కాలంలో తమ సైనికులకు, ప్రభుత్వ ఉద్యోగులకు ఎలాంటి అవరోధం లేకుండా భోజనం పెట్టాలి అందుకు ధాన్యం కావాలి. భారతదేశంలో పండే పంట దేశ జనాభాకు ఆరునెలలకు కూడా చాలడం లేదు. విదేశాల నుండి బియ్యం, గోధుమలు, దిగుమతి చేయవలసిన పరిస్థితి ఏర్పడింది ఆ విపత్తు నుండి బయటపడాలంటే ప్రజలకు ఆహార ధాన్యాల సరఫరాలను క్రమబద్ధం చేయాలి. కాబట్టి తలకు ఇన్ని ఔన్సులు బియ్యమని నిర్ణయించారు దానినే రేషనింగు అన్నారు రైతుల నుండి ధాన్యాన్ని నిర్బంధంగా ప్రొక్యూర్ చేశారు బియ్యమూ, గోధుమలే కాక ఇతర జీవితావసర వస్తువుల సరఫరాకూడా క్రమబద్ధం చేశారు. ఈ విధానం కష్టంగా ఉన్నా, బాధకలిగినా, నష్టాలు ఎదురైనా ఏదో ఒకరకంగా ఓర్చుకున్నారు యుద్ధం ముగిసింది మిత్రమండలి విజయం సాధించింది. కాంగ్రెసు నాయకులందరినీ జైళ్ళ నుండి విడుదల చేశారు. బ్రిటనులో ఎన్నికలు జరిగాయి యుద్ధంలో విజయం సాధించిన విన్‌స్టన్ చర్చిల్‌ను ఆయన కన్సర్వేటివ్ పార్టీని ప్రజలు ఓడించారు చర్చిల్

స్థానంలో క్లెమెంట్ ఆట్లీ ప్రధాని అయ్యారు లేబరు పార్టీ నాయకుడిగా అట్లీ భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రధానం చేయాలని నిర్ణయించారు సర్ స్టాఫర్డ్ క్రిప్స్‌ను భారతదేశానికి రాయబారిగా పంపారు. మరో క్యాబినెట్ కమిటీ కూడా వచ్చింది. చర్చలు సాగించారు. ఒక పరిష్కారానికి వచ్చారు. భారతదేశానికి స్వాతంత్ర్యం సంప్రాప్తించింది పండిట్ నెహ్రూ ప్రధానిగా కాంగ్రెసు అధికారాన్ని చేపట్టింది

ఈ నేపధ్యంలో స్వతంత్ర భారతదేశం**లో సైనా యుద్ధ** అవసరాలకోసం బ్రిటీష్ పాలకులు ప్రవేశపెట్టిన రేషనింగ్, **కంట్రోళ్ళు, పర్మిట్**లు, లైసెన్సులు రద్దు చేస్తారనుకున్నారు. కానీ నెహ్రూ మరింత కఠినంగా అమలుపరచాలని **నిర్ణయించు**కున్నారు. రష్యాలో అమలు జరుగుతున్న కమ్యూనిస్టు పార్టీ పాలనా **విధానాన్ని** , వారు అమలులో పెట్టిన సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను, కమ్యూన్‌లను (సమిష్టి భోజనశాలలు) పరిశీలించాలనే ఉద్దేశ్యముతో రష్యా వెళ్ళి వచ్చారు. అచ్చట ఇనుపతెర లోపల ఏమి జరుగుతుందో చూపించలేదు కొన్ని మోడల్ క్షేత్రాలను, కమ్యూనులను చూపించారు. ఇంతెందుకు రష్యాలో ఒక భూతల స్వర్గం వెలిసిందనేంతగా భ్రమలు గొలిపేటట్లు చేశారు. ఇండియాకి తిరిగి రాగానే గాంధీని, గాంధీయిజాన్ని వదలివేశారు మార్క్సిజాన్ని, మార్క్సు ఆర్థిక సిద్ధాంతాలను, క్యాపిటల్ గ్రంథాన్ని నెత్తికెక్కించు కున్నాడు. ఆ పాటలే పాడటం ప్రారంభించాడు. కేంద్రంలో ప్రభుత్వ సారధ్యాన్ని **చేపడు**తూనే రష్యాని అనుకరించడం మొదలు పెట్టాడు. దేశాన్ని **పారిశ్రా**మికీకరణ చేయాలన్నారు. పంచవర్ష ప్రణాళికా పద్ధతిని ప్రవేశపెట్టా**లను**కున్నారు. వెనుకా, ముందు చూడకుండా వెంటనే మొదటి పంచవర్ష **ప్రణాళి**కను ప్రవేశపెట్టాడు బ్రిటీషువారు పోతూ ప్రవేశపెట్టిన కంట్రోళ్ళు, రేషనింగులు, పర్మిట్‌లు, లైసెన్సుల రాజ్యం ప్రారం**భించాడు. పరిపాలన**లో తనకు సహాయ పడేందుకు ఏర్చి, కూర్చి, వడపో**సి కమ్యూనిస్టు అర్థశాస్త్ర** సిద్ధాంతవేత్త మహాబలన**వీస్ ను త**న సలహాదారుగా **నియ**మించుకున్నారు. అతడు మరికొంత మందిని **కే**వలం కమ్యూనిస్టు సిద్ధాంత అనుకూలురు అయిన ఐ.ఎ.యస్ , ఐ పి.యస్, అధికారులను నియమించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే పండిట్ నెహ్రూ కమ్యూనిస్టుల కబంధహస్తాలలో ఇరుక్కు పోయాడు. దృతరాష్ట్రుని కౌగిలిలో బంధించబడ్డాడు పరిపాలన అంతా ప్రచ్ఛన్న కమ్యూనిజం వైపు మారింది

# పంచవర్ష ప్రణాళికా పద్ధతి – ఆచార్య రంగా అసమ్మతి.

ఆచార్య రంగాజీ పంచవర్ష ప్రణాళిక పద్ధతిని వ్యతిరేకించాడు భారీ పారిశ్రామికీకరణను వ్యతిరేకించాడు కంట్రోలు, పర్మిట్‌లు, రేషనింగులు, లైసెన్సులను వెంటనే రద్దుచేయాలన్నారు నీవు కమ్యూనిస్టుల కట్టుబానిసగా మారిపోయావని నెహ్రూను అన్నారు నీవు ప్రవేశపెట్టనున్న సమిష్టి వ్యవసాయం క్షేత్రాలు తరతరాలుగా భూమిని నమ్ముకుని కష్టించి పండించి తాను తిన్నంత తిని సమాజాన్ని పోషిస్తున్న స్వేచ్ఛాప్రియులైన రైతాంగాన్ని బానిసలుగా, కట్టు బానిసలుగా మార్చడానికి కుట్రలు సాగిస్తున్నావన్నారు. అని ఎదిరించడం ప్రారంభించారు. రంగాను బెదిరించాడు నెహ్రూ. క్రమశిక్షణ చర్యగై కొంటా నన్నాడు. వెంటనే ఒక నిముషం కూడా ఆలోచించకుండా నీ కబంధ హస్తాలలో పడి కొట్టుకుంటున్న కాంగ్రెసు నుండి నేనే బయటకుపోతా. నీ నిరంకుశ విధానాన్ని ప్రజలలో ప్రచారం చేస్తా. సవాలు విసిరారు. నెహ్రూ లొంగి వచ్చాడు సామ, దాన, భేద, దండోపాయాలను ప్రయోగించాలనుకున్నారు బుజ్జగించడం ముందే అయిపోయింది కదా ! ఇక దానం, మంత్రి పదవి ఇస్తానన్నాడు అప్పడే కేంద్ర వ్యవసాయ మంత్రిగా ఉన్న బాబు రాజేంద్రప్రసాదు రాష్ట్రపతిగా ఎన్నిక కావడంతో ఖాళీ అయిన స్థానంలో మంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టమని మధ్యవర్తుల ద్వారా ఇంకొంచెం ముందుకు పోయి గోవింద వల్లభపంతు ద్వారా కబురు పెట్టాడు నాకు మంత్రి పదవి అక్కరలేదంటూ మహాకవి భర్తృహరి సుభాషితం.

తే గీ తనిసిరే వేల్పులు, దధిర త్నములచేత
వెఱచిరే ఘోరకాకోల, విషముచేత
విడిచిరే యత్నమమృతంబు వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.

తా .. దేవతలు అమృతం కొరకు పాల సముద్రాన్ని చిలికారు మధ్యలో రత్నాలు దొరికాయి సంతోషించారా ? లేదే ? వారికి కావలసినది అమృతం. అది లభించేవరకు విశ్రమించేది లేదని మరల మరింత వేగంగా చిలకడం ప్రారంభించారు. భయంకరమైన విషం బయట పడింది. భయపడి పారిపోయారా ? లేదే ! మరితం పట్టుదలతో

చిలికారు అమృతం లభించింది. ఇదీ రంగాగారి చిత్తశుద్ధి, స్థిర సంకల్పం, దీక్షా, పట్టుదల

నాకు కావలసినది ప్రజల మెడలకు గుదిబండల్లాగా, చేతులకు సంకెళ్ళలాగా, కాళ్ళకు బంధాలుగా తయారై పలురకాలైన కడగండ్ల పాలుచేస్తున్న పర్మిట్, లైసెన్సుల రాజ్యం పోవాలని, ఆ విధానాలను బేషరతుగా రద్దుచేయాలి అంతే గాని మంత్రిపదవి ఆశచూపితే లొంగిపోయి మీ పాదక్రాంతమయ్యే దుర్బల మనస్తత్వము కాదు నాది. గాంధీజీని కలిశారు కంట్రోళ్ళు వలన ప్రజలకు కలిగే కడగండ్లను వివరించాడు. మీరు వెంటనే జోక్యం కలిగించుకోవాలని ప్రార్థించాడు. రంగాజీ కృషిని మెచ్చుకున్నారు. గాంధీజీ కంట్రోళ్ళు పోవలసిందే నన్నారు. బహిరంగంగా పత్రికలో ప్రకటన చేశారు. అయినా నెహ్రూ మనస్సు మార్చుకోలేడు మరింత పట్టుదలతో కఠినంగా వ్యవహరించాడు. కేంద్రంలో ఆహార వ్యవసాయ మంత్రిగా ఉన్న పండిట్ నెహ్రూ సన్నిహిత మిత్రుడు రఫీ అహ్మద్ కిద్వాయ్ వద్దకుపోయి వివరించాడు రంగాజీ గాంధీజీ సందేశాన్ని అందించాడు కంట్రోళ్ళు రద్దుచేయడం నాకూ ఇష్టమేనని కిద్వాయ్ చెప్పారు నెహ్రూదృష్టికి కూడా తీసుకొని వెళ్ళారు. అయినా నెహ్రూ పట్టు వీడలేదు. రంగాజీ మరింత పట్టుదలతో ప్రతిఘటన సాగించారు రంగాజీ పట్టుదలను గురించి మహాకవి భర్తృహరి సుభాషితాల నుండి ఈ క్రింది సుభాషితాన్ని పరిశీలించండి.

శా ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజించు రురువి ఘ్నాయుత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

తా .. అధములైనవారు విఘ్నములు కలుగుననే భయంతో ఏ కార్యమునూ ఆరంభించరు. మధ్యములు ప్రారంభిస్తారుగానీ విఘ్నములు కలిగితే భయపడి పారిపోతారు. కానీ స్థిరచిత్తులు, స్థిర సంకల్పులూ ధైర్య శీలాది గుణములు కలిగిన వారు ఎన్ని విఘ్నములు ఎదురైనా, తల పెట్టిన కార్యం ఫలించేదాకా పట్టువిడవక పనిసాధిస్తారు. ఇదీ రంగా గారి ధోరణి. ఇదీ రంగాజీ చిత్తశుద్ధి.

ఇదీ ఆయన స్థిర సంకల్పం. పట్టు విడవకుండా మరింతపట్టుదలతో దేశవ్యాప్తంగా ఒక మహోద్యమాన్ని ప్రారంభించారు కంట్రోళ్ల వ్యతిరేక వారం జరుపమని ప్రజలకు పిలుపునిచ్చారు. దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాలలో పెద్ద ఎత్తున ప్రజలు స్పందించారు. రైతు సంఘాలు ముందుకు వచ్చాయి. కంట్రోళ్ళు, రేషనింగులు, పర్మిట్‌లు, లైసెన్సులు అనేవి పేద, మధ్య తరగతి ప్రజలకు, చేతి వృత్తుల వారికి నరక ప్రాయంగా ఉన్నాయి వారి స్వాతంత్ర్యాన్ని హరించాయి వ్యక్తిత్వాలను కోల్పేయేటట్లు చేశాయి ప్రతి చిన్న అధికారి జులుం సాగించేవాడే పైగా మహాత్మాగాంధీ ఆశీస్సులున్నాయి. కేంద్ర ఆహార వ్యవసాయ మంత్రి రఫీ అహ్మద్ కిద్వాయ్ రంగాకు మద్ధతు ప్రకటించారు రాజాజీ దీనిని కంట్రోళ్ళ పర్మిట్ లైసెన్స్ రాజ్‌గా అభివర్ణించాడు దీనిని రద్దుచేయకపోతే ప్రజలు తిరుగుబాటు చేయాలని ఆదేశించాడు

అయినా నెహ్రూకు చీమకుట్టినట్టు అయినా లేదు 1952 వచ్చింది. దక్షిణాది రాష్ట్రాలలో ముఖ్యంగా ఆంధ్రదేశంలో మొదటి సార్వత్రిక ఎన్నికలలో కాంగ్రెసును నామరూ పాలు లేకుండా చేశారు ప్రజలు **(ఆంధ్రలో కాంగ్రెసు నిలువునా చీలిపోయి: 1. రంగా, ప్రకాశం కాంగ్రెసు వ్యతిరేకంగా స్వతంత్రంగా రాజకీయ పక్షాలను ఏర్పాటుచేసి ఎన్నికలలో పోటీ చేయటం కారణంగా వారూ ఓడిపోయారు. కాంగ్రెసునూ ఓడించారు. మద్రాసులో కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా ప్రకాశం నాయకుడిగా యునైటెట్ ఫ్రంట్‌గా ఏర్పడింది. ఈ కథ అంతా ఇదే గ్రంథంలో అనేక శీర్షికల క్రిందవచ్చింది. గమనించండి.)**

నెహ్రూ గుండెల్లో గునపాలు గుచ్చినట్లు అయింది ఎలాగైనా కాంగ్రెసును బ్రతికించాలి అని రాజాజీ వేడుకున్నాడు మీరు నాయకులుగా ప్రభుత్వేర్పాటు చేయాలన్నారు రాజాజీ చేస్తాను కానీ ఒక షరతు. నాకు రంగా సహకారం కావాలి అన్నారు. నెహ్రూ మీ ఇచ్ఛవచ్చినట్లు చేసుకోండి. మీకు పూర్తి స్వేచ్ఛ ఉంది ఒక ప్రత్యేక వార్తాహరుని ద్వారా రంగాజీకి కబురు పెట్టారు. రాజాజీ ఆజ్ఞ రంగాజీకి సుగ్రీవాజ్ఞ కదా ? మద్రాసు చేరారు రంగాజీ. రాజాజీని కలిశారు ఏమిటి ఆదేశం అని అడిగారు చెప్పారు విషయమంతా రాజాజీ. నీ సహకారం ఉంటే కాని మద్రాసులో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పాటు చేయలేనని చెప్పారు ఏమిటి నీ సమాధానం అని అడిగారు ? రంగాజీ వెంటనే మీరు నాయకులుగా ఉన్న ప్రభుత్వానికి నా పూర్తి మద్ధత్తు ఇస్తాను అయితే మీరే ప్రభోదించినట్లు ఈ కంట్రోల్ పర్మిట్

రాజ్ పోవాలన్నారు సరేనన్నారు రాజాజీ రంగా ! నీవు నా ప్రభుత్వంలో ఉప ముఖ్యమంత్రిగా ఉండాలి అన్నారు రంగాజీ తృటిపాటులో తలవంచి నమస్కరించి నాకే అధికార పదవీ వద్దు నాకు కావలసినదల్లా ఒక్కటే అది ప్రజలను పీడిస్తున్న, బాధిస్తున్న, వేధిస్తున్న రేషనింగు, కంట్రోళ్ళు, లైసెన్సు పర్మిట్‌లు విధానాలను రద్దుచేయాలన్నారు నా అభిప్రాయం కూడా అదే కదా? కేంద్రంలో ఆహార వ్యవసాయ మంత్రి కిద్వాయ్ కూడా మనకు అండగా ఉన్నారు కదా ? గాంధీజీ ఆశీస్సులు కూడా ఉన్నాయి కదా ? పరిపాలనలో నాకు పూర్తి స్వేచ్ఛను కలిగిస్తానన్నాడు కదా ? నెహ్రూ వెంటనే రద్దు చేద్దాం. రంగాజీ అంగీకరించారు. మదరాసులో రాజాజీ నేతృత్వంలో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడింది దక్షిణాదిన కమ్యూనిస్టు ప్రమాదం తొలగింది. నెల తిరక్కుండానే కంట్రోళ్ళు, రేషనింగులు రద్దు అయ్యాయి. ఇది రంగాజీకి విజయం కాదా ? ఇంతకన్నా ఆయన కోరుకొనేది మాత్రం ఏమున్నది ఈ సందర్భంలో కూడా భర్తృహరి మహాకవి సుభాషితమును ఒక మారు చెప్పకుందాం ( ఈ భాగాలు లోగడ ఒకసారి ప్రస్తావనకు వచ్చింది అయినా ఫరవాలేదు - అధికస్య అధికస్య ఫలం అన్నారు కదా)

శా .. నీతి ప్రౌఢ విహారులైన నిపుణుల్ నిందింప నీ మెచ్చనీ
ఖ్యాతిం జెందనీ సంపదల్ నిలువనీ గాఢంబుగా సాగనీ
ఘాతంబప్పడ పొందనీ నియతిమై కానీ **యుగాంతంబునన్**
నీతి శ్లాఘ్యపదంబు దప్పరుగదా నిత్యంబు **ధీరోత్తముల్**.

తా . నీతిమంతులైన వారూ, ధైర్యసాహసములు గలవారూ, తాము సాధించ తలపెట్టిన కార్యము ప్రజాహితమైనదని అనుకొనప్పడు ఎంతటి ఆపదలు ఎదురైనా, ఎన్ని అపవాదులు పైన బడ్డా లెక్క చేయకుండా ఎదిరించి నిలిచి పనిసాధిస్తారని దీని తాత్పర్యము

**ఆ రోజులలో పండిట్** నెహ్రూ ప్రపంచంలోనే ప్రముఖుడుగా ప్రఖ్యాతి గాంచి ఉన్నారు. పార్టీలో **ఆయనకు** ఎదురులేదు రంగాజీకి సైతం నెహ్రూపట్ల అపారమైన గౌరవం కలదు. నెహ్రూను గొప్పగా ఆరాధించే వారిలో రంగాజీ ప్రథములు ఇరువురూ స్వతంత్ర సమరయోధులే అయినప్పటికీ ప్రజాహితంను కోరి అంతటి నెహ్రూను ఎదిరించారు. ఇదే రంగాజీ యొక్క చిత్తశుద్ధికీ, స్థిర సంకల్పానికి మచ్చుతునక

# 9వ రాజ్యాంగ అధికరణ, వ్యవసాయ భూములకు వర్తించరాదని ఆచార్య రంగాజీ పోరాటం

ఈ రచన ప్రారంభించే ముందు రాజ్యాంగంలో 9వ అధికరణ గూర్చి కొంత వివరణ కావాలి. జమీందారులు, ఈనాందారులు, మొఖసాదారులు, భూమిపై పెత్తనం సాగిస్తున్నారు దీనిపై రంగాజీ అనేక పోరాటాలు సల్పిన విషయం సుగ్రాహ్యమే ప్రభుత్వం పై విధానాలన్నీ రద్దుచేసింది. అయితే జమీందారీల రద్దు తరువాత భూమిపై శ్రమించి పంటలు పండించుకుంటున్న రైతులకు ఆ భూమిపై సర్వహక్కులూ కలిగించాలి. అలా జమిందారుల నుండి స్వాధీనం చేసుకునే భూమికి ఎలాంటి నష్ట పరిహారాన్ని చెల్లించనవసరం లేదనేదే ఆ అధికరణయొక్క ఉద్దేశ్యము. దీనిని రంగాజీయే ప్రవేశపెట్టారు. రాజ్యాంగంలో పొందుపరిచారు. మరి ఆయనే ఎందుకు దీనిని వ్యతిరేకిస్తున్నారో ? అని అనుమానం కలగవచ్చు. ఎందుకో చూద్దాం.

పండిట్ నెహ్రూ రైతుల యజమాన్యంలో ఉన్న భూమినంతటినీ ముందుగా సహకార వ్యవసాయ క్షేత్రాలకు అటు తరువాత రష్యాలో కమ్యూనిస్టులు ప్రవేశపెట్టిన సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను స్థాపించాలని పెద్ద కుట్రపన్నిన విషయం తెలుసుగదా ? (దీని వివరాలు వేరే చూడవచ్చు) ఇచ్చట సూక్ష్మంగా మాత్రమే పరిశీలిద్దాం. ఆ కుట్ర ఎలా సాగిందో చూడండి. అది పార్లమెంటు సమావేశాలు ముగియనున్న రోజు. సభ్యులంతా ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయే హడావుడిలో ఉంటారు మనం సాగించే కుట్రను తెలుసుకొనే అవకాశం ఉండదు అందువలన 9వ రాజ్యాంగ అధికరణ రైతుల నుండి స్వాధీనం చేసుకునే భూములకు ఎలాంటి నష్టపరిహారం ఇవ్వవలసిన అవసరం లేకుండా బిల్లును తయారు చేశారు అంతటితో ఆగారా ? లేదే ! నష్ట పరిహారం కావాలని కోర్టులలో సవాలుచేసే అధికారాన్ని కూడా లేకుండా చేశారు. సూక్ష్మంగా ఇదీ ఆ బిల్లు స్వరూప స్వభావాలు.

ఆ రోజు ఉదయం మామూలుగానే బ్రహ్మముహూర్తంలో నిదురలేచిన రంగా కాలకృత్యాలు తీర్చుకుని ఆనాటి పార్లమెంటు ప్రొసీడింగ్స్ కవరు తెరిచారు. చూశారు బిల్లు వివరాలు. కృంగిపోయారు. ఇంత మోసమా ? ఇంతటి కుట్రా ! దీని కెందుకు ఇంత దగా చేయాలి ? భారత రైతాంగ

స్వాతంత్రోద్యమంలో చేసిన మహోన్నత త్యాగాలు మనసుకైనా రాలేదా ? పండిట్ నెహ్రూకు రైతులపై ఇంతటి కక్ష సాధింపు ఏ కమ్యూనిస్టులో చేస్తే బాధపడవలసిన పనిలేదు. ఇది నెహ్రూ చేయుటవే బాధగా ఉంది అనుకుంటూ నిశితంగా బిల్లును పరిశీలించి నోట్సు తయారుచేసుకుని పార్లమెంటుకు వెళ్ళారు. బిల్లులు ప్రవేశపెడుతుండగానే లేచినిలబడి ప్రతిఘటించారు ఆనాటి ప్రసంగం ప్రపంచ రాజనీతిజ్ఞులనే ఆశ్చర్య చకితులను చేసింది పండిట్‌జీ మీరు రైతులను ఇంతటి అన్యాయం చేయదగునా ? అదీ ! పార్లమెంటు మెంబర్ల కనులు గప్పి, ఏమరపించి పార్లమెంటు చివరి రోజున ఇంతటి హడావిడిగా బిల్లు పెట్టానా ? ఇది మీ హూందాకు తగిన పనేనా ? అంటూ ఇప్పటికైనా దీన్ని విరమించండి అని ప్రాధేయపడ్డారు రంగాజీ ఆనాటికి వాయిదా పడింది దీనిని గుడ్డిలో మెల్లగా భావించి ఈనాటికి ఈ ఆపద నుండి బయటపడ్డాం అంతేచాలు అనుకొన్నారు.

**రెండింట మూడువంతుల మెజార్టీ(2 / 3) కంటే అత్యధిక సంఖ్య సభ్యుల మద్దతుగల లోక్‌సభలో ప్రధాని నెహ్రూ ప్రవేశపెట్టిన 17 వ రాజ్యాంగ సవరణ చట్టం వీగిపోవడం ఆచార్య రంగాకు గొప్ప విజయంగా భావించింది ప్రపంచమంతా. 17 వ రాజ్యాంగ సవరణ చట్టము ద్వారా ఎలాంటి నష్ట పరిహారము చెల్లించకుండా తరతరాలుగా దానాదవున విక్రయాది సర్వహక్కులతో అనుభవిస్తున్న రైతుల భూములను సహకార సంఘాలకు అప్పగించాలనే నెహ్రూ కుట్రను భగ్నం చేశాడు రంగాజీ. ఈ కుట్ర 1950 ప్రాంతాలలో ఆవడి కాంగ్రెసులోనే ప్రారంభమయినది. ఇది రైతులకు ప్రయోజన కారియనీ, వారి అభ్యుదయానికీ, వారి అభివృద్ధికీ ఇదొక గొప్ప అవకాశంగా అభివర్ణించాడు నెహ్రూ. రైతు నాయకులు ఆచార్యరంగా, చౌదరీ చరణ్‌సింగ్ ఆనాడే వ్యతిరేకించారు. రాజాజీ వారికి అండగా ఉన్నారు. 1944 వ సంవత్సరాంతములో మహాత్మాగాంధీ, ఆచార్య రంగాల మధ్య సాగిన సుదీర్ఘ చర్చలలో భూమిపై రైతుల సర్వంసహాధికారాన్ని అంగీకరించి ఆశీర్వదించాడు. అదే ఆచార్య రంగా ప్రతిపాదించిన "ప్రజాస్వామ్య కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్" పాలనా విధానం.**

మహాత్మాగాంధీ అంగీకరించి ఆశీర్వదించిన రంగాజీ ప్రతిపాదించిన "కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్" విధానానికి ఆవడి కాంగ్రెసు తీర్మానం తూట్లు పొడవటమే నెహ్రూ ఆశయం రైతుల పొట్టలు కొట్టవద్దనీ, వారి హక్కులు

కాలరాయవద్దనీ, వారి స్వాతంత్ర్యాన్ని హరించవద్దనీ రంగాజీ సహకార వ్యవసాయ విధానాన్ని వ్యతిరేకించారు. కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్ సిద్ధాంతాన్ని జాతీయ స్థాయిలోనే కాక అంతర్జాతీయ స్థాయిలో ప్రపంచ దేశాలలో బహుళ ప్రచారం చేశారు రంగాజీ అప్పడే "రైతులు కమ్యూనిస్టులు" అనే గ్రంధమూ, విప్లవ రైతాంగమనే మరో గ్రంధమూ రచించి, ప్రచురించి సహకార వ్యవసాయ విధానానికి వ్యతిరేకంగా ప్రచారం చేశారు రంగాజీ.

పండిట్ నెహ్రూ రైతులు సహకార వ్యవసాయంలో చేరకపోవడం వారి ఇష్టం మీదనే ఆధారపడుతుందన్నారు బలవంతమేమీ లేదన్నారు. ఒకవైపున రైతుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ఎలాంటి అవరోధం కలగదని చెపుతూనే కర్నాటకలోని "ఎల్వాల్ " అనే గ్రామంలో వినోభా భావే, జయప్రకాష్ నారాయణ, పండిట్ నెహ్రూలు ముగ్గురూ భూమిపై హక్కు రైతులకు ఎంతమాత్రమూ లేదని చాటి చెప్పారు. పంచభూతాలలో భూమి కూడా ఒకటనీ పంచభూతాలు సర్వమానవ ప్రజల ఉపయోగానికి ఏర్పడ్డాయనీ, అగ్ని, వాయువు, నీరు, ఆకాశం, ఎలా సర్వజీవకోటికీ స్వేచ్ఛగా ఉపయోగించు కోవడానికి అందుబాటులో ఉన్నాయో భూమి కూడా అలానే ఉపయోగించు కొనవచ్చునని నిర్ద్వంధంగా ప్రకటించారు (ఈ కథలన్నీ వేరు వేరు సందర్భాలలో ఆయా ప్రత్యేక పరిస్థితులను బట్టి వివరించబడ్డాయి అందువలన ఇక్కడ వివరాల లోతుకు పోదల్చలేదు)

17వ రాజ్యాంగ సవరణ చట్ట నిరసన సభ విజయవాడలో, బెంగుళూరులో జరిగాయి ఆ సభలలో రాజాజీ, కె యం మున్షీ, బెజవాడ రామచంద్రారెడ్డి, సర్దార్ లచ్చన్న మరెందరో పాల్గొన్నారు ఆ వివరాలన్నీ సంక్షిప్తంగానే అయినా వేరొక సందర్భంలో వివరించబడి ఉన్నది ఇప్పడు మన ముందున్న ప్రస్తుత సమస్య లోక్‌సభలో 2/3 వంతులకంటే అత్యధిక సంఖ్య సభ్యులు ఉండగా 50 మంది సభ్యులు మాత్రమే ఉన్న రంగాజీ సవరణ చట్టాన్ని ఎలా ఓడించారు ? ఇదొక మిష్టరీ ప్రతి సభ్యుడ్ని పార్టీలతో నిమిత్తం లేకుండా కలుసుకొని సుదీర్ఘమైన సంభాషణలు జరిపారు ఈ సవరణ ఆమోదించబడితే రైతు అనేవాడు ఉండడనీ, అంతా కూలీలుగా మారతారని, రష్యాలోని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో రైతులు మొత్తంగా ఎలా బానిసలయ్యారో వివరించారు. రంగాజీ అభిప్రాయాలతో హెచ్చుమందికి

ఏకాభిప్రాయం కుదిరింది సవరణ చట్టం పై చర్చ సాగింది ఓటింగు జరిగింది వాయిస్ ఓటుతో కాక డివిజన్ కోరాడు రంగాజీ( ప్రతి సభ్యుని తల లెక్కించాలని) ఢిల్లీలో ఉండికూడా అనేకమంది సభ్యులు సమావేశానికి రాలేదు సభలో హాజరు అయిన సభ్యులలో కొందరు సరిగ్గా ఓటింగు సమయం వచ్చేసరికి నాలుగు ద్వారాల గుండా కొందరుబయటకు వెళ్ళి పోయారు ఓట్లను లెక్కించారు సవరణ వీగిపోయింది నెహ్రూ కుంగి పోయాడు నోటమాట రాలేదు. మొహంమంతా రక్తార్ణవమైంది దుఃఖ భారముతో సవరణ వీగిపోయిందనే బాధతో బయటకు వెళ్ళి పార్లమెంటు హౌసులోని తన కార్యాలయంలో చిందులు తొక్కుతూ కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ సెక్రటరీ ఎక్కడా ? పార్టీ విప్‌లు ఎక్కడా ? పిలవండి. ఆదేశించాడు నెహ్రూ. వచ్చారు. ఎదురుగా నిలబడ్డారు. లోపల ఏమేమి సంభాషణ జరిగిందో తెలియకపోయినా తెల్లవారి ఉదయం ౨ గంటలకే పార్లమెంటరీ కాంగ్రెసు పార్టీ జనరల్ బాడీని పిలవండి అని ఆదేశించి వెళ్ళిపోయారు

మరుసటి రోజు ఉదయం పార్లమెంటు సెంట్రల్ హాలులో సమావేశం జరిగింది. పండిట్ నెహ్రూ వచ్చాడు. రావడమే తడవుగా కనీసం అధ్యక్ష స్థానంలో కూర్చోకుండానే గద్గద స్వరంతో మామూలు సంప్రదాయం ప్రకారం ఫ్రెండ్స్ అనీ కూడా సంబోధించలేదు మొదటనే ఈ పార్టీకి నాయకుడు ఎవరు ? నేనా ? రంగాజీనా ? సభ మౌనం వహించింది. ఎవరూ మాట్లాడలేదు. మళ్ళీ అదేమాట ఉచ్చస్వరంతో చెప్పండీ ! ఈ సభకు నాయకుడినినేనా ? రంగానా ? మరల మరలా అదేమాట. సభంతా భయ కంపితులయ్యారు. మీరే మీరే, మీరే మా నాయకులు అని హాలు ప్రతి ధ్వనించేటట్లుగా కేకలు వేశారు అయితే సభలో నా సవరణ ఎందుకు ఓడిపోయింది అని గద్దించారు సభ్యులు మౌనమే పాటించారు తిరిగి మరో మారు నియమావళి ప్రకారం రాజ్యాంగసవరణను ప్రవేశపెట్టాలని తీర్మానించారు.

## క్షీణించిన పండిట్ నెహ్రూ ఆరోగ్యం

చైనాయుద్ధంలో భారతదేశం పరాజయం కారణంగాగానీ, పార్లమెంటులో తనపట్టు సడలిందనే కారణంచేగాని క్రమంగా నెహ్రూ ఆరోగ్యం క్షీణించడం మొదలు పెట్టింది తాను ప్రతిపాదించిన పంచశీల

సిద్ధాంతంకాల గర్భంలో కలిసిపోయింది. హిందీ - చీనీ భాయి భాయి అనే తాను ప్రారంభించిన నినాదం బెడిసి కొట్టింది. యుగయుగాలుగా, తరతరాలుగా రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘీకంగా, సాంస్కృతికంగా చైనా భారత్‌ల మధ్య సహజీవనానికి గండిపడింది. ఒకరికొకరు శత్రువులయ్యారు రోజుకు వందలమైళ్ళ ప్రదేశాన్ని అద్దూ అపులేకుండా స్వాధీనం చేసుకుంటూ చొచ్చుకొని వచ్చాయి. భారత భూభాగంలోనికి చైనా సేనలు. ఇలా జరగటానికి పండిట్ నెహ్రూ విధానాలే కారణమని ప్రపంచమంతా కోడై కూసింది పండిట్ నెహ్రూ భారతదేశానికి తలవంపులు తెచ్చాడని ముఖం మీదనే విమర్శలు సాగాయి. ౨౦ సం..పైగా భారత దేశంపై సర్వం సహాధి కారాన్ని మకుటంలేని మహారాజుగా ప్రజలచేత ప్రశంసలు పొందిన నెహ్రూ ఒక్కమారు ప్రపంచమంతా విమర్శలు కురిపించడంతో తట్టుకోలేకపోయాడు. ఆరోగ్యం క్రమక్రమంగా క్షీణించడం ప్రారంభించింది.

ఈ నేపధ్యంలో లోక్‌సభ సమావేశమై వాయిస్ ఓటుతో 17 వ రాజ్యాంగ సవరణ ఆమోదించబడింది. సభ్యులలో హెచ్చు మందికి కమ్యూనిస్టులు మినహా ఈ రాజ్యాంగ సవరణ ఇష్టం లేదు. పండిట్ నెహ్రూ కొరకు మాత్రమే తమ అభీష్టాలకు వ్యతిరేకంగా సవరణకు ఓటు చేశారు. సవరణ నెగ్గిందనిపించారు.

## అంతిమ శ్వాస విడచిన నెహ్రూకు రంగానివాళి

ఆ తరువాత ఒరిస్సా పర్యటనలో నెహ్రూ సెరిబ్రల్ హెమరేజ్ కి గురి అయ్యి మంచం పట్టారు ఢిల్లీకి తిరిగి వచ్చిన కొద్ది రోజులలోనే మన జాతీయ మహానాయకుడు పండిట్ నెహ్రూ కన్నుమూశారు. పండిట్ నెహ్రూ మరణానంతరం పార్లమెంటులో రంగాజీ చేసిన ప్రసంగం గమనించ దగినదిగా ఉన్నది. నెహ్రూ పట్ల రంగాజీకి ఎంతటి ప్రేమ, గౌరవం, ఆదరణ కలదో ఆ ఉపన్యాసాన్ని ఒకమారు పరిశీలించినట్లు అయితే అర్థం కాగలదు. నెహ్రూను గురించి రంగాజీ అభిప్రాయంలో ఆయన గొప్ప రాజనీతిజ్ఞుడనీ, ప్రజాస్వామ్య రక్షకుడనీ, మానవతావాది అనీ సమసమాజ నిర్మాత అనీ ఎంతగానో కొనియాడారు.

నెహ్రూ మరణానంతరం ఆయన వారసుడిగా లాల్ బహద్దూర్ శాస్త్రి ప్రధానిగా పదవి చేపట్టారు. ఆయన 17 వ రాజ్యాంగ సవరణ చట్టాన్ని కట్టగట్టి

పెట్టెలో పెట్టి తాళం వేశారు మరో మాటలో చెప్పాలంటే చెత్తబుట్టలో పారవేశాడు ఇంతలో భారత దేశంపై పాకిస్తాన్ యుద్ధం ప్రకటించింది యావత్ భారత జాతి ఇండియా-పాకిస్తాన్ యుద్ధంలో తమ వంతు సేవ చేసేందుకు తయారుగా ఉండాలని దేశభక్తి ప్రపూరితమైన ఒక మహోపన్యాసాన్ని ప్రజలకు అందించాడు ఎక్కడికక్కడ కుల, మత, జాతి వర్గ రహితంగా సమైక్యతతో అవసరమైతే యుద్ధరంగంలో దూకటానికైనా సంసిద్ధులుగా ఉంటామని ముందుకు వచ్చారు పాకిస్తాను ఎంతో కాలం యుద్ధంలో నిలిచి పోరాడలేక పోయింది. వారాలలోనే పరాజయం చెందింది. లాల్ బహద్దూర్ శాస్త్రికి ప్రపంచంలో అనుపమానమైన గౌరవం, ఆదరణ లభించాయి. దేశం ఎల్లడెల విజయోత్సవాలు జరిగాయి

## జై కిసాన్- జై జవాన్ అంటూ నినదించిన లాల్ బహద్దూర్ శాస్త్రి

ఢిల్లీలో జరిగిన ఒక విజయోత్సవంలో లాల్ బహుద్దూర్ శాస్త్రి ఆసక్తికరమైన రెండు నినాదాలను ప్రకటించారు అందులో ఒకటి "జై కిసాన్" నినాదము. రెండవది "జై- జవాన్" నినాదము. వీటి వెనుక నున్న రహస్యం ఏమంటే ఆనాటి వరకూ భారతజాతి తన అవసరాలకు ఆహారధాన్యాలు ఇతర దేశాల నుండి దిగుమతి చేసుకోవలసిన దుర్గతిలో ఉన్నది శ్రీ శాస్త్రి అధికారం చేపట్టిన సంవత్సరం ఆహార ధాన్యాల విషయంలో దేశం స్వయం సమృద్ధిని సాధించింది. ఇంకొక్క ఏడాదిలో విదేశాలకు ఎగుమతి చేయగలిగేన స్థితిలో ఉండబోతుంది. అలానే పంచదార, నూనెగింజలు, పప్పధాన్యాలు ఉత్పత్తిలో కూడా గణనీయమైన ఉత్పత్తిని సాధించాయి. దాదాపు స్వయం పోషకత్వం స్థాయికి చేరువలో ఉన్నాయి ఇందుకు రైతులను ప్రశంసిస్తూ జై కిసాన్' నినాదాన్ని ఇచ్చారు. ఇక రెండవ నినాదమా ? ఈ పాటికే అర్థమై ఉండాలి పాకిస్తాన్‌పై భారత సైనికులు అఖండమైన, అద్వితీయమైన అనుపమానమైన విజయం సాధించారుగదా ? అందుకు భారత సైనికులను ప్రశంసిస్తూ "జై జవాన్" నినాదాన్ని ఇచ్చారు. ఈ రెండు మహోన్నతమైన నినాదాలు ప్రజలను ఉద్వేగపూరితులను చేశాయి దేశభక్తిని రేకెత్తింపచేశాయి. ఏదేశరక్షణకైనా సైనికుల సాహసోపేతమైన త్యాగాలేననేది జై జవాన్ నినాదం. ఇక రెండవదా? ఏ దేశమైన తమ ప్రజలను కడుపునిండా ఆహారాన్ని అందించడమే తన పలిపాలనా దక్షతకు నిదర్శనం. అందుతే దేశభక్తి ప్రపూరితులైన రైతు, కూలీ

శ్రామిక జనాలను ప్రశంసిస్తూ, ఉద్బోధిస్తూ "జై కిసాన్" నినాదాన్ని ఇచ్చారు

ఈ పరామార్థాన్ని గ్రహించకనే పండిట్ నెహ్రూ ప్రభుత్వం చైనా దురాక్రమణను ఎదిరించి నిలబడలేకపోయింది అలానే ఆహార ధాన్యాల ఉత్పత్తిలో స్వయం సమృద్ధి సాధించలేకపోయింది. నెహ్రూ ఈ రెండు పరమార్థాలను గ్రహించలేకపోయారు కేవలం దేశాన్ని సోవియట్ యూనియన్‌లోపలే పారిశ్రామికీకరణ చేస్తే చాలుననుకున్నాడు అన్ని సమస్యలు వాటి అంతట అవే పరిష్కారమై పోతాయనే భ్రమలో పడి పోయాడాయన కానీ శ్రీ శాస్త్రి అలా కాదు రైతుల పట్ల వ్యవసాయంపట్ల వారి కృషి పట్ల వారి శక్తి సామర్థ్యాల పట్ల అపారమైన విశ్వాసం కలవాడు. అందుకే 17 వ రాజ్యాంగ సవరణ చట్టాన్ని సీల్‌చేసి భద్రంగా దాచి ఉంచాడు

భారతీయుల దురదృష్టమా అన్నట్లు ఏడాది తిరక్కముందే శాంతి సాధన సమావేశాలలో పాల్గొనేందుకు తాష్కెంటు (రష్యా) వెళ్ళి అచ్చటనే పరమ పదించారు (ఇచ్చట చాలా కథలు చెప్పకోవచ్చు గ్రంథవిస్తరణ భీతిచే ఇంతటితో ముగిస్తున్నాను)

లాల్ బహుదూర్ శాస్త్రి స్థానంలో శ్రీమతి ఇందిరాగాంధీ దేశ పరిపాలనా పగ్గాలు చేపట్టింది ఆమె తన పదవీ కాలమంతటిలో ఒక్కసారి కూడా 17 వ రాజ్యాంగ సవరణ చట్టం గురించి ఊసైనా ఎత్తలేదు. అది శాశ్వతంగా బుట్టదాఖలైపోయింది. ఇంతకన్నా రంగాజీకి విజయం మరేముంటుంది రోడ్‌రోలర్ లాంటి మెజార్టీ ఉన్న లోక్‌సభలో కేవలం 50 మంది సభ్యులు కూడా లేని స్వతంత్రపార్టీ అధినేతగా, స్వతంత్ర పార్టీ పార్లమెంటరీ పార్టీ నాయకుడిగా రంగాజీ ఎగురవేసిన కీర్తి పతాకం ప్రపంచ ప్రజల హర్షామోదాలను పొందింది అందుకే ఇందిరాగాంధీ పట్ల రంగాజీ ఆదరణ, ప్రేమ, అభిమానం పెంచుకున్నారు ఆయమ్మపట్ల ప్రేమానురాగాలతోనే చివరలో కాంగ్రెసులో చేరారు ఇది దేశంలోని అనేక ప్రతిపక్షాలకు ఆగ్రహ కారణమైనది అయినా జంకుగొంకు లేకుండా ఎదిరించి నిలబడగలిగారు

**(రంగాజీ కాంగ్రెసులో ఎందుకు చేరారో-వేరే ఒక చాప్టర్‌లో చెప్పాలనుకొన్నాను)**